వెంటనే గురుమహారాజు, ప్రత్యక్షమయి ఓదార్చిరి. మనము పరిశుద్ధముచెందకున్న, మహాత్ముల ఆత్మల తలంపులచే, నిండియున్న, ప్రదేశపు మహిమ, మానవులకు గోచరముగాదు. పావనభావనల ఆకర్షణమునకు, మూలము మన మనోదర్శనమే.

యమునాతీరమున, జపించుచు, సదా సచ్చిదానందమున మునిగియుండెను. అప్పుడు ఆమె ''పరమాత్మా? నేను ఇతరుల తప్పులను, ఎన్నకూడదు. అటువంటి తలంపులు, ఎప్పటికిని నామనస్సున లేకుండునట్లు చేయుము'' అని కన్నీటిచే ప్రార్థించెను. ఆమె తన సహచారిణి, యోగిన్‌మాతో ''యోగిన్ ఇతరుల తప్పులు చూచిన, నీకండ్లు అపవిత్రములగును. తప్పులను చూడవలదు'' అని చెప్పెను. ఆమె ఒకరోజు సమాధిలో నుండగా, యోగానందస్వామి ఆమెను ప్రశ్నింప ఆమె గురుమహారాజువలెనే, ప్రత్యుత్తరములు చెప్పెను. ఆమెకు తెలివి తెలిసినతరువాత గురుమహారాజు ''చిత్'' తనపైన నుండెనని చెప్పెను.

ఈ బృందావనముననే ఆమె తన తపస్సు వలన శిష్యులకు జ్ఞానదానమును దీక్షారూపమున, ఇచ్చెను. దీక్ష అనగా, వ్యక్తిస్థితిని, సంస్కారమును, ప్రారబ్దమును బట్టి అతడు పరమాత్మను సంధించుటకు, గురువుగారు బోధించు మంత్రము. ఆమెకు గురుమహారాజుగారు స్వప్నములో ''యోగిన్‌కు (శ్రీయోగానందస్వామికి) దీక్ష నిమ్మా అని అతనికి తగిన మంత్రమిది'' యని నుడివిరి. ఆదేసమయమున యోగానందులకు స్వప్నములో ప్రత్యక్ష్యమై—''నీకుదీక్షాదానము నేనీయలేదు. తల్లి దగ్గఱ స్వీకరింపుము'' అని హెచ్చరించిరి. ఆమె ఒకరోజు సమాధిలో యోగానందులకు దీక్ష అనుగ్రహించెను. బృందావనమునుండి వచ్చిన తరువాత తల్లి జీవితము అతి దీనస్థితిని చెందెను. ఆమెభర్తృగ్రామమైన కమరుపుష్కరమునకు వెళ్లెను. అక్కడ ఒకప్పుడు శ్రీరామకృష్ణులు ప్రత్యక్షమయిరి. ఆయన పాదముల నుండి ఒకనది తరంగములుగా ప్రవహించెను. శ్రీవివేకానందస్వామి ప్రేమానందులు బ్రహ్మానందులు—పలువురు భక్తులు అతనివెంబడినుండిరి. ఆమె 'గంగానది అతని పాదములనుండి జనించినది, అతడే శివస్వరూపము' అని తెలిసికొనెను. ఆమెకు డబ్బులేదు. ఆకుకూరలు తోటలో పండించి వండి గురుమహారాజుగారికి ప్రసాదముగా అరగించి ఆమె అన్నము ఉప్పులేని ఆకు మాత్రము, ఒక సంవత్సరము తినెను. గుడ్డలు చినిగెను. ఆమెకు నా అనువారు లేరుకదా అని ఒకసమయమున వ్యాకులపడ గురుమహారాజుగారు, ప్రత్యక్షమయి ఓదార్చిరి.

తల్లి అవస్థ ఆమెపుత్రులైన గురుమహారాజుగారి శిష్యులకు తెలిసి కలకత్తాకు రప్పించి ఆమెను పోషింప ఆరంభించిరి. వీరియందు శారదానందులు యోగానందులు ముఖ్యులు. యోగిన్‌మా ఆమెకు స్త్రీ తోడు. అప్పుడు మాతకు 34 సంవత్సరములు.

(సశేషము)

ఓమ్ తత్సత్.

# దేవీ స్తవము

## శ్రీ ఆత్మానందస్వామి

(గత సంచిక తరువాయి)

ఇంచుకైన నాదు మొఱాలఽకించవేమి; మోయగా నీకు నను భారఽమాయె నేని
కలఁడొకండు కార్యాకార్య ఽ కారణుండు; శయ్యడిగ్గి నన్నుతని కంఽదియ్యవమ్మ. 74

రామకృష్ణాది బుద్ధులు ఽ ప్రేమఁ జూతు; రంతియే, మోక్షమీయలే ఽ రెంతకైన
గుడుచువారె జీర్ణముఁ జేసి ఽ కొనవలె, శివ; వద్దు నాదారికడ్డు రాఽవద్దు పొమ్ము. 75

బాహ్య విజ్ఞానమునకు నే ఽ బాటుపడను; తండ్రి దర్శనమీయఁడు ఽ దానివలన
సర్వతోముఖజ్ఞాన విఽజ్ఞానమొదవఁ; దెరను తొలఁగించు మీశ్వరి ఽ కరుణతోడ. 76

దృష్ట మనుమానబంధ, మఽతృప్తికరము; విసము దాని పూజింప తాఽమసముగాదె
జగము రజ్జు సర్పభ్రాంతి ఽ జనని, తెలిసె; తొలగుము తెరదీసి మఱుఁగు ఽ నిలువవలదు. 77

మూఢ విశ్వాసము విరోధ ఽ మూల మరయ; మతదురభిమాన మధమాధ ఽ మంబెయగును
సమరసస్వభావ మొదవె; ఽ శక్తి! నాకు; తెరను తొలఁగింపు మావలి ఽ కరుగనిమ్ము. 78

మనసునందు నీరూపము ఽ గనకయున్న; శివుని వీక్షింపలేరంద్రు ఽ సిద్ధ ఋషులు
గాలిఁబీల్పక జీవింప ఽ జాలనట్లు; జాలిగొని తెరదీసి నఽన్నేలు మంబ. 79

భీతి గర్వదురభిమాన ఽ భీర, దంభ; జంబుకసమూహముల్ తత్క్షఽణంబుఁ బాఱుఁ
జెవికి వేదాంతగర్జనల్ ఽ చేరినంత; దయను తెరదీయుమమ్మ నేఽతగినవాఁడ. 80

కంటినే మనోవాక్కాయ ఽ కర్మశుద్ధి; సాత్వికాహార నియమ ప్రఽచార యుక్తిఁ
బడయకను, రాజయోగ, మఽహాపాయ మంచు; భారమూని, గావుము నీ కఽఱేకలను నమ్మ. 81

అష్టవసు సమాయుక్తమై ఽ యలరు, విశ్వ; మయ చరాచర సంఘము ఽ మార్పుచెందు
నిత్యషడ్భావవైకృతిన్ ఽ నీవు బనుప; బంధములవిప్పి తెరువిమ్ము ఽ భద్రకాళి. 82

శుద్ధమది, యశుద్ధంబిది, ✽ సుకృతమిద్ది, వికృతమద్ది, ఫలంబిది ✽ విఫలమద్ది
పాప పుణ్యంబు లేల నీ ✽ పాలఁబడితి; నేకపాటల, తెరదీసి ✽ యేలుమమ్మ. 83

ధర్మకర్మానుచరణము ✽ ధ్యానమొసఁగె; దానిచే, నకర్మస్థితి ✽ దాపరించె
[illegible]ౕమసి' యనుచు గురుండు ✽ దారిఁజూపె; తెరనుదీయవె యింద్రాక్షి ✽ కరుణతోడ.

నిద్రలేని యగాధ స✽ముద్రముద్ర; శాంతసహన విశాలాంత ✽ రాంతరంబు
దలఁప ముక్తిభావంబులె ✽ దయఁదలంచి; తెరనొకటి చూపు కాళిక ✽ మఱుఁగు 85

విగ్రహారాధన తొలుత ✽ వెడలె, నిష్ట; దేవతాప్రార్థన జపముల్ ✽ లావుమీరె
తైలధారగ ధ్యాన వి✽స్తరత యొదవె; దేవి, తెరువుము కడసారి ✽ తెరవుఁ జూపు. 86

మధువు లభ్యమౌ పట్టున ✽ మట్టు మొత్త; తత్వమలవడు సత్సంగ ✽ ధారణమున
నాకు నీ నామజపమె స✽నాతనంబు; తెరను తెరువుము తడవాయె ✽ ధేనుకాంబ. 87

నీవు మేల్కాంచినప్పుడు ✽ నిప్పులుఱుకు; నంట దివ్యమూలాధార ✽ మందు, మేఘ
గర్జనల్ విజృంభించు, నా✽కాల మందు; నంబ, తెరదీసి యావలి ✽ కనుపు మమ్మ.

నీవు కన్నువిప్పినవేళ ✽ భావమడఁగు; దృష్టి యంతర్ముఖంబగు ✽ దేహమపుడు
కంపమొందు సడలిపోవు ✽ గొంప మొదలు; భయము తీరెను తెరయెత్తు ✽ భద్రకాళి. 89

అశనభోగభాగ్యాకర్ష ✽ ణాతిశయము; గట్టిపెట్టి, యాత్మావలో ✽ కనముఁ జేయు
నింద్రియాళి కెదురురాకు ✽ మింతె చాలు; తెరను తెరువుము శైలజా ✽ కరుణతోడ. 90

సూక్ష్మమందున స్థూలము, ✽ సూక్ష్మరూపు; కారణంబునందున, మహా ✽ కారణంబు
నందు కారణం బిమిడి స ✽ మాధి నిలుచు; నంట, యాదవి తెరదీయు ✽ మమ్మ వేగ. 91

దినములు గడచుచుండె సం ✽ దేహమేల?; మాను మెగతాళి, నేటితో, ✽ జ్ఞాననేత్ర
మొకటి నాసికాగ్రముననె ✽ యున్నదంట; దాని తెరువుము కాళిక ✽ దయదలంచి. 92

నిష్ఠురోక్తులాడితినని ✽ కష్టబెట్టు; కొనకు, మనసులో నిబ్బంది ✽ కొలఁదిఁ దూల
నాడినాడ, నీ యనుఁగుఁ గ ✽ న్నాడగానె; కరుణఁ దెరదీసి రక్షించు ✽ కాళికాంబ. 93

నీ చరణసరోజములందు ✽ నేను పూర్ణ; దర్పధనమనఃప్రాణ స ✽ మర్పణంబు
జేసి దాసుఁడ నగుచు నీ ✽ చింతజేయు; వాఁడ, యమున రక్షించు నీ ✽ వాడనమ్మ. 94

అంబ, 'జాతస్య మరణం ధ్రు × వంబె' గంటి; 'పునరపి జననము,' మఱియు × 'పునరపి మర
ణంబు' నే నొల్ల, నీ చర × ణంబులాన; వినతు లొనరుతు, నావలి × కనుపు మంబ. 95

దుష్టు డపకారములుచేయు × దోసకారి; కుత్తమోత్తముఁ డుపకృతు × లొనరఁజేయు
ఉభయనైసర్గికములవి × అభము శుభము; లేల, కాళి యావలికి పో × నియ్యవమ్మ. 96

మధుకరముఁ దిని తనివొంది × మనసునందు; దుఃఖ మావంత లేక, యే × త్రోవఁ బోక
హాయి వేదాంత వనవిహా × రాప్తి నలరు; చుందు దయఁజూడు మంబ ధ × న్యుండ నగుదు. 97

పత్త్రిపుటముగఁ జేదోయి × బరచి యొడలు; గప్పి జీర్ణాంబరములచే × గఠినభూమి
నూఱడిల్లి, చెట్ల మొదళ్ల × నూరకుబ్బ; చుందు దయఁజూడు కాళి ధ × న్యుండనగుదు. 98

కల్లెములతో విషయముల × గట్టి చింత; రేవగలుఁ బరమాత్మ నం × దే వెలార్చి
యాత్మలోనఁ బూర్ణానంద × మంది పొంగు; చుందు, దయఁజూడు గంగ ధ × న్యుండ నగుదు. 99

స్థూల సూక్ష్మకారణ దేహ × లీలలఁ గని; సరకుచేయక బుద్ధిని × పరమునందె
లగ్నమొనరిచి హాయి నా × లక్ష్యమందు; నుందు దయఁజూడు దేవి ధ × న్యుండ నగుదు. 100

మోక్షదాయకమైన బ్ర × హ్మాక్షరముల; నాత్మ నిడి 'అహం బ్రహ్మాస్మి' × యంచు నేను
చేత నక్షయపాత్రతో × స్వేచ్ఛఁ జనుచు; నుందు దయఁజూడు దుర్గ ధ × న్యుండ నగుదు. 101

తైలధార నీ నామంబు × స్తవముఁ జేయ; నఖిల వేదాంతశాస్త్ర ర × హస్యమెల్లఁ
గర్మయోగులు జ్ఞానులు × గాంచు సరణి; గూర్తువట కాళికాంబ నా × కోర్కె దీర్చ. 102

కావ్యపఠనమందును, వర్త × కంబునందు; తర్కమందును, గృషియందు × దగిలియున్న
యనువుగాదు నిధిధ్యాస × నంబు, వాని; దెలిసి వర్జించితిని తెర × దీయు మంబ. 103

ఆదిమధ్యాంతశూన్యుని × నప్రమేయు; సచ్చిదానందమయుని, న × చలుని, శివుని
వేదముల కొలనున్న స × ర్వేశ్వరుని, య; నుగ్రహముతోడఁ జూపవే × యుగ్ర కాళి. 104

పావనుండు శ్రీకొత్త లం × కావధూత; సుతుఁడు, సామి యాత్మానందు × హితముగోరి
పతితపావని శాశ్వత × పదము నిమ్మ; తెరను తెరువుము చండిక × కరుణతోడ. 105

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.



# సర్వధర్మ సమన్వయమే మతాదర్శము

రచయిత :
శ్రీ వివేకానందస్వామి

అనువాదకుడు :
శ్రీ పిన్నింటి సుబ్బారావు

ఈ యింద్రియమయ జగత్తు, ఈ విజ్ఞాన జగత్తుయొక్క ఆద్యంతములు వాచామగోచరుడగు పరమేశ్వరుడే యని గ్రహింపవలయును. ఈ యాత్మానాత్మ వివేకమే మతమునకు పునాది. మతము ఇంద్రియాతీతస్థితియందావిర్భవించును. తర్కమునకును నిశ్చయజ్ఞానమునకును అది అతీతస్థితి. ఇంద్రియాతీతుడగు ఆ పరమేశ్వరుని గ్రహించు దివ్యస్మృతియే మతము. ఈ పరిశోధన యనంతకాలమునుండియు జరుగుచున్నది. అండ, పిండాండములు ఒక తీరుగా గమనముచేయుచున్నవి.

మతములకు పునాది బాహ్యముగాక, అంతరంగమైయున్నది. మానవుని నిర్మాణమునందే మతమునకు పునాదిగలదు. మానవుడు తన మనస్సును, శరీరమును, ప్రాణమును, భావములను విడిచిపెట్టుట ఎంత యసాధ్యమో, మతమునుగూడ విడుచుట యంత యసాధ్య కార్యము. ఈ పునాదిపైననే యనేకమతములు ఏర్పడినవి. కాని వీనియందలి సమష్టితత్వమును విమర్శనకుశలురగువారు గ్రహింపగలరు.

సృష్టియొక్క యాద్యంతములు పరమేశ్వరుడే యగుచో ఆ పరమేశ్వరునకై ఏల కృషి చేయవలయును? ఈ యింద్రియమయ జగత్తుతో ఏల తృప్తి నొందరాదు? ఆహార నిద్రాదులతోడను, ఏదియో కొద్దిగా పుణ్యకర్మ చేసియద్దానితోడను ఏల తృప్తిగాంచ గూడదు? ప్రపంచమునకే కొద్దియో మంచిని చేయుటయే మతము, అతీతవస్తువునకై ఏల యత్నము చేయవలయును?

ఈ కనబడు బాహ్యజగత్తు, ఇంద్రియాతీతమగు తత్వముయొక్క యంశమై యున్నది. ఆధ్యాత్మిక జగత్తుయొక్క బాహ్యస్వరూపమే యీ బాహ్యజగత్తు. ఏథెన్సు పట్టణమునందుపన్యసించుచు, సోక్రటీసు, గ్రీసుదేశమునందు పర్యటించుచున్న యొక బ్రాహ్మణునితో, మానవునియొక్క నిజతత్వమును గ్రహించుటయే చదువులలోకెల్ల చదువు అని నుడివెను. అంత నా బ్రాహ్మణుడు "దేవుని గ్రహింపనిదే, మానవుని దెలియుటెట్లు" అని ప్రశ్నించెను. ఈ జీవితమునకుగాని, యీ బాహ్యజగత్తునకుగాని యథార్థస్వరూపము నామరూపరహితుడగు పరమాత్మయే యని గ్రహింపవలయును. ఏ శాస్త్రమును మనము పూర్తిగా విమర్శించినను, స్థూలరూపమునుండి, సూక్ష్మతత్వములోనికి పరిణామమును పొందగలదు.

ఈ విధముగా మానవుడు భగవంతుని తత్వమును గ్రహింపవలసినవాడాయెను. ఈ ప్రస్తుతస్థితితో తృప్తినొందరాదా యనిన ఆవు, కుక్క మొదలగు పశువులవలె ఈ వర్తమాన స్థితితో తృప్తినొందరాదు. మానవునకును,

పశువునకును ఈ మత జిజ్ఞాసయే భేద కారణము. మతధ్యాసలేనిచో ఈ మానవజన్మ వృథా. జీవరాశియందొక్క మానవునకే యూర్ధ్వదృష్టిగలదు. ఈ యూర్ధ్వదృష్టియే మతము, లేక మోక్షస్థానమును, మానవుని పరమావధిని చూపుచున్నది. నీవు ఎంత ధనమును దాచియుంచితివో, ఎట్టి దుస్తులను ధరించితివో, ఎట్టి గృహమందు వసించుచుంటివో దానిపై నీమోక్షస్థితి యాధారపడి యుండదు. ఈ మతమందలి యాసక్తివలననే, మానవజాతి యభివృద్ధిగొందగలదు.

మతమువలని ప్రయోజనమేమి? అది మానవునిదారిద్ర్యమును పోగొట్టగలదా? యని యడుగవచ్చును. ఇది చిన్నపిల్లలడుగు ప్రశ్నవంటిది. పాఠశాలయందుపాధ్యాయుడు చేయు శాస్త్ర ప్రయోగములనుగాంచి విద్యార్థి దీనివలన మాకు కొంత బిస్కత్తులు లభ్యమగునాయని ప్రశ్నించిన ఎట్లుండునో యారీతిగా, మతమును గూర్చి ప్రశ్నింపరాదు. మత జిజ్ఞాస మానవుని భూత, భవిష్యత్తు, వర్తమానస్థితులకు సంబంధించిన ధర్మమైయున్నది. అది శాశ్వత తత్వము. శాశ్వతతత్వమును ఐహికధర్మములతో తులదూపరాదు. శాశ్వతధర్మముతోడనే పోల్చవలయును. మతమువలన లాభముగలదు. అది మానవునకు శాంతిని చేకూర్చగలదు. ప్రస్తుత జీవితమునకు మతమే పునాది. మానవుని దేవునిగా చేయునది మతము. మానవ సంఘమునుంచి మతమును తుడిచివైచిన, పశుగణమునకును, మానవజాతికిని వ్యత్యాసముండనేరదు. ఇంద్రియసుఖము మానవుని యాదర్శముగాదు. జ్ఞానమే యాతని యాదర్శము. ఇంద్రియ సౌఖ్యముకంటె విద్యానందము, అంతకంటె ఆధ్యాత్మికానందము గొప్పవి. ఇట్టి బ్రహ్మానందము మత జిజ్ఞాస ఫలితము. మిగిలిన యానందములు దీనిలో పాతికభాగమునకైనను సరిరావు.

ప్రపంచముయొక్క గమ్యస్థానమేది? ఎచ్చటను ఏదియును లేదా? ఒక ఋజురేఖను పొడగించినచో అతి వృత్తాకారముగా బయలుదేరిన స్థానమునకు వచ్చి కలియదా? అదే రీతిగా, మనము భగవంతునియందు జనించియనంతకాలమునకు ఆయననే చొచ్చుచున్నాము.

మతధర్మపథమునందు క్రొత్తవిషయములకనుగొనవలసిన పనిలేదు. వివిధ ధర్మములయందుగల సమష్టి తత్వమును గ్రహించుటయే జ్ఞానము. సమస్తమైన పదార్థములయొక్క మూలతత్వ మొక్కటియేయని గ్రహించుటయే మత జిజ్ఞాసయొక్క ఫలితము.

పూర్వమునుండియు, ఈ మూలతత్వమును నరయుటయందు హిందువులు చాల పరిశోధనలుచేసి దిగ్విజయమునుగాంచి యుండిరి. కపిలుని సాంఖ్యసిద్ధాంతము, వేదాంతుల అద్వైతతత్వము ఈ పరిశోధనా విజయ స్తంభములే.

# తెలుగు భాషా సమితి, మద్రాసు

తెలుగు భాషా సమితి యాజమాన్యాన ఏర్పడిన సంస్కృతి సమితి ౧౯౫౧ సంవత్సరం డిశంబరు నెల ౨౨, ౨౩ తేదీలలో రాజాజీ హాలులో జరిపిన పత్రికల ప్రదర్శనం, సమావేశాల సందర్భంలో సమర్పించిన సంక్షిప్త పరిచయ నివేదిక యిది.

తెలుగు భాషా సమితి సంకల్పించిన కార్య కలాపములలో ప్రధానమయినది తెలుగు విజ్ఞాన సర్వస్వ నిర్మాణం. ఇదివరకున్న విజ్ఞాన సర్వస్వములు సాధారణంగా అనుసరిస్తున్న అకారాది క్రమపద్ధతి గాక విషయానుక్రమ పద్ధతిని ఈ విజ్ఞాన సర్వస్వము ప్రకటింపబడుతుంది. ఈ పద్ధతివలన ఒక్కొక్క శాస్త్రము నకుగాని, ఒక్కొక్క కళకుగాని సంబంధించిన అంశములన్నీ ఒక్క సంపుటమందే ఉండుట కవకాశం ఉంటుంది. ఈ విధంగా విజ్ఞాన సర్వస్వం మొత్తం పన్నెండు సంపుటాలుగా వెలువడగలవు. ప్రతి సంపుటం డబుల్ క్రౌన్ ఆక్టేవో సైజులో వేయి పేజీలలో ఉంటుంది.

''చరిత్ర - రాజనీతి'' సంపుటం, ''పదార్థ విజ్ఞాన - రసాయన'' శాస్త్రాల సంపుటం, ''ఆంధ్ర'' సంపుటం క్రమరీతిని వెలువడ గలవు.

## ''చరిత్ర - రాజనీతి'' సంపుటము

ఈ సంపుటము ముద్రణమునకు సిద్ధముగా నున్నది. దీనిలోనికి కావలసిన చిత్రములు, దేశ పటములు అన్నీ తయారుగా ఉన్నవి.. కాగితము ఇంకా దొరకనందువల్ల దీని ముద్రణము ప్రారంభము కాలేదు. కాగితము వచ్చిన వెంటనే ముద్రణము ఆరంభము కాగలదు.

ఈ సంపుటము రెండు భాగములుగా ఉండును. మొదటి భాగములో సంక్షిప్తముగా ప్రాచీన కాలమునుండి నేటివరకు గల చరిత్రము— రాజనీతి పరిణామమున్ను ఉంటవి. ప్రపంచ చరిత్రకున్ను, రాజనీతి పరిణామమునకున్ను సంబంధించిన అనేక ముఖ్యవిషయాల వివరణములు రెండవ భాగములో అకారాది క్రమమున ఉంటవి.

## ''పదార్థ విజ్ఞాన - రసాయన శాస్త్రముల'' సంపుటము

ఇందు విషయము పదార్థ విజ్ఞాన - రసాయన శాస్త్రముల పరామర్శ. గ్రంథ విస్తృతి ౧౦౦౦ పుటలు. విషయము రెండు భాగములుగా విస్తృతమై యున్నది. అందు మొదటిది, ఈ రెండు శాస్త్రముల సంక్షేపావలోకనము గలది. ౧౫౦ పుటల భాగము. ఇది తయారై ముద్రణకు సిద్ధముగా నున్నది. రెండవది. అకారాది క్రమముగా ఈ రెండు శాస్త్రము లందలి ప్రత్యేక విషయముల వివరణముగలది. దీని వ్యాప్తి ౭౫౦ పుటలు. ఇందు పదార్థ విజ్ఞాన శాస్త్ర భాగము అకారాది క్రమమున వర్గీకరించబడి అచ్చునకు సిద్ధముగా నున్నది. రసాయన శాస్త్రములో అకారాది క్రమ విషయము సంపాదితమై వర్గీకరణ విధానములో

నున్నది. ఇదికూడ కొద్దికాలములోనే పూర్తి కానున్నది.

## ''ఆంధ్ర'' సంపుటము

ప్రధానముగా ఇది ఆంధ్ర సంస్కృతికి సంబంధించిన సంపుటము. ఈ సంపుటము కూడా రెండు భాగాలుగా ఉంటుంది. మొదటి భాగములో విశాలాంధ్రదేశపు నైసర్గిక స్వరూపాదులు, శీతోష్ణస్థితి, పర్వతములు, నదులు, సరస్సులు, ఖనిజ, వన, జయసంపదలు, జాతులు, పరిశ్రమలు, వర్తక వ్యాపారములు, వ్యవసాయము, విద్య, వైద్యము, వాఙ్మయము, భాష, కళలు, చరిత్ర మొదలైన సమస్త విషయాలను గుఱించి తెలుపబడును. వాఙ్మయము, భాష, కళలు, చరిత్ర, వ్యవసాయము, పరిశ్రమలు, వర్తక వ్యాపారాదులను గురించి చాలా ప్రాచీనకాలమునుంచి ఇప్పటివరకు ఆయా విషయాలలో కలిగిన పరిణామ వికాసములు సంగ్రహముగా వివరింపబడును. రెండవ భాగములో విశాలాంధ్రదేశపు జిల్లాలు, పురుషులు, దుర్గములు, పండుగలు, మతములు, విశ్వవిద్యాలయములు, పుణ్యక్షేత్రములు మొదలైన వాటిని గురించిన సంగ్రహ వివరణము ఉంటుంది. ఆయా విషయాలలో కృషి చేసిన సమర్థులచేత వ్యాసములు వ్రాయబడుచున్నవి.

## సంస్కృతి సమితి

తెలుగు భాషా సమితి విజ్ఞాన సర్వస్వ ప్రచురణతోపాటు ఆంధ్రుల సాహిత్య, కళాభివృద్ధికి బహుముఖాల తోడ్పడ నిశ్చయించుకొన్నది. సంస్కృతి రంగంలో చైతన్యాన్ని ప్రబోధింపజేయుటకు ఒక సంస్కృతి సమితి—కల్చరల్ కమిటీ—భాషా సమితి యాజమాన్యాన ఏర్పడినది. సాహిత్యానికి, కళకు సంబంధించిన వివిధ రంగాలలో నూతన జాగృతిని కల్పించుటకు ఈ కమిటీ పనిచేయగలదు. ఈ శాఖ సంస్కృతి సభల సమావేశాలు జరిపి సంస్కృతిని పోషించు ముఖ్య విషయాలను గూర్చి చర్చలు జరిపించుట, ప్రదర్శనములు ఏర్పాటుచేయుట మొదలైన కార్యప్రణాళికను కూడ అనుసరింపగలదు.

తెలుగు భాషకు, సారస్వతమునకు, సంస్కృతికి సంబంధించిన చిత్రాలు, పట్టికలు, గ్రంథాలు మొదలైన పరికరాలు ఈ ప్రదర్శనాలలో ప్రదర్శింపబడగలవు.

ఈ ఉద్దేశాలను పురస్కరించుకొని తెలుగు పత్రికల ప్రదర్శనం జరిపించుటకు, పత్రికలకు సంబంధించిన విషయాలను గూర్చి ఆయా శాఖలలో సమర్థులైనవారిచే ఉపన్యాసములను ఇప్పించుటకును మొట్టమొదటగా తలపెట్టబడినది.

ఆధునిక సంస్కృతి వికాసానికి పత్రికలు పట్టుగొమ్మలు. మనదేశంలో జాతీయభావ ప్రాదుర్భావంతోపాటు పత్రికలుకూడ అవతరించినవి. మన పునర్నిర్మాణ దశలో పత్రికల ప్రాముఖ్యం అగణ్యమైనది.

కావున, ఏతద్విషయాలన్నిటిని చక్కగ అవగాహన చేసికొనుటకుగాను, ఈ పత్రికల ప్రదర్శనం, మహాసభ ఏర్పాటుచేయబడినది.

-పందిరి మల్లికార్జునరావు,
కార్యకర్త.

Vol. VIII—7 (January 1952) Sri Ramakrishna Prabha Regd. No. M—4635

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు పండిత పామర రంజకమైన శైలి. ముచ్చటగు 5-వ కూర్పు రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | |
|---|---|---|---|
| శారదా ప్రసంగములు ... | 2 8 0 | గురూపదేశములు ... | 0 8 0 |
| ప్రబోధరత్నాకరము ... | 2 4 0 | నా సంస్కరణ యుద్ధవిధానము ... | 0 6 0 |
| రాజయోగము ... | 2 4 0 | నా గురుదేవుడు ... | 0 6 0 |
| కర్మయోగము | 1 8 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | 0 4 0 |
| భక్తియోగము ... | 1 4 0 | నవీన భారతదేశము ... | 0 4 0 |
| వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 1 8 0 | ముక్తిమార్గము ... | 0 3 0 |
| వివేకానంద లేఖావళి (రెండవ భాగము) | 1 8 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | 0 3 0 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 4 0 | శ్రీ రామనామ సంకీర్తనము ... | [illegible] 1 0 |
| వివేక సూర్యోదయము ... | 1 0 0 | యతిగీతము (పద్యకావ్యము) ... | 0 1 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 12 0 | నా మతము 0 0 6 డజను | 0 5 0 |
| భక్తిమార్గము ... | 0 8 0 | సింహ గర్జన 0 0 6 డజను | 0 5 0 |
| చికాగో నగరోపన్యాసములు ... | 0 8 0 | | |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మా యొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మా యొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి ; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎన్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానంద స్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-1-52

# శ్రీ రామకృష్ణ ప్రభ

౧౯౫౨, ఫిబ్రవరి—ఖర, మాఘము

సంపుటము ౮ సంచిక ౮







శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు
చెన్నపురి

(పాట భావము)

హరినామోచ్చారణమున నా కెన్నడు కన్నీరు కండ్లవెంట ధారలు ధారలుగా ప్రవహించును? ఆ దిన మెప్పుడు రాగలదు? సంసార వాసనలు నశించు సుదినమెన్నడు వచ్చునో? పులకాంకితుడనగు దినమెన్నడు సమీపించును?

ఇట్లు మాట్లాడుచుండ ఆహూతులయిన బ్రాహ్మభక్తులు కొందఱు వచ్చి కూర్చొనిరి. వారిలో కొందఱు పండితులు, కొందరు ఉన్నతోద్యోగులు. విజయశ్రీ రజనీనాథరాయ్ వారిలో నొకడు.

'భావము కలిగిన వాయువు స్తంభించును' అని శ్రీ రామకృష్ణుడు పలుకుచు మఱియు అర్జునుడు మత్స్యయంత్రమును నెక్కుపెట్టునపుడు అతని దృష్టి సమస్తమును మత్స్యనేత్రమునందే లయించియుండెను. మరి యే యితర దిశకును అతని దృష్టి మఱలలేదు. అతని కంటికి మత్స్యనేత్రమువినా అన్యమేదియు గోచరింపలేదు. ఇట్టి యవస్థయందు వాయువు స్తంభించి కుంభకము లభించును. భగవద్దర్శన లక్షణ మేమన మనయందలి మహావాయువు అతివేగముగ శిరోభిముఖముగా గమించును. అంతట సమాధి లభించి మనకు భగవద్దర్శన మబ్బును.

(వచ్చియున్న బ్రాహ్మభక్తులను జూచి) పండితమాత్రులై భగవద్భక్తి కుదురనివారి మాటలు అవకతవకలుగా నుండును. సామాధ్యాయి యను పండితు డొకడు 'ఈశ్వరుని యందు రసములేదు. మన భక్తిప్రేమలచే నాతని సరసుని గావింపవలయు'నని వచించెను. ఎంతటిమాట? ఏ ప్రభువును వేదములు రసస్వరూపముగా వాకొనుచున్నవో ఆయన నీరసుడట! దీనినిబట్టియే భగవాను డెట్టివాడన్న విషయ మా వ్యక్తికి తెలియనే తెలియదని ఋజువగుచున్నది. అందువలననే యిట్టి యవకతవకలు. ఒకడు 'నా మామగారింట గోశాల నిండుగ గుఱ్ఱములున్న'వని వచించెను. ఇందువలన అతని మామగారింట గుఱ్ఱపు గిట్టగూడ లేదని తెలియుచున్నది. గోశాలయందు గుఱ్ఱము లుండునా!

కొందఱు తమ యైశ్వర్యము శక్తి సంపద సంభ్రమములు—వీనివలన నహంకరింతురు. ఇవన్నియు మూన్నాళ్ల ముచ్చటలే. వారితో నేదియు పోవదు. ఈ విషయమున నొక పాట గలదు. 'ఓ మనసా! యోచించి చూడుము. ఎవరి కెవరు? ఈ భూమండలమున నివన్నియు భ్రమమాయ తమములే. ఈ మాయాజాలమున బట్టువడి దక్షిణ కాళిని మఱువకుము. ఎవరి కొఱకై చింతించి కష్టింతువో వారు నీవెంట రారు. ఆ ప్రేయసిగూడ నీ శవమును అమంగళమని దూరముగా విడిచిపోవును. ఇవన్నియు మూన్నాళ్ల ముచ్చటలే. యజమానుడని నిన్నందఱును గౌరవింతురు. కాని కాలయజమాని వచ్చినచో ఈ యజమానిని విడనాడుదురు.' ధనగర్వ ముండరాదు. నేను ధనికుడనని యనుకున్నంతనే నీకంటె అధికులగు ధనికులున్నారన్న విషయము స్ఫురించును. సంధ్య కాగనే మిణుగురుపురుగు బయటబడి యావత్ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నానని తలంచును. కాని నక్షత్రములు ప్రకాశింపగనే దాని యభిమాన ముడుగును. అపుడు నక్షత్రములు మేమే కాంతిమంతములమని జగత్తునకు వెలుతురు నిచ్చుచుంటిమని తలంచును. కొంత సేపటికి చంద్రోదయము కాగా నక్షత్రములు




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౨ { ౧౯౫౨ - ఫిబ్రవరి :: ఖర - మాఘము } సంచిక ౨

ఓం నమః శ్రీ భగవతే రామకృష్ణాయ నమో నమః

## ప్రార్థన

### శ్రీ రామకృష్ణ స్తవము

శ్లో. ఓంకార వాచ్యం స్వవికాశ మాద్యం నిత్యం విశుద్ధం త్రిగుణై ర్విముక్తం।
సాక్షీ స్వరూపం జగతాం జనేశం శ్రీరామకృష్ణం సతతం నమామి॥

శ్లో. రాగాదిశూన్యం కరుణాధివాసం జ్ఞానప్రకాశం భవపాశనాశం।
ఆనందరూపం మృదుమంజుహాసం శ్రీరామకృష్ణం సతతం స్మరామి॥

శ్లో. మగ్నం భవాద్ధావభితారయంతం స్వాంకం నయంతం దురితం చరంతం।
భక్తార్తి భారం కృపయాహరంతం శ్రీరామకృష్ణం శరణం వ్రజామి॥

శ్లో. కృచ్ఛ్రం తపోయజ్ఞమహం న జానే మంత్రం న యంత్రం స్తవనంచ కించిత్।
జానే సదాహం శరణం వరేణ్యం హే దీనబంధో తవపాదయుగ్మం॥

శ్లో. షడ్వైరిణో మే ప్రసభం ప్రమత్త మాతంగ వన్మాం నియతం తు దంతి।
హే దేవ దేవేశ జగన్నివాస దాసోస్మి తే మాం పరిపశ్య రక్ష॥

శ్లో. నాహం ప్రయాచే మణిరత్నపూర్ణం హర్మ్యమ్ మనోజ్ఞాం సురబృందసేవ్యం।
మేరోః సమానం రజతం సువర్ణం కాంతాం సురమ్యాం భువి సర్వరాజ్యమ్॥

# రామకృష్ణప్రభ

శ్లో. యద్ యోగిబృందా జనహీనదేశే మగ్నాః సమాధౌ పరిచింతయంతి।
యాచే త్వహంతే భువనైకనాథ బ్రహ్మాదివంద్యం చరణారవిందమ్॥

శ్లో. నత్వేవ జానాసి మహేశ్వరోఽసి దీనాతి దీనశ్చ పదాశ్రితోఽహం।
సంయచ్ఛ తస్మై స్వకృపాగుణేన భక్తిం తదీయా మచలాం విశుద్ధామ్॥

శ్లో. మందప్రమత్తో గుణవిత్తహీనః కథం నువేద్మి స్తవనం తవాహం।
స్తుత్వా యథా త్వాం కరుణైకసింధో ప్రాప్స్యామి తన్మాం ప్రవిదేహి శిక్షాం॥

శ్లో. నమామి నిత్యం తవపాదయుగ్మం ధ్యాయామి నిత్యం తవపూర్ణరూపం।
కరోమి నిత్యం కమలాంఘ్రి పూజాం నాథ త్వదన్యచ్ఛరణం నజానే॥

శ్లో. స్థాపకాయచ ధర్మస్య, సర్వధర్మ స్వరూపిణే।
అవతార వరిష్ఠాయ, రామకృష్ణాయ తే నమః॥

శా. శ్రీరమ్యంబగు సృష్టి సర్వమతముల్ శిష్టావళిన్ బ్రహ్మముం
జేరంగోల్పుఁ దుదిన్ నదీనదములన్ సింధూత్కరంబున్ బలెన్
మీరున్నేమను భేదభావముడుగన్ మేలంచు బోధించు సు
శ్రీరమ్యా! మతసామరస్య నిలయా! శ్రీ రామకృష్ణప్రభూ!

తే. గీ. సురుచిరంబైన భవదీయ సుస్మితమున
విస్తృతోన్మీలిత కటాక్ష వీక్షణమున
శిష్యవర్గంబుఁ దీర్చెడి చిన్మయాత్మ!
రామకృష్ణప్రభూ నీవె రక్షణంబు!



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## సింధూరియాపటి బ్రహ్మసమాజమున శ్రీ రామకృష్ణుడు

(గతసంచిక తరువాయి)

26 నవంబరు 1883.

విజయకృష్ణ గోస్వామి నేడే గయాక్షేత్రము నుండి తిరిగివచ్చెను. ఆతడు అచటనున్నప్పుడు కొన్నిదినములు నిర్జనస్థలములయందును కొన్నాళ్లు సాధుసంగమమునందును గడపెను. ప్రస్తుత మాతడు కాషాయాంబరముల ధరించి యున్నాడు. ఈదుస్తులతో నాతడు చాల అందముగా గనిపించుచున్నాడు. ఆతడెల్లప్పుడును అంతర్ముఖుడై యున్నట్లు ఆతని వైఖరి మనకు స్ఫురింపజేయుచుండును. వినమితశిరస్కుడై యతడు దీర్ఘాలోచనానిమగ్నుడుంబోలె శ్రీ గురుదేవుని సన్నిధియందు గూర్చొని యుండెను.

శ్రీరామ:—(విజయుని జూచుచు) విజయా! 'నీకేదయిన నిల్లు కుదిరినదా ?'

ఇదిగో వినుము. సాధువు లిరువురు దేశాటనము చేయుచు నొకపట్టణమును జేరిరి. అందొక డా పట్టణము వైఖరికి తెల్లబోయి యందలి యిండ్లు, బజార్లు, కొట్లు—అన్నింటినీ జూడ నారంభించెను. ఆసమయమున అతడు రెండవ సాధువును కలిసికొనెను. అంతట నా ద్వితీయ సాధువు 'ఆశ్చర్యపరవశుడవై యిట్లు చూచుచున్నావేమి ? నీ మూట ముల్లె లేవి ?' యని యడిగెను. ప్రథము డిట్లు సమాధానించెను : 'నే నీ పట్టణమును జేరగనే బస కుదుర్చుకొని ఆ మూట నందుంచి తలుపు తాళమువైచి నిశ్చింతమనస్కుడనై బయటికి వచ్చితిని. ఈ పట్టణమునందలి వింతలను జూచుచు బోవుచున్నాను.' ''అందువలననే నేనుగూడ బస కుదిరినదా' యని యడుగుచుంటిని'' అని రెండవవాడు పలికెను. ('మ.' మున్నగువారితో) విజయుని (fountain) జెలయిన్నాళ్లును మూతవడియుండెను. అది యిపుడు తెరువబడినది.

(విజయునితో) చూచితివా! శివనాథుడెన్నియో కష్టములనుభవించుచున్నాడు. పత్రికలకు వ్యాసముల వ్రాయుటయు నింకను నెన్నియోపను లతనికున్నవి. విషయకర్మముల వలన మిగులునది యశాంతియే. అదియునుగాక ఎన్నియో తీవ్రసమస్యాపరిష్కరణాది దీర్ఘాలోచనలుగూడ నతనికి గలవు.

శ్రీమద్భాగవతమునందు అవధూతకుగల (24) ఇరువది నలుగురు గురువులలో గ్రద్దయు నొక గురువుగా బేర్కొనబడియున్నది. ఒక

చోట కొందఱు చేపలు పట్టుచుండిరి. ఆ సమయమున నెక్కడనుండియో యొక గ్రద్ద వచ్చి హఠాత్తుగా నచ్చట బ్రాలి యొక చేపను తన్ను కొనిపోయెను. కాని దాని ముక్కున చేపను జూడగనే వందలకొలది కాకులు దానిని వెంబడింప నారంభించెను. తోడనే 'కా కా' యని పెద్దగా గోల జరిగెను. చేపతోడి గ్రద్ద పోయిన చోటికెల్ల నీ కాకులు పోవుచుండెను. దక్షిణాభిముఖముగా గ్రద్ద వెళ్లెను. కాకులు ఆ వైపునకే వచ్చెను. మఱల నుత్తరదిశకు పోవగా నచ్చట గూడ నదియే జరిగెను. సరి యని గ్రద్ద తూర్పు పడమరలు తిరుగాడ జొచ్చినది. కాని కాకులు దానిని వదలినవి కావు ఎచటికిబోయినను ఈ యవస్థ తటస్థించుటచే చికాకుచెంది యటు నిటు తిరుగుచుండగా ముక్కునుండి చేప జారిపోయెను. అంతటితో కాకులన్నియు గ్రద్దను వదలి చేపను జేరెను. అంతట ఆ గ్రద్ద నిశ్చింతగా నొక చెట్టు కొమ్మపై గూర్చొని యిట్లు తలపోయ నారంభించెను: 'నా కష్టములన్నింటికిని ఈ చేపయేగదా కారణము. అది పోయినది, దానితోడనే నా కష్టములును నశించినవి. నే నిపుడు నిర్విచారినై యున్నాను.'

అవధూత గ్రద్దవలన నీ గుణపాఠమును గ్రహించెను. 'ఎంతవఱకు మత్స్యము (వాసనలు) లుండునో అంతవఱకు కర్మములు దప్పవు. ఆ కర్మములవలన విచారము, ఆతురత, అశాంతి మున్నగునవన్నియు పుట్టును. వాసనా త్యాగము లభించినంతటనే కర్మ నశించి శాంతి సమకూఱును.

కాని నిష్కామకర్మ మిక్కిలి మంచిది. దానియం దశాంతియే లేదు. కాని నిష్కామ కర్మాచరణము మిక్కిలి కష్టము. మనము నిష్కామకర్మ మాచరించుచున్నామని తలంప వచ్చును. కాని ఎందుండియో కామన అందు అజ్ఞాతముగా బ్రవేశించును. కర్తకు అది స్ఫురింపనే స్ఫురింపదు. మానవుడు పూర్వము తీవ్ర సాధనల చేసియున్నచో నిష్కామకర్మను ఆచరింపగలడు. భగవద్దర్శనానంతరము నిష్కామకర్మ మనాయాసముగ ప్రవర్తిల్లును. సాక్షాత్కారానంతరము సాధారణముగా కర్మత్యాగమే కలుగును. ఎవరో ఒకరిద్దరు నారద మహర్షివలె లోకశిక్షార్థము కర్మాచరణము గావించుచుందురు.

అవధూత కింకొక గురువు గలదు. అది తేనెటీగ. తేనెటీగ ఎంతో కష్టపడి ఎన్నాళ్లకో మధువును సంపాదించును. కాని ఆ మధువును అది అనుభవింపదు. ఎవఁడో వచ్చి ఆ తేనె పట్టును విడదీసి యా తేనెను తీసికొనిపోవును. 'సంచయనము చేయరా'దన్న గుణపాఠమును అవధూత తేనెటీగవలన గ్రహించెను. సాధువులు సంపూర్ణముగ భగవంతునియెడ నిబ్బరము కలిగియుండవలయును. వారు సంచయనము చేయరాదు.

ఈ విషయము సంసారులకు గాదు. సంసారులు వారి కుటుంబమును రక్షించుకొనవలయును గదా! అందువలన వారు సంచయనము చేయవలయును. పక్షులు, సాధువులు, సంచయనము చేయరు. కాని పక్షులు పిల్లలకొఱకై ఆహారమును నోటగఱచికొనివచ్చును. విజయా! నేనొక విషయము జెప్పెద వినుము. ఎవఁడేని సాధువు మూట ముల్లె కట్టుకొని యందనేకము లగు ముళ్లు వేసికొనియున్నచో వానిని నమ్మవలదు. నే నొకమా రిట్టి సాధువు నొకనిని జూచితిని. ఇరువురు మువ్వురు కూర్చొని

యున్నారు. ఒకడు పప్పులోని రాళ్ల నేరు చున్నాడు. మరియొకడు బట్ట కుట్టుచున్నాడు. మరియొకడు ధనికులు పెట్టిన విందునుగూర్చి మాట్లాడుచున్నాడు. "అరె ఓ బాబునేలాక్ రూపేయా కరచ్ కియా, సాధు లోకోం బహుత్ కిలాయా—పూరీ, జిలేబీ, పేడా, బర్ఫీ, మాల్పువా, బహుత్ చీజ్ తయార్ కియా" (అందరును నవ్విరి.)

విజయకృష్ణుడు:—చిత్తము. దారియం దిట్టి సాధువులనుగూడ జూచితిని. గయలో అందరు వీరిని 'లోటావాలా' సాధువులందురు. (అందరు నవ్విరి.)

శ్రీరామ:—(విజయునితో) భగవానుని యందు భక్తి కుదిరిన కర్మత్యాగము తనంతట తానే లభించును. భగవంతు డెవరిచే పని చేయించుచున్నాడో వారు కర్మల నాచరింతురు గాక! నీకిపుడు సమయ మాసన్నమయినది. అన్నింటినీ వదలివైచి 'ఓ మనసా! భగవానుని నీవు చూడుము, నేను జూచెదను. ఇతరులెవ్వరును మన దృష్టిని చెదర్చకుందురుగాక' అని చెప్పి శ్రీ రామకృష్ణ భగవానుడు అనన్యకంఠమాధుర్యముతో మధువును వర్షించు నొకానొక గేయమును బాడెను.

(పాట భావము)

జాగరూకతతో హృదయమున ఆదరిణి శ్యామామాతను గొలువుము. ఓ మనసా! నీవు చూడుము, నేను జూచెద. ఇంకెవరిని జూడ నీయకు. కామాదుల నేమరించి ఒంటరిగా తల్లిని జూచుటకు నీవు రమ్ము. అపుడపుడు 'అమ్మా, అమ్మా' యని పిలుచుటకై రసనేంద్రియమును మాత్రము విడువవలదు. కురుచిని కుమంత్రము లను దరిజేరనీయకుము. జ్ఞానమును నేత్రములకు ద్వారపాలకుని గావింపుము. అత్యంతము జాగరూకతతో నుండమనుము.

శ్రీరామ:—(విజయునితో) ఇక నీవు భగవానుని శరణుజొచ్చి లజ్జాభయముల ద్యజింపుము. నేను హరినామసంకీర్తనము చేయుచు నృత్యము చేసినచో నితరులేమనుకొందురో యన్న భావమును వదలిపెట్టుము. లజ్జాఘృణ భయము లుండరాదు. లజ్జయు, ఘృణమును, భయమును, రహస్యగోపనాభిలాషయు పాశములే. ఇవన్నియు నశించిననే జీవునకు ముక్తి. జీవుడు పాశబద్ధుడు. శివుడు పాశముక్తుడు. భగవత్ప్రేమ అత్యంత కష్టసాధ్యము. మొట్ట మొదట పతివ్రతకు తన భర్తయం దెంతటి నిష్ఠయో అంతటి నిష్ఠ భగవానునియందు మనకు కుదిరిన యపుడే భక్తి లభించును. శుద్ధ భక్తి కలుగుట చాల కష్టము. భక్తియందు మనఃప్రాణములు భగవల్లగ్నములగును.

తదనంతరము భావము. భావము కలిగినంతనే మానవుడు అచ్చెరువందును. వాయువు స్తంభించును. కుంభకము తనంతట తానే సిద్ధించును. తుపాకి ప్రేల్చువాడు ఆ సమయమున తదేకాగ్రచిత్తుడై, వాచారహితుడై స్తంభితవాయువై యున్నట్టి స్థితియే యిదియును.

ప్రేమ లాభము ఇంకను చాల యంతరమున నున్నది. చైతన్యప్రభువునకు ప్రేమ కలిగెను. భగవత్ప్రేమ కలిగిన బహిర్విషయము లన్నియు మఱచిపోవును; మానవున కత్యంత ప్రియమైన శరీరము సయితము జ్ఞప్తియం దుండదు.

ఇట్లు పలుకుచు శ్రీ రామకృష్ణ గురుదేవు డొక కీర్తన బాడ నారంభించెను.

(పాట భావము)

హరినామోచ్చారణమున నా కెన్నడు కన్నీరు కండ్లవెంట ధారలు ధారలుగా ప్రవహించును? ఆ దిన మెప్పుడు రాగలదు? సంసార వాసనలు నశించు సుదినమెన్నడు వరి కొనును? పులకాంకితుడనగు దినమెన్నడు సమీపించును?

ఇట్లు మాట్లాడుచుండ ఆహూతులయిన బ్రాహ్మభక్తులు కొందఱు వచ్చి కూర్చొనిరి. వారిలో కొందఱు పండితులు, కొందరు ఉన్నతోద్యోగులు. విజయశ్రీ రజనీనాథరాయ్ వారిలో నొకడు.

'భావము కలిగిన వాయువు స్తంభించును' అని శ్రీ రామకృష్ణుడు పలుకుచు మఱియు అర్జునుడు మత్స్యయంత్రమును నెక్కు వెట్టునపుడు అతని దృష్టి సమస్తమును మత్స్యనేత్రమునందే లయించియుండెను. మరి యే యితర దిశకును అతని దృష్టి మఱల లేదు. అతని కంటికి మత్స్యనేత్రమువినా అన్యమేదియు గోచరింపలేదు. ఇట్టి యవస్థయందు వాయువు స్తంభించి కుంభకము లభించును. భగవద్దర్శన లక్షణ మేమన మనయందలి మహావాయువు అతివేగముగ శిరోభిముఖముగా గమించును. అంతట సమాధి లభించి మనకు భగవద్దర్శన మబ్బును.

(వచ్చియున్న బ్రాహ్మభక్తులను జూచి) పండితమాత్రులై భగవద్భక్తి కుదురనివారి మాటలు అవకతవకలుగా నుండును. సామాధ్యాయి యను పండితు డొకడు 'ఈశ్వరుని యందు రసములేదు. మన భక్తిప్రేమలచే నాతని సరసుని గావింపవలయు'నని వచించెను. ఎంతటిమాట? ఏ ప్రభువును వేదములు రసస్వరూపముగా వాకొనుచున్నవో ఆయన నీరసుడట! దీనినిబట్టియే భగవాను డెట్టివాడన్న విషయ మా వ్యక్తికి తెలియనే తెలియదని ఋజువగుచున్నది. అందువలననే యిట్టి యవకతవకలు. ఒకడు 'నా మామగారింట గోశాల నిండుగ గుఱ్ఱములున్న'వని వచించెను. ఇందువలన అతని మామగారింట గుఱ్ఱపు గిట్ట గూడ లేదని తెలియుచున్నది. గోశాలయందు గుఱ్ఱము లుండునా!

కొందఱు తమ యైశ్వర్యము శక్తి సంపద సంభ్రమములు—వీనివలన నహంకరింతురు. ఇవన్నియు మూన్నాళ్ల ముచ్చటలే. వారితో నేదియు పోవదు. ఈ విషయమున నొక పాట గలదు. 'ఓ మనసా! యోచించి చూడుము. ఎవరికెవరు? ఈ భూమండలమున నివన్నియు భ్రమాయత్తములే. ఈ మాయాజాలమున బట్టువడి దక్షిణ కాళిని మఱువకుము. ఎవరికొఱకై చింతించి కష్టింతువో వారు నీవెంట రారు. ఆ ప్రేయసిగూడ నీ శవమును అమంగళమని దూరముగా విడిచిపోవును. ఇవన్నియు మూన్నాళ్ల ముచ్చటలే. యజమానుడని నిన్నందఱును గౌరవింతురు. కాని కాలయజమాని వచ్చినచో ఈ యజమానిని విడనాడుదురు.' ధనగర్వ ముండరాదు. నేను ధనికుడనని యనుకున్నంతనే నీకంటె అధికులగు ధనికులున్నారన్న విషయము స్ఫురించును. సంధ్య కాగనే మిణుగురుపురుగు బయటబడి యావత్ప్రపంచమును ప్రకాశింపజేయుచున్నానని తలంచును. కాని నక్షత్రములు ప్రకాశింపగనే దాని యభిమాన ముడుగును. అపుడు నక్షత్రములు మేమే కాంతిమంతములమని జగత్తునకు వెలుతురు నిచ్చుచుంటిమని తలంచును. కొంత సేపటికి చంద్రోదయము కాగా నక్షత్రములు

సిగ్గుజెంది ప్రభాహీనములగును. చంద్రుడంతట నా వెలుగువలననే యావత్ప్రపంచము భాసించుచున్నది. నేనే వెలుగునిచ్చుచున్నాననుకొనును. చూచుచుండగనే యరుణోదయమగును. సూర్యుడుదయించును. చంద్రుడు కాంతిహీనుడగును. కొంతసేపటికి కనుపింపనే కనుపింపడు.

ధనవంతు లీ విషయమును గమనించినచో ధనగర్వము కలుగదు.

మణిలాలు ఉత్సవార్థమై యెన్నియో యాహార పదార్థముల సేకరించియుండెను. ఎంతో గౌరవపూర్వకముగ శ్రీ రామకృష్ణ గురుదేవునకును అచటికి వచ్చియున్న భక్తులకును సమారాధన గావించెను. భక్తులు ఇండ్లకు మఱలునపుడు రాత్రి చాలకాలమయినది. కాని ఎవరికిగూడ నది శ్రమగా దోపలేదు.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
21-7-'15.

శ్రీమాన్ ...

పదునాల్గవ తారీఖునాటి నీ యుత్తరమును జూచి విషయమును గ్రహింపగలిగితిని. నీ యారోగ్యము చక్కగా నున్నదని విని మిక్కిలి సంతసించుచున్నాను. శరీరారోగ్యము బాగుగా నున్ననే భక్తిసాధనలు, స్మరణమననములు సులభసాధ్యములగును. కావుననే 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్' అన్న పలుకు అనుభవార్థమగుచున్నయది. ఈ కాలమున భగవానుడు నీవలన నత్యుత్తమములగు స్మరణమననముల గావింపించుచున్నాడని విని యపరిమితానందము నందుచున్నాడను. ఆయన చింతనమువినా యన్యమెద్ది కలదు? తక్కిన వన్నియు నిహామునందు నిలిచిపోవునవియే. భగవానుని స్వకీయునిగా గావించుకొనగలిగినచో ఇహపరలోకములు రెండింటికిని పనికి వచ్చును. ఏలనన ఆయనతో మనకు నిత్యసంబంధము కలుగవలయును. ఈ ప్రాపంచిక దశవింశతి వర్షములకొఱకు మాత్రమే కాదు.

నీవు భగవచ్ఛరణాగతుని లక్షణములను శీలమును దెలియగోరుచున్నావు; అత్యంత శ్రేయోదాయకము. కాని లక్షణముల దెలిసికొనుటకంటె శరణాగతుడగుటయే ముఖ్యము. అట్లయినచో ఆ లక్షణములు తమంతట తామే ప్రకటితములగును. అయినను లక్షణముల నరయుట కభిలషించుట దుష్కార్యముగాదు. ఈ లక్షణములు సాధారణముగా నిరుదెఱంగులు. ఒకటి స్వసంవేద్యము. రెండవది పరసంవేద్యము. తనంతట తానే యెఱుగుట

స్వసంవేద్యము. ఇదియే సర్వోత్తమమయినది. ఇతరులు చూచి 'ఔను ఈతనికి జ్ఞానము కలిగినది' యని తెలిసికొనుట పరసంవేద్యము. కాని పరసంవేద్యమునందు పొరపాటు కలుగవచ్చును. ఎట్లన బాహ్యలక్షణములు ప్రకటితములు కాకుండుటయే యీ పొరపాటునకు కారణము గానోపును. జ్ఞానేతర కారణము వలన సయితము పరసంవేద్యము కలుగవచ్చును. అందువలన నిది పొరపాటున కవకాశము కలిగించునదియే. కాని నీ యనుభవసిద్ధమగు దానియందు పొరపాటు కలుగజాలదు. కావున నదియే సరియైనది. కడుపు నిండినదో లేదో యన్న విషయము నితరులకంటె చక్కగా మనమే తెలిసికొనుటవంటిదియే యిదియును. మరియొక యుదాహరణము:—మన ముఖవైఖరినిబట్టి మన కోపము నితరులు గుర్తెఱుంగగలరు. ఇది పరసంవేద్యము. కాని దీనియందు పొరపాటు కలుగవచ్చును. ఎట్లన, కోపము లేకపోయినను కోపమును మన మభినయింపవచ్చునుగదా! అది అసంభవముకాదు. కారణాంతరములవలన సయితము ఈ లక్షణములన్నియును ప్రకటింపబడవచ్చును. ఇతరులు చూచు నిమిత్తము ఇట్టి రాగద్వేషాది భావములను బ్రకటింపవచ్చును. కాని యథార్థముగా కోపమున్నదియు లేనిదియు ఆ వ్యక్తికి తప్పక తెలియును. ఇదియే వాని స్వసంవేద్యము. అయినను అట్టివాడీ లక్షణముల నన్నింటిని ప్రకటింపకుండగూడ నుండగలడు. కావుననే స్వసంవేద్యమే సత్యమయినది. ఎట్లయినను నీవు వ్రాసిన లక్షణములన్నియు చక్కగనున్నవి. భగవచ్ఛరణాగతుడవయినచో నీ వెవరియందును ఆధారపడియుండ నవసరము లేదు. నీయందుండియే నిర్భయస్వభావము ప్రభవింపగలదు. ఏలయన 'ఆయన కృపను బడయుదువు, ఆయన ఎల్లపుడు నిన్ను రక్షించుచున్న విషయము నీకు స్పష్టము కాగలదు. అసచ్చింతలన్నియు నీ హృదయమునుండి తమంతట తామే తొలగిపోవును. సదా సద్భావమే స్ఫురించుచుండును. నీ యంతరంగము శాంతిమయమగును. ఇవన్నియు స్వసంవేద్యములు. ఇతరులు నిన్నుజూచి యితడు శాంతస్వభావుడు, నిశ్చింతగలవాడు, సర్వభూతదయ కలవాడు, నిత్యసంతోషి యని యిట్టి గుణముల నారోపించుట పరసంవేద్యములు. ఇతర లక్షణములుగూడ కలవు. నీవు తెలిపిన లక్షణముల జదివి సంతసించుచున్నాను. అన్నియు సత్యములే వాకొనియున్నావు. భగవానుడు నీకు సుబుద్ధి నొసగి రక్షించుగాత. భగవానుని ప్రేమించి జీవితమును ధన్యము గావించుకొనుము. ఇక వ్రాయుట కేమి కలదు?

నీ శ్రేయోభిలాషి,
శ్రీ తురీయానంద

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ భగవానుడు

మహాపురుషుల జీవితాంశముల గూర్చి ఆలోచింపదలంచుట అత్యంత కష్టమగు కార్యము. వారినిగూర్చి యోజించిన కొలందిని వారియందలి మహత్త్వము, మనయందలి నిమ్నత,— ఈ రెండింటికినిగల తారతమ్యము చక్కగా గోచరించుచుండును. ఈ విషయ స్మరణమున పుష్పదంతుని ఈ క్రింది * శ్లోకము తలపునకు రాకమానదు. మనమో కామక్రోధ లోభ మోహాది క్లేశములకు వశీభూతులము. కావున మన చిత్తము ఎల్లప్పుడును నిమ్నమును సంకుచితమును నై యొప్పుచుండును. ఇట్టి సందర్భమున వారల మనమెంతవఱకు దెలియగలము? ఈ తారతమ్యము వలన మనము పరిశుద్ధాంతఃకరణముతో మహాత్ముల జీవితాంశముల దలచిన కొలదియు వారి గుణావళిని ఆలోచించినకొలదియు ఆ యాలోచన అనర్ఘళ ధారాప్రవాహమువలె అంతులేనిదై పరువులెత్తుచుండును. ఆ మహత్త్వ గాంభీర్యమును మన మనస్సు ఇదమిత్థముగా దెలియజాలదు.

ఇందులకు గల ముఖ్యహేతు వెయ్యది? యోగవాశిష్ఠమునం దొకానొకచో 'ఎవని మనస్సు సంపూర్ణముగా కేవలమననముతోడనే జీవించునో వాడే జీవించియున్నవాడు—సజ్జీవతి మనోయస్య మననేనహి జీవతి' యని ప్రవచింపబడియున్నది. ఇట్లే అమెరికాదేశమునందలి ప్రసిద్ధ పురుషుడు ఎమర్సన్ ఇట్లు పలికియున్నాడు: "ఉన్నతభూమికయందు వసించువానినే మహానుభావుడందురు. సాధారణ మనుజులు ఆ స్థితిని బడయుట అత్యంతము కష్టసాధ్యము. స్వతస్సిద్ధముగా నిట్టి స్థితిని ఎవడు పడసియుండునో నతడే గొప్పవాడు. I count him a great man who inhabits a higher sphere of thought into which other men rise with labour and difficulty. He is great who is what he is from nature." సాధారణముగ జనసామాన్యము లౌకికవిషయములందే చింతానిమగ్నులై తమ కాలమంతయు గడపి ముగింతురు. రోగ శోక మరణము లెల్లప్పుడు వారిని వెన్నంటి తిరుగాడుచుండును. ఎన్ని సంపదలు, ఎన్ని ఐశ్వర్యములు మనము చేకూర్చుకొన్నను 'ఇంకను కావలయు' నన్న భావము దప్ప 'ఇక చాలు' నన్న సంతృప్తి కలుగనేరదు. ఈ జీవితమునకంటె మహత్తరమయినదేదియయినను గలదా యన్న విషయము మనకు స్ఫురియింపనే స్ఫురియింపదు. ఏదో కారణమువలన మానసిక విఘాతము సంభవించినపుడే "మనకు సంతృప్తి యావంతయినను లేదు. విధిలేక యెట్లో ఉన్న దానితో సరిపెట్టుకొన బ్రాకులాడుచున్నా" మని తెలియగలదు. ఆ సమయమునందే ఈ

* శ్లో. అతీతః పంథానం తవ చ మహిమా వాఙ్మనసయో - రతద్ వ్యావృత్త్యా యం చకిత మభిధత్తే శ్రుతిరపి।
స కస్య స్తోతవ్యః కతివిధగుణః కస్యవిషయః - పదే త్వర్వాచీనే పతతిన మనః కస్య న వచః॥

ప్రపంచమంతయు ఆడంబరములకెల్ల నాడంబర మనియు సారమెల్ల భగవద్భక్తియే యనియు దోపగలదు. అపుడు కొంతకు గొంత వైరాగ్యము ప్రభవించుటయు సత్యాన్వేషణమునకు బూనుటయు జరుగును. కాని భగవత్సాక్షాత్కారము బడయు తలంపున మానవు డెన్నియోసార్లు క్రిందుమీదులగుచుండును. మహాపురుషుల కిట్టి క్రిందుమీదులు కలుగబోవు. శ్రీ రామకృష్ణోపదేశానుసారము వారెల్లరును నీటిమీది పెద్దప్రూనులవంటివారు. వీరందఱు యుగావతారపురుషులై జనసామాన్యము నుద్ధరింప జన్మించినవారు. పతనమయిన యుగధర్మమును పునరుద్ధరించుటకై యవతరించిన యుగావతారపురుషుడు శ్రీ రామకృష్ణ భగవానుడు. కలిమాయావృతమును హతమును నగు మానవలోకమును స్వీయసుఖము నొసగి రక్షించుటకై ప్రేరేపింపబడిన యపూర్వసృష్టి శ్రీ రామకృష్ణ భగవానుడు. భారతదేశీయులు చ్యుతమయిన తమ ధర్మమును మార్గమును గానక పదే పదే మార్గాభిముఖులై ఎదురు చూచుచున్న భారతీయోద్ధరణార్థము భగవాను డెన్నిసార్లవతరింపలేదు? ధర్మజీవనమునే యనుసరించుచుంటిమని భ్రమించి మార్గచ్యుతులైన భారతీయులకు ఋజుమార్గమునుజూపిన మహానుభావుడు సిద్ధార్థుడు. అట్టి స్థితియే గతశతాబ్దమున గలుగగా భారతదేశీయ తపోఫలస్వరూపుడును ఏకీకృత జ్ఞానభక్తి సమూర్జితుడునునై రామకృష్ణభగవాను డవతరించెను. ఫరాసీ రచయిత రోమా రోలా (Romain Rolland) శ్రీ రామకృష్ణ జీవితమునం దిట్లు వ్రాసియున్నాడు: ''ఏ మానవుని యభివ్యక్తిని గూర్చి నేనిందు పొందుపఱచియుంటినో ఆ మహానుభావుడు ముప్పదిమూడుకోట్ల జనుల ద్విసహస్రాబ్దాధ్యాత్మికజీవన సంపూర్ణపరిణామ కేంద్రము.'' ఇందుమూలమున శ్రీవా రెట్టి మహాత్ములో వారి మనోవిహరణస్థాయి యెట్టిదో తెలియగలదు.

వారి జీవితము, ఉపదేశములు—వీనిని పరిశీలించినచో ఒండు రెండు విషయములు మనల నాకర్షించుచుండును. ప్రప్రథమమున నిజముగా భగవానుడు దప్ప నితరమేదియు వారి మనస్సు నాకర్షింపలేదు. భగవదన్యవిషయము వారెఱుగరనియే నుడువవచ్చును. వారెల్ల విధముల 'భగవల్లాభమే మానవలక్ష్య'మని ఎన్నియో సార్లు పలికియున్నారు. అదియే వారు మొదటి నుండి చివరివఱకు నొసగిన దివ్యోపదేశము. 'భగవానుడే వస్తువు. తదన్యమంతయు నవస్తువు. బ్రహ్మసత్యం జగన్మిథ్యా' కావున భగవానుడు దప్ప నితరమేది యనియు మనల నాకర్షించిన యెడల మనము దానినుండి మనల విముక్తుల జేసికొనవలయును. అనగా కామకాంచన త్యాగము. ఇది వారి యుపదేశములందు ముఖ్యమయినది. సాధారణముగ జీవితమున మానవున కశాంతిని గలిగించున వివి రెండేకదా!

భగవానుడే వస్తువు; తదన్యమంతయు నవస్తువే యని సాధారణముగా మహాపురుషులు సెలవిచ్చినను సామాన్య మానవజీవితమున నివి రెండును—అనగా వస్త్వవస్తువులు—విపరీతములై కనుపట్టుచుండును. సాధారణముగా ధర్మాచరణము కర్తవ్యమని వినియు మన స్వార్జితమగు నే చిల్లిగవ్వయో దానముచేసి గోరంతలు కొండంతలుగా తలంతుము. దేవాలయమునకేగి భగవత్ప్రార్థన గావించునపుడు సైతము ధనకనకవస్తువాహనాదులనే యభ్యర్థింతుము. ఇందు వస్తువు అవస్తువుగను అవస్తువు వస్తువుగను మాఱుచుండుటను గమనించినచో

మన లౌకికపరాయణత, యెంతటి లౌల్యమున కాలవాలమై యున్నదో గుర్తింపదగును. మన జీవనమంతయు ఎంతటి పాండిత్యమును సముపార్జించినను ఎన్ని యుపనిషణ్మంత్రములబఠించినను శుష్కమై యాకసమున కెగురజాలియు నేలమీది క్రుళ్లునే జూచునట్టి గృధ్రమువలె అథోముఖమై యుండును. ఇదియే మన బ్రదుకు, మన మనో విహారస్థలము. శ్రీ రామకృష్ణులవారి మనస్సును గ్రహింపజూచిన మనకును వారికిని గల యంత రము గోచరింపగలదు. మనము దేనిని చాల మంచిదనియు, శ్రేయస్కరమనియు, ఆనంద దాయకమనియు తలంతుమో దానిని శ్రీవారు లక్షింపనైన లక్షింపరు. అయినను మనకంటె వారికి ఆనందము స్వల్పమా యన్నచో ఆ యానందమునకును మన యానందమునకును పొందికయే లేదు. శోకక్లేశాదులు శ్రీవారిని దరియనే దరియవు. కంఠమున వ్రణముజూపి నెలలకొలది బాధపడుచు ఆహారము సైతము గ్రహింపజాలక మాటలాడగూడ వీలులేని రుగ్ణులైయున్నప్పుడు భక్తులు వచ్చిరన్నచో వారితో విచ్చలవిడిగా గంటలకొలది భగవద్విషయమును చర్చించుచు వారి నానందసాగరమున దేల్చుచుండెడివారు. విషయసుఖములతో ఆ సుఖమునకు పోలికయే లేదు. విషయసుఖముల ననుభవించు మనము ముండ్లపొదలను దినెడి యొంటెవలె నిదియే బాగున్నదని తలంతుము.

శ్రీవారిని మన యాదర్శపురుషునిగా గ్రహించినచో ఆ జీవన మెంత కష్టసాధ్యమయినదో తెలియగలదు. పదేపదే వారు శిష్యులకెన్నియో సార్లు ఇట్లు వచించియుండిరి. 'నేను జేసిన సాధన యందు పదునాఱవవంతు చేయగలిగినను అది యెంతయో గొప్పకార్యము.' ఈ విషయమునం దొక యుదాహరణము—అనేకసంవత్సరముల నాటి మాట! అప్పుడు వివేకానందుడు నరేంద్రుడుగానే యుండెడివాడు. బడిలో చదువుచు నానాడు గురుదేవునియొద్దకు వచ్చుచు బోవు చుండువాడు. చక్కగా పాపటదీసి తలదువ్వి గురుదేవునియెదుట నొకరోజు కూర్చొనియుండగా శ్రీవారు తనవ్రేలితో ఆ పాపటను జూపిరి. కాని నరేంద్రు డంతమాత్రమున మఱచువాడా? ఆయన తక్షణమే గురుదేవుడు వచించిన యర్థ మిది యని గ్రహించెను. వెంటనే గురుదేవుని కాలిచెప్పులను చేతియందలి హుక్కాగొట్టమును జూప నారంభించెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు నవ్వుచు నిట్లు పలికెను: 'నేను భగవల్లాభముకొఱ కెంతయో తపస్సుచేసితిని. నీవు దానియందొక వీసము చేసినను నిన్ను పరుపుమీద పరుపువైచి హంస తూలికాతల్పమున బరుండబెట్టుదును.' కాలము గమించెను. నరేంద్రుడుగూడ వివేకానందుడయ్యెను. భారతదేశమున వివిధప్రాంతముల కతోరతపంబొనర్చి దేశసేవాపరాయణుడై పాశ్చాత్యదేశములకేగి వచ్చెను. వారి యత్యద్భుతోపన్యాసముల విని పాశ్చాత్యులు వారి శరీరారోగ్యము చక్కగానుండుటకై మంచి 'స్ప్రింగులు' గల మంచమును పరుపులు ఇంకను వలయు నేర్పాట్లు గావించిరి. (ఇప్పుడుగూడ వీనిని బేలూరుమఠమున వివేకానందులు నివసించిన గదియందు గనుగొనవచ్చును.) ఆ మంచమున బరుండునపుడు శ్రీరామకృష్ణుల పూర్వ లాలనమును స్మరించి కన్నీరుబెట్టుకొని భక్తుల కావిషయమును దెలియచేసెడివారు శ్రీ వివేకానందులు. అప్పుడు వారికి శ్రీరామకృష్ణుల మహత్త్వము ఇంకను జ్వాజ్వల్యమానమై కనుపట్టెడిది. కావుననే కొన్నిసమయములందు "నేను వచించుదానియం దేమాత్రము మంచి

యున్నను అదియంతయు శ్రీ రామకృష్ణుల వారిదే. వానిలో గొప్పదన మేదేని యున్నచో నదియంతయు వారిదే. దయయుంచి నా యంతస్థును జూచి వారిని మీరు గణింపవలదు. వారి శిష్యులమయిన మేమందఱమును కోటి జన్మములు వారిని బోల బ్రయత్నించినను వారి యునికియందు లవలేశముగా నేనియు పరివర్తింప జాలము'' అని పలికెను. శ్రీ వివేకానందులే అట్లు పలికినచో మనమెంతని వర్ణింపగలము? ఆ ఉన్నతస్థితియందుండి శ్రీవారు తమ స్పర్శ వలనను దృష్టివలనను, భాషణము వలనను ఎందఱో మానవుల జీవితముల పరివర్తనము గావించి వారిని ఉన్నతస్థితికి గొనివచ్చిరన్న అందాశ్చర్యమున కావంతయు నెడముండదు. నేటికిగూడ అమృతతుల్యములగు శ్రీవారి వాక్కులు వేలకొలదిమైళ్ల దూరముననున్న దుఃఖితులును కష్టజీవులు నగు మానవులకు మనశ్శాంతిని ప్రసాదించుచున్నవి. ఇట్టి మహా మహుని అవతారపురుషుని జీవనపంథ, లక్ష్యము—ప్రపంచమునందలి మానవలోకము సమస్తమునకు అనుసరణీయములుగదా!



మొసలి నీటిపై ఈదులాడగోరును. కాని యది పైకి రాగానే వేటకాండ్రు దానిని చంపుటకై గుఱిపెట్టెదరు. కావున అది విధిలేక నీటియడుగుననే యుండి పైకి రాజాలకుండును. ఐనను సురక్షితముగా పైకి వచ్చుటకు అవకాశము చిక్కినప్పుడెల్ల బుస్సలుకొట్టుచు పైకి లేచి ఆనందముతో సాగరమున ఈదులాడును. ఓ నరుడా! సంసారమోహమున జిక్కిన నీవును ఆనందసాగరమున ఈదులాడ వాంఛించుచున్నావు, వేదనపడు చున్నావు. కాని సంసార తాపత్రయము నీకు అవకాశ మొసగుటలేదు. ఐనను నిరుత్సాహపడకుము. తీఱిక లభించినపుడెల్ల ఆత్రముతో భగవానుని వేడుకొనుము. మనఃపూర్వకముగా ప్రార్థింపుము. నీ దుఃఖము లన్నిటిని వానితో జెప్పుకొనుము. సకాలమున నిన్ను ఆతడు విముక్తుని జేసి సచ్చిదానంద సాగరమున ఓలలాడజేయును.

శ్రీ రామకృష్ణ పరమహంస.



ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ !

# శ్రీ బ్రహ్మానందస్వామి హాస్య చమత్కారములు

శ్రీ చిరంతనానంద స్వామి

శ్రీ రామకృష్ణ మానసపుత్రుఁడగు శ్రీ బ్రహ్మానందస్వామి శ్రీ రామకృష్ణునివలెనే వింతలతో, వినోదములతో, హాసములతో, పరిహాసములతో మహోన్నతాధ్యాత్మిక విషయములను బోధించువాఁడు. ఫలగర్భమున బీజములను సాగరగర్భమున రత్నములను నిమిడియుండు రీతిని మహనీయుల హాస్యచమత్కారోక్తులు సైతము విశేషభావబంధురములై, అంతరార్థసమువేతములై యలరారుచుండును. స్వామి తన శిష్యులలో నొకని కిట్టి హాస్యచమత్కారోక్తులతోఁ గూడినవియు ఛందోబద్ధము గానివియు నగు పద్యములను వ్రాసి పంపుచుండువాఁడు. కాని యందలి భావము లొక్కొక్కప్పుడు నపాళమంటుచుండెడివి. స్వామి చెన్నపురిలో నుండినపుడు తన లేఖకుఁడును ఉపచారకుఁడునై యుండిన ప్రభవానందస్వామి కీపద్యములను జెప్పి యాతనిచే వ్రాయించి పంపించువాఁడు. వానిలో నొకటి, ''శుచియైన హవ్యమును శునకమునకిడితి'' యను పాదము కలిగియుండెను. ఆ శిష్యునకీ పద్యమును బంప ప్రభవానందస్వామి సంకోచించుచుండ, స్వామి దానిని బునఃపరిశీలించి యిట్లు పలికెను: ''ఊహుఁ, ఇందేమియు మార్పుచేయనక్కఱ లేదు. ఉన్నదున్నట్లుగా దీనిని బంపవయ్యా! మఱి యేయితరమార్గమునను ఆ స్తబ్ధునకు నాభావము తల కెక్కదు.'' సద్గురూత్తముల శిక్షణవిధానము నిరర్థకమగునా? స్వామి యాశయము లాశిష్యుని మనఃఫలకమున ముద్రితమై యొప్ప నచిరకాలముననే యాతనికి మహత్తరమగు నాత్మప్రబోధ మొదవెను.

బ్రహ్మానందస్వామిని శ్రీ రామకృష్ణునితోఁ బోల్చుచు, మహేంద్రనాథగుప్త మహాశయుఁడు ('మ.') విశ్వానందుఁడను స్వామి శిష్యునితో నొకప్పు డిట్లు పలికెను: ''మహారాజు వర్తనము బరిశీలించుచో, శ్రీ గురుదేవులు (శ్రీ రామకృష్ణులు) ఎట్టివారో కొంత యవగాహన కాఁగలదు. సమాధిస్థితినుండి యాయన మనస్సు బాహ్యప్రజ్ఞ నొందినపు డాయన యందలి హాస్యరసము ప్రదీప్తమైయుండెడిది.'' స్వామి విషయమునను నిది యథార్థమై యొప్పెను. అంతరవలోకనప్రభావమునఁ దమ మానసోద్యానమునఁ బొచ్చి యానందపరిపూర్ణులై బాహ్యలోకమునకు మరలు మహనీయులు తమ సరససల్లాపములచే, హాస్యచమత్కారములచే నవ్వులనెడి పువ్వులను వెదచల్లుచు నెల్లరియుల్లములను బల్లవింపఁజేయుచుందురుకదా!

కన్నులు మూసికొని ధ్యానస్థితుఁడై యుండు శిష్యునిచెంతఁ గొన్ని ఫలములనో, మధురాహారములనో పెట్టించుచుండుట స్వామి కొక వేడుక. శిష్యుఁడు తన ధ్యానమును ముగించియు ముగింపకమునుపే తన యిష్టాహారములు ప్రత్యక్షమగును. అటువెనుక స్వామి యిట్లు ప్రశ్నించును: ''సరి, నాయనా! నీ తపఃఫలములు సిద్ధించినవా?''

తఱచుగా స్వామి శిష్యులను బ్రక్కలు పడ నవ్వించును. ఒకప్పుడు తాము నవ్వుచుండ,

స్వామి తన్ను మెల్లఁగా మోఁచేతితోఁ బొడిచి విశ్వానందుని సూచించుచు, "అదిగో, చూడు; అతఁ డెట్లు ఆఁడుపాపవలె ముసిముసినవ్వులు నవ్వుచున్నాఁడో?" అని పలుకుట తానింకను స్మరించుచుందునని ప్రభవానందస్వామి తెలిపి యున్నాఁడు. ఒక్కొక్కప్పుడు స్వామి సవిమర్శ ముగా నిట్లు వచించును: "అనుదినము నవ్వు చుండుట మంచిది. అయ్యది మనశ్శరీరములకు విశ్రాంతి నొసఁగూర్చును."

స్వామి హాస్యచమత్కారము లెట్లు దివ్య ప్రేమపూరితములు, సమున్నతభావప్రేరితము లునై యుండెడివో కాంచియున్నాముగదా? సోదరశిష్యులయెడ నాతని హాస్యచమత్కార ముల కొకటి రెండు నిదర్శనములను దెలుపుట యప్రస్తుతము కానేరదు.

ఒకనాఁడు అపరాహ్ణము స్వామి గంగానది కభిముఖముగానున్న వసారాయందలి బెంచిపైఁ గూర్చుండియుండెను. ఈ వసారాతోఁ గూడిన పురాతనభవన మొక్కటియే యపుడు బేలూరు మఠస్థుల కందఱికిని నివాసస్థానమై యుండెడిది.

సత్ప్రకాశానందస్వామి యను శిష్యుఁ డపుడు స్వామిసన్నిధిని నిలుచుండియుండెను. తన సెలవుదినములను మఠమున సాధుసాంగ త్యమునఁ గడపుచుండిన భక్తుఁడగు నొక యువకుఁ డింటికి వెడలఁబోవుచు స్వామియొద్ద సెలవుగైకొనవచ్చెను.

సార్థకనామధేయుఁడై మఠమును సందర్శింప వచ్చువారి కెల్లరకును మాతృస్థానీయుఁడై యుండిన ప్రేమానందస్వామియెడ నా యువ కుఁడు విశేషానురక్తుఁడై యుండెనని బ్రహ్మా నందస్వామి గ్రహించి, హాస్యభావప్రేరితుఁడై తన సోదరునిపట్ల నొక 'తమాషా' జరుపుద మని సంకల్పించెను.

యువకుఁడు తనకు ప్రణామమాచరించు చుండ, స్వామి యాతనిఁ గాంచి, "ప్రేమా నందస్వామివద్ద సెలవుతీసికొంటివా?" యని ప్రశ్నించెను. "లేదండి, ఆయనవద్ద సెలవు తీసికొనఁబోవుచున్నాను" అని యువకుఁడు బదులుచెప్పెను.

"మంచిది. నీ వాయనకుఁ బ్రణమిల్లునపుడు ప్రణామమంత్ర ముచ్చరింపవలయును. బహుశా నీ కీమంత్రము తెలియకపోవచ్చును; కాని నీకు నేను నేర్పెదను!"

అట్లు పలుకుచు, స్వామి ప్రాయికముగా నప్పటికప్పుడు వంగభాషలో సంస్కృతప్రాయ ముగా నుండురీతి నల్లిన యొక ద్విపద నాతనికిఁ జెప్పసాగెను. అందలి భావ మిది: "ఇంటికి మరల నా మన సొప్పకున్నది. మీ పాదార విందసన్నిధిని శాశ్వతముగాఁ బడియుండుటయే నా యభీష్టము." ఈ మంత్రము నుచ్చరించుచు నెట్లు వర్తింపవలయునో స్వామి యాతనికిఁ దెల్పెను. మొట్టమొదట ప్రేమానందస్వామి యెదుట బద్ధాంజలియై నిలుచుండి ద్విపదను బఠించుచు, "మీ పాదారవిందములకడ శాశ్వ తముగాఁ బడియుండుటయే నా యభీష్టము" అనునర్థమిచ్చు రెండవపాదముదగ్గఱకు వచ్చు సరికిఁ దన యంజలిని స్వామిపాదములవైపు త్రిప్పి మెల్లఁగా వంగుచుఁ దుదకు సాఁగిలఁబడ వలయునని చెప్పెను.

ఆ యువకుఁ డీఁక ప్రేమానందస్వామిని సంద ర్శించుటకై మరలినంతనే బ్రహ్మానందస్వామి, 'నీవు వెళ్లి ముచ్చట చూడు' మని సత్ప్రకాశా నందునిఁ బంపెను. యువకుఁడు ప్రాయికముగాఁ దనకుఁ దెల్పినరీతి నొనరించి ప్రణామమాచ రింప వంగుచు నేదియో గొణుఁగుచుండుట ప్రేమానందస్వామి గమనించి, "ఏమిది?

ఏమనుచున్నావు? పైకిఁ జెప్పు, నాయనా?'' యని పలికెను. కాని యువకుఁడు మిన్నకుండెను. ఈ విచిత్రఘట్టమును జూచుచుండిన సత్ప్రకాశానందస్వామి నవ్వాఁపుకొనలేక పక్కున నవ్వెను. అది గని ప్రేమానందస్వామి యాతనివైపుఁ జూచి, ''ఓహో! ఆతఁ డేమనుచున్నాఁడో నీకుఁ దప్పక తెలిసియుండును. అదేదో చెప్పవోయి!'' యనెను. అంత నాతఁడు ప్రణామమంత్రగాథ నంతయు ముచ్చటింప నెల్లరును గడుపుబ్బ నవ్వసాగిరి.

స్వామి తన సోదరశిష్యుఁడగు నఖండానందస్వామియెడ నొనరించిన తమాషా—పైదానికంటె విచిత్రమైన దొకటి—కలదు. కొంతకాలముగా బేలూరుమఠమున స్వామితో నివసించుచుండిన యఖండానందస్వామి మూర్షిదాబాదుజిల్లాలోని సర్గాచియందలి తన యాశ్రమమునకు వెడలనిశ్చయించెను. మఱికొన్నాళ్లుండుమని స్వామి తన సోదరశిష్యుని వేఁడుకొనెనుగాని యాతఁడు తాను వెడలకతప్పదనెను.

సోదరశిష్యుని పట్టుదలను గాంచి, ''సరిలే'' యని యాతనిని గొన్నిమైళ్లదూరమున నున్న స్టేషనుకడకుఁ గొనిపోవుటకై స్వామి యొక పల్లకీని గుదిర్చెను. తెల్లవాఱుచున్నదనఁగా రైలుబండి రావలసియుండినందున, అఖండానందస్వామి వేకువజాముననే బయలుదేఱవలసియుండెను.

పల్లకీబోయీలు అఖండానందస్వామి నెక్కించుకొని బయలుదేఱుటకుముందు బ్రహ్మానందస్వామి వారి చెవిలో నేమియో చెప్పెను. అపు డింకను జీఁకటిగా నుండెను. అఖండానందస్వామి తెరలమఱుఁగునఁ బదిలముగాఁ గూర్చుండియుండెను. బోయీలు మాటిమాటికిని బల్లకీ దింపి యాఁగుచుండిరి. ''ఎందుకు ఆఁగుచున్నారు?'' అని స్వామి యాతురతతో నడుగుచుండుటయు, వారిట్లు సమాధానింపసాగిరి: ''కూంతసేపు బడలిక దీర్చుకుంటున్నామండి బాబయ్యా! చుట్ట కాల్చుకుంటున్నాం. ఇంకా ఓ! కావలిసింత ఏళుందండి. తమరు ఆదుర్దా పడక్కఱలేదండి మారాజా!''

కొన్ని గంటలసేపు ప్రయాసతోఁ గూడిన యీవిధమైన ప్రయాణము సాగించి,—తమ 'ఓంబాయి' నినాదములతోఁ దెల్లవాఱుపర్యంతము స్వామిని మఠావరణముచుట్టును ద్రిప్పి త్రిప్పి, బోయీలు చిట్టచివరిపర్యాయము మఠముముంగిట పల్ల దింపి, ''దిగండి బాబయ్యా!'' అనిరి! పల్లకీనుండి సరిగా దిగఁబోవుసరికి చిరకాలానంతరము తా నేదూరదేశమునుండియో వచ్చెనో యనురీతిని కుశలప్రశ్నలు వేయుచు బ్రహ్మానందస్వామి ప్రత్యక్షమయ్యెను! జరిగిన వృత్తాంతమంతయు గ్రహించి యఖండానందస్వామి ప్రక్కలుపడ నవ్వసాగెను. బ్రహ్మానందస్వామి యాతని నాలింగనమొనర్చుకొనెను. ఇరువురును బాలకులవలె నవ్వసాగిరి.

మహనీయులగు నాచార్యులు సదా గంభీరవదనులై యుందురనియు నవ్వులను హాస్యచమత్కారములను వారికడ నెన్నఁడును ఆసింపరాదనియు లోకులు గొందఱనుకొనుచుందురు కాని యట్లనుకొనుటయే హాస్యాస్పదము. గురువరేణ్యుల జీవితములు నవనవోన్మేషప్రతిభావంతములై, బాలకునివలె మహోల్లాసమయములై, మంచుబిందువుపోల్కి స్వచ్ఛములై, మహాకావ్యమువలె నవరసభరితములై యలరారుచుండును. ఇట్టివారల బోధలే హృదయంగమమై యొప్పు నవలీలగా శిష్యహృదయమున నాటుకొనుచుండును.



# పవిత్రమాత శ్రీ శారదాదేవి

శ్రీమతి డాక్టర్ రామకృష్ణమ్మ, ఎం.బి., బి.ఎస్.

[చెన్నపురి శ్రీ రామకృష్ణ మఠమున 20_12_51 న జరిగిన శ్రీ శారదా దేవి 99_వ జన్మదినోత్సవ సందర్భమున శ్రీ రామకృష్ణమ్మగారు ఉపన్యసించిన యుపన్యాసమే యీ వ్యాసము. —సంపాదకులు]

(గతసంచిక తరువాయి)

ఈమె కలకత్తాలో, నిర్వికల్ప సమాధిని అనుభవించెను. అప్పుడు ఆమె- "యోగీ! నేను పైకి ఎగిరితిని. శ్రీ రామకృష్ణ సన్నిధి ప్రాప్తించెను. నాకు ఈ శరీరమును చూచి అసహ్యత కలిగెను. కొంతసేపు ఆలోచించి తిని. మరల నా శరీరములో ప్రవేశించితిని" అని పలికెను. మరియొకరోజున శ్రీ రామ కృష్ణులు, గంగాజలములో ప్రవేశించి మిళిత మైనట్లు ఆ జలమును వివేకానందులు తీసి "శ్రీ రామకృష్ణులకు జై" అని నుడువుచు పలువురపై చల్లినటుల ఆమెకు తెలిసెను. ఆ గుంపులో తెల్లని శరీరముగల మానవులు కొందరు కలరు.

గురుమహారాజు చనిపోయిన తరువాత ఆమె ఆహారమును భుజింపక, చింతలో మునిగి యుండెను. అప్పుడు అతడు ఒక ఆడపిల్లను చూపి 'ఇది నీ ప్రాపంచికమాయ. ఈ పిల్లను పోషింపు'మనెను. ఇప్పుడు పవిత్రమాతకు, ఈ రాధు అను మాయబంధమును కట్టెను. లేకున్న ఆమె ఈ లోకమును విడుచును. ఆమెశరీరమును త్యజించిన, పలువురకు దీక్ష లభించదు. ఈ రామకృష్ణ సన్యాసులుండరు. ఆమె మాయ బంధము మరణించిన ఆమె సోదరునిబిడ్డ రాధు. ఆమె పోషించి ఆదరించిన స్త్రీ. ఈ రాధు తల్లి ఉన్మాదిని. ఈ పవిత్రమాత, ఆమె సోదరుల వలన, వారి భార్యాపుత్రులవలన, వారి సంతానమువలన, ముఖ్యముగా ఈ రాధు ఆమె తల్లి వలన చెప్పరాని బాధల, చీవాటుల, దయాదాక్షిణ్యములేని మాటలవలన కష్టపడెను. వారలందరకు ఆమెయే ఆధారము. వారి సేవకు ఆమెను దుర్వినియోగించిరి. తల్లి సాధారణ స్త్రీ, ప్రపంచ ప్రేమ, భాతృప్రేమలో మునిగినదని ఎవ్వరికైనను సందేహముకలిగిన వెంటనే గురు మహారాజుగారు స్వప్నరూపమున "గంగానది అపవిత్రమవునా. ఆమెయు నేను; వేరుకాదు" అని వారికి సమాధానము చెప్పెడివారు. గిరీశ బాబు అను గురుమహారాజు గృహస్థ శిష్యుడు "తల్లి తమ్ములు ఎన్ని తపములు ఎన్ని జన్మములలో చేసిరో! ఈ జన్మములో ఆమె ప్రేమను సేవను అనుభవించుచున్నా"రనెను. ఆమెను

అర్థముచేసికొననివారలు, ఆమె లోకబంధములచే కట్టుపడిన స్త్రీ అని అనవచ్చును. వారికి ప్రత్యుత్తరము లివి :

1. ఆమె దీక్షను స్వీకరించినవారు మహాత్యాగులు, సన్యాసులు, వారు ఆమె అనుగ్రహమును కోరిరి. లోకమాయకులోనైన స్త్రీవలన వారికి ఈ ఉన్నత పదవి ఉన్నత భావములు లభింపవు.

2. లోకసంబంధమైన ప్రేమకలవారు వారి ప్రియులను ప్రేమింతురు. వారి ప్రేమను తిరుగ వాంఛింతురు. తల్లికి త్యాగరూపమైన ప్రేమ, దయచే, కరుణచే, మిళితమైన ప్రేమ, బంధువులపై నుండెను. భక్తులను, శిష్యులను, బంధువులను ప్రేమించునట్లు ప్రేమించెను.

3. ఒకరోజున ఆమె బంధువుల బిడ్డ చనిపోయినట్లు వార్త వచ్చెను. ఆ బిడ్డను తల్లి ప్రేమించుచుండెను. క్షణమాత్రము చింతించెను. సాయంకాలము మామూలుగా పూజలు ఆరాధనలు జరిపించెను.

ఆమె మనస్సు ఈ మాయాబంధమువలన కళంకితము కాలేదు. మరణకాలమున ఆమె ఈ బంధమును త్రెంపెను.

హిందువులకు గురువు దైవసమానుడు. ప్రేమ ఇతరుల పాపములకు అడ్డు ఆశక్తి. శిష్యుని తత్త్వమును కనుగొను శక్తిగా ఉండవలెను. ఆత్మజ్ఞానము, జపతపములు వీనియందు ఇతరులను తర్ఫీతు చేయించు శక్తి, తపోశక్తి ఉండవలెను. ఈ పవిత్రమాతవలె దీక్షాదానమునిచ్చు అర్హత ఎవ్వరికిని లేదు. రామకృష్ణపరమహంస మానసపుత్రుడు, బ్రహ్మానందస్వామి కొంద అకు మాత్రము దీక్షనిచ్చి ఇతరులను నిరాకరించుచుండెను. ఎవ్వరికైనను దీక్ష నిచ్చిన అతనికి జ్వరము వచ్చుచుండెను. నిరాకరింపబడినవారు ఆమె వెంబడి బడుచుండిరి. ఆ తల్లి రాత్రి అనక, పగలనక, కాలము అనక ఏ స్థలములోనైన, ముందు వెనుక లాలోచింపకుండ, అందరి పాపముల హరించి, అతిప్రేమచే అందఱకు దీక్ష నిచ్చుచుండెను. వారికొఱకై ప్రార్థనలు ఆమె చేయుచుండెను. ఆమె వారికి కడుపు నిండుగా భోజనము తన చేతులార చేసిపెట్టుచుండెను. కొందఱిని కరుణించి వారి జీవితములను మార్చెను. ఒక త్రాగుబోతు శిష్యుని, ఒక స్త్రీ దుష్టమనస్సును, ఒక సంసారి చెడు త్రోవ త్రొక్క సమకట్టిన నిశ్చయమును మార్చెను. తల్లి తనకు జబ్బుగానున్నప్పుడు శిష్యులకు దీక్ష ఇవ్వదని శారదానందస్వామి చెప్ప "నేను పుట్టినది దీక్షాదానముచేయుటకే" అని జబ్బును లక్ష్యము చేయక ప్రేమను చూపించెను. ఆమె శిష్యులసంఖ్య, ఆమె ఔదార్యమువలన ఎక్కువయినది. మరియు వారు పనికిమాలినవారలు. ఆమె మాతృహృదయము దయామయమై, ప్రతిరోజు రెండుగంటల రాత్రికి, వారికి బదులు ఆమె "ఓ పరమాత్మ! నా శిష్యులు ఈ లోకమాయలో చిక్కియున్నారు. వారిని నీవు ఆశీర్వదింపుము. వారికి ఈ జన్మమే చివరి జన్మముగా ప్రసాదింపుము" అని ప్రార్థించుచుండెను. పూజాదినములలో పండ్లను, పూలను గురుమహారాజునకు నివేదించుచు "నా శిష్యులు జ్ఞాపకశక్తిలేని బిడ్డలు కాన నేను వారికి బదులు ఈ వస్తువులు మీకు అందింపచేయుచున్నాను" అని చేతులు ముడిచి "ఈ జీవితమునను అటుపిమ్మటను వారిని అనుగ్రహింపుము" అని వేడుకొనుచుండెను.

ఆమె జయరాంబాటిలో నున్నప్పుడు దీక్షకై శిష్యులు పోవుచుండిరి. ఆమె వారికొఱకై

ఫలాహారములుచేసి దాచియుంచి పెట్టును. వారి కొఱకై ఇంటింటికి పోయి పాలు తెచ్చును. వారికి వండి ప్రక్కన కూర్చొని వడ్డించును. ఆమె వారికి దీక్ష నిచ్చి పంపునప్పుడు చూచి "నాయనా! నిన్ను నేనెప్పుడు కలిసికొనగలుగుదునో" అని ఏడ్చును. ఏ శిష్యుడైనను అన్నమునకు రాకున్న, అతడు వచ్చువఱకు వేచియుండి అతనికి పెట్టిన తరువాతనే ఆమె తినును. ఆమె శిష్యులు ఆమె ప్రేమభాగ్యము అనుభవించి, పవిత్ర మాతృత్వ మిట్టి ఉన్నతమైనదని ఊహించిరి. ఎవరు ముందు సన్యాసులగుదురో కూడ ఆమెకు తెలియును. ఒకశిష్యుడు దీక్ష బడసిన తరువాత ఆమెకు ఫలములను కొంత ధనమును ఇచ్చెను. ఆమె సన్యాసుల ధనమును స్వీకరించనని మూడుసారులు నిరాకరించెను. కొంతకాలమైన తరువాత అతడు సన్యాసి ఆయెను. ఈ పైన ఉదాహరణములవలననే, ఆమె గురుత్వమునకు తగిన ఔన్నత్యమును తెలిసికొనవచ్చును. ఒకప్పుడు ఒక సన్యాసికి ఎక్కువ జపములు చేయుటవలన మెదడు చెదరిపోయెను. బేలూరు మఠములోని సన్యాసులు ఎంత ప్రయత్నించినను సాధ్యము కాలేదు. వారు అతనిని తల్లి శరణమునకు పంపిరి. క్షణములో అతనిని సరియైన మార్గమునకు త్రిప్పెను.

కొందఱి శిష్యులకు, ఆమె కలలో కనబడి మంత్రోపదేశము చేసెను. గిరీశబాబు అను గురుమహారాజు గృహస్థ శిష్యుడు, ఒకసారి ఆమెను చూచిన వెంటనే తన 18-వ సంవత్సరమున, జ్వరములో నున్నప్పుడు స్వప్నమందు కనబడి ఓదార్చిన స్త్రీ స్వరూపము తల్లిదని తెలిసికొనెను.

ఆమె దీక్ష నివ్వడము నిమిషమాత్రము. బేలూరు మఠములో నుండు సన్యాసులు కొంతకాలము జపించి గురువుగారి అనుగ్రహమును వేడుకొని దీక్ష నివ్వవలెను. ఆమె గురువుగారి శక్తిస్వరూపము కాన ఆమెకు ఏ చిక్కు లేదు.

ఆమె బ్రహ్మచర్య సన్యాసావస్థల ఆజ్ఞలను సన్యాసులకు అనుగ్రహించుచుండెను. ఆమె గృహస్థులనుచూచిన "గృహస్థాశ్రమము మంచిది. నేను గృహస్థను. మన మనస్సే ప్రధానము. పెండ్లి మంచిది" అని కొందఱకు, "ప్రపంచములో అన్నీ రెండు, రెండు చెవులు, రెండు కండ్లు కాన వివాహితుడవు కమ్ము. జపము చేయుము" అని కొందఱకు జెప్పెను. ఇట్లు గృహస్థులకు వారి తత్త్వమునుబట్టి ధైర్యము నిచ్చును. త్యాగస్వరూపుల చూచిన "ప్రపంచము మిథ్య, లోకవాంఛలలో కట్టుబడకుము. సన్యాసివి కమ్ము" అని కొందఱకు జెప్పి సన్యాసమును ఇచ్చును.

ఈమె స్త్రీల సముదాయము చదువునకు పేరెక్కినది. ఆమె శిష్యురాలు గౌరిమా అవివాహితురాలు. ఆమె విద్యాలయము ఇప్పటికి కలకత్తాలో ఉన్నది. తెలివితేటలచే ప్రకాశించు స్త్రీలు, ఇతర స్త్రీల అభ్యుదయమునకు పాటుపడవలెనని ఆమె అభిప్రాయము. మరియొక శిష్యురాలు లక్ష్మీదీదిపూరులో చనిపోయెను. ఆమె కొందఱకు దీక్షాదానము చేసెను. గోలప్ మా ఒక విధవ. ఆమె తల్లికి సహచరిణి. యోగిన్ మా భర్తచే వదలబడిన స్త్రీ. ఈమె ఒక జ్ఞాని. ఈ స్త్రీలకు తల్లి అనుగ్రహమువలన గురుమహారాజు శిష్యుల జ్ఞానస్వాంతము లభించెను. కొందఱు సమాధిని అనుభవించిరి. కాన విధవలు, భర్తృ నిరాకరణ బొందినవారు, గృహిణులకు సమానులు. విచారము కొంచెము లేదు. తల్లి ప్రేమను బడసిన శ్రీ శారదానందస్వామి ఆమె గౌరవార్థమై

శ్రీ నివేదిత పాఠశాల నియమించెను. మార్గరెట్ నోబుల్ లేక సోదరి నివేదిత తల్లి ప్రేమను చవిజూచి తన దేశమైన ఇంగ్లాండును మఱచెను. తల్లికి తెల్లవారు నల్లవారు అను జాతి మత భేదములు లేవు. ఆమె ఒకప్పుడు తనకుటీరమును బాగుచేయుటకై దొంగల నియమించెను. ఒక తురకజాతి కూలీకి ఆమె చేతులార వండి వాని దగ్గఱ కూర్చొని వడ్డించెను. ఆమె బంధువులు ఆక్షేపింప "నా బిడ్డ నాకు ఎట్లు దూరమవును" అని స్పష్టముగా చెప్పెను.

1888 వ సంవత్సరములో ఆమె గయకు వెళ్లెను. అప్పుడు ఆ గయలో నుండిన బౌద్ధ సన్యాసుల అన్నసదుపాయముల చూచి అప్పటి నుండియు "ఓ తండ్రీ నా బిడ్డలు, అనగా సన్యాసులు, తలదాచుకొనుటకు స్థలము లేక, తినుటకు పిడికెడు అన్నము లేక కష్టపడు చున్నారు. వారికిటువంటి స్థలమును ప్రసాదించు"మని ఆమె ఏడ్చి ప్రార్థించెను. అటు పిమ్మటనే బేలూరు మఠము స్థాపితము. తరువాత ఆమె పూరీకి వెళ్లెను. 1909 డిసెంబరు మాసమున రామేశ్వర యాత్రకు బయలుదేఱి త్రోవలో ఒక క్రైస్తవుడు వేడుకొన, అతనిని హిందువులలో చేర్చి, దీక్షను గాయత్రి నిచ్చి జంజెము వేయించెను. రామేశ్వరము పోవు మార్గములో, మద్రాసులో దిగి పలువురకు దీక్షను దర్శనప్రాప్తిని ఇచ్చెను. ఆమె "మద్రాసు స్త్రీలు ఎంతో చదివినవారు" అని పలికెను. రామనాథపురము రాజు వివేకానంద స్వామి భక్తుడు ఆమెను ఆదరించెను. ఆమె పుత్రుడు రామకృష్ణానందస్వామి అన్ని సదుపాయములు కలిగించెను. ఆమె పాదములవలన ఈ దక్షిణ హిందూస్థానము, ముఖ్యముగా మద్రాసు, రామేశ్వరము, బెంగుళూరు, రాజమహేంద్రవరము భాగ్యము పొందినవి.

ఆమె జీవితములో ఆమె మొదటి శిష్యుడు ఆమెను ప్రేమపూర్వకముగా సేవించిన పుత్రుడు యోగానందస్వామి, ప్రేమానంద స్వామి చనిపోయిరి. వారికై ఆమె దుఃఖించెను. యోగానందులు తరువాత శారదానందస్వామి ఆమె సేవలో గడిపెను. 1920 వ సంవత్సరమున ఆమె కాలా అజారు జ్వరము వలన పీడితురాలయ్యెను. చనిపోవుటకు ముందు బంధువులను చూడ నిరాకరించెను. శారదానందస్వామి ఏ విధముగానైన ఆమె మనస్సును రాధు ప్రక్కకు తిప్ప ప్రయత్నించెను. ఒక రోజు "నా మనస్సు దిగదు" అని ఆమె స్పష్టముగా చెప్పెను. ఒకరోజు శారదానందులను పిలిచి తనప్రక్కన కూర్చుండబెట్టుకొని "శారదా! నేను పోవుచున్నా" ననెను. అటు పిమ్మట మూడురోజులకు ఆమె మహాసమాధిని బడసెను. బేలూరు మఠములో గంగానది తీరములో ఆమె భౌతికశరీరమును దహనము చేసిరి. ఆమెపేరట ఒక గుడి ఉన్నది.

ఈ సాధారణ, అసాధారణజీవి, కాలసమయమునుబట్టి శ్రీకృష్ణభగవానుడు బోధించిన అనుగ్రహము సుఖదుఃఖములు సమముచేయవలయును. స్వార్థఫలత్యాగరూపమైన నియమితకర్మ కార్యములు చేయవలయుననెడి గీతాతత్త్వమును ప్రచురింపచేసెను. అట్లే బుద్ధ చైతన్య అవతారములు; రామానుజ, శంకర, రామలింగస్వామి, తిరుజ్ఞాన సంబంధరు, వేమన మొదలగు భక్తులు కాలమును అనుసరించి ఆయా ప్రజలకు ముక్తిమార్గమును బోధించిరి.

ఆమె జీవితమువలన "ప్రేమసేవ" అను మార్గావలంబనమున ము నందగలమని తెలు

చున్నది. ఆమె నిష్కల్మష, మాతృప్రేమ; దేవీస్వరూపము మాతృస్వరూపమని తెలిసి కొనవచ్చును. ఆమె బోధనలలో, వేదాంత సారము అనుభవరూపముగా వెల్లడించినది. వివేకానందస్వామి "అమ్మా గురువుకూడ మాయ" అనగా "నీ తర్కము చాలు, శుకుడు వ్యాసుడుకూడ దేవుని మాయ కను గొనలేదు" ఆమె ముఖ్యముగా చూపిన మార్గము "ప్రేమ". దేవుడు మనవాడను కొని, అన్నివిధములుగా ప్రేమించవలెను. మన పూర్వ ప్రారబ్ధము లెటులుండినను మనము సాధనలో ప్రమత్తులమై యుండకూడదు. నేను ఇంత తపము, ఇంత జపము చేసిఉన్నాను. ఇన్ని దానములు చేసితిని. నాకు ఇంత ఫలము లభించును అని అనుకొనకూడదని ఆమె చెప్పెడిది. అంతయు భగవంతుని ఇచ్ఛ. ఒక వేళ ఏదైన నిబంధన భగవంతుని అనుగ్రహ మునకు ఉన్న అది ఒక్కటే; "పరిశుద్ధమైన ప్రేమభక్తి". ఇదియే ఆమె నిశ్చయము. ఆమె మతానుసారము ఈ ప్రేమభక్తి అందఱకు రాదు. ప్రపంచముపైన కోరికలుండిన వారి ప్రేమభక్తి ఉత్తమము కానేరదు. ఎంతవఱకు వాంఛ లుడుగునో, అంతవఱకు "నిరాశిత ప్రేమభక్తి" సమకూడునని శిష్యులకు బోధించును. ఆ కారణమువలన భగవంతుడు ముక్తి నొసంగును కాని, మనస్సులో భక్తి పురి కొల్పడు. ఈశ్వరకోటులైన వారలకు మాత్రము ఈ ప్రేమను మనస్సులో రగుల్ప చేయును.

ఆత్మసంబంధమైన సాధనలు మనస్సును పరిశుద్ధముచేసి, చీకటిని పారదోలి ప్రేమను ఉత్పత్తిచేయునని చెప్పెడిది. పూర్వకర్మబంధన ముల విడదీసి, ఇంద్రియదమనముచేయుటకు "సాధన" మార్గము అని ప్రవచించెను. దేవుని నామము, పాప మేఘముల పాఱద్రోలు గాలి. వాసనపువ్వు చేతిలో పట్టుకొన్న, చేతికి సువాసన ఉండును. అటులనే దేవుని స్మరణ మనస్సునకు భక్తిని కల్పించును.

కాన ఆమె "మీరు ఎప్పటికిని సాధన విడువకూడదు. భగవంతుని అనుగ్రహమునకు ఎంతకాలము పట్టినప్పటికిని నిరాశపడకూడదు. సకాలమున పండిన మామిడిపండు అతిమధురము కాన మీరు సాధనలో పక్వపడువఱకు ఆత్మసంబంధమైన అనుభవములు అక్కఱలేదు. ఈ జన్మమున దివ్యదర్శనము దొఱకకున్నను, మరుజన్మములో ఈ సాధన పనికివచ్చును" అని శిష్యులకు సదా చెప్పును. ఆమె జపములు చేయుచు నిదర్శనముగా చూపుచుండెను.

అన్ని సాధనములలో జపము చాల ముఖ్యము. దీక్షామంత్రోపదేశములవలన శరీరము పరిశుద్ధమవును. మన ప్రేళ్లు దేవుని నామమును ఎన్నుటకే. ఒకడు చిన్నప్పటి నుండియు కష్టపడి ఆవుదూడను ఎత్తుకొన్న కొంతకాలమైన తరువాత అవలీలగా దానిని మోయగలడు. ఆ విధముగనే, జపము వలన మనకు తెలియకుండగనే మనము ఆత్మ జ్ఞానమును బొందగలము. మన మనస్సు స్థిరపడును. పవిత్రమైన మనస్సునుండి వెలివడు జపము కష్టములేక బయటపడును.

ఈ విధముగ సాధన, జపము, ప్రేమభక్తి— వీని విషయమై చెప్పుచు, ప్రజాసేవ చేయుట మంచిదని చెప్పును. 24 గంటలు జపముచేయ వీలుపడదు. సోమరి మనస్సు పరుగెత్తును. అందువలన, ఈ రామకృష్ణ సముదాయపు, సేవామార్గమునకు ఆమె ముఖ్యమైన ఊతను గల్పించెను.

ఎవ్వరికైన మనోవేదన సంభవించిన ఓపికను బోధించును. భక్తుల దీనదశ భగవంతుని అనుకంపమునకు మార్గము. భక్తుడు చింతలను పాఱద్రోలి, కన్నీరు నింపి భగవంతుని వేడుకొనవలెను. తండ్రి తప్పక దారిని చూపును.

"ఈ రోజు శరీరముండును. రేపు శరీర ముండబోదు". ఈవిధముగా ఆలోచించి కామమును మనస్సులో సన్యాసులు గృహస్థులు త్యజింపవలెనని "ఈ కామ త్యాగము" ఆత్మ సాధనమార్గమునకు అతిముఖ్యమని చెప్పెడిది. "ఎవ్వడు భగవంతునికొఱకై అన్నియు త్యజించునో అతడు అతనితో సమానుడు. ప్రారబ్ధకర్మ శాసనముల సంకెళ్లు తమంత తామే విఱుగును. భగవంతుని నామస్మరణమును చేసిన భక్తుని నొసట వ్రాసిన వ్రాత విధి తానేతుడుచును" అని చెప్పెడిది. ఆమె "భగవంతుని దర్శించిన వానికి రెండు కొమ్ములు లేవు. సత్యము, అసత్యము—వీని తారతమ్యము నెఱిగి ఋజు మార్గమున ప్రవర్తించుటవలన జన్మవిమోచనము, సచ్చిదానంద అవస్థ దొఱకును" అని పలుకుచుండెను.

ఈ విధముగ, లోకమాత ఎన్నో ఉదాహరణల రూపమున, చిన్నకథలరూపముగ తన జీవితరూపమున అన్ని సాధనలకంటె "ప్రేమ భక్తి" ముఖ్యమని చాటెను.

మనమందఱము ఆమె బిడ్డలము. ఎవ్వరు ఆమెను మనస్ఫూర్తిగా ప్రేమించుచున్నారో వారి మనస్సులో ఆమె పాదములున్నవి. ఆమె చనిపోలేదు. ఆమె మాతృత్వము, ప్రేమ, ఎందఱి భక్తుల హృదయములను ఆనందవారిధిలో ముంచుచున్నవి! ఆమె పుత్రులకు మతములు అన్ని సదుపాయములు ఆమె ప్రేమ వలననే ప్రవర్థిల్లుచున్నవి. ఆమె గురుమహారాజు గారి అనుకంపిత ప్రేమస్వరూపము. ఆమె ఆయన వేరు కారు. ఆయన వజ్రము; ఆమె తేజస్సు. ఆమెయే ఆదిశక్తి, సనాతని, మీనాక్షి, కామాక్షి, కాళి, పార్వతి, సీత, రాధ, రుక్మిణి. ఈ కలియుగ నారీమణుల ఉద్ధరింప బయలు దేరిన అవతార స్వరూపిణి శ్రీ శారదాదేవి.

# శ్రీ వాసుదేవ మననము

## యవర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

ఈ ద్వితీయవర్ణకమునందు అనుబంధ చతుష్టయము వర్ణింపబడుచున్నది. "అధికారీచ విషయః సంబంధశ్చ ప్రయోజనం। శాస్త్రారంభ ఫలం ప్రాహుః అనుబంధ చతుష్టయం॥" వేదాంతశాస్త్రము నభ్యసించుటయందు ఫలమైన 1. విషయము, 2. ప్రయోజనము, 3. సంబంధము, 4. అధికారి యనెడి అనుబంధ చతుష్టయము వివరింపబడుచున్నది.

ఈ వేదాంతశాస్త్రమునకు జీవేశ్వరైక్య రూపమైన బ్రహ్మమే విషయము. అప్రతిబద్ధ స్వస్వరూపావస్థానరూపమైన మోక్షమే ప్రయోజనము. వేదాంతశాస్త్రమునకు విషయప్రయోజనము లివియె. తెలియబడకుండునంతవఱకు బ్రహ్మమె ప్రతిపాద్యవిషయమగును. తెలియబడినయంతట మోక్షరూపమగుటచే బ్రహ్మమే ఫలమగును. ఇందుకు ప్రమాణము—"సయో హవై పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి॥" (ముం. ఉ. 3-2-9) ఎవడు స్వాభిన్నముగ సర్వోత్కృష్ట పరబ్రహ్మమును సాక్షాదపరోక్షముగ ననుభవించుచున్నాడో అట్టి బ్రహ్మవిదుడు బ్రహ్మమే యగుచున్నాడు. "తరతి శోకమాత్మవిత్॥" (ఛాం. 7-1-3) ఆత్మవేత్త సాంసారికదుఃఖము నతిక్రమించుచున్నాడు. "తమేవ విద్వాన్ నబిభాయమృత్యోః॥" (అథర్వవేదము. 10-8-44) పరబ్రహ్మజ్ఞానమును సాక్షాత్తుగ బడసిన తత్త్వజ్ఞుడే మృత్యువునుగుఱించి భయపడడు. "అభయం ప్రతిష్ఠాం విందతే॥" (తై. ఉ. 2-8) బ్రాహ్మీస్థితిని - బ్రహ్మనిష్ఠను బొందిన బ్రహ్మవిజ్ఞాని బ్రహ్మరూపమైన అభయమునందు ప్రతిష్ఠను బొందుచున్నాడు. అభయరూపమైన బ్రహ్మమే యగుచున్నాడని యర్థము. అని సర్వోపనిషత్సిద్ధాంతము. ప్రతిపాద్యమగు బ్రహ్మమునకును ప్రతిపాదకమగు వేదాంతశాస్త్రమునకును ప్రతిపాద్య ప్రతిపాదకభావము సంబంధము. మఱియు బోధ్యుడగు అనగా బోధింపబడదగువాడగు శిష్యునకును, బోధకమగు అనగా బోధించునది యగు వేదాంతశాస్త్రమునకును బోధ్యబోధకభావము సంబంధము. సాధనచతుష్టయసంపన్నుడే యీ శాస్త్రమున కధికారి వేదాంతశాస్త్రము—బ్రహ్మవిద్యయొక్క సంబంధ ప్రయోజనము లివి యని తొలుతనే తెలిసిన యెడల తీవ్రముముక్షువులు బ్రహ్మవిద్యాశ్రవణ గ్రహణధారణాభ్యాసార్థము పట్టుదలతో ప్రవర్తించెదరు. "ప్రయోజనమనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే॥" ప్రయోజనమును ఉద్దేశింపక మందుడైనను ప్రవర్తింపడుగదా.

అధికారి యనగా.—''సత్యం వద। ధర్మం చర। స్వాధ్యాయాన్మాప్రమదః। సత్యాన్న ప్రమదితవ్యం। ధర్మాన్నప్రమదితవ్యం। కుశలాన్నప్రమదితవ్యం। భూత్యైనప్రమదితవ్యం। స్వాధ్యాయప్రవచనాభ్యాం నప్రమదితవ్యం॥౧॥ దేవపితృకార్యాభ్యాం నప్రమదిత్యం। మాతృదేవోభవ। పితృదేవోభవ। ఆచార్యదేవోభవ। అతిథిర్దేవోభవ। యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని। నోఇతరాణి। యాన్యస్మాకంసుచరితాని। తాని త్వయోపాస్యాని। నోఇతరాణి॥'' (తై. ఉ. 1-11) సత్యమును పలుకుము. ధర్మము నాచరింపుము. వేదాధ్యయనమునుండి ప్రమాదమును పొందకుము. అనగా అధీతవేదమును మఱువవలదని తాత్పర్యము. సత్యమును విడువవలదు. అసత్యము నవలంబింపవలదు. ''నసత్యాత్పరమోధర్మః। నానృతాత్పాతకం పరం॥'' ''సత్యముకంటె పరమధర్మమును, అనృతముకంటె పరమపాతకమును లేవు'' అని స్మృతివచనము. ధర్మమునుండి ప్రమాదమును పొందవలదు. (''ధర్మస్తు తద్విధిః''=ధర్మమనగా నవశ్య మాచరింపవలసిన శాస్త్రనిరూపిత నియమరూప వర్ణాశ్రమోచితాచారము. దానినుండి ప్రమాదమును పొందుట యనగా ఆచరింపక పరిత్యజించుట.) అట్టి స్వధర్మకర్మమును తప్పక నాచరింపుము. కుశలకర్మమునుండి ప్రమాదమును పొందవలదు అనగా దేహారోగ్యనిమిత్తమైన ఔషధసేవ నేమఱవలదు. శ్రేయోర్థమైన కర్మమునుండి ప్రమాదమును పొందవలదు. స్వాధ్యాయ ప్రవచనములను (అధ్యయనాధ్యాపనములను) నియమముగ నిర్వర్తింపుము. దేవపితృకార్యములను (యజ్ఞయాగాది దేవతాకర్మములను శ్రాద్ధాది పితృకర్మములను) శ్రద్ధాభక్తులతో జేయుము. తల్లిని దైవభావముతో పూజింపుము. తండ్రిని దైవభావముతో పూజింపుము. ఆచార్యుడనగా విద్యాప్రదాత. అతడు మాతాపితృసమానుడు. అతనిని దైవతమునిగా భావించి సేవింపుము. అతిథిని దైవముగా భావించి పూజింపుము. అనిందితములు, శిష్టాచారలక్షణములునైన కర్మములనే నీవు ఆచరింపుము. నిందితములుకానట్టి కర్మములే నీవు సేవింపదగినవి. నింద్యములైన కర్మములను నీవాచరింపదగదు. ఆచార్యులచేత ననుష్ఠితములైన సదాచారములే శిష్యులచేత నాచరింపదగినవి. ఆచార్యులు ఒకవేళ ప్రమాదవశమున నింద్యములగు కర్మముల నాచరించినను, ఆచార్యులు ఆచరించిన నింద్యకర్మములను నీవు మాత్ర మాచరింపకుము. ''ఏష ఆదేశః = ఇది యీశ్వరాజ్ఞ.'' ''విహితస్యా ననుష్ఠానాన్నిషిద్ధస్య చ సేవనాత్। అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛ్యతి॥'' (పరాశర మాధవీయము.) విధివిధానోక్త కర్మముల నుల్లంఘించుట, శాస్త్రనిషేధకర్మముల నవశ్యమభినివేశముతో నాచరించుచుండుట, ఇంద్రియముల నిగ్రహింపలేకుండుట అనగా ధర్మవిరుద్ధమని తలంపక ఇచ్ఛవచ్చిన ట్లింద్రియములను ప్రవర్తింపనిచ్చుట యను నీమూడింటివలన పురుషుడు పతితుడగును అను నిత్యాది శాస్త్రాదేశముల శిరసావహించి, ఈ జన్మమునందుగాని, జన్మాంతరమునందుగాని సద్గురూపసదనముచేసి బ్రహ్మచర్యాది విధ్యుక్తనియమానుసారముగా వేదవేదాంగముల నధ్యయనముజేసి, సకలవేదార్థములయొక్క సామాన్యజ్ఞానము నధిగమించి, కామ          వర్జన పురస్సరముగ నిత్యనైమిత్తిక ప్రాయశ్చిత్తోపాసనకర్మముల నప్రమత్తుడై యభినివేశముతో

నిర్వర్తించుటచేత నిఖిల కల్మషములు నిర్గతములగుటవలన నితాంత నిర్మలస్వాంతుడై యంతట పరమేశ్వరానుగ్రహముచేత లబ్ధమైన సాధన చతుష్టయ సంపన్నుడే, ''బ్రాహ్మణో బృహస్పతి సవేనయజేత। రాజా రాజ సూయేన యజేతః॥'' 'బృహస్పతి సవనము' అను క్రతువునందు బ్రాహ్మణుడే అధికారి. 'రాజసూయ యాగము' అను క్రతువునందు క్షత్రియుడే అధికారియగునట్లు, బ్రహ్మవిద్యావిచారణయందును, స్వాత్మాపరోక్షజ్ఞానప్రాప్తియందును అర్హతగల యధికారియగుచున్నాడు. ఈజన్మమునందుగాని, జన్మాంతరమునందుగాని సద్గురూపదిష్టముగ వేదాంతశ్రవణాదికమును శ్రద్ధతో నభ్యసించిన పురుషునకు, కృషిగర్భాదులు ఏ ప్రకారముగా యోగ్యకాలముచేత పరిపక్వములగుచున్నవో, ఆ ప్రకారమే ఆత్మవిచారణయు యోగ్యకాలముచేత మెల్లగా పరిపక్వమగుచున్నది. అనగా యనేకజన్మముల యంతమున అప్రతిబద్ధమైన స్వాత్మజ్ఞాన మపరోక్షముగ సాక్షాత్కరించుచున్నది. ఈ యర్థమునందు శ్రుతి. ''గర్భేను సన్నన్వేషాను వేదమహం దేవానాం జనిమాని విశ్వా॥'' (ఐ. ఉ. 2-5) వామదేవుడను మహర్షి పూర్వానేక జన్మాభ్యస్త వేదాంత శ్రవణాద్యభ్యాసబలముచేత, మాతృగర్భమునందు శయనించియున్న సమయముననే బ్రహ్మసాక్షాత్కారరూపమయిన స్వాత్మాపరోక్షజ్ఞానము గలిగినవాడాయెను. అని శ్రుతిభారతి. అందువలన ''యాన్యతోఽన్యాని జన్మాని తేషు నూనంకృతం భవేత్। సత్కృత్యం పురుషేణేహానాఽన్యథాబ్రహ్మణిస్థితిః॥'' ఈ వర్తమాన జన్మమునకు బూర్వము పొందబడిన అనేక జన్మాంతరములందు బురుషునిచే సత్కర్మము తప్పక నిర్వర్తితమై యుండవలయును. నిశ్చయము. లేనియెడల నీ జన్మమునందు బ్రహ్మనిష్ఠ - బ్రాహ్మీస్థితి - సిద్ధింపదు'' అని సర్వ వేదాంత సిద్ధాంతము.

కామ్యకర్మములనగా.—స్వర్గాద్యభీష్ట ఫలములను సంపాదింప సాధనములగుచు ఫలకాంక్షతో నాచరింపబడు వైదికములగు ఇష్టాపూర్త కర్మములు కామ్యకర్మములు. ఇష్ట కర్మములన జ్యోతిష్టోమాతిరాత్రపౌండరీకసోమ యాగాది శ్రౌతకర్మములు. పూర్తకర్మములన వాపీకూపతటాకారామ దేవాలయాది స్థాపనమనెడి స్మార్తకర్తములు. ''జ్యోతిష్టోమేనస్వర్గకామోయజేత'' స్వర్గాభిలాషిజ్యోతిష్టోమసవనమును జేయవలయునని శాస్త్రము. ''కామ్యకర్మాణి కుర్వాణైః కామ్యకర్మానురూపతః। జనిత్వైవోపభోక్తవ్యం భూయః కామ్యఫలం నరైః॥'' (స. వే. సి. సా. సం.) కామ్యకర్మానుష్ఠాన తత్పరులు తత్తదనురూపమైన జన్మములను పునః పునః పొందుచునే యుండి యా కామ్యకర్మాచరణమునం దపేక్షించిన కామ్యఫలమునే మఱల ననుభవించి తీఱవలెను. ''ఉపాసతే పురుషం యేహ్యకామాస్తే శుక్రమేత దతివర్తంతి ధీరాః। కామాన్ యః కామయతే మన్యమానః సకామాభిర్జాయతే తత్ర తత్ర॥'' ఎవరు నిష్కాములై పరమపురుషుని ఉపాసన జేయుచున్నారో అట్టి ధీరులే బ్రహ్మనిష్ఠను బొందుచున్నారు. సంసారమును తరించుచున్నారు. ఇక నెవరు విషయభోగముల నభిలషించుచు కామ్యకర్మానుష్ఠాన తత్పరులగుచున్నారో వారు ఆయా కోరికలచేత నాయాచోట్ల జననమొందెదరని ప్రసిద్ధముగ శ్రుతివచనము. ''అంధతమః ప్రవిశన్తియేఽవిద్యాముపాసతే॥'' (ఈశా. 9) ఆత్మజ్ఞానమునకు అవరోధమైనవియు, రాగద్వేషాదులను

అహంకార మమకారములను అభివృద్ధిజేయు నవియు నందుమూలమున జనన మరణ లక్షణ సంసారహేతువైన అవిద్యాస్వరూపమైనవియు నగు కామ్యకర్మములను ప్రధానముగ సేవ రనుష్ఠించుచుందురో, విషయసుఖాభిలాషులగు నట్టి అజ్ఞులు, శాస్త్రమువలనగాని సద్గురువు వలనగాని మఱలింప గష్టసాధ్యమైన యీ సంసారమునం దెడ తెగని గమనాగమనములను గలిగియుండెదరు. ''అన్యోఽసావన్యోఽహమస్మీతి। నస వేదయథాపశు రేవస దేవానాంపశుః॥'' (బృ. ఉ. 1-4-10) ద్వైతమును మనస్సునందు గ్రహించి బ్రహ్మాత్మ భేదబుద్ధితో జ్ఞేయ ధ్యేయములను ఆత్మ (తన) కంటె నన్యములుగ దలంచుచు, కామ్యకర్మములే కైవల్యప్రదములనియు నింతకంటె మోక్షసాధనము లేదనియు నిశ్చయించి కామ్యకర్మములను ముఖ్యముగ నాచరించుచు స్వాత్మవిచారణ మెంతమాత్ర మెఱుంగని అజ్ఞుడు జ్ఞానవిహీనమైన పశువు మనుష్యున కుపకరించు విధమున దేవతలకు పశువురీతి నుపకరించును కనుక దేవతలకు పశువే యగుచున్నాడు. ''ఇష్టాపూర్తం మన్యమానావరిష్ఠం నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః। నాకస్య పృష్ఠే తే సుకృతే ఽనుభూత్వేమం లోకం హీనతరం వావిశన్తి॥'' (ముం. ఉ. 1-2-10) భార్యాపుత్ర పశు ధన క్షేత్రాదులయం దత్యంత వ్యామోహముచేత ప్రమత్తులగు మూఢులు, ఇష్టాపూర్త కర్మముల నాచరించుటయె మిక్కిలి ప్రధానమైన పరమ పురుషార్థ సాధనముగా భావించుచుందురు. కాని యింతకంటె భిన్నమైనది ఆత్మజ్ఞాన మనునది పరమపురుషార్థప్రాప్తికి ప్రత్యక్షసాధన మున్నదనియైనను వారెఱుంగజాలరు. అటువంటి జ్ఞానులు, సుకృతభోగాయతనమైన స్వర్గోపరి స్థానమునందు పుణ్యకర్మఫలము ననుభవించి మైన యంతట మనుష్యలోకమునుగాని, ఇంతకంటె హీనతరమైన తిర్యఙ్నారకాదిలక్ష్యమైన లోకమునుగాని శేషకర్మానుగుణముగ నవశముగా పొందుచున్నారు. కనుక ''తత్కర్మ యన్నబంధాయ సావిద్యాయా విముక్తయే। ఆయాసాయాపరం కర్మ విద్యాఽన్యాశిల్పనైపుణీ॥'' (విష్ణుపురాణం. ) ఏ కర్మము బంధకరముకానిదై యున్నదో ఆ కర్మమును; ఏవిద్య కర్మజన్మసంసారబంధవిముక్తిప్రదమైనదై యున్నదో ఆ విద్యయు, 'కర్మము'ను 'విద్యయు' నగును. అన్యములైన కర్మములును - విద్యలు (చతుష్షష్ట్యాది విద్యలు) ను, ఆయాసమునకును - శిల్పనైపుణ్యమునకును కారణభూతములగును గాని సహజానంద సాధకములుగా నేరవు.

నిషిద్ధకర్మములనగా.—నరకాద్యనిష్ట ఫలములను సంభవింపజేయు బ్రహ్మహత్యాది పంచమహాపాతకాదులు. ''బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః। మహాంతి పాతకాన్యాహు సంసర్గశ్చాపి తైస్సహ॥'' (మను. 11-54) బ్రహ్మహత్య-సురాపానము-స్వర్ణస్తేయము - గురుతల్పగమనము - అను నీ చతుర్విధ మహాపాతకములను చేసినవారితోడి సంసర్గమునను నీ యైదుకర్మములు పంచమహాపాతకములు. ''స్తేనో హిరణ్యస్య సురాం పిబంశ్చ గురో స్తల్పమావసన్ బ్రహ్మహాచ ఏతే పతంతి చత్వారః పంచమశ్చాచరం స్తైరితి॥'' (ఛాం. ఉ. 5-10-9) స్వర్ణస్తేయి-సురాపాయి-గురుతల్పగమనుడు - బ్రాహ్మణహంత - ఈ నలువుర సహవాసి యను నీ యేవురును పంచమహాపాతకులు అని శ్రుతి. ఇటువంటి పంచమహాపాతకాది నిషిద్ధకర్మాచరణమువలన ''క్రిమి

కీటాది రూపేణ జనిత్వా తు నిషిద్ధకృత్ ।
నిషిద్ధఫలభోగీస్యా దదోఽధో నరకం వ్రజేత్ ॥''
(స. వే. సి. సా. సం.) నిషిద్ధకర్మాచరణ తత్పరుడు క్రిమికీటాది జన్మములను పొంది నిషిద్ధకర్మఫలభోక్తయగును. అతినీచమైన నరకము నధిగమించును.

''అవిద్యాయాం బహుధా వర్తమానావయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః । యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్తే నాతురాః క్షీణలోకాశ్చ్యవంతే॥'' (ముం. ఉ. 1-2-9) మాయామయమైన జగమున మునిగి మనోరథముల నిరోధింపజాలక, అవిద్యయందు బహుప్రకారముల ప్రవర్తించుచు, కామ్యనిషిద్ధకర్మముల నాశ్రయించి యొక్కొక్క కోరిక యీడేరగనే మేము కృతార్థులమైతిమని భావించుచుండు అజ్ఞానలోకము కామ్యనిషిద్ధకర్మాచరణమువలన గలిగెడి ఫలమునందలి యనురాగమువలన తత్త్వజ్ఞానమును తెలిసికొనజాలకున్నారు. ఆ హేతువుచేతి నిజకర్మానుగుణముగ నూర్ధ్వాధోలోకముల నెడతెగక పరిభ్రమించుచునే యుందురు కాని ముక్తులు గానేరరు అని సమస్తశాస్త్రసిద్ధాంతము.

నిత్యకర్మములనగా.—సద్గురుశాస్త్రోక్త మార్గము ననుసరించి ఫలాభిసంధిరహితముగా నిత్యము నిర్వర్తింపక పరిత్యజించుటవలన ప్రత్యవాయమును గలుగజేయునవియగు స్నాన సంధ్యావందనాది కర్మములు. ''స్నానం సంధ్యా జపో హోమః స్వాధ్యాయో దేవతార్చనమ్। ఆతిథ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినే దినే॥'' (పరాశరస్మృతి.) స్నానము-సంధ్యావందనము - జపము - హోమము (నిత్యోపాసనము) - స్వాధ్యాయము - దేవతార్చనము - ఆతిథ్యము - వైశ్వదేవము నను నివి ప్రతి దినము విడువక నడుపవలసిన నిత్యకర్మములు. వేదవిధాయకములైన ఈ నిత్యకర్మముల అనాచరణమువలన గలుగు హాని ప్రత్యవాయ మనబడును. ''అకృత్వా వైదికం నిత్యం ప్రత్యవాయీ భవేన్నరః॥ = వేదవిహిత నిత్యకర్మములను ప్రత్యహము నాచరింపక పరిత్యజించిన యెడల మనుష్యుడు ప్రత్యవాయి యగుచున్నాడ''ని శ్రుతి. నిత్యకర్మములలో ప్రథమాచరణీయము స్నానము. స్నానము పంచప్రకారములుగ శాస్త్రమునందు చెప్పబడినది. అవెట్లనగా.—''స్నానాని పంచపుణ్యాని కీర్తితాని మనీషిభిః । ఆగ్నేయం వారుణం బ్రాహ్మం వాయవ్యం దివ్యమేవ చ॥ ఆగ్నేయం భస్మనా స్నాన మవగాహం తు వారుణం। ఆపోహిష్ఠేతి చ బ్రాహ్మం వాయవ్యం గోరజస్స్మృతమ్। యత్తుసాతపవర్షేణ స్నానం తద్దివ్యముచ్యతే॥'' ''ఇతిపరాశరమునయః॥'' 1. ఆగ్నేయము, 2. వారుణము, 3. బ్రాహ్మము, 4. వాయవ్యము, 5. దివ్యము నని స్నాన మయిదు విధములు. ఇందు 1. ఆగ్నేయస్నాన మన శిరసాది పాదముల పర్యంతము శరీరమంతట భస్మమును సముద్ధూళించుకొనుట (విభూతిధారణము) ఆగ్నేయస్నాన మనబడును. 2. వారుణస్నానమన ఆపాదమస్తకము నీటిలో మునిగి చేయు స్నానము వారుణస్నాన మనబడును. 3. బ్రాహ్మస్నానమన నిర్మలమైన జలమును బ్రహ్మముఖాఖ్యమంత్రముచే నభిమంత్రించి యీ పవిత్రోదకమును స్పృశించి 'ఆపోహిష్ఠే' త్యాది మంత్రములతో శిరమున జల్లుకొనుట బ్రాహ్మస్నాన మనబడును. ('బ్రహ్మముఖ' మంత్ర మనగా—''ఓంకార పూర్వికాస్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః। త్రిపదాచైవ సావిత్రీ (గాయత్రీ) విజ్ఞేయం బ్రహ్మణో

ముఖమ్॥'' ఇతిమనుః 2-81) 4. వాయవ్య స్నానమన గోవుయొక్క పాదములను స్పృశించి ఆ గోష్పాదరజమును శిరమున ధరించుట వాయవ్యస్నాన మనబడును. ''గవాంరజ ఖురోద్ధూతం శిరసాయస్తు ధారయేత్। సర్వ తీర్థ జలేస్నాతః సర్వపాపైః ప్రముచ్యతే॥'' (పద్మపురాణము, సృష్టిఖండము. 4 అ.) గోఖురస్థరజమును శిరమున ధరించిన పురుషుడు పరమపవిత్రమైన సమస్త పుణ్యతీర్థములయందును స్నానముచేసినవాడే యగును, సమస్త పాపవిముక్తియు సమకూడును అని పురాణ వచనము. 5. దివ్యస్నానమన ఎండ కాయుచుండగా గురియుచున్న వర్షమునందు జేయబడునట్టి స్నానము దివ్యస్నాన మనబడును. ''స్నాన పూర్వాః క్రియా శ్శుద్ధాః సర్వాస్సిద్ధి ప్రయాంతి చ। తస్మాత్స్నానం పురాకుర్యా దేష్వేకం దేహశక్తితః॥'' స్నానపూర్వకముగ ననుష్ఠింపబడినవైన పక్షమునసే సర్వవైదిక కర్మములును పవిత్రవంతములగుచు సాఫల్యము లగును. అందువలన శరీరారోగ్యము ననుసరించియె వీనియందేదియైన నొకస్నానము నాచరించిన తరువాతనే స్వధర్మకర్మానుష్ఠానమున కుపక్రమింపవలయును. ''అస్నాత్వా నాచరే త్కర్మ జప హోమాది కించన। లాలా స్వేద సమాకీర్ణ శ్శయనాదుత్థితః పుమాన్। అత్యంత మలినః కాయో నవచ్ఛిద్ర సమన్వితః। స్రవత్యేవ దివారాత్రం ప్రాతస్స్నానం విశోధనం। ప్రాతస్స్నానం ప్రశంసంతి దృష్టా దృష్ట ఫలం హితత్। సర్వమర్హతి శుద్ధాత్మా ప్రాతస్స్నాయీ జపాదికం। స్నాత్వాఽధికారీభవతి దైవే పిత్రే చ కర్మణి॥'' ''ఇతిదక్షః॥'' సంధ్యావందన జప హోమాది స్వధర్మకర్మము నెన్నడును అస్నాతుడై యెంతమాత్రము నాచరింపదగదు. ప్రాతఃకాలమున పడకనుండి లేచిన పురుషుడు చొంగ చెమటతో సంకీర్ణశరీరుడై యుండును. శరీర మత్యంత మలినమైనది. తొమ్మిది ద్వారములు గలది. రాత్రిందివములు దుర్గంధమును స్రవించుచునే యుండును. అట్టి శరీరమును పరిశుద్ధిచేయుటయె ప్రాతస్స్నానము. ఆ ప్రాతస్స్నానము దృష్టాదృష్ట ఫలమనియె ప్రశంసించెదరు. ప్రాతస్స్నాయి పరిశుద్ధాత్ముడగును గాన జపాదికము సర్వము అనుష్ఠాన యోగ్యమగుచున్నది. ప్రాతస్స్నాతుడయ్యె సకలదైవ పైతృకాది కర్మములయందును అధికారి యగుచున్నాడు. ''అస్నాతస్తు పుమాన్నార్హో జపాగ్ని హవనాదిషు। ప్రాతస్స్నానం తదర్థంతు నిత్యస్నానం ప్రకీర్తితం॥'' ''ఇతి శంఖః॥'' అస్నాతుడగు పురుషుడు జపాగ్ని హవనాదుల నాచరించుట కర్హుడుకాడు. కావున అపేక్షిత శుచిత్వ సంపాదనార్థమును, సంధ్యావందనాది సకలవైదిక కర్మానుష్ఠానమునం దర్హతకొఱకును శుద్ధిసంపాదకమైన ప్రాతస్స్నానము ముఖ్యముగ నిత్యమాచరణీయము. ఇట్లు సంధ్యావందనాది సకలశ్రౌత స్మార్త కర్మానుష్ఠానమునకు బూర్వమే స్నానమవశ్యముగ నాచరింపవలయునని సర్వశ్రుతి స్మృతులును విధించుచున్నవి కనుక నిత్యకర్మములయందు స్నానము మొదట విధింపబడి నిత్యకర్మమగుచున్నది. అట్లగుట సమస్త విధ్యుక్త కర్మానుష్ఠానమునకు నాదియందే స్నానమును ముఖ్యముగ నాచరించి యనంతరము సంధ్యావందనాదికము నిర్వర్తింపవలయును.

స్నానానంతరము ముఖ్యముగ సంధ్యావందనమును ముందాచరింపవలయును. ''సంధ్యాహీనోఽశుచిర్నిత్య మనర్హ స్సర్వకర్మసు।

యదన్య త్కురుతే కర్మ న తస్యఫలభాగ్భవేత్॥'' "ఇతిదక్షః॥'' సంధ్యావందనము నెఱుంగనివాడును, ఎఱిగియుండియు నాచరింపనివాడును నిత్య మశుచియె యగుచు సర్వశ్రౌత స్మార్తకర్మములయందును అనర్హుడగును. సంధ్యావందనము వినాగా వైదికములగు నే యితర కర్మముల నాచరించినను ఆ కర్మఫల భోక్త కాజాలడు. "సంధ్యాతిక్రమణం యస్య సప్తరాత్ర మవిచ్యుతం। ఉన్మత్తదోషయుక్తోవా పునస్సంస్కారమర్హతి॥'' "ఇతిశౌనకః॥'' సప్తరాత్రము లవిచ్ఛిన్నముగ సంధ్యావందనాతిక్రమణమును ఏ ద్విజుడు చేయునో అట్టి ద్విజుడున్మాదదోషయుక్తుడైనను వానికి మఱల నుపనయనసంస్కారము జేయవలసినదే. "సంధ్యామిష్టిం చ హోమం చ యావజ్జీవం సమాచరేత్। నత్యజేత్ సూతకే వాపి త్యజన్ గచ్ఛత్యధోగతిమ్॥'' "ఇతిమాధవీయే॥'' సంధ్యావందనము – ఇష్టి – హోమమును యావజ్జీవము నాచరించుచునే యుండవలయును. సూతక దివసములయందుగూడ నుజ్జగించక (విడువక) సమాచరించవలసినదే. ఎన్నడును మానగూడదు. నిత్యము నాచరింపక పరిత్యజించిన యెడల నధోగతుల నధిగమించును. "సంధ్యాత్రయం తు కర్తవ్యం ద్విజేనాత్మవిదా సదేతి అత్రిః॥'' ఆత్మవిదుడైన ద్విజునిచేతంగూడ సంధ్యాత్రయము నిత్యము కర్తవ్యమే. "అహరహ స్సంధ్యా ముపాసీత॥'' యావజ్జీవితము ప్రతిదినమున త్రికాలములయందును ప్రమాదమును పొందక సంధ్యావందన మవశ్యకర్తవ్యమని వేదానుశాసనము. ఇట్లు సంధ్యావందనాతిక్రమణంబున ప్రత్యవాయ బాహుళ్యశ్రవణము వలన సంధ్యావందనము నిత్యకర్మమగుట సిద్ధము.

"బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదో అధ్యేతవ్యో జ్ఞేయశ్చ॥'' (కృ. య. వే.) సాంగ వేదాధ్యయనము తదర్థగ్రహణమును ద్విజునిచేత నవశ్యముగ నిర్వర్తింపబడవలసిన నిష్కారణధర్మమని కృష్ణయజుర్వేద మైత్రాయణీ శాఖయందు విధింపబడినది. "వేదాక్షరాణి యావంతి పఠితాని ద్విజోత్తమైః। తావంతి హరినామాని కీర్తితాని నసంశయః।'' (ఋ. వే. భా.) "ద్విజోత్తములచేత నెన్ని వేదాక్షరము లధీతములగుచుండునో అన్ని యావృత్తులు శ్రీహరినామము కీర్తింపబడినది యగుచుండును. సంశయములేదు'' అని శ్రీవిద్యారణ్య ఋగ్వేద భాష్యవచనము. 'శ్రీహరి' యన "సహేతుకం సంసారం హరతీతిహరిః'' = కారణమైన యజ్ఞానముతో సహ కార్యమైన సంసారమును హరించు జ్ఞానాత్మక పరమాత్మ. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ॥'' (తై. ఉ. 2-1) బ్రహ్మము సత్యస్వరూపము జ్ఞానస్వరూపము అనంత స్వరూపము నని శ్రుతి. "అధీత మపియో వేదం విముంచతి నరాధమః। భ్రూణహాసతు విజ్ఞేయోవియోని మధిగచ్ఛతి॥'' (శిక్ష) వేదము నధ్యయనము జేసియు, స్వాధ్యాయ ప్రవచనములను నియమముగా నిత్యము నిర్వర్తింపక అధీత వేదమును పరిత్యజించిన ద్విజాధముడు భ్రూణహత్యాపాతకుడని తెలియవలయును. వాడు భావిభవమున పక్షియై ప్రభవించును.

(సశేషము)



శ్రీ రామకృష్ణ జన్మదినోత్సవము తిథిపూజ బుధవారము 27-2-1952

మఠమున బహిరంగోత్సవము ఆదివారము 2-3-1952

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

432 పుటలు పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3-0-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | ... | | | | | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | ... | | | | | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | ... | | | | | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | ... | | | | | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | ... | | | | | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | ... | | | | | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | ... | | | | | 0 | 1 | 0 |
| నా మఠము | | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |
| సింహగర్జన | | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎన్. రాజన్ గారిచే జి జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-2-52.

# వి ష య సూ చి క



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు దాఁచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముంగుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ శ్రీ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ | ౧౯౫౨ - మార్చి :: ఖర - ఫాల్గుణము | సంచిక ౯

## ఉగాది ఊహాలు

శా. శ్రీరమ్యంబగు బ్రహ్మముం గనుఁగొనం జింతించు భక్తాళి యిం
పారం దత్తదధీతమార్గముల బ్రహ్మాంశంబు గుర్తింప సు
స్మేర స్పర్శవిలోకనాది విధులన్ శిక్షించి రక్షించు సు
శ్రీరమ్యా మతసామరస్య నిలయా శ్రీరామకృష్ణప్రభూ! ౧

తే. గీ. పుడమి నాధ్యాత్మికామృతంబునకుఁ బాసి; ఖర కరోష్ణార్త సాధుహృత్కమల మలయఁ
గరుణ నందన వర్షంబు గానుపించె; మోక్షరాజ్యాభిషిక్తుల దీక్ష మెఱసె! ౨

తే. గీ. భావి భాగ్యోదయము నూత్న వత్సరంబు
నందదం బల్ల నందన నామకంబు;
చపలచిత్తమ! యదృఢవిశ్వాసములను
వీడు; భవదాత్మతత్త్వగవేషణమున
స్థిరపదంబూను నిర్వాణ సిద్ధి కింక. (పంచపది) 3

చ. గతము గతంబె! కాన విను గమ్యగవేషణమందు నేను ముం
బతితుఁడనైతిగా యనుచు వందురఁబోకుము దుర్బలత్వమున్
మతిఁ జొరనీకు సాధక! క్షమాపరిపూర్ణత సాధనాళి ని
శ్చితమతిఁ బూను మీశ్వరుఁడు చిద్గగనంబున గోచరించెడున్. ౪

తే. గీ. నందనాబ్దంబు చిన్మయానందదంబు; క్షామబాధానివారకంబై మహోత్త
మాశయోత్తేజకంబయి యఖిలజనుల; చిత్తపద్మాళి వికసింపఁ జేయుఁ గాత! ౫



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## కేశవచంద్రసేనునితోడ గురుదేవుని యంతిమ సమావేశము

28 నవంబరు 1883.

మధ్యాహ్నము రెండుగంటలకు 'మ.' కేశవుని కమలకుటీరమునకుబోవు కాలిబాటయందు నడచుచుండెను. అచ్చటికి శ్రీ రామకృష్ణుల శుభాగమనమే యాతని యాగమమునకును గారణము. కేశవుని శరీరస్థితి నీరసముగా నున్నందునను అతనియందు గురుదేవునకు మిక్కిలి ప్రీతియున్నందునను గురుదేవు డానాడచటికి వచ్చునట్లు తెలిసెను. కమలకుటీరమునకు ప్రాగ్దిశయందు విక్టోరియాకళాశాల గలదు. అందు బ్రాహ్మసామాజికురాండ్రగు స్త్రీలు కొందఱు చదువుచుండిరి. కళాశాలకు నుత్తరమున నుపవనముతో గూడిన యొకానొక గొప్ప భవనము కలదు. అందు ఆంగ్లేయ కుటుంబ మొండు నివసించుచుండెను. ఆ యింట నేదో కలవరము జరుగుచుండెను. అందేదియో విపత్తు కలిగినట్లు 'మ.' కు స్ఫురించెను. కొంత సేపటికి శవధారిణియగు శకటమును నీలాంబరధారియగు శకటరక్షకుడును వచ్చిరి. ఆ యింట నెవరో మరణించిరి.

'మ.' యిట్లు తలపోయ నారంభించెను. ఎవరో యీ భూమిని విడిచి వెడలిపోయిరి. ఎచటికి? అన్న ప్రాచీన ప్రశ్నకు సమాధానము నరయుచుండ నుత్తరదిశనుండి యొక బండి వచ్చుచుండెను. 'మ.' ఆ బండియందు శ్రీవారు వచ్చుచుండిరో లేదో యని యాత్రుతతో నెదురుచూచుచుండెను. షుమారు అయిదుగంటలకు కమలకుటీరము నెదుట నొక బండి యాగెను. అందుండి శ్రీ రామకృష్ణ గురుదేవుడు, లాటు, రాఖాల్ మఱియు నిరువురు భక్తులతో దిగిరి. కేశవసేనుని బంధువులు నెలుపటికివచ్చి శ్రీ గురుదేవుని లోనికి దోడ్కొనిపోయి మేడమీది లోగిలి కెదుటి వసారాయందలి మంచముమీద గూర్చుండబెట్టిరి. చాల సేపటినుండియు శ్రీ రామకృష్ణులవా రచ్చట గూర్చొనియుండిరి. కాని కేశవుని దర్శింపవలయు నేర్పాట్లేమియు జరిగినవికావు. అందువలన శ్రీ గురుదేవులు కొంచెము విసువుకొనుచుండిరి. కేశవుని శిష్యులు కొందరు వచ్చి అత్యంత వినయ వినమితులై 'కొంత విశ్రాంతి గైకొనుచున్నారు, తొందరలో వత్తురు' అని శ్రీ గురుదేవునితో పలికిరి. అంతలో శ్రీ రామకృష్ణులవా రిట్లు సంభాషింప దొడంగిరి: 'ఏమోయ్! అతడేల యిచటికి రావలయును? నేను లోనికి బోగూడదా?'

ప్రసన్నుడు:—(వినయముతో) చిత్తము. ఆయనయే కొన్ని నిమిషములలో మీ సన్నిధికి రాగలడు.

శ్రీరామ:—నీవు వెడలిపొమ్ము. ఈ గందరగోళమంతయు నీవే కల్పించుచున్నావు. నేను లోనికి పోవుదును.

రామకృష్ణుల ఆవేశమును ఆత్రుతను మాన్పనెంచి ప్రసన్నుడు తన సంభాషణమును మార్చి యిట్లు పలికెను: 'ఇపుడాయన స్థితి వేరొండుగా మారిపోయినది. దేవితో మాట్లాడుచుండును. దేవీవచనముల విని కొన్నివేళల నవ్వును, కొన్నివేళల నేడ్చును.'

'కేశవుడు జగజ్జననితో మాట్లాడుచున్నా' డన్న మాట విన్నంతనే శ్రీ రామకృష్ణులవారు భావావిష్టులై సమాధినిమగ్నులైరి. ఇది చలికాలము. శ్రీ రామకృష్ణులవారు పచ్చటి 'ఫ్లానల్ కోటును' ధరించియున్నారు. దానిపైన నొక శాలువ యున్నది. తిన్నగా కూర్చొనియున్నారు. దృష్టియు స్థిరముగా నుండెను. ఎంతయో కాలమిట్లు గడచిపోయెను. కాని సమాధి సమాప్తము కాలేదు. చీకటి పడినది. శ్రీ రామకృష్ణులు కొంతవఱకు సహజస్థితికి దిగిరి. ప్రక్కగదియందు దీపము వెలిగింపబడియుండెను. చాల కష్టముమీద శ్రీవారిని మెల్లమెల్లగా ఆ గదిలోనికి దీసికొనివచ్చిరి. ఆ గదియంతయు వివిధములయిన కుర్చీలు, బల్లలు, సోఫాలు, చిలుక కొయ్యలు—మున్నగు వానితో నిండియుండెను. శ్రీ రామకృష్ణుల వారిని ఆ గదియందొక సోఫాలో గూర్చుండబెట్టిరి. వెంటనే శ్రీవారు భావావిష్టులయిరి. ఆ భావావేశముతో సోఫాను జూచుచు, మునుపు వీని ఆవశ్యకత యుండెను. ఇప్పుడేల? రాఖాలునిజూచి 'ఓ, నీవును వచ్చితివా' ఇట్లు పలుకుచు దేనినో చూచుచు నిట్లు వచించిరి: 'ఆహా! ఆఁ అమ్మా నీవును వచ్చితివా? బనారసు పట్టు పుట్టము కట్టుకొని యేమి చూపుటకు వచ్చితివి? నన్ను చికాకుపెట్టకుము. కూర్చో తల్లీ కూర్చో.'

శ్రీ రామకృష్ణులవారు మహాభావమున నున్నారు. గదియంతయు దీపకాంతితో నిండియుండెను. బ్రాహ్మభక్తు లనేకులు గుమిగూడిరి. లాటు, రాఖాల్, 'మ.' మున్నగువారు శ్రీ రామకృష్ణులవారి పాదసన్నిధిని గూర్చొనియుండిరి. శ్రీవారు భావావస్థలో తనలో నిట్లుమాట్లాడుకొనుచుండిరి: 'దేహము, ఆత్మ. దేహము కల్పితము. అది నశించును. ఆత్మకు మృత్యువు లేదు. అది పోవక్కకవంటిది. చక్కగా పండిన వక్కలోని పై డిప్ప వేఱుపడి పోక వేఱుగ నుండును. పచ్చిపోకయందలి డిప్పను వేఱుపఱచుట దుస్సాధము. భగవంతుని దర్శించినయెడల దేహబుద్ధి నశించును. ఆ స్థితియందు 'దేహము వేఱు, ఆత్మ వేఱు' అన్నబుద్ధి కలుగును.'

ఈ సమయమున కేశవుడా గదిని ప్రవేశించెను. అతడు పురమందిరమునందును బ్రహ్మసమాజ భవనమునను నుపన్యసింపగా జూచినవారు ఇప్పటి యతని నిస్సారమగు అస్థిచర్మమయ శరీరమునుగాంచి మిక్కిలి ఆశ్చర్యపడిరి. అతడు నిలువనుగూడ శక్తిలేనివాడై యుండెను. మెల్లమెల్లగ గోడను బట్టుకొనివచ్చి, శ్రీవారి సోఫాకు ఎదుట క్రింద గూర్చుండెను. శ్రీ రామకృష్ణులవారుగూడ ఇంతలో సోఫాను విడిచి క్రిందనే కూర్చొనిరి. శ్రీ రామకృష్ణుల దర్శనమునం దెంతో ఆశ కలిగి కేశవుడాయనకు సాష్టాంగ నమస్కారము గావించెను. శ్రీ రామకృష్ణులవారింకను భావావస్థయందే నిమగ్నులై యుండి జగన్మాతతో నేదియో సంభాషించుచుండిరి.

ఆ సమయమున కేశవు డుచ్ఛస్వరమున నేను వచ్చియున్నానని పలికి శ్రీ రామకృష్ణుల వారి వామహస్తమును బట్టుకొని మెల్లగా స్పర్శింప నారంభించెను. కాని గురుదేవులు భావమున నిమగ్నులైయుండిరి. వారేదేదియో చెప్పుకొనిపోవుచుండ భక్తులందఱును ఆశ్చర్యముతో వినుచుండిరి.

శ్రీరామ:—ఎంతవఱకు ఉపాధి కలదో అంతవఱకు భిన్నత్వజ్ఞానము అనగా కేశవుడు, ప్రసన్నుడు, అమృతుడు—అను నిట్టి భిన్న భిన్న వ్యక్తిత్వసూచకమైన జ్ఞానము కలుగును. పూర్ణజ్ఞానము కలిగినచో నపుడు ఏకైక చైతన్యమే భాసించుచుండును. అదియునుగాక పూర్ణజ్ఞానమున ఏకైక చైతన్యమే జీవము, జగత్తు, చతుర్వింశతి తత్త్వములునైయున్నట్లు గోచరించును. అయినను శక్తివిశేషమున విభేదములు గలవు. ఆ చైతన్యమే సమస్తముగా భాసించుచున్నను ఆ శక్తి కొన్నిటియందు ఎక్కువగను కొన్నిటియందు తక్కువగను ప్రకాశించును.

విద్యాసాగరుడు 'భగవంతు డొకని కెక్కువ శక్తిని మరియొకనికి తక్కువ శక్తిని నొసగెనా' యని ప్రశ్నించెను. అందులకు నేను 'అట్లు కానిచో నొక్కడే బదుగురతో నెట్లు పోట్లాడి జయింపగలడు? ఇంక నిన్నుమాత్రము మేమేల చూడరావలయు'నని యడిగితిని.

ఈశ్వరలీల యే యాధారమున ప్రజ్వలించుచుండునో యచ్చట విశేషశక్తి తప్పక యున్నది. జమీందారుడు సమస్త ప్రదేశములందును గూర్చొనును. అయినను ఒకచోట కూర్చొనుట కతని కెక్కుడు ప్రీతి యుండవచ్చును. భగవంతు డట్లు కూర్చొను స్థలము భక్తుని హృదయము. భక్తహృదయమున భగవానుని విశేషశక్తి యవతరించును. ఒకడు మహత్కార్యములు సాధించుచున్నచో వానియందు విశేషశక్తి కలదని తెలియనగును. ఈ ఆద్యాశక్తికిని పరబ్రహ్మమునకును భేదములేదు. వీనిలో ఒకదానిని వదలి యన్యమును దలంపనయితిగాదు. మణిని వదలి జ్యోతిని, జ్యోతిని వదలి మణిని కనుగొనజాలము. సర్పమును వదలి తిర్యగ్గతిని గనుగొనుట యసాధ్యము. అట్లే తిర్యగ్గతిని మఱచి సర్పమును దలంపజాలము.

ఈ ఆద్యాశక్తియే జీవము, జగత్తు, చతుర్వింశతితత్త్వములు నయ్యెను. అనులోమ విలోమములు. నేను రాఖాల్ నరేంద్రుడు మున్నగువారి కొఱ కింతటి తాపత్రయము పడనేల? 'వీరి కొఱకు నీవేల యిట్లు బెంగపెట్టుకొనియెదవు? వారిని వీడి భగవానుని జింతింపరాదా' యని హాజ్రా పలికెడివాడు. (కేశవుడు మున్నగు భక్తులు కొద్దిగా నవ్విరి).

అంతట నేను ఎక్కువగా యోచింప నారంభించితిని. 'అమ్మా! నా కిది యేటి స్థితి? హాజ్రా వీరికొఱ కేల యింతగా తపించుచున్నావని యడుగుచున్నాడు' అని అమ్మతో భాషించితిని. పిదప భోలానాథుని నడిగితిని. అంతట 'మహాభారతమున నిట్లున్న'దని భోలానాథుడు పలికెను. 'సమాధినిమగ్నుడగువాడు సమాధ్యనంతరము దేని నవలంబముగా గైకొనును? అందువలననే కొందఱు సత్త్వగుణప్రధానులగు భక్తులను తమచుట్టును బెట్టుకొనియుందురు.' మహాభారతమునందలి ఈ ప్రమాణమును దెలిసికొని బ్రదుకు జీవుడా యనుకొంటిని. (అందరు నవ్విరి). హాజ్రా దేమియు తప్పులేదు. సాధకావస్థయందు 'నేతి – నేతి' భావముతో మనస్సు

సమస్తమును భగవదర్పణము గావింపవల యును. సిద్ధావస్థలో విషయము వేఱు. భగవ ల్లాభానంతరము అనులోమము, విలోమము. పెరుగునుండి వెన్నను జిలికి తీసిన పిమ్మట వాని యన్యోన్య సంబంధము మనకు చక్కగా గోచ రించునుగదా. అప్పుడే భగవచ్ఛక్తి యెందు ఎక్కువగా ప్రకాశించుచున్నది, ఎందు తక్కు వగా వ్యక్తమగుచున్నది యని మనము తెలిసి కొనగలము.

సముద్రము పొంగివచ్చినచో భూమియందు చాలవఱకు జలమయమగును. అంతకుముందు వంకర టింకర నదీమార్గముల జను ఓడలన్నియు నిపుడు సూటిగా సముద్రమున బ్రవేశింపగలవు. చేలలో కోత కోసినపిదప గట్టుమీదనే చుట్టి చుట్టి నడువనక్కఱలేదు. మధ్యనుంచి యడ్డ ముగానైనను పోవచ్చును. భగవత్సాక్షాత్కా రానంతరము సమస్త వస్తువులయందును మనము భగవానుని దర్శింపగలము. కాని మనుష్య శరీరమున మాత్రము ఆ పరబ్రహ్మము మిక్కిలిగా ప్రకాశించును. ఈ మనుష్యులయందును సత్త్వ గుణాధికులగు భక్తులయందు అనగా ఈపత్తయి నను కామినీ కాంచన లాలస లేనివారియందు ఇంకను మిక్కిలిగా గోచరించును. సమాధిస్థితి నుండి తిరిగి వచ్చువాడు మనస్సును దేనియందు లయింపజేయును? అందుకొఱకే సత్త్వగుణ ప్రధానులయిన సిద్ధభక్తుల యవసరము. లేనిచో అతడు దేనినిబట్టి కాలము గడుపును? ఎది బ్రహ్మమో అదియే ఆద్యాశక్తి. క్రియారహి తమై యున్నపుడు బ్రహ్మ మందుము. సృష్టి స్థితిప్రళయము లొనర్చునపుడు 'శక్తి'యందుము. అదియే ప్రకృతి. పురుషుడు, ప్రకృతి. పురుషు డేదియో యదియే ప్రకృతి. ఆనందమయుడే ఆనందమయి. పురుషుడన్న జ్ఞానము కలవానికి స్త్రీ యన్న జ్ఞానమును స్ఫురించును. తండ్రి యన్న జ్ఞానము గలవానికి తల్లి యను జ్ఞానము సయితము కలుగును. (కేశవుడు నవ్వెను). అంధకారజ్ఞానము గలవానికి ప్రకాశజ్ఞానము గూడ గలుగును. రాత్రిజ్ఞానము కలవానికి పగటిజ్ఞానము గలుగును. సుఖజ్ఞానము గల వానికి దుఃఖజ్ఞానముగూడ నుండును. నామాట లర్థమగుచున్నవిగదా!

కేశవు:—చిత్తము, తెలియుచున్నవి.

శ్రీరామ:—అమ్మ! ఎవరు తల్లి? జగత్తు నకు తల్లి. ఏతల్లి జగత్తును సృష్టించెనో, పాలిం చుచున్నదో ఆ తల్లి. ఆమె తన బిడ్డల నెల్ల ప్పుడును రక్షించుచున్నది. ధర్మార్థకామ మోక్షములందు దేనిని బ్రార్థింతుమో దానినే ఆమె యొసగును. సరియయిన శిశువు తల్లిని వీడియుండజాలదు, కాని తల్లి సమస్తము నెఱుగును. శిశువు ఆహారము భుజించును, త్రావును, తిరుగును. అంతే తక్కిన విషయ మేదియు నది యెఱుంగదు.

కేశవ:—చిత్తమండి.

(సశేషము)



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
12-8-'15.

శ్రీమార్గ దే...

నీ యుత్తరమున వ్రాయబడిన సంగతుల గ్రహించి అత్యంతము దుఃఖితుడనైతిని. ఈమాఱు మఱల పూర్వవంగదేశమున కల్లోలము జరుగుచున్నదట. భగవదిచ్ఛ యెట్లున్నదియో!—ఆయన యెల్లరకును శుభము నొసంగుగాత! అదియే నా ప్రార్థన.

భగవద్ధ్యానము చేయగలిగినంతగా చేయుము. అలవాటుపడినపిదప సమస్త కార్యములును సుకరములగునన్న విషయము నిజమే. మెల్లమెల్లగ అభ్యాసము కుదుటబడవలయును. దానితోబాటు భగవానునియందు ప్రేమ జనింపవలయును. ప్రపంచమున సమస్తమును అనిత్యము, నిస్సారము అని తెలిసి భగవానునికే సంపూర్ణముగా మనఃప్రాణముల నర్పించుకొనగలిగినచో నిశ్చయముగా భగవత్ప్రేమ జనించును. భగవత్ప్రేమ ఒక్కమాఱు ప్రభవించెనా, యింక నేలాటి భయమును నిలువబోదు. భగవానుని శరణంటిన సమస్తకార్యములను ఆయనయే చక్కబెట్టును.

నా శుభాశీర్వచనములు,
ఇట్లు,
శ్రీ తురీయానంద



శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
6-5-'16.

మార్గ...

29-వ తారీఖునాటి నీ యుత్తరమును జూచి సమస్తవిషయములను గ్రహింపగలిగితిని. నా యుత్తరమును పఠించి నీవెంతయో అభివృద్ధి నందితివని విని సంతసించుచున్నాను. వలయునది యుత్సాహమే. భగవంతుని నీవెంతటి ఆప్తునిగా తలంచుచుందువో అంతటి సన్నిహితునిగా ఆయనను కనుగొనగలవు. అంతటితో నీ సాంసారిక తాపములన్నియు పటాపంచలగును. 'తూర్పున కెంతగా దగ్గరింతువో పశ్చిమమున కంతగా దూరుడవగుదు'వని శ్రీ రామకృష్ణులవారు వచించెడివారు. మనము భగవానుని కభిముఖులమై నడువగలిగినచో సాంసారిక బంధములన్నియు దూరీకృతములు కాగలవు.

భగవాను డంతర్యామియై యున్నాడు, నిజమే. ఆయనయందు మనము మనస్సును లయింపగలిగినచో మన పని యంతటితో సరి. ఆయన ఆత్మకు ఆత్మ; ప్రాణమునకు ప్రాణము. ఆయన కృపవలననే మనము జీవించియుండి మన జీవయాత్రను గడుపుకొనుచున్నాము. కావున ఆయనకే మనము సమస్త ప్రేమను ప్రప్రథమమున నర్పింపవలయును. ఈ విషయమును దెలియకపోవుటవలననే మన మెన్నియో బాధలకు లోనగుచున్నాము. మనము ఆయ

నను గుర్తింపగలిగినచో మన బాధలన్నియు నివర్తించును. ఇట్టి భావమే యెల్లప్పుడు నీ హృదయమున హత్తుకొనునట్లు భగవానుడు నిన్నాశీర్వదించుగాక! అట్లయిననే నీ జీవనము ధన్యము కాగలదు. భగవానుడు గీతయందిట్లు నొక్కి వక్కాణించియున్నాడుగదా!—"నన్ను భజింపుము. ఇది యొకటియే సారవంతము. సంసారమంతయు ననిత్యము, నశుభదము. దీని యందు పడినచో నేయితరమును లక్ష్యింపక నన్నే భజింపుము. అట్లయినచో నిన్ను నీవు కాపాడుకొనగలవు, లేనిచో నీ ముక్తికి మార్గమే లేదు.—అనిత్యమసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమాం; మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు; మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః." ఇట్టి అభయప్రదమును నిశ్చయమును అగు భగవద్వాణి యెదుట నుండగా దానిని లక్ష్యింపనిచో అంతకంటె అత్యంత సంతాపకరమగు విషయ మన్యమెద్ది కలదు? సుఖదుఃఖము లేవియు నిత్యములుగావు. అందువలననే భగవానుని వాకిటనే పడియుండవలయునని పెద్దలు వచింతురు. ఆయనయందు దృష్టి నిలిపినచో జాలును. సంసారతరణమున నుపాయాంతర మనావశ్యకము. కాన నీ వెల్లప్పుడును హృదయమున భగవానుని ధ్యానింపుము. సమస్తమును ఆయనయే చక్కబెట్టును.

* శ్లో. 'రామం చింతయ చిత్త బర్బర చిరం
చింతాశతైః కిం ఫలమ్।
కిం మిథ్యా బహుజల్పనేన సతతం
రే వక్త్రి! రామం వద।
కర్ణ త్వం శ్రుణు రామచంద్రచరితం
కిం గీతవాద్యాదిభిః।
చక్షుః రామమయం నిరీక్ష సకలం
రామాత్పరం త్యజ్యతాం।

నా శుభాశీర్వచనములు,
ఇట్లు,
శ్రీ తురీయానంద

* ఓ మనస్సా! ఎల్లప్పుడు శ్రీరాముని చింతింపుము. వందలకొలది యితర చింతలవలని ప్రయోజనమేమి? ఓ వక్త్రిమా! మిథ్యాభూతములగు ప్రలాపములవలని ప్రయోజనమేమి? రామనామమును బలుకుము. ఓ కర్ణమా! నీవు రామచంద్ర చరితమును వినుము. గీతవాద్యాదుల శ్రవణమువలని ఫలమేమి? ఓ నేత్రమా! నీవు శ్రీరామ స్వరూపమును జూడుము. రామునే కాని తదన్యమయిన సమస్తమును (జూడక) విడిచిపెట్టుము.

# రా మ ప్ర భూ!

శ్రీ సాలగ్రామ కాశీ విశ్వనాథశర్మ

శా. శ్రీ కళ్యాణ గుణాకరా శుభకరా క్షేమంకరా శ్రీకరా
లోకాధార పరాత్పరా సుఖకరా లోకేశ్వరా యీశ్వరా
శ్రీకాంతాంశజ జానకీశ్వర వరా జీవాత్మ జీవేశ్వరా
పాకారి ప్రముఖామరార్చిత పరా పట్టాభి రామప్రభూ! 1

శా. కైవల్యాధిపు ధారుణీతనయహృత్కంజాత కంజాప్తునిన్
సేవింపన్ననిలాత్మజుండు ననుజుల్ సేవానుమోదాత్మునిన్
శ్రీ వెంటూరి పురీ నివాసు నిల సజ్జీమూత దేహాంచితున్
భావింతున్ సతతంబు నామది నినున్ పట్టాభి రామప్రభూ! 2

మ. నిగమజ్ఞేయుడ వీశ్వరుండవు మహా నిర్వాణ సంధాయివిన్
భగవంతుండవు రామనామక పరబ్రహ్మంబవున్ నిత్యమున్
సగుణారాధ్యుడవున్ దయానిధివి సంసారార్ణవోత్తారకా!
పగలున్ రేయిని గొల్తు నిన్నెపుడు శ్రీ పట్టాభి రామప్రభూ! 3

శా. మాయాజాల విభేద్యమాన త్రిజగన్మాంగల్య సంధాన నా
నాయోగీశ్వర గేయమాన పరిపూర్ణానంద మేపారగా
నీ యవ్యాజ కృపాకటాక్షమున సన్వీక్షింపవే దీనునిన్
మాయామానుష విగ్రహా భవహరా పట్టాభి రామప్రభూ! 4

శా. ఓ దేవోత్తమ! పావనా గుణమణీ! యోలోక రక్షామణీ!
ఓ దీనావన! జానకీశ! వరదా! యోభక్త చింతామణీ!
ఓ దామోదర! శ్రీధరా! భవహరా! యోరామ నిత్యంబు నీ
పాదాబ్జంబులయందు భక్తినిడవే పట్టాభి రామప్రభూ! 5

శా. మాయింపంగదె నాదుపాపములు రామాయన్న పల్కంగదే
కూయాలింపగదే యిదే నతిగదే గోల్వెట్ట వే రాగదే
నీయానన్ నిను నమ్మితంటినిగదే నిర్వాణము న్నీగదే
పాయంజేయగదే వెతల్ భవహరా పట్టాభి రామప్రభూ! 6

శా. సాయంబెవ్వరు నాకహో ఘన మహా సంసారనిర్మగ్నుడన్
ఓ యయ్యా నిను కావుకావుమని నేనోర్వొప్పగా గుయ్యిడన్
వేయేలా ననుబ్రోవరావు జనకా విశ్వేశ విశ్వాత్మకా
పాయంజాలను నన్నుబ్రోవ గదవే పట్టాభి రామప్రభూ! 7

శా. ఓ దీనావన పావనా గుణమణీ యోభక్త రత్నామణీ
నీ దీనావనబద్ధకంకణ అహో - నేవేడగా దీనతన్
నాదైన్యంబును బాపవేగ తగదే నాకేది దిక్కింక నీ
పాదాక్రాంతుఁడ దేవ బ్రోవగదవే. పట్టాభి రామప్రభూ! 8

శా. నాదోషంబులు లెక్కజూడ వినుమన్నా రిక్కలే తక్కువౌ
నాదౌర్భాగ్యము చెప్ప సిగ్గు మిగులౌ నాబుద్ధి మాంద్యంబహో
నీదే భారము రామ భక్తజనహృన్నీరేజ మధ్యస్థితా!
పాదాక్రాంతుఁడ దేవ ప్రోవగదవే పట్టాభి రామప్రభూ! 9

శా. లే రెవ్వారలు దిక్కునాకు గుయి నాలింపంగ పాలింపగా
సారంబింతయు గానరాని ఘన సంసారాబ్ధి భీతుండ నో
శ్రీరామా రఘునాయకా శ్రితజన క్షేమంకరా రాఘవా
భారంబా ననుబ్రోవ? బ్రోవగదవే పట్టాభి రామప్రభూ! 10

# శ్రీ వివేకానంద సంభాషణలు

## (శ్రీ సురేంద్రనాథ్‌దాస్‌గుప్త)

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[నిరంతరమును మరణమునుగూర్చి చింతింపుము. నీలో నూతన జీవిత మారంభ మగును—మానవసేవ చేయుము—భగవంతుడు రక్షకుడు.]

ఒకానొకరోజున నేను వివిధకళాశాలల యందు చదువుచున్న స్నేహితులతో గలసి బేలూరుమఠమునందున్న స్వామిజీని దర్శించుటకై వెళ్లితిని. మేము శ్రీవారి చుట్టును గూర్చుంటిమి. అనేకవిషయములగూర్చి సంభాషణలు జరుగుచుండెను. ప్రశ్న యడుగుటయే తడవుగ శ్రీవారు వెంటనే సరియగు జవాబును చెప్పుచుండిరి. అకస్మాత్తుగా మమ్ముద్దేశించి, "మీరందరును పాశ్చాత్యుల వివిధ వేదాంతములను, తత్త్వశాస్త్రములనుగూర్చియు జాతులను, దేశములనుగూర్చియు నేర్చుకొనుచున్నారుగదా. జీవితములో అన్నింటికంటె గొప్ప సత్య మేదియో చెప్పగలరా" యని ప్రశ్నించెను.

మేమందరమును ఆలోచించితిమి. కాని మాలో ఒక్కరును శ్రీవారికి గావలసిన జవాబు చెప్పలేకపోయితిమి. అంతట వారే ఉత్సాహమునుగొల్పు రీతిగా ఈ విధముగా దెలియబఱచిరి.

"ఇటు చూడుడు. మనమందరమును చనిపోవుదుము! ఇది ఎల్లకాలము మనస్సులో జ్ఞాపకముంచుకొనుడు. మీయందంతర్గతమైయున్న, చైతన్యము మేల్కొంచగలదు. నీయందలి యల్పత్వము, నీచత్వము మాయ మగును. కర్మయోగ మారంభమగును. నీ శరీరమందును, మనస్సునందును ఒక వినూతన బలము చేకూరును. నిన్ను సమీపించు ఇతరులు, నీయొద్ద నేదియో యితరుల నుద్ధరించు శక్తి గలదని గ్రహింపగలరు."

అంతట శ్రీవారికిని, నాకును ఈ సంభాషణ జరిగెను.

నేను:—స్వామిజి! మరణమును తలచినంతనే హృదయము పగిలిపోవునుగదా! మనస్సు విచారమున మునిగిపోవునుగదా?

స్వామిజి:—అలాగుననే, మొదట గుండె తడబడుట, మనస్సు విచారమున మునుగుట సంభవించును. కాని పట్టుదల వహింపుము. రోజులు గడువనిమ్ము. అప్పుడు? నీ హృదయమునకు సరిక్రొత్తబలము చేకూరుచున్నట్లు చూడగలవు. ఎల్లప్పుడు మరణమునుగూర్చి తలంచుచుండుటచే, నీలో

నూతనజీవిత మారంభమగునటుల, అంతయు మిథ్య, అంతయును మిథ్య యనెడి పరమ సత్యమును నీకు దెలియుచుండును. ఇట్లు కొంతకాలము గడువనిమ్ము. నీలో నున్న యల్పశక్తి క్రమక్రమముగా వృద్ధిగాంచి, సింహబలమును బడయగలదు. ఎల్లప్పుడు మరణమునుగూర్చియే విచారించుము. ఇందలి సత్యము నీకే తెలియగలదు. మాటలతో చెప్పవలసిన దింతకంటె మఱియొకటి లేదు.

ఈ సమయమున నా స్నేహితులలో నొకరు స్వామిజీనిగూర్చి మెల్లగా పొగడుచుండిరి.

స్వామిజి:—నన్ను స్తోత్రముచేయకుడి. నిందాస్తుతులు ఈ లోకమున నిరుపయోగములు. ఊయలయందలి మానవు డెట్లూగునో, యా రీతిగా నివి మానవుని నూపగలవు. అంతులేని స్తోత్రపాఠములను, అంతులేని నిందలను రెంటినిగూడ అనుభవించితిని. కాని వానివలన ప్రయోజనమేమి? వీనిని లక్ష్యముచేయక, మానవుడు తన విధ్యుక్త ధర్మమును నెరవేర్చుచుండవలయును. ఆఖరు ఘడియ సమీపించినపుడు, నీకు, నాకు, అందరికిని, స్తుతి, నింద సమానములే యని తెలియగలవు. మనమిచ్చట పనిచేయుటకే యున్నాము. పిలుపు వచ్చిన తోడనే, యందరము, సమస్తమును విడిచిపెట్టి పోవలసినవారమే.

నేను:—స్వామిజి! మన మెంతటి యల్పులము!

స్వామిజి:—సత్యము, నీవు చెప్పినది యథార్థము. అనంతములగు గ్రహతారాసులతో గూడిన యీ యనంత ప్రపంచమందు మన మెంతటివారము! అనూహ్యమగు శక్తితో ఈ బ్రహ్మాండములన్నియు ఎవ్వని పాదసన్నిధిని దిరుగుచున్నవో, యా యవాఙ్మానసగోచరునిముందు మన మెంతటివారలమో యొకసారి స్మరింపుము. నిష్ప్రయోజనకరములైన, నీచములైన భావములతో నుండుటకు ఇచ్చట తావులేదు. ఒకరిపై నింకొకరు శత్రుత్వ మవలంబించుట, పక్షపాతమును చూపుటవలన మనకు గలుగు లాభములేవి? నా సలహా పాటింపుడు. "మీరు మీ కళాశాలలను వదలిన వెంటనే తోడి మానవుల సేవ చేయుడు. మీ యింట, మీ స్వాధీనములలోని ఇనుపపెట్టె నిండుగ నున్న ధనము, బంగారము వీనివలన మీకు గలుగు నానందముకంటె ఈ మానవ సేవవలన గలిగిన యానందము యనేకరెట్లధికమని మీకు దెలియగలదు. నా మాటలను వినుడు. తోడిమానవులసేవ, ఎంత శీఘ్రముగా, ఎంత ఎక్కువగా మీరు చేయగలరో, యంత శీఘ్రముగా, యంత ఎక్కువగా మీరు జ్ఞానమార్గమునం దభ్యుదయమును బడయగలరు.

నేను:—స్వామిజి! కాని మనము చాల దరిద్రులమే!

స్వామిజి:—దరిద్రులమను భావ మటుండనిండు. ఏ విషయమున మీరు అల్పులు? మీకు బండ్లు గుఱ్ఱములు లేవనిగాని, పిల్చినంతనే హాజరగుటకు సేవకులు లేరనిగాని విచారించుచుంటిరా? వానివలన లాభమేమి? మీరు అహోరాత్రములు హృదయపూర్వకముగా మానవసేవ చేయుచుండిన మీకు ఏమియును లోటుండదను విషయము మీకు బాగుగా తెలియదు. ఈ మిథ్యా

జీవితముయొక్క రెండవభాగము మీకు దెలియబడగలదు. మరణమను తెర వీడి పోయి, నిజముగాఅమరజీవితమునకు శాశ్వత హక్కుదారు లయ్యెదరు.

నేను:—స్వామిజీ! మీ అమృతతుల్యములగు నుపదేశములను వినుచు మే మెంత యానందము ననుభవించుచుంటిమి!

స్వామిజి:— నే నింతవఱకు భారతదేశమంతటను సంచరించి, యనేక మహాపురుషులను దర్శించితిని. వారల హృదయములు ప్రేమావృతములు. వారి పాదసన్నిధిని నే గూర్చుండగా, నాయందు వారల ప్రేమధార వర్షించుట నాకు ప్రత్యక్షానుభవ గోచరమయ్యెను. ఆ మహాత్ముల సాంగత్యమువలననే, నేనేర్చిన యీయల్పము, మీకు బోధింపగలుగుచున్నాను. నేను గొప్పవాడనని తలచకుడు.

నేను:—కాని స్వామిజి! మిమ్ములను మేము భగవంతుని గ్రహించినవారలుగా తలచుచున్నాము.

నే నీరీతిగానుడివినంతనే, (శ్రీ)వారి యాకర్షణీయములగు నేత్రము లశ్రుపూరితములై (ఎంత స్పష్టముగా ఇప్పటికిని ఆదృశ్యము నాకంటికి గనబడుచున్నది!) హృదయము ప్రేమాంబుధిలో మునిగి ప్రశాంతముగను మృదుమధురముగను "జ్ఞానులు గోరు జ్ఞానసిద్ధి యా పవిత్రపాదపద్మముల సన్నిధినే, భక్తులుగోరు భక్తియందలి పరిపూర్ణసిద్ధి ఆ పవిత్ర పాదపద్మముల సన్నిధినే. నీవు చెప్పు స్త్రీ పురుషాదులు యావన్మందియు, రక్షణకై యాపవిత్ర పాదపద్మ సన్నిధికిగాక మరెచ్చటికి వెళ్లగలరు?" అని నుడివిరి.

మఱికొంత సేపటికి మఱల "మానవులు తమలోదాము గలహించుకొనుచు, కాలమును వృథ సేయుచు ఎంతతప్పిదమును చేయుచున్నారు! కాని యీ రీతిగా ఎంతకాలము వఱకు చేయగలరు? జీవితమందలి సాయంసమయమందైనను వారందరును జగజ్జనని గృహమునుజొచ్చి శరణుబొందవలసినవారలే" యని సెలవిచ్చిరి.



ఏనుగు చిన్న గుడిసెలోనికి జొరబడినయెడల గుడిసె అల్లల్లాడి కూలిపోవును. అట్లే బ్రహ్మానందానుభవము సాధకుని శరీరమును గడల్చివైచి యొక్కొక్కప్పుడు విచ్ఛిన్నము చేసివేయును. దానివలని ఫలితమేమో తెలియునా? ఇల్లు అంటుకొనినయెడల అనేకవస్తువులు (దానితోబాటు) తగులబడిపోవును. అటులనే జ్ఞానాగ్ని కామక్రోధాదిరిపులనందఱను ధ్వంసముచేసి తుదకు 'నేను; నాది' యను స్పృహను గూడ నాశనము చేయును. తీవ్రమైన ఆ దెబ్బతో శరీరము శిథిలమైపోవును. అంతయు పూర్తియైనదని నీవనుకొనవచ్చును కాని, అహంకారవాసన లేశమున్నను గూడ భగవంతుడు నిన్ను విముక్తుని జేయడు. నీవొక ఆసుపత్రిలో రోగిగా ప్రవేశించినయెడల పూర్తిగా నీవ్యాధి నివారణకానిదే నిన్ను విడువరుగదా!

—శ్రీ రామకృష్ణ పరమహంస

# మానవుఁడు

శ్రీ జె. హెచ్. బి. ఆచార్య

తే. గీ. నరసమూహము చపల వా।నరచయంబు ; పన్నగాళియు బహువిధ । పక్షిగణము
జంతుసంతతి కీటక । జాల మాది ; జీవరాసులఁ బుట్టించె । సృష్టికర్త. 1

తే. గీ. తనువు ధనమును శాశ్వత।మని తలంచి ; నీతి నియమంబులును లేని । నీచుఁడొకఁడు
సిరియు నాయువు గోల్పోవుఁ । దరుణిఁగూడి ; హద్దులేదంద్రు వాంఛకుఁ । బెద్దలెల్ల. 2

తే. గీ. పదవినొకదాని నిద్దరు । వడయఁగోరి ; బలముచాలక యోడిన । వాఁడు గినిసి
బాధితుండయి, పగవాని । వైరమూని ; హతమొనర్చియు నాత్మహ।త్యకు గడంగు. 3

తే. గీ. జగతి జనముల నెల్ల వం।చనయొనర్చి ; ఆర్తజనులకు బధిర పం।గ్వంధులకును
దమ్మిడియు నీక ; నటుమీఁదఁ । దానుదినక ; నవనిపాల్జేయుధనము పా।పాత్ముఁడొకఁడు.

తే. గీ. భువనమోహన సౌందర్య।మూర్తియైన ; దేవదేవునిదిక్కేని । దెలిసికొనక
దార పుత్రాదులందు వి।త్తంబునందుఁ ; దగిలియుండును నరుఁడొండు । ధాత్రియందు. 5

తే. గీ. పండితునియింటఁ బుట్టిన । భాగ్యశాలి ; వాసికెక్కిన గొప్ప వి।ద్వాంసుఁ డొకఁడు
మదన సదృశుఁడు యౌవన । మదముచేత ; దేశకాలంబు దెలియక । తిరుగుచుండు. 6

తే. గీ. సైఁపఁజాలని సహజ మ।త్సరముచేత ; సవతిబిడ్డను బాధించు । సవతితల్లి
వార్ధకంబునఁ బెండ్లాడి । భార్యచెయ్యి ; ఖండలింపకమానెడి । మనుజుఁడొకఁడు. 7

. గీ. ఉన్నదానిలోఁ దృప్తిని । గన్నవాఁడు : జ్ఞానసాధన జేసెడి । మానవుండు
మడుఁగులోఁబుట్టి పెరుగు తా।మరము భంగి ; విషయవాంఛలఁదగులని।విబుధుఁడొకఁడు. 8



# గీతయందలి గంభీర సూక్తులు

శ్రీ.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో ।
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో ।
వేదాంత కృద్వేద విదేవచాహమ్ ॥
—గీత. 15-15.

అచ్యుత సారథ్య విజయ సామ్రాజ్యలక్ష్మిని చేపట్టుటకు నరుదెంచిన అర్జునుడు తన క్షాత్ర ధర్మమును స్వీకరించుటకు బదులుగా సంక్షుభిత మనస్సుతో దుఃఖితుడై, చేతనున్న బాణమును అంబులపొది మున్నగు యుద్ధపరికరములను విడనాడి చేతులు మోడ్చి శ్రీకృష్ణపరమాత్మ నెదుట నిట్లు పలికెను: ''చెడుసందేహములతో నా మనస్సు చలించినది. ఏది ధర్మమో తెలిసి కొనలేక నిన్నడుగుచున్నాను. ఇప్పుడు నాకు ఏది మేలైనదో నిర్ణయించి చెప్పుము. నీ శిష్యుడను. శరణంటిని. ఆజ్ఞాపింపుము. (గీత. అ. 2-7.)

దుఃఖితుడైన అర్జునుని పరిస్థితి తెలిసి, వానిని శిష్యునిగా స్వీకరించి చిరునవ్వుతో పార్థు నుద్దేశించి పలికిన మాటలు ఎంత గంభీరముగా నున్నవో చూడుడు. ''అర్జునా! విషమ పరిస్థితిలో నీకీ మోహమేల? ఇది అవివేకులకు దగినది. దుర్లోకములకు కారణమైనది. అపకీర్తి తెచ్చునది. పిరికితనము వీడుము. నీ కిది ఎంతమాత్రము తగదు. నీవు శత్రుభయంకరుడవు. నీచమైన ఈ హృదయ దౌర్బల్యమును పారద్రోలి లెమ్ము. నిలువబడుము.''

గురు, శిష్య సంవాదమైన శ్రీ భగవద్గీత ప్రస్థానత్రయములోనిది. ఇయ్యది గొప్ప బోధనీయ గ్రంథముగా నిప్పటికిని పరిగణింపబడుచున్నది. పై నుదహరించిన తొలిపలుకులతో ప్రారంభించిన పరమాత్మ వాక్కులు మనబోటి పిరికిపందల జీవితయాత్రలో ముందంజకు నొక తార్కాణము. అది భగవద్గీతకును, మన జీవితమునకును నాంది ప్రస్తావనగా నున్నదని చెప్పుటలో నతిశయోక్తిలేదు. కనుకనే వ్యాసమహర్షి యుపనిషత్తులన్నింటిని గోవునకు బోల్చి, గోపాలనందనుడు పాలను పితుకువాడుగను, పార్థుడే గోవత్సముగను, ఏతత్ సారమే గీత యను అమృతముగను, పరిశుద్ధులైన జీవులు గీతామృతము ననుభవించుచున్నారనియు చిత్రముగా వర్ణించియున్నాడు. కనుక గీత మిక్కిలి సారవంతమైన గంభీర సూక్తులతో ఒక్క అర్జునునకేగాక, మనకందరకును సందేశ తరంగిణియై ప్రవహించి మన జీవితలక్ష్యమునకు సర్వదా చేయూతనిచ్చు గ్రంథరాజమై యలరారుచున్నది.

ఈ గ్రంథమునందు అనేకవిధములుగా బోధించినమార్గములుస్థాలీపులాకన్యాయముగా నిచ్చట కొద్దిగా వివరింతుము. స్వకర్మను నభ్యసించుటయే అతని ప్రథమకర్తవ్యము. ఫలాపేక్షతో మానవునికి నిమిత్తములేదు. ''ఎప్పుడు నీ బుద్ధి అజ్ఞానదోషమును దాటునో అప్పుడే నీవు వినవలసినదానియందును, వినిన దానియందును విరక్తిని బొందుదువు. (గీత. II.

52.) అనేకవిధములైన విషయములు వినుటచేత చలించిన నీబుద్ధి ఎప్పుడు ఈశ్వరధ్యానమున నిశ్చలమై స్థిరమై యుండునో అప్పుడే ఆత్మజ్ఞానమును పొందుదువు.'' (గీ. 53) అని తెలిపి అర్జునుని సంశయనివృత్తికొఱకు స్థితప్రజ్ఞుల లక్షణములను బోధించి అతని మనస్సునకు శాంతి నొసగిన పుణ్యపురుషుడు శ్రీకృష్ణపరమాత్మ. అదియునుగాక స్వధర్మమును విడనాడుట ధర్మముగాదని శ్రీకృష్ణుడే తన స్వవిషయమును తెలుపుటకు ముందు, పెద్దలైన జనకాదులు గూడ కర్మల ద్వారముననే ఆత్మజ్ఞానమును బొందిరని సూచించెను. కాబట్టి అర్జునుడు గూడ లోకముకొఱకైనను కర్మల నభ్యసించుట స్వధర్మముగా నెంచుట కర్తవ్యము. అర్జునా! మూడులోకములలో నాకు చేయవలసినదేదియు లేదు. నాకు లేనిది కాని, కావలసినది గాని లేదు. కాని నేను కర్మలు విడనాడుటలేదు. చేయుచునే యుందును. నేను నిత్యము జాగరూకుడనై కర్మలు చేయకుండిన జనులును నా మార్గముననే అనుసరింతురు. (గీత. III. 22, 23).

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥

—గీత. III. 34.

ఇది శ్రీకృష్ణుని యభిమతము. కావుననే నొక్కి వక్కాణించినాడు. సర్వకాల సర్వజనా భీష్టమునకు సందేశముగా నొసంగబడిన సూత్రము. విశ్వకళ్యాణమునకు పరమాత్మ శుభాశీస్సు. చకితహృదయులకు శాంతినొసగు హితవాక్కు. అభ్యుదయ కేంద్రస్థానములకు ఆయువుపట్టు. మతావశ్యకత, మతసమన్వయమునకు ఒక జ్యోతి. విరోధశక్తులకు తమ యారాటము పొసగ వీలులేకుండ, చెప్పబడిన గంభీర నినాదము. ఒక్క అర్జునుడే గాక మనమందరమును స్వధర్మనిరతులమై యుండుటయే జీవిత యాశయమని త్రికరణశుద్ధిగా తేల్చిన కార్యవాది.

చివరకు పార్థు నుద్దేశించి యిట్లు పలికెను. ''నాయందు మనస్సు నిలుపుము. నాకు భక్తుడవు కమ్ము. నన్ను పూజింపుము. నాకు నమస్కరింపుము. సమస్త ధర్మములును పరిత్యజించి నన్నే శరణుబొందుము. నేను సమస్త పాపములనుండి నిన్ను విడిపింతును. నేను ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. (గీత. 18-65-66.) భక్తులలో నగ్రగణ్యుడైన ప్రహ్లాదుని జీవితము భగవానుని అపారదయకు తార్కాణము, గాన ఆ మహామహుని దయ అనంతము. భక్తులు వారివారి స్వధర్మానుష్ఠానమే అంగీకరణమార్గమే గాని పరధర్మ స్వీకరణ గొప్పది గానట్లు నిరూపించి తన విధ్యుక్తధర్మమును గంభీరసూక్తులతో మనకు బోధించియున్నాడు.

మోక్షము సర్వప్రాణులకు జన్మహక్కు.
ధర్మస్య విజయోఽస్తి
ఓం తత్సత్

# గోలప్‌మా

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు

శ్రీ రామకృష్ణుల శిష్యురాండ్రలో శారదా మాతకు నతిసన్నిహితగ నుండి, యామెతో వ్యవహరించుచు, చిత్తశుద్ధిని జపసిద్ధినిగాంచి, యిదియే కడపటి జన్మయని శారదామాతచే ప్రశంసింపబడిన శ్రీ గోలప్‌మా. ఈ గోపాల సుందరాదేవి కలకత్తానగరమున నుత్తరదిశ యందు శిథిలమగుచున్న యొకానొక యింటిలో వాసముచేయుచుండిన నడివయస్సుగల బ్రాహ్మణ వితంతువు. ఈమె గొప్ప బ్రాహ్మణ కుటుంబమునకు జెందినది. ఈమెకు జిన్ననాటనే భర్తృవియోగము కలిగెను. ఆమె కొక్కతెయే కుమార్తె. ఈమెను గొప్పవానికిచ్చి వివాహముచేసినది. ఆమెయు జనిపోవుటవలన దుఃఖసముద్రమున మునిగియుండెను. ఇరుగు పొరుగు వార లామెనుజూచి, "ఆ దుఃఖితయగు బ్రాహ్మణవితంతు"వను పేరుతో పిలుచుచుండెడివారు. యోగీమా, యామె పొరుగున నివసించుచు, నామె దుర్భరావేదనను గ్రహించి, యామెను దక్షిణేశ్వరమున రామకృష్ణులచెంతకు దోడ్కొనివెళ్లెను. శ్రీవారిని దర్శించి వారికి దనకడుపులోని దుఃఖము సర్వమును వెలిబుచ్చుకొనెను. అంత, గురుదేవులానందభావమున నుండి, యామెతో నిట్లనిరి: "నీ వదృష్టవంతురాలవు, ప్రపంచమున నావారనుకొని పిలుచుట కన్యులెవ్వరును లేని (దిక్కులేని) వారలకు దేవుడే సాహాయ్యపడు"ననుచు, నుపశమనవాక్కు లాడగ, శ్రీవారి వాక్కు లామెలో నుత్తేజమును గలుగజేసినవి; ఆమెకు శాంతిని సమకూర్చినవి.

పరమహంస దేవులు 1885 సంవత్సరమున నొకనాడు తన యింటికివచ్చి, తనగృహమును పావనముజేయబోవుచున్నారని విని, యామె యెంతయో సంబరపడెను. ప్రక్కనున్న భక్తుని యింటికి, శ్రీవారు రాగనే వారు తన యింటికి వచ్చుచున్నారను నాత్రతతో ఇంటిలోనికిని వీధిలోనికిని వెళ్లుచువచ్చుచునుండెను. గురుదేవులకు దనయింట స్వాగతమిచ్చుట కామె మిక్కిలి బీదరాలు. ఐన నామెయు, నామె సోదరియు నా మహనీయునికి దగిన మర్యాద చేయుట కేర్పాట్లు జరుపుచునే యుండిరి.

గురుదేవులు తనయింట గాలుపెట్టగనే యా దుఃఖితయగు బ్రాహ్మణ వితంతువు మైమరచి యానందాబ్ధి నోలలాడుచుండెను. ఆమె తన యుద్రేకము నాపుకొనలేక గురుదేవులతో నిట్లు వాపోయెను. "నే నీ యానందమును భరింపలేక యున్నాను. నా కుమార్తెయగు చండి యత్తవారింటనుండి తన గౌరవార్థమై పంపబడిన రక్షకులతోను, లంపతాలతోను నాయింటికి వచ్చినప్పుడు నా బీదగృహము క్రొత్త జీవముతో నిండెను. అప్పుడైనను నే నింత సంబరపడలేదు. నాస్థితి యిప్పుడు బీదవానికొక 'లాటరీలో' లక్షరూపాయలు వచ్చినవన్న శుభవార్తవినినంతనే మరణించునట్లున్నది. నిజముగా నాతడు మరణించెను. నామనస్స్థితియు నటులనేయున్నది. నన్నాశీర్వదింపుడు. లేనిచో నే నిప్పుడే మరణించుచున్నాను," అనుచు నామె గురుదేవులయందలి భక్తి పారవశ్యముచే గొయ్యవారి నిలిచెను. ఇంకను గురుదేవులు ఆథిత్యము సేవించుటకు బనులు మిగిలి యుండుటచే, ఆమె సోదరి తన్ను బిలుచుచున్నను, సోదరిమాట లామె చెవులకు వినబడలేదు! శ్రీరామకృష్ణు లీ సోదరీమణు లిద్దరను జూచి

వారిభక్తి శ్రేయయు మెచ్చి, దక్షిణేశ్వరమున వారినిగూర్చి భక్తులకడ నెంతయో ప్రశంసించెను.

గురుదేవు లానెను శారదాదేవికి, "ఈ బ్రాహ్మణస్త్రీని భద్రముగా కనిపెట్టుము, ఆమె నీ కూడ నుండిపోవు"నని. పరిచయము సేసిరి. గురుదేవుల పరిచర్యాలాభమునకై గోలప్‌మా దక్షిణేశ్వరాలయమునందే, శారదాదేవితో సహవాసం దప్పుడప్పుడు కాలక్షేపము చేసెడిది. దక్షిణేశ్వరమునందు, శ్యామపకూర్ నందు, కాశీపురోద్యానమునందు శ్రీ వారిచరమావస్థయందు గురుదేవులకు సేవచేయు భాగ్య మామెకు గలిగెను.

"సత్యం బ్రూయాత్ ప్రియంబ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియం," అను వాక్యమును గోలప్‌మా గుర్తింపక, ఆమె యెవరినీ సరకుచేయక, తన కతీతమైన భక్తి, శ్రద్ధ గౌరవ ప్రపత్తులుగల శారదామాతయొద్దగూడ గష్టములు కలుగునని తెలియని యమాయకత్వముతో సత్యవాక పరిపాలన జేసెడిది. శ్రీరామకృష్ణు లొకపర్యాయము జబ్బులో నుండి పాలపథ్యముననుండగ, శారదాదేవి రామకృష్ణులకు తెలియకుండగ నెక్కువ పాల నిచ్చుటకై పాలను మట్టియూడలవలె చిక్కనగగాచి, మూడురు శేరులపాలను గురుదేవులచే గ్రహింపజేయుచుండెడిది. రామకృష్ణు లను మానించి, యాగాలలో పాలము దాను గ్రోలు పాలెన్నియని యడుగుచుండెడివారు. ఎవ్వరును నిజమును జెప్పరైరి. కాని పరిస్థితుల నెరుగక గోలప్‌మా రెండు పర్యాయములు రామకృష్ణులతో నిజమును జెప్పెను. అన్ని పాలను దాను త్రాగుచున్నట్లు వినగనే, జళుపుచే, శ్రీ గురుదేవున కజీర్ణము చేసెడిది. అంత శారదామాత గోలప్‌మా నాహారవిషయమున నసత్యమాడినను దోసములేదని బుజ్జగించెను.

గోలప్‌మాతో రామకృష్ణు లొకసారి తన భోజనమును పట్టుకొని రమ్మనిరి. ఆనాటినుండియు దనకుగాని ధర్మమును దనపైనుంచుకొని గోలప్‌మా ప్రతిదినమును రామకృష్ణులకు భోజనమును తానే తెచ్చుచుండెడిది. శారదాదేవి రామకృష్ణులకు భోజనము దీసికొని వెళ్లి రామకృష్ణులచే నారగింపజేయించు సమయమే, శ్రీవారి నామె దర్శించు సమయము. కాని రెండు మాసము లిట్లు జరిగినను, శారదాదేవి కా సదవకాశ మొక్కపర్యాయమైనను కలుగదాయె. దీనిని తెలిసికొని, శ్రీరామకృష్ణులు గోలప్‌మాను వారించి, శారదాదేవి కెప్పటి సౌకర్యము గల్పించెను.

అట్లే గోలప్‌మా సాయంకాలమునుండి, రాత్రి పదిగంటలవరకు శ్రీరామకృష్ణులసన్నిధి నుండుట జరుగుచుండెను. ఈ కారణమున గోలప్‌మా భోజనమునకు వచ్చువరకు, నే పిల్లియు నామెడగు భోజనమును ముట్టుకొనకుండ శ్రీశారదాదేవి చూచుచుండెడిది. ఒకనాడు శారదామాత 'నే నిక్లెంతకాలము కనిపెట్టుకొని యుండగలను? కుక్కైన, పిల్లియైన ముట్టుకొనిన ముట్టుకొననిం'డని విసుగుకొనుచుండుట శ్రీరామకృష్ణుల చెవులబడినది. వెంటనే శ్రీరామకృష్ణులు గోలప్‌మా నీ విషయమై బుజ్జగించిరి. ఆ రామకృష్ణుల మాటల నాలించి, గోలప్‌మా తనలోపము తెలిసికొనలేక, శారదామాత తన్ను గూతురుగా ప్రేమించుచున్నదనియే యనెను.

శ్రీరామకృష్ణులు పంచవటియందు ఆధ్యాత్మిక సాధన జేసినప్పుడు, శ్రీవారికి సీతాదేవి దర్శనమిచ్చినది. అప్పుడామె చేతుల వజ్రపు

పోళ్లతోనున్న బంగారు కంకణముల నామె ధరించినట్లు ద్యోతకమైనది. గోలప్‌మాతో నొకసారి శ్రీరామకృష్ణులు శారదాదేవి కేవలము సరస్వతీదేవి యంశమనియు, ఆమె యితరులకు జ్ఞానదీప్తినిచ్చుననియు ప్రసంగవశాత్తు చెప్పెను. ధనమునుముట్టని త్యాగియైనను, శారదామాత స్త్రీయగుటచేతను, అర్ధాంగి యగుటచేతను, సరస్వతీస్వరూపిణి యగుటచేతను, సీతా మహాలక్ష్మికివలె నామె నలంకరించుటకై, హృదయునితో చెప్పి, యామెకు బంగారుగాజుల జతలు మొదలగు నాభరణములను తయారుచేయించెను. శ్రీరామకృష్ణులు విరాగియని తెలిసియు, విషయముల నన్నింటిని గుర్తించియు, నామె భక్తి, ప్రేమలతో ఆ నగల నలంకరించుకొనెను. మణిమోహానుని తల్లి శ్రీరామకృష్ణు లెంతటి విరాగియైనను, శారదా శ్రీమాత దుద్దులజతలను ఇతర బంగారు నగలను ధరించినది; ఇది బాగుండునా యని, మణిమోహానునితల్లి తనతోనన్నదని అనవసరపుపనిలో జోక్యము పుచ్చుకొను శారదాదేవికడ గోలప్‌మా అధిక ప్రసంగము చేసెను. నాటిరాత్రియే, శారదామాత తన చేతిగాజులజతలను దప్ప మిగిలిన యాభరణములను తీసివైచెను. ఉదయమున, యోగిన్‌మా మొదలగు వా రిదిచూచి, శారదామాతచే నేవియో కొన్ని ఆభరణములను పెట్టుకొనునట్లొప్పించిరి.

1885 సంవత్సరము ఆకరున కర్కటక వ్రణమువలన శ్రీరామకృష్ణులు బాధపడుచున్నప్పుడు, భక్తులు శ్రీవారి వైద్యమునకై విడిదిని దక్షిణేశ్వరమునుండి శ్యామపకూరునకు మార్చిరి. శారదామాత దక్షిణేశ్వరముననే యుండుట తటస్థించెను. ఇట్లు రామకృష్ణులవ్యాధికై శారదామాత హృదయము దుఃఖనిమగ్నమైయుండ, సత్యము దెలియక, శారదామాతతోగూడి శ్రీవారికి పరిచర్య జేయుచున్నను, అమాయకురాలగు గోలప్‌మా, యోగిన్‌మాతో గురుదేవులు శారదామాతచే చీకాకును పడలేక దక్షిణేశ్వరము నుండి స్థానమును మార్చిరనెను. ఈ మాట శారదామాత హృదయమునకు శూలమువలె గ్రుచ్చుకొనెను. ఈ దుర్భరవేదనచే శ్రీమాత కలకత్తా వెళ్లి, కంట దడిపెట్టుకొనుచు గోలప్‌మా యన్న మాటలలోని సత్యమేమి యని గురుదేవులను బ్రశ్నించెను. గురుదేవు లది యసత్యమని యామెను శాంతపరచెను. గురుదేవు లంతట గోలప్‌మాకు గబురుజేసి యామె యొక్క యవకతవకమాటలకు, నపోహలకు నామెను తీవ్రముగా మందలించెను. గోలప్‌మా వెంటనే పశ్చాత్తాపముతో దక్షిణేశ్వరమునకుబోయి, యేడ్చుచు మాతను క్షమాపన వేడెను. ఎవరినీ ద్వేషింపని యాతల్లి యొక్క మాటతో నావిషయమంతటికిని నవ్వివైచి, ముమ్మారు గోలప్‌మా వీపునుతట్టి, యామెకు దుఃఖోపశమనము గలిగించెను.

ఇట్టి విషయములను గోలప్‌మాయందు జూచి చూచి శారదామాత, 'సత్యవ్రతము పేర దన సున్నిత భావములను గోల్పోయి, యితరుల సున్నితమగు భావములను నొప్పింపక తానొవ్వక తప్పించుకొని తిరుగవలె' నని యామెకు బోధించెను.

శ్రీ రామకృష్ణులు కర్కటకవ్రణబాధతో నున్నపుడు, వారి జబ్బు నయము జేయుంచుటకై గోలప్‌మా తనకు దెలిసిన యొక గొప్పవైద్యుని యొద్దకు సలహాకై శ్రీవారిని తీసికొనివెళ్లెద ననియె. వెంటనే రామకృష్ణులు చిన్న పిల్ల

వానివలె నానాదేశములలో నామె నూట లాలిం
చిరి. మరునాటి దినమున నుదయ మా వైద్యుని
యొద్దకు పడవలో దక్షిణేశ్వరమునుండి కల
కత్తా కామెయు, కాళీ, లాటూ, శారదా -
రామకృష్ణులు కలిసి వెళ్లిరి. వైద్యునిసలహాను
పొంది, తిరిగి వచ్చునప్పుడు వారి కందఱకు
జాల ఆకలి వేసెను. భక్తులెవరివద్దనైనను
డబ్బులున్నవాయని. గురుదేవులు ప్రశ్నింప,
వారెవరికడను కాసైనను లేదనిరి. గోలప్
మాయొద్ద అణామాత్రమే యుండెను. ఆయ
ణాలో దగ్గరనున్న యంగడిలో, కాళీ నేదియో
కొని తెమ్మని గురుదేవులు చెప్ప, నాత డంగ
డిలో నాయణాతో నేదియో తీపి పదార్థమును
కొని, గురుదేవుల కిచ్చెను. అంత నందరు
నాశ్చర్యపడునట్లుల వచ్చినదంతయు దా నార
గించి, యంత గంగోదకమును గ్రోలి, శ్రీరామ
కృష్ణగురుదేవుడు "ఆ! నాకు తృప్తియయినది"
దనిరి. గురుదేవు లట్లనుసరికి ముగ్ధులై
చూచువారందఱి యాకలి తీరినట్లయినది.
అది యేమియో తెలియదు గాని యందరు
సంతుష్టులైరి. దేశ, కాల భేదములతో సంబం
ధము లేదు గాని, యేసుక్రీస్తు, శ్రీకృష్ణాది
అవతార పురుషులవలెనే, యీ గొప్ప యోగి
పుంగవుడును దన యఖండ విజ్ఞానమునుపయో
గించి తానారగించుటచే, ఆకలిగొన్నవారిని
తృప్తిపరచెను. ప్రకృతి నుపాసించు వారలకు
దాని రహస్యములు స్పష్టములే.

శారదామాతతో బహు సన్నిహితముగ
నుండిన గోలప్‌మా రామకృష్ణులు మహా
సమాధి గాంచినంతనే, శారదామాతతో గాశీ,
యయోధ్య, గోకులము మొదలగు తీర్థయా
త్రలు జేసి, బృందావనము జేరి యచ్చట తపస్సు
చేయుచుండెను. తర్వాత శారదామాతను జేరి,
యామెతోడ కమార్పకూర్ వెళ్లెను. ఇచ్చట
శారదామాత తిండికిగూడ ననేక కష్టములు
పడుచుండెను. ప్రయాణసమయమున వీరు
డబ్బులేక కాలినడకనే వచ్చి చేరిరి. త్రోవలో
తల్లి యాకలిబాధతో నున్నపుడు, గోలప్‌మా
తన చేతులతో వంటనుజేసి యామెకు భోజ
నముపెట్టెను. అట్లా వంట నారగించి, అమృ
తమువలె నున్నదని యెన్నియోసార్లు శారదా
మాత ప్రశంసించెను.

గోలప్‌మా యెంత యుద్రేకపూరితము
గను, గుండ బ్రద్దలుగొట్టినట్లును ఇతరుల మొగ
మున మోటుగ మాట్లాడినను ఆ శారదామాత
యందు నిష్కపటముగను, సాక్షీగను, ఉన్నది
యున్నట్లుగను మాట్లాడెడిది. శ్రీరామ
కృష్ణులు చెప్పినట్లు, ఆమె అంతఃకరణము శుద్ధ
మును, ప్రేమపూరితమును. ఈమెయందు
చిత్తశుద్ధిని, జపసిద్ధిని గాంతుము. భక్తులు
అనేకులు భక్తియను పేర శారదామాతయొద్ద
చేయుచుండెడి తెలివితక్కువ చేష్టల నీమెయడ్డు
కొనియెడిది. శారదామాత యితరులతో మా
ట్లాడుటకు సిగ్గుపడునదగుటచే, నీమె యామె
యొద్ద పెద్దగనుండి, పరులతో మాట్లాడుచు,
నామెకు నండగను, రక్షగను నుండెడిది.

ఆమె జీవితము సామాన్యముగ గనబడి
నను, బూర్తిగ భగవత్పరముగ నుండెడిది.
నితరులనుండి సేవలు గొనుట కెంత విముఖ
ముగ నుండెడిదో, యంతకుమిన్నగ నితరులసేవ
చేయుటకు సుముఖముగ నుండెడిది. అట్టి
యవకాశ మెంతమాత్రము చిక్కినను దానిని
బోనిచ్చెడిదికాదు. ఈ సేవచేయుట యామె
కెంతమాత్రము కష్టము కలిగింపని నైసర్గిక
స్వభావమైనది.

నీలాటరేవున నే స్థలమునందైన నశుభ్రత

గాంచినచో, నామె చిరుగుగుడ్డలతో దాని నెత్తివైచి, యాస్థలమును నీటితో శుభ్రపరచెడిది. బృందావనమునందుండగ, దేవాలయమునం దొకచోట నొక బిడ్డడు మలినముచేసిన స్థలమును జూచెను. ఆ స్థలము నెవ్వరును శుభ్రపరచరైరి. ఆమె దానినిజూచినవెంటనే, తానే శుభ్రపరచెను. ఇదిచూచిన వార లా స్థలమును గోలప్‌మా బిడ్డడే పాడుచేసెననుకొనిరి. కాని ప్రక్కవారిభావమునుగ్రహించి, యామెకు బిడ్డలు లేరనియు, నామె పవిత్రజీవియనియు, నిట్టి సేవ లద్భుతముగ జేయుననియు కొనియాడిరి.

దౌహిత్రునివలన ఆమె ఏకొద్దియో భృతిని సేకరించుచుండెడిది. దానిలో సగమునుమాత్రమే తన స్వంతమునకు ఖర్చుపరచుచు, మిగిలిన సగమును దిక్కులేని బీదలకు ధర్మముచేసెడిది. ఆమె దర్శనభాగ్యముగల ప్రతి బీదవానికేదియో తృణమో పణమో ముట్టుచుండెడిది. బీదలు జబ్బుగ నున్నట్లు తన చెవిని బడగనే, ఆమె వారి వైద్యవిషయమున దోడ్పడెడిది. నిజమగు నాధ్యాత్మిక జ్ఞానముచే నామె హృదయ వికాసము, విన్యాసముగల్గి వర్తించెడిది.

గోలప్‌మా యొకసారి యుద్బోధనాలయమునందలి స్నానాలగదిని శుభ్రపరచి, పిమ్మట గంగాస్నానమును జేయకయే, బట్టలనుమార్చుకొని, పండ్లు, ఫలములను శుభ్రపరచి, వానిని నివేదనకై యాయత్తపరచెను. అంత దానిని జూచి, నళినియను స్త్రీ, గోలప్‌మాతో ''ఇది యేమిటి? వెళ్లి, గంగాస్నానముచేయు''మనియె. గోలప్‌మా 'నీకు గావలసినచో, నీవు గంగాస్నానముచేయు'మని నళినితో ననియె. ఈ విషయమై నళిని శారదామాతతో బ్రసంగింప, మాత, గోలప్‌మా చిత్తశుద్ధిని ప్రశంసించుచు, గోలప్‌మావంటి చిత్తస్థాయిగలవారు బాహ్యశుద్ధికై యెక్కువసరకు చేయరనియు, నట్టి చిత్తశుద్ధిగలవారు, శుద్ధబ్రహ్మస్వరూపులేకాన, నెఱుకను, నాత్మజ్ఞానమును బొందుదురనియు నిది గోలప్‌మాకు దుది జన్మమనియు జెప్పెను.

శారదామాత కామారిపుష్కరమున లేమిచే నుప్పునకుగూడ కరవై బాధపడుచుండుటను గోలప్‌మా వినినంతనే, ఆమె భక్తగణములో బ్రబోధమును జేసి, చందాలను వసూలు చేసెను. శ్రీమాతను కలకత్తాకు రప్పించి, యామెకు స్థావర మేర్పరచెను; శారదానంద స్వాములు శ్రీమాతృరక్షణకు పూనుకొనునంతవరకు తానే సర్వవిధముల మాతను ఆదరించుచుండెను. శ్రీరామకృష్ణుల యాశీర్వాదమునుబొంది శారదామాత పరిచయమైననాటినుండి, యామె 1920-వ సంవత్సరమున పరమపదించిన ముప్పదియారు సంవత్సరములపర్యంత మహర్నిశము శ్రీమాతృసేవజేసి, యామెతో నానందాబ్ధి నోలలాడుచు, నామె మన్నన గాంచిన ధన్యజీవి గోలప్‌మా.

1924 సంవత్సరమున గోలప్‌మా శారదామాతృగృహమున పరమపదించెను. ఆమెను జూచుభాగ్య మబ్బినవారలందరకు ఆ భక్తిమార్గము గొప్ప యాదర్శమయ్యెను. చిన్ననాటినుండియు కష్టములవలన దుఃఖితయని పేరువడసిన, గోలప్‌మా, తన యాధ్యాత్మిక సాధనచే లబ్ధమైన భూమికనుండి, తనవంటివారలెందరకో దుఃఖహారిణియై, యానందము, సంతోషము నివ్వగలిగెను. శ్రీరామకృష్ణుల స్పర్శచే సాధువుగామారిన యామె జీవితము భక్తి, గౌరవ ప్రపత్తులతో చిరస్మరణీయమై యున్నది.

# మహమ్మదీయ వేదము

శ్రీ దేవరకొండ నారాయణశాస్త్రి

ధర్మతత్త్వజిజ్ఞాసువులకు, పరమార్థాన్వేషకులకు సర్వమతముల సారమును గ్రహించుట తొలికర్తవ్యము. శ్రీమచ్ఛంకరాచార్యులు, శ్రీరామకృష్ణ వివేకానంద కేశవచంద్రసేనులు, శ్రీ అరవిందులు, శ్రీ గాంధిమహాత్ముడు మున్నగు మహాపురుషులు అనుసరించిన మార్గమిది. కావున, మనముగూడ వారి దారినే నడచుట శ్రేయస్కరముగదా. ప్రస్తుతము, మన పొరుగువారై సోదరసమానులై యున్న మహమ్మదీయుల మతగ్రంథమగు కురానును గూర్చి తెలిసికొన యత్నింతము.

మనకు వేదము లెట్టివో మహమ్మదీయులకు అట్టిది కురాను షరీఫ్. మనకు మంత్రద్రష్టలైన మహర్షులవంటివాడు మహమ్మదీయులకు మహమ్మదు పైగంబర్. 'జిబ్రీల్' అనబడు దేవదూతద్వారా భక్తుడగు మహమ్మదునకు భగవంతుడు వినిపించిన సందేశమట కురాను. ఈ విషయమై మహమ్మదుయొక్క సంగ్రహజీవితమున నిట్లు వ్రాయబడియున్నది :—"జిబ్రీలాతని మనోనయనమునకు సాక్షాత్కరించినపుడెల్ల మహమ్మదు మూర్ఛనొందుచుండెను. ఆతని మొగమును కన్నులును ఎఱ్ఱబాఱుచుండెను. ముచ్చెమటలును పోయుచుండెను. ఆ సమయమున నతడు ఒడలినిండ దుప్పటి కప్పుకొనియుండ, ఆతనినుండి జిబ్రీలు దేవుని సందేశమును పలికించుచుండెను......ఆతని పూర్వచరిత్రమును సద్వర్తనమును నెఱిగియుండిన వారొక్కరొక్కరుగ నాతడు మూర్ఛావస్థనుండి పలికిన మాటలను వ్రాసికొని యుంచుచుండిరి. ఈ వచనముల సంహితయే కురాను షరీఫను గ్రంథము." †

మన వేదశాస్త్రములవలెనే వారి వేదమును 'దేవుడు ఒక్కడే. ఆతడు శాశ్వతుడు. అజుడు, అనంతుడు, సృష్టిస్థితిలయకర్త, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వశాసకుడు, క్షమాదయాది సద్గుణ నిధి' అని వచించుచున్నది. కాని, విగ్రహారాధనను నిషేధించుచున్నది. "ప్రతిమా స్వల్పబుద్ధీనాం" అని మన పెద్దలుగూడ నుడివియుండుటవలన నయ్యది గొప్ప తప్పుగా నెన్నజాలము. కురానునందును దైవప్రార్థనము, ధ్యానము, అనాథసంరక్షణము, భిక్షము - లేక దానమిచ్చుట, అన్యాయముగా నితరులకు హాని చేయకుండుట మొదలగు సదాచారములు కర్తవ్యములుగా విధింపబడియు—మోసము, వ్యభి

† ఈ వ్యాసమునందు జూపబడిన కురాను వచనములన్నియు అనంతపురము రాజకీయ కళాశాలయందు ఆంధ్ర కర్ణాటక గీర్వాణభాషాధ్యాపకులుగా నుండిన శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావు (ఎమ్. ఏ., పి. హెచ్. డి., ఎల్. టి.) గారిచే ఆంధ్రీకరింపబడిన 'కురాను షరీఫ్' అను గ్రంథమునుండి కైకొనబడినవి, మహమ్మదుయొక్క జీవితచరిత్రయు అందలిదే.

చారము, దొంగతనము, జూదము, సురాపానము, తప్పుడు వర్తకము మున్నగు పాపకర్మములు నిషిద్ధములయ్యు నున్నవి. కర్మసిద్ధాంతమును, పునర్జన్మ సిద్ధాంతమును సంపూర్ణముగా అంగీకరించుచున్నది కురాను. అముఖ్యములగు కొన్నివిషయములలో దప్ప దక్కిన విషయములలో మన శాస్త్రములకును, కురానునకును పరస్పర వైరుద్ధ్యమేమియు లేదు. వానిని బోల్చిచూపవలయునన్నచో ప్రత్యేకముగా నొక గ్రంథము వ్రాయవలసివచ్చును. కనుక, సౌజన్యముతో దద్గ్రంథమునే పఠించి గ్రహింప బఠితలకు నా మనవి.

ఇక, మతవ్యాప్తికై మానవకోటికి హానికరములగు యుద్ధములు సలుప దన్మతస్థులను బురికొల్పు వాక్యములు కురానునందుండుట గర్హింపదగినదని కొందఱి యాక్షేపణ.

నిజమే, "దేవునితో నితరదైవముల జేర్చువారు మీ కెచట కంటబడినను చంపివేయుడు. వారిని బట్టుకొని, వారిని ముట్టడించి, అన్నివిధములుగను వారికై పొంచియుండుడు. వారు నీ మతమును స్వీకరించి, ప్రార్థనలు సలిపి, విధింపబడిన భిక్షము నిచ్చినచో వారిని వారి దారిని విడిచిపెట్టుము." (10 కాండము. 9 సురా. 1 అధ్యాయము.) "వారి (అవిశ్వాసుల) తలలను, వ్రేళ్లకొనలను నఱికివేయుము." (9 కాండము. 8 సురా. 5 అధ్యా.) "దేవుని మతమే సర్వత్ర నెలకొనువఱకును యుద్ధము చేయుము." (9 కాం. 8 సురా. 5 అ.) ఇత్యాది వాక్యములు కురానునందు గొన్ని కనబడుచున్నవి. కాని, "మతవిషయమై మీతో యుద్ధముచేసి, మీ యిండ్లనుండి తఱిమివేయనివారిని న్యాయముగను, దయతోడను చూడవలదని యాతడు (దేవుడు) నిషేధింపడు. (28 కాం. 60 సు. 2 అ.) "అవిశ్వాసులు నీపై (మహమ్మదుపై) కుట్ర పన్ని, నిన్ను కారాగృహమున నుంచుటకును, లేదా నిన్ను చంపుటకును, లేదా నిన్ను దేశమునుండి వెడలగొట్టుటకును దలంచిరి. దీనిని జ్ఞాపకముంచుకొనుము. వారు కుట్ర పన్నిన దేవుడును బన్నెను. పన్నాగముల బన్నువారిలో దేవుడు గొప్పవాడు." (9 కాం. 8 సు. 4 అ.) "వారు మీ కెక్కడ కంటబడినను బరిమార్పుడు. వారు మిమ్మేయే చోట్లనుండి తఱిమివేసిరో యందుండి వారిని దఱిమివేయుడు." "వారు యుద్ధము నిలిపినయెడల దుష్టులపై దప్ప దక్కిన యన్నిచోట్లను శత్రుత్వమును గట్టిపెట్టుడు." (2 కాం. 2 సు. 24 అ.) "వారు సంధికి దిగినచో మీరును సంధికి దిగుడు." (11 కాం. 8 సు. 8 అ.) "ఓ మక్కా వాసులారా! మీకు దీర్పుగావలసినచో నిదిగో తీర్పు. మీరు పోరాటము మానినచో శ్రేయస్సు గలుగును. మీరు తిరిగి యారంభించినచో మేము నారంభించెదము." (9 కాం. 8 సు. 2 అ.) ఇట్టి కురాను వచనములబట్టియు, "మహమ్మదు క్రొత్తగా బ్రకటించుచుండిన యుపదేశములు అరబ్బీదేశములోని యప్పటి మతమునకు విరుద్ధములుగా నుండెను...కొంతకాలమునకు వీరివలన దమ మతమునకు ముప్పు వాటిల్లునని పూర్వమతాచారావలంబులనుకొని, మహమ్మదుతో జేరినవారి ననేకవిధముల బాధింపసాగిరి. వారా బాధలనన్నిటి ననుభవించియు దాము ప్రవక్తయని నమ్మిన మహమ్మదును వీడరైరి. ఇక దారిలేక యా దేశస్థులు వీరినందఱిని జంప నూహించిరి." "అతనిని (మహమ్మదును)

అతని శిష్యులను బాధలపాలుజేయుచుండిరి. తుదకు మహమ్మదును జంప గుట్రచేసి, ఆయుధ హస్తులై యాతని గృహముచుట్టును మూగిరి. రాత్రియంతయు నట్లుండి, తెల్లవారున నాతడు పైకివచ్చునప్పు డాతని నంతమొందింపవలెనని వారి యుద్దేశము. కాని, మహమ్మదున కీ కుట్ర యెట్లో తెలిసెను. ఆతడు లేచి తన మేనల్లు డగు అలీపై దన యాకుపచ్చని దుప్పటినిగప్పి, ఆతని నట్లే పరుండియుండుమని చెప్పి, ఒక కిటికీ ద్వారా యిల్లువిడిచి వెడలిపోయెను. అట్లాతడు పోయి తన ముఖ్యశిష్యుడగు అబూబకర్ ఇల్లు చేర, వారిద్దఱును గలసి యూరువిడిచి యొక కొండగుహలో దలదాచుకొనిరి. వీరు తప్పి పోయిరని విన్న కొరెయిషువారి కాగ్రహ మినుమడించి, మహమ్మదు తల నఱికి తెచ్చిన వారికి బహుమానమిత్తుమని ప్రకటించిరి.'' (మహ. చరిత్ర) ఇటువంటి మహమ్మదు చరిత్ర విషయములబట్టియు, పై సందేశము భగవంతునినుండి మహమ్మదునకు లభించుటకు గారణము కేవలము మతవ్యాప్తియే కాదనియు, ప్రతిపక్షుల భరింపరాని దౌష్ట్యమే యనియు నూహింపవచ్చును. ఎట్లన, ''జ్ఞానవంతుడవై దయాపరుడవై వారిని నీ ప్రభువు మార్గమునకు బిలువుము. అతిదయగలిగి వారితో వాదన జేయుము.'' (14 కాం. 16 సు. 16 అ.) ''వారు నీ మాటలను వినక వెనుదిరిగినను వారికి బోధించుచుండుట నీ నిర్మల విధియై యున్నది.'' (14 కాం. 16 సు. 11 అ.) ''భక్తిహీనులను కపటులను మన్నింపకుము. కాని, వారికి హానిచేయక యుండుము.'' (22 కాం. 33 సు. 6 అ.) ''నీ ప్రభున కిష్టమైనచో భూమిలో నున్నవారందఱును (నీ మతమును) విశ్వసించియే యుందురు. ఏమి! మనుష్యులను విశ్వాసులు కమ్మని నిర్బంధించెదవా?'' (11 కాం. 10 సు. 10 అ.) ఇత్యాది సదుపదేశముల ననుసరించి మహమ్మదు ప్రవక్త సాధుత్వముచేత మతప్రచారము చేయుచుండ, అతనిని అతని యనుచరులను నానాహింసల పాలుజేసి, అడవుల కొండల బట్టించుటయే కాక, వారినెల్లరను హతమొనర్చుటకుగూడ సాహసించిన యరబ్బుల కిరాతక చర్యలకు ప్రతీకారముగగాని, ఆత్మసంరక్షణార్థముగ గాని, నిర్బంధముచే నైనవారి నున్మార్గమునుండి మరల్చి సన్మార్గవర్తుల జేయుటకై గాని, మహమ్మదునకు పై భగవత్సందేశము వచ్చియుండవచ్చు.

''శ్లో॥ న సామ రక్షస్సుగుణాయ కల్పతే। న దాన మర్థోపచితేషు యుజ్యతే। నభేదసాధ్యా బలదర్పితా జనాః। పరాక్రమ స్త్వేవ మమేహ రోచతే। న చాస్య కార్యస్య పరాక్రమాదృతే। వినిశ్చయః కశ్చి దిహోపపద్యతే॥ (వాల్మీకి రామాయణము, సుందరకాండము,) అని హనుమంతుడు చింతించినట్లు, ‡ అనేక దురాచారములకు, అంధవిశ్వాసములకు వశీకృతులై రాక్షసతుల్యులైన యప్పటి అరేబియా దేశవాసులను సంస్కరించి, సత్పథానువర్తనులుగ జేయుటకు దండోపాయము మాత్రమే ప్రయోజనకారియై యుండుట సంభవించియుండవచ్చునని భావించుట కభ్యంతరమేమి?

''అసాధుం సాధునా జయేత్'' అను విదుర

‡ మహమ్మదు జననకాలమునను, దత్పూర్వమునను అరేబియాదేశమున మూఢవిశ్వాసములును, అనాచారములును నిండి తాండవమాడుచుండినట్లు ఉపోద్ఘాతమునుండి గ్రహింపగలము.

వచనము ననుసరించి, ధర్మోపదేశకుడు సామము చేత మాత్రమే దుశ్శీలురను ధర్మశీలురుగ జేయవలయును గాని, వారి వినాశమునకే హేతువగు యుద్ధము చేయుటయు, చేయించుటయు తగదని కొందఱు తలపవచ్చును. అట్టివారు "వినాశాయ చ దుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి" అను శ్రీకృష్ణ ప్రవచనమును లక్షింపదగును.

మఱియు, భగవంతుడు మహమ్మదునకు ఆ యుద్ధసందేశము నందజేయుటకు మహమ్మదు ప్రవర్తయు, అతని ననుసరించిన విశ్వాసులును శత్రువులవలన దుస్సహబాధల ననుభవించి, మహమ్మదీయ మతాశయముల మహత్త్వమునుగూర్చి సంశయచిత్తులు కానున్న యదనున అదియే సర్వప్రపంచ మనుసరింపదగిన యుత్తమ మతమని వారిచే భావింపజేసి, వారి యందు స్థిరవిశ్వాసము నెలకొల్పు నుద్దేశము గూడ ఒక కారణమై యుండవచ్చు. అనగా, ఆ వాక్యములు తన్మతస్తుత్యర్థకములును గావచ్చునని భావము,—"ఆ మహనీయుడు (శ్రీరామకృష్ణుడు) జన్మించి సాధన యొనర్చిన పుణ్యభూమియం దాతని పవిత్రనామమును నిలుపుటకై దోపిడిచేయుటకైనను సమ్మతింతును" అను శ్రీ వివేకానంద ప్రవచనము వలె,

అట్లుగాక, ఆ నుడువులు కేవలము స్వమత ప్రచార కారణముననే రణమునకు బ్రోత్స హింప నుపయోగింపబడినవే యైనను, ధర్మ ప్రబోధకములును, సర్వధర్మసమ్మతములును అగు ప్రవచనములు సమృద్ధిగాగల యీ ధర్మ గ్రంథమున గల ఆ వాక్యములు మృగాంకు నందలి మృగమువలె పరిగణింపదగినవి కావని నా యభిప్రాయము. శుభ్రాంశునందు గల శీతలప్రకాశమునా మచ్చనా, మనము ప్రధానముగా భావింపవలయు?

పూర్వాపరవిషయములను, సందర్భములను గమనించి, వానినన్నిటిని సమన్వయించుకొని సారాంశము గ్రహింపక, మక్కికి మక్కిగా ఆ వాక్యముల యర్థమును గ్రహించి, 'మా వేదము మతవైశాల్యసిద్ధికై యుద్ధముచేయ నుద్బోధించుచున్న'దని మహమ్మదీయులు ఆ బోధానుసారముగ వర్తింప యత్నించిరేని వారు పూర్తిగా దప్పుత్రోవబడినవారగుదురు. తదితర మతానుసారులును అటులనే ఆ వాక్యములబట్టి కురానునుగాని, తదనుసారులనుగాని, మహమ్మదు పైగంబర్‌నుగాని దూషింపక ఆ వేదసారమును స్వీకరించుట లెస్స.

అస్తు. క్రీస్తుభగవానునివలె శత్రువులు తన్ను చిత్రవధ చేసినను సహించి వారి శ్రేయమును గాంక్షించుటయా, లేక మహమ్మదువలె వైరులకు దగిన ప్రతీకారము సలిపి తన మతమును స్థాపించుటయా యేది ప్రవర్తధర్మము?

ప్రతీకారము నొనర్చుట సర్వసాధారణ ధర్మము. అప్రతికారము విశేషధర్మము. మహమ్మదు సాధారణ ధర్మమును, క్రీస్తు విశేషధర్మమును అవలంబించియుండిరి. "అపకారమును మఱచిపోవువారి పాపములును తొలగిపోవును." (6 కాం. 5 సు. 7 అ.) "తమకు గలిగిన యన్యాయమును సహించి క్షమించుటయే అనుల్లంఘనీయమగు విధి." (25 కాం. 42 సు. 4 అ.) ఇత్యాది విశేష ధర్మోపదేశములు సైతము మహమ్మదున కందినవి. కాని, తద్ధర్మము నాతడు పూర్తిగా అనుసరింపజాలకపోయెను. స్వశరీరమునుండి రుధిర ధారలు స్రవించుచుండ, మరణోన్ముఖుడయ్యు శత్రుమంగళార్థమై పరమప్రభుని ప్రార్థింపగలి

గిన ఆ మూర్తీభవించిన సహనమననొప్పు క్రీస్తుదేవునివంటివానికే విశిష్టధర్మానుసరణము సులభముగా నుండుట.

కాని, ప్రవక్తలలో తరగతులు గలవని "మేము పంపిన ప్రవక్తలలో గొందఱికంటె మఱికొందఱకు హెచ్చుజ్ఞానమును బ్రసాదించి యున్నాము." (బి వ కాం. ఆదివాక్యము) అను కురాను వాక్యమువలన దేలుచున్నది. కాబట్టి, సర్వజ్ఞుడగు జగదీశ్వరుడు ఎప్పుడు ఏ తరగతి ప్రవక్తను ఎచ్చటికి బంపి యే పని జేయింపవలెనో అప్పుడు ఆ తరగతి ప్రవక్తను అచ్చటికి బంపి ఆ పని జేయించును. లీలా ప్రియుడగు పరమేశ్వరుని చెయిదములు అత్యంత గంభీరములుగదా. "బహుశాస్త్ర గురూపాసనేఽపి సారాదానం షట్పదవత్." (సాం. సూ.) అను యనుభవజ్ఞుల సూక్తి ననుసరించి, శ్రీ రామకృష్ణాది మహనీయులవలె సకల మతశాస్త్రముల సారమును గ్రహించి, తదను గుణముగా బ్రవర్తింప సర్వేశ్వరుడు మనల సమర్థుల జేయుగాక.



ఒకడు నూయి త్రవ్వనారంభించినాడు. నాలుగైదు బారలలోతు త్రవ్వి నీరు గానక మఱియొక చోటును నిర్ణయించి అక్కడ ఇంకను లోతుగా త్రవ్వినాడు. కాని అక్కడను నీరు పడకపోవుటచే మఱియొక తావును నిర్ణయించి అక్కడ మఱింత లోతుగా త్రవ్వినాడు, కాని ఫలము కలుగ లేదు. తుదకు విసిగివేసారి ఆపనినే విడిచిపెట్టినాడు. ఈ మూడు నూతులలోతును కలిపిన పాతిక బారలకు కొంచెము తక్కువగానుండును. ఒకచోటు విడిచి మఱియొకచోట త్రవ్వనారంభించుటకుబదులు తాను బడిన శ్రమలో సగబాలైనను ఓపికతో మొదటి నూతికే వినియోగించిన పక్షమున వానికి నీరు లభించియుండెడిది. ఈ మతము కాదని ఆ మతము, ఆ మతము కాదని మఱియొక మతము—ఈ విధముగా మతధర్మములను ఊరక మార్చుకొనుచుండువారి విషయము కూడ నిట్టిదే. ఏదైన ఒక్క మతమును నమ్ముకొని దానినే శ్రద్ధాభక్తులతో సాధనచేసినయెడల తప్పక విజయము చేకూరును.

—శ్రీ రామకృష్ణ పరమహంస.



హహ మిత్యుపాసన మహంగ్రహోపాసనమితి భాష్యే॥'' కూటస్థాసంగచిద్రూప ప్రత్యగ భిన్న సచ్చిదానంద పరమాత్మరూపమైన పర బ్రహ్మమే నేననెడి ఉపాసనము అహంగ్రహో పాసనమని శాంకరభాష్యము.

''నిత్యనైమిత్తికైరేవ నియమేనేశ్వరార్పితైః। బహుజన్మకృతైర్విప్రః సత్త్వ శుద్ధిం సమ శ్నుతే॥'' అనేక జన్మాంతరములయందు నియ మముతో పరమేశ్వరార్పితముగ నిర్వర్తితమైన నిత్యనైమిత్తికాది స్వధర్మకర్మానుష్ఠానము చేతనే ద్విజు డంతఃకరణ పారిశుద్ధ్యమును బడయుచున్నాడు.

''నిత్యనైమిత్తికైరేవ కుర్వాణో దురిత క్షయః। జ్ఞానంచ విమలీకుర్వన్ అభ్యాసేనచ పాచయేత్। అభ్యాసా త్పక్వవిజ్ఞానః కైవల్యం లభతేనరః॥'' మానవుడు నిత్యనైమిత్తిక కర్మా నుష్ఠాన మూలముననే దురితక్షయమును గావిం చుచు అనగా చిత్తవృత్తులను క్షీణింపజేయుచు జ్ఞానమును విమలమొనరించుచు నిరంతర వేదాంతాభ్యాసముచేత జ్ఞానమును పరిపక్వము గావించుకొనవలయును. ఆ యభ్యాసముచేత జ్ఞానము పరిపాకమునొంది ఫలరూపమైన జీవే శ్వరైకత్వ విజ్ఞానము పురుషునకు సిద్ధించును. స్వాత్మవిజ్ఞానమువలన పురుషుడు కైవల్యమును బొందును అదెట్లన,...... ''నిత్యకర్మానుష్ఠానా ద్ధర్మోత్పత్తిః। ధర్మోత్పత్తేః పాపహాని స్తతశ్చిత్త శుద్ధిః। తతస్సంసార యాథాత్మ్యావబోధః।తతో వైరాగ్యం। తతోముముక్షుత్వం। తతస్తదుపా యపర్యేషణం। తతస్సర్వకర్మతత్సాధనసన్న్యా సః। తతోయోగాభ్యాసః।తతశ్చిత్తస్యప్రత్యక్ప్ర వణతా। తతస్తత్త్వమస్యాదివాక్యార్థపరిజ్ఞానం తతోఽవిద్యోచ్ఛేదః। తతస్స్వాత్మన్యేవావ స్థానమ్॥'' (నైష్కర్మ్యసిద్ధి, 1-135) ఫలము పరమేశ్వరార్పణమగు నిత్యనైమిత్తిక కర్మా నుష్ఠానమువలన గొంత కాలమునకు పుణ్యా స్వభావము కలుగును. ధర్మ-పుణ్య-స్వభావో దయమువలన పాపప్రవృత్తి నాశమగును. అం తట నిర్మలదర్పణమువలె చిత్తము పరిశుద్ధమై నిత్యానిత్య వస్తువివేక గ్రహణ యోగ్యమై యుండును. అప్పు డా పరిశుద్ధాంతఃకరణము నకు సంసారముయొక్క యథార్థరూపము గోచ రించును. అనగా సంసారము అనృతజడ దుఃఖము హేయమునని తెలియును. ఇదియే కదా సంసారముయొక్క యథార్థస్వభావము. ఇట్లుండ సంసారము అస్తిభాతి ప్రియము ఉపా దేయమునని తలంచుట చిత్తదోషమని తెలియ వలయును. సంసార యాథార్థ్యము తెలిసిన పిమ్మట నిస్సారమైన సంసారమునందు వైరా గ్యము జనించును. సంసారమునందు వైరాగ్య మంకురించిన యంతట, నిత్యమై శుద్ధమై సంవిద భిన్న పరమానంద రూపమైన మోక్షమునందు తీవ్రమైన ఇచ్ఛ పుట్టును. అంతట మోక్షో పాయాన్వేషణ ముపక్రమింపబడును. మోక్ష సాధనము నెఱింగి దాని నభ్యసించుటయందు సర్వకర్మములు ఆకర్మానుష్ఠాన సాధనములైన గృహస్థాశ్రమాదులును ప్రతిబంధకములుగా దోచి వాని నన్నింటిని యథాశాస్త్రముగ సన్యసించును. (సశేషము)

**సంపాదకులు:** శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు

శ్రీ కే. ఎస్. ఎన్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి, శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-3-52.

# శ్రీ రామకృష్ణ ప్రభ

౧౯౫౨, ఏప్రిల్—నందన, చైత్రము

సంపుటము ౮ సంచిక ౧౦





శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు
చెన్నపురి

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపబడును. ఒక వారము, పదిరోజులు దాటి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలైనెల నుండిగాని చందాదారులుగా చేరవచ్చును. ఇతర మాసములలో చేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులలో గాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవరకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య సూచింపుడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుకలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకు తెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను పంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూడు పుటలకు మించరాదు. ప్రతినెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకు బంపు గ్రంథములను, వినిమయముగా బంపెడి పత్రికలను "సంపాదకుడు, శ్రీరామకృష్ణప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగ బంపబడవలయునన్నచో దగు పోస్టేజి చేర్చి పంపవలయును.





# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ } ౧౯౫౨ - ఏప్రిల్ : : నందన - చైత్రము { సంచిక ౧౦



## ప్రార్థన

### వినయ పత్రిక

బ్రహ్మేంద్ర చంద్రార్క వరుణాగ్ని వసుమరుత యమ అర్చి భవదంఘ్రి సర్వాధికారీ।
అకళనిరుపాధి, నిర్గుణ నిరంజన బ్రహ్మకర్మ పథమేక మజనిర్వికారం।
అఖిల విగ్రహా ఉగ్రరూప శివ భూపసుర సర్వగత సర్వ సర్వోపకారం।
జ్ఞాన వైరాగ్య ధన ధర్మ కైవల్య సుఖ సుభగ సౌభాగ్య శివ సానుకూలం ॥

తదపి నరమూఢ ఆరూఢ సంసారపథ
భ్రమతభవ విముఖ తవపాదమూలం
నష్టమతి దుష్టఅతి కష్టరతం ఖేద గత దాస తులసీ శంభూ శరణ ఆయా
దేహికామారీ శ్రీరామపద పంకజే భక్తి భవ హరణీ గతభేదమాయా ॥

—శ్రీ తులసీదాసు

బ్రహ్మ, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, వరుణుడు, అగ్ని, వసువులు, మరుద్గణములు, యముడు, అర్చి, దేవతలందరు నీ శ్రీచరణసేవచే బ్రహ్మత్వము ఇంద్రత్వము మొదలగు శ్రేష్ఠములగు పదవులను బడసిరి. కాని, నీవు కలారహితుడవు, సంపూర్ణముగా ఉపాధిరహితుడవైన శుద్ధస్వరూపుడవు, సత్త్వరజాదిగుణములు లేనివాడవు. మాయలేని బ్రహ్మాద్వైతవస్తువవు, కర్మమార్గప్రవర్తకుడవు, అద్వితీయుడవు, జన్మవికారములు లేనివాడవు.

ఈ సమస్త బ్రహ్మాండము నీ శరీరము. ఓ ఉగ్రరూపముగల శివా! నీవు దేవతలకు రాజవు, సర్వవస్తువులందును ఇమిడియున్నావు, అన్నియు నీవే, అన్నిటికి ఉపకారముచేయు వాడవుకూడ నీవే. నీవు అనుకూలించిన జీవులు జ్ఞానము, వైరాగ్యము, ధనము, ధర్మము, కైవల్యసుఖము, సౌందర్యము, సౌభాగ్యమును పొందుదురు.

ఓ భవా! అజ్ఞానను మూఢనరులు, నీ శ్రీచరణారవిందములయందు విముఖులై ఈ సంసారముయొక్క జన్మమరణాదులనెడి మార్గము నారోహించి, భ్రమింతురు.

మతిచెడి, దూషీకృతహృదయుడై, కష్టపడి ఖేదముచెందిన తులసీదాసు శ్రీశంభుచరణముల నాశ్రయించుటకు వచ్చియున్నాడు.

ఓ కామారీ! శ్రీరామచరణపంకజములందు భేదబుద్ధియు, మాయయు లేనిదై యున్న భవహారిణీ భక్తిని ప్రసాదింతువుగాక.

---

ఫిబ్రవరి సంచికయందు ప్రచురింపబడిన ఓంకారవాచ్యమను శ్రీరామకృష్ణ స్తోత్రమును కీ. శే. శ్రీ యోగీశ్వరానందస్వాములవారు రచించిరి. శ్రీవారు అల్సూరు (బెంగళూరు) లోను, బేగంపేట (హైదరాబాదు) లోను శ్రీరామకృష్ణాశ్రమములను గట్టించిరి. 'ఓంకారవాచ్యము' చివర ప్రచురింపబడిన 'స్థాపకాయచ ధర్మస్య...' యన్న శ్లోకము శ్రీ వివేకానంద విరచితము.

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## కేశవచంద్రసేనునితో గురుదేవుని యంతిమ సమావేశము

(గతసంచిక తరువాయి)

శ్రీరామకృష్ణ గురుదేవుడు కొంతసేపటికి తన సహజస్థితికి వచ్చి కేశవునితో నవ్వుచు మాట్లాడుచుండెను. ఆ గదియందున్నవారెల్ల రును ఈయన ఏమిచెప్పుచున్నారా యని తీవ్రముగా గమనించుచుండిరి. చాలసేపటినుండి సంభాషించుచున్నను కేశవుని కుశలప్రశ్నము లడుగలేదుగదా యని వారందఱకును మిక్కిలి ఆశ్చర్యముగానుండెను. ప్రారంభమునుండియు కేవలము భగవానునిగూర్చియే శ్రీగురుదేవుడు సంభాషించుచుండెను.

శ్రీరామ:—(కేశవునితో) బ్రహ్మజ్ఞానులు (బ్రాహ్మమతస్థులు) భగవానుని మహిమల నింతగా వర్ణింతురేల? 'ఓ ఈశ్వరా! నీవు చంద్రుని సృష్టించితివి, సూర్యుని సృష్టించితివి, నక్షత్రముల సృష్టించితివి.'—ఇట్టి వర్ణముల వలని ప్రయోజనమేమి? వాని యవసరమేమి? ప్రజలనేకులు తోటనుజూచియే సంతోషింతురు. యజమానిని గలిసికొన బ్రయత్నించువారెందఱు? తోట గొప్పదా? యజమాని గొప్పవాడా? మద్యపానికి యంగడివానియొద్దనున్న మద్యపరిమాణముతో పనియేమి? ఒక్కసీసాతోనే వాని పని పూర్తియగును. నరేంద్రుని జూచినపుడు, 'ఓయీ! మీ జనకులెవరు? ఆయన కెన్నియిండ్లు గలవు' అని నేనడుగలేదు. ఇవన్నియు నెందువలననో తెలియునా? మానవుడు తనసంపదయందు గాఢానురక్తి గలవాడు. కావున నతడు భగవానుడును దన యైశ్వర్యమునందు ప్రీతుడై యుండునని తలంచును. కావున భగవదైశ్వర్యమును గొనియాడినచో ఆయన మిక్కిలిగా సంతసించునని యతని భావము. శంభుమల్లికుడు నాతో నిట్లుచెప్పెను: 'అయ్యా! నా యైశ్వర్యము సమస్తమును భగవత్పాదారవిందములకడ నర్పించి మరణించునట్లు మీరు నన్నాశీర్వదింపుడు.' అంతట నే నిట్లంటిని: 'ఇదంతయు నీకు ఐశ్వర్యముగ దోపవచ్చును. భగవానునకు నీవేమి సమర్పింపగలవు? ఆయన కిదంతయు తృణప్రాయము.'

మన విష్ణ్వాలయమునందలి నగలు దొంగలింపబడినపుడు మథురబాబును నేనును లోపలికి బోయితిమి. అంతట మథురబాబిట్లు వచించెను: 'ఛీఛీ! భగవానుడా! నీకే యోగ్యతయును లేదు. నీ శరీరముమీది భూషణములు దొంగలింపబడుచుండ నీవేమియు చేయజాలకపోయితివి.' తర్వాత నేను, 'ఇది యేమి ప్రలాపము? నీ వెవరి నగలని వాకొనుచున్నావో ఆ భగవానుని కంటి కివియన్నియు చిలిపిరాళ్లు. లక్ష్మి యెవని శక్తి? అట్టివాడు ఏదో జమలేని కొద్ది నగలు అపహరింపబడినవని తలంచి బెంగగొని

యున్నాడని తలంచుచుంటివా? ఇట్లనరాదు.' అని చెప్పితిని.

ఈశ్వరు డైశ్వర్యమునకు వశీభూతుడు కానేర్చునా? అతడు భక్తికే వశ్యుడు. ఆయనకు కావలయునది యేమి? సంపదకాదు—భావము, ప్రేమభక్తి, వివేకవైరాగ్యములు—ఇవియే ఆయన యభిలషించునవి.

ప్రతి మనుజుడును తన భావానుగుణముగనే భగవానుని గనుగొనును. తమోగుణియగు భక్తుడు దేవి మాంసమును భుజించుచున్నట్లు జూచును. కావున నతడు మేకను బలిగా నొసగును. రజోగుణియగు భక్తుడు వివిధాహార పదార్థముల దయారుచేసి నివేదనముచేయును. సాత్త్వికభక్తుని పూజయం దెట్టి యాడంబరమును గనుపింపదు. అతని పూజావిధానము నెవరును నరయజాలరు. పుష్పములు లేనిచో బిల్వదళములతోడను గంగాజలములతోడను తనపూజను ముగించును. పేలాలో బెల్లమో పెట్టి నివేదనము చేయును. వీలుపడినచో కొంచెము పాయసము వండి నివేదించును.

వీరేగాక త్రిగుణాతీతుడను మఱియొక భక్తుడు గలడు. అతనిది బాలకస్వభావము. భగవన్నామజపమే యాతని పూజ! కేవలము భగవన్నామము మాత్రమే!

(నవ్వుచు కేశవునితో) నీకు జబ్బుచేసినందులకు కారణము గలదు. నీ శరీరమునుండి వివిధ భావములు బయలువెడలుచున్నవి. అందువలననే నీకీయవస్థ. భావావస్థయందేమియు గోచరింపదు. చాలకాలము తరువాతనే శరీరమునకు దెబ్బగలుగును. పెద్ద పొగయోడ గంగలో బోవుచున్నప్పుడు ప్రారంభమున నేమియు మార్పు గనిపింపదు. కొంతసేపటికి గట్టుననున్న నీరు దభీదభీమని పెద్దపెద్ద కెరటములతో తాకుచుండును. కొన్నిసమయములందు గట్టుసయితము కొద్దిగా విరిగిపడుచుండును. అది నేను చూచియున్నాను. గుడిసెయందేనుగు దూరినచో నా గుడిసెను విరచి పారవైచును. భావహస్తి దేహకుటీరమును ప్రవేశించినపుడును నిదియేగతి సంభవించును.

ఏమగునో తెలియునా? ఎందైన నిప్పంటుకొన్నచో ప్రక్కనున్న వస్తువులన్నియును దగ్ధములగును. పెద్ద కలకలము చెలరేగును. జ్ఞానాగ్ని ప్రారంభమున కామక్రోధాది శత్రువర్గమును నాశనముగావించును. పిదప అహంభావమును నశింపజేయును. తర్వాతనో, శరీరముమీద తత్తరపాటును గలిగించును.

సమస్తమును అయిపోయినట్లు భావించుచున్నావు గాబోలు. కాని నీ వ్యాధియందేమాత్రము మిగిలియున్నను నిన్నాయన విడువడు. వైద్యశాలలో నీవు రోగిగా జేరినపక్షమున సంపూర్ణముగా నయమగువఱకును నీవు బయటికి రాజాలవు. నీ రోగములో ఏ కొంతమాత్రము శేషించియున్నను 'డాక్టరు' నీబహిర్గమనమునకు సమ్మతింపడు; సెలవొసంగడు. వైద్యశాలలో నెందుకు జేరితివి? (అందఱు నవ్విరి)

వైద్యశాల విషయము విని కేశవుడు మఱిమఱి నవ్వ నారంభించెను. నవ్వు నాపుకొనజాలకపోవుచున్నాడు. ఉండుండి మఱల నవ్వుచున్నాడు.

శ్రీరామ:—(కేశవునితో) హృదయు డిట్లు చెప్పువాడు: 'ఇట్టిభావమును జూడలేదు, ఇట్టి రోగమును జూడలేదు.' ఆ సమయమున నాకు చాల జబ్బుచేసెను. మాటిమాటికి విరేచనము లగుచుండెను. తలయందు లక్షలకొలది చీమలు కుట్టుచున్నట్లు బాధకలుగుచుండెను. కాని

రేయింబవళ్లు భగవత్సంబంధమయిన వాక్యాలాపముమాత్రము నిలిచినదికాదు. నాటాగడ నుండి రామవైద్యుడు చూడవచ్చెను. అపుడు నేను పదుగురతో భగవద్విచారము చేయుచుంటిని. అంత నతడు, 'ఇదేమి ఇతడు పిచ్చివాడా? ఇట్టి యస్థిపంజరమువలెనుండి విచారమెందులకు?' అనెను.

(కేశవునితో) అంతయు నీ (ఈశ్వరుని) యిచ్ఛయే.

సర్వమును నీ యిచ్ఛయే! తల్లి నీవు ఇచ్ఛామయివి.

నీ పనిని నీవు చూచుకొనెదవు. అమ్మా! లోకులు తామే చేయుచున్నట్లు భావింతురు. గులాబిమొక్క వేర్లమీద మంచుపడవలయునని తోటమాలి పాదుచేసియుంచును. మంచు వేర్లమీద పడినచో చెట్టు వృద్ధియగును. అందుచేత నే కాబోలు నీ వేరంతయుగూడ తీసివేసెను. (కేశవుడును గురుదేవుడును నవ్విరి.) నీవు మఱలివచ్చినపిదప గొప్పకార్యములు చేయుదువు కాబోలు.

నీకనారోగ్యముగా నున్నదని విన్నపుడంతయు నేను మిక్కిలిగా కలవరముచెందుదును. మునుపు నీకు జబ్బుచేసినపుడు నేను వేగుజామున లేచి విలపించువాడను. ఇట్లు ప్రార్థించువాడను. 'తల్లీ! కేశవున కేదేని విపత్తు కలిగినచో నే నెవరితో సంభాషింతును?' పిమ్మట కలకత్తాకు బోయినపుడు సిద్ధేశ్వరీ దేవ్యాలయమున లేత కొబ్బరికాయ పంచదారయు నివేదనముచేసి నీ యారోగ్యము నిమిత్తము మ్రొక్కుకొంటిని.

ఈసారి అంతగాలేదు. ఉన్నదున్నట్లు చెప్పుచుంటిని. రెండు మూడు దినములే చాల భయము కలిగినది.

ఇట్లు వారిరువురు సంభాషించుచుండగా తూర్పుదిక్కున కేశవుడు లోనికి ప్రవేశించిన గుమ్మమునందే యతని తల్లివచ్చినిలిచినది. అచ్చటినుండి ఉమానాథుడు 'అమ్మగారు మీకునమస్కరించుచున్నా'రని కేకలువేసి చెప్పెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు చిఱునవ్వు నవ్వెను.

ఉమానాథుడు:— కేశవుని యనారోగ్యము సరిపడునట్లు మీ రాశీర్వదింపుడని అమ్మగారు కోరుచున్నది.

శ్రీరామ:—సువచని, ఆనందమయి దేవిని ప్రార్థింపుము. ఆమె దుఃఖమును దొలగింప గలదు. (కేశవునితో) ఈ గృహమున చాల కాలము గడుపవలదు. స్త్రీలమధ్య నున్నచో సంసారమున నిమగ్నుడవగుదువు. భగవదాలోచనలు సలుపుచున్న యెడల నీవు బాగుపడుదువు.

శ్రీ గురుదేవుడు గంభీరముగా నిట్లు పలికి తదుత్తరక్షణముననే చిన్నపసిబిడ్డవలె నవ్వ నారంభించెను. (కేశవునితో) ఏదీ నీ చేయి చూపుమని చేయితీసికొని పసిబాలునివలె దాని తూకము చూచుచుండెను. పిమ్మట, 'లేదు, నీ చేయి తేలికగనే యున్నది. దుష్టునివలె బరువుగాలేదు.' అందఱును నవ్విరి. మఱల లోగిలి నుండి ఉమానాథుడు 'అమ్మగారు కేశవు నాశీర్వదింపుడని చెప్పుచున్నా'రని పలికెను.

శ్రీరామకృష్ణ గురుదేవుడు గంభీరముగా, 'అది నాకు సాధ్యమా! భగవానుడే యాశీర్వదించును. తల్లీ! నీపని నీవు చేసికొందువు. కాని మనుష్యులు తాము చేయుచున్నామను కొందురు.

'భగవంతుడు రెండుపర్యాయములు నవ్వును. ఇరువురు తోబుట్టువులు తమభూములను బంచుకొనదలచి త్రాటితో కొలుచుచు 'ఈభాగము నాది, ఆ భాగము నీది' యని పలుకునపు డొకమారు. ''ఇదిఅంతయు నా జగత్తు, దానిలో

కొంచెము మట్టితీసికొని 'ఇది నాది అది నీది' అంట'' అని నవ్వెను; మఱియొకమారు—రోగికి జబ్బు మరణాంతకమైయుండి తల్లి యేడ్చుచుండగా వైద్యుడువచ్చి 'భయమెందుకమ్మా! నేను నయముచేయుదు'నని పలుకునపుడు. వైద్యుడు భగవంతుడు చంపదలంచినవు డెవరును కాపాడజాలరని గుర్తింపడు.' (అందఱును నిశ్శబ్దముగా వినుచున్నారు.)

ఈ సమయముననే కేశవుడు చాలసేపు గుక్కబట్టి దగ్గ నారంభించెను. ఆ దగ్గు తగ్గలేదు. అందఱకును మనోవేదనగా నున్నది. కేశవుడిక నట నుండజాలక శ్రీరామకృష్ణ గురుదేవునకు సాష్టాంగనమస్కారముచేసి మిక్కిలి కష్టముతో మెల్ల మెల్లగా గోడనుబట్టుకొని తన గదిలోనికి బోయెను.

శ్రీరామకృష్ణ గురుదేవుడు బయలుదేరు ముందు కొంచెము ఫలాహారము నొసగిరి. ఆ సమయమున కేశవుని జ్యేష్ఠకుమారు డచట కూర్చొనెను. అమృతుడను నతడా బాలుని శ్రీరామకృష్ణగురుదేవునకుపరిచయముచేయుచు నతని నాశీర్వదింపగోరెను. అందులకు 'నే నాశీర్వదింపజాల'నని పలికి నవ్వుచు శ్రీరామకృష్ణ గురుదేవు డా బాలుని వీపున నిమిరెను.

అమృతుడు:—సరే, అట్లయిన మీరు శరీరమంతయు తడవుడు.

శ్రీరామ:—(భక్తులతో) నే నెల్లప్పుడును 'నీవు ఆరోగ్యవంతుడవు క'మ్మని చెప్పజాలను. అట్టి సిద్ధినిమ్మనికూడ దేవి నెన్నడును ప్రార్థింపను. 'అమ్మా! నాకు శుద్ధభక్తి ని' మ్మనియే నే నామెను వేడుకొనగలను.

ఇతడు (కేశవసేనుడు) సాధారణ మానవుడా ? ఇతడందఱిచేతను గౌరవింపబడును, ధనికులయినను సరియే, సాధువులయినను సరియే. దయానందుని జూచితిని. అతడు ఆయన తోటలో నుండెను. 'కేశవసేనా! కేశవసేనా' యని యఱచుచు నతడెపుడువచ్చునా యని యెదురుచూచుచుండెను. ఆరోజు 'వచ్చెదనని' కేశవుడు చెప్పెను గాబోలు. కేశవునకు హోమమునందును దేవతలయందును నమ్మకము లేకుండెను. అంతట దయానందు డన్నిరకముల సృష్టిజేసిన భగవంతుడు దేవతల మాత్రము సృష్టింపజాలడా' యని పలుకుచుండెను.

కేశవుని యశస్సును శ్రీరామకృష్ణ గురుదేవు డతని శిష్యులయెదుట ప్రస్తావించుచుండెను.

శ్రీరామ:—కేశవునకు కొంచెమయినను హీనబుద్ధిలేదు. (అతని శిష్యులతో) 'మీకెవరికయిన సందియములున్నచో అక్కడికి (దక్షిణేశ్వరమునకు) వెళ్లి తీర్చుకొనుడని చెప్పెడివాడు. నాకును అదియే స్వభావము. మనుష్యుల గౌరవాదరణలవలన నాకేమి ప్రయోజనము ? కేశవుని కీర్తి ప్రబలమగుగాక! అతడు గొప్పవాడు. అందుచేతనే గౌరవింపబడుచున్నాడు.

శ్రీరామకృష్ణ గురుదేవుడు కొంచెము ఫలాహారము భుజించి క్రిందికి దిగివచ్చెను. అప్పుడు చీకటిగానుండెను. ఇంటివానిని బిలిచి దీపము బెట్టుము. లేనిచో దరిద్రము ఆవరించును అని పలికి క్రిందికి దిగెను. బండి వచ్చియుండెను. భక్తులతోగూడ బండిలోనెక్కి శ్రీగురుదేవుడు దక్షిణేశ్వరాభిముఖు డయ్యెను.

# శ్రీ బుద్ధ భగవానుడు

సనాతన హిందూ ధర్మమున పరమ పురుషార్థములు: ధర్మార్థ, కామ, మోక్షములు. గుణకర్మములననుసరించి వర్ణభేదములును వయస్సు ననుసరించి యాశ్రమములును ప్రతిపాదింపబడినవి. పూర్వకాలమున నింద్రియ సంయమముగలిగి యాయా కాలానుసారిణి సకలభోగముల సజ్జన సమ్మతముగ ననుభవించెడివారు. తదనంతర మొక యాశ్రమమునుండి యొక యాశ్రమమును స్వీకరించి తత్తద్ధర్మముల నాచరించి చివర త్యాగబుద్ధిగలిగి సర్వమును సన్న్యసించి భగవదేకాయత్తచిత్తులై పుణ్యలోక సంపాదనమునకు గడంగెడివారు. వారి జీవితమంతయు సాధనావిధానము ననుసరించుచుండెను. నాడవతరించినమహర్షులు మంత్రద్రష్టలై యుండిరి. వారు ప్రకటించిన సత్యమే నేటి వేదరూపమున భాసిల్లుచున్నది. కాలము గడచినకొలదిని ఆ లక్ష్యము విభిన్నమై ప్రాపంచికవిషయలౌల్యమే ప్రధానస్థానము నాక్రమించెను. ఇట్టి యవరోహణ సోపానపంక్తియందు బుద్ధి ప్రాధాన్యత ప్రథమము. ఈ బుద్ధిప్రాధాన్యతవలన విచారబుద్ధి వికసించి దర్శనశాస్త్రములు వెలయ నారంభించెను. పిదప కల్పనాశక్తి ప్రబలమై పురాణములు వెలసినవి. అవి మెల్లమెల్లగా సృష్టికర్తృమహిమావర్ణనములు ఆయన సృజనాది కార్యములకు సహాయభూతులగు దేవదేవీవర్ణనలు వారు గావించిన యద్భుత క్రియలు మొదలగువానితో నిండింపబడినవి. ఈ పురాణయుగమునందును పారమార్థికాన్వేషణము జరుగుచునే యుండెను. అయినను కాలచక్రము వీనిని మంద్రస్థాయికి గొనివచ్చినది. మానవుడు బుద్ధిరాజ్యమును వీడి విషయప్రపంచమున దిరుగ నారంభించెను. కావ్యాలంకారములు సృజింపబడినవి. భోగపరాయణులై యిందుల కనుకూలములగు శాస్త్రము లుత్పన్నములయ్యెను. ఐహికసౌఖ్యములు సంపూర్ణముగా లభింపమి జన్మాంతరమున దత్సంపాదనా విధానము నన్వేషింపగడంగిరి. రంభోర్వశులుగల స్వర్గముగూడ సృష్టింపబడెను. కర్మకాండానుగుణ్యమగు నాదరణ యీ కాలమునందును నుండెను. పశుబలియుతములగు యజ్ఞాదులు ఊర్ధ్వలోకప్రాప్తికి మార్గములుగా జేయబడినవి. ఇట్టి భోగపరాయణత సహజముగా, సమస్తధర్మములకును శరీరమే యాద్యమన్న దృఢనమ్మకమును గలిగించినది. యావజ్జీవేత్ సుఖంజీవేత్ ఋణంకృత్వా ఘృతంపిబేత్ (జీవించినంతకాలము సుఖింపవలయును. అప్పుచేసియైనను నేయిత్రాగవలయును) దీనిని బట్టి విచారించినచో నాటి ప్రజలు పురుషార్థములందు తృతీయమే యనుసరణీయమని తలంచినట్లు కనిపించును. ఇట్టి సందిగ్ధసమయమునందే బుద్ధభగవాను డవతరించెను.

2500 యేండ్లకుపూర్వము వైశాఖపూర్ణిమ నాడు హిమాలయపర్వతముల చరియలయందు సుగంధపుష్ప పూరితములైన లుంబినీవనము నందు శాక్యవంశాధిపతియగు శుద్ధోధనుని కుమారుడై శ్రీబుద్ధభగవాను డవతరించెను. ఆ సమయమున ఆకసమునంటుచున్న సాలవృక్షము లన్నియు ఆమూలాగ్రము పుష్పములచే విరాజిల్లుచుండెను. పంచవర్ణ భ్రమర సమూహములు వివిధపక్షి సమూహములు కొమ్మలనుండి కొమ్మకొమ్మకు నెగురుచు మధుర కూజనము లొనర్చుచుండెను. ఈ లుంబినీవనము సమస్తము ఒకానొక రాజోద్యానవనమువలె శోభిల్లుచుండెను.

ఇట్టి యానందకరసమయమున మాయాదేవి యా లుంబినీవనము ప్రవేశించెను. అందు విహరించుచు ఆయా పుష్పరాజములను జెట్లను జూచి యానందించుచు నామహాసాధ్వి యొకానొక సాలవృక్షమును జేరి యందలి పుష్పము చేతికందినది గదాయని చేతబట్టుటయు నది యామెచేతిలో నూడిపడియెను. ఆక్షణముననే ఆమెకు గర్భచిహ్నములు పొడకట్టెను. వెంటనే సద్యోగర్భమున నొక దివ్యశిశువు జన్మించెను. ఆ శిశువునకు సిద్ధార్థుడని నామకరణముచేసిరి.

శుద్ధోధనుడును మాయాదేవియును శుద్ధసత్త్వస్వరూపులు. ప్రసవానంతరము వారము నాటికే మాయాదేవి ప్రపంచమును వీడిపోయినది. సిద్ధార్థుడు జన్మించిన యా పవిత్ర లగ్నమునందే యశోధరయు, చెన్నుడను సారథియు, కంటకమను అశ్వోత్తమమును జన్మించిరట. శిశుసంరక్షణభారము ఆయనసవతితల్లి యగు గోతమిపై బడెను. ఆమెయు నాశిశువునెంతో యల్లారుముద్దుగా పెంచి పెద్దజేసెను. శాక్యసింహుడగు సిద్ధార్థునకు జాతకర్మాచరణము గావింపబడెను. జ్యోతిష్కులెల్లరు అది జూచి ఈ బాలుడు సంసారజీవనము ననుసరించెనేని రాజాధిరాజగును. లేక వైరాగ్యము ననుసరించినచో జగత్కల్యాణార్థము ఇల్లువిడిచి అభినవమతస్థాపకుడై ప్రజానీకమును మోక్షమార్గమునకు దోడ్కొనిపోవును. దేవళాసితులను ఋషు లిరువురు రాజకుమారుని శుభ సాముద్రికలక్షణముల గాంచి యెంతయునందితులై సిద్ధార్థుడు బుద్ధుడై ప్రపంచము నుద్ధరింపగల సమయమున జీవించి యా మహాత్ముని జూచు భాగ్యము మనకు గలుగదుగదాయని దుఃఖించిరి. ఈ ఋషుల దుఃఖమును గాంచిన రాజు శుద్ధోధనుడు "మహాత్ములారా! ఎట్టి దృశ్యములగాంచి మా కుమారుడు విరాగి యగునో తెలుపు"డని వారిని బ్రార్థించి వృద్ధులు, అంధులు, శవము, సన్న్యాసి— ఈ నాలుగు దృశ్యములే తన పుత్రుని వైరాగ్యమునకు కారణభూతములగునని తెలిసికొనెను. పుత్రుని యందలి వాత్సల్యముచేతను, భ్రాంతిచేతను రాజు ఈ నాల్గింటిని కుమారుని కంటబడకుండ జేయుచుండెను. కర్మగతి నడ్డుకొనగలవారెవరు? అది అనుల్లంఘనీయము గదా!

సిద్ధార్థుడు మెల్లమెల్లగా శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడగుచుండెను. సకల విద్యలను నభ్యసించెను. తీరుబడి కలిగినపుడెల్ల నేకాంతవాసముచేయుట, అప్పుడప్పుడు గంభీరధ్యాన నిమగ్నుడగుట మున్నగు విపరీత లక్షణముల నతనియందు గొందరు లక్షించిరి. సమస్త శాస్త్రములను బఠించినను 'జీవహింస' యన్నచో ఆ మహాత్మునకు హృదయము ద్రవించెడిది. అయినను ఆయన భయపడెడివాడు

కాడు, శస్త్రాస్త్రవిద్యాపాటవము గలిగియుం డెను; ధనుర్విద్యయందు సాటిలేనివాడై విరాజిల్లెను. ఆటపాటలయందు జనసామాన్యము ననుకరించినను ఏకాంతవాసమున స్వీయ చింతా రాజ్య విహారమే ఆయన కత్యంత ప్రియతమమై యొప్పెను. శుద్ధోధనుడు తనకుమారుడై హికసుఖమగ్నుడగుటకై ప్రతిఋతువునందును తత్తదనుగుణ్యములగు వాసభవనములు నిర్మించెను. సుసజ్జితులును, రూపలావణ్యశోభితులునగు దాసదాసీజనములను, రమ్యమైన యుద్యానవనములు కుముదపూరిత సరోవరములు సుగంధపుష్ప పరిశోభితములగు లతానికుంజములు—సమస్తమును సృష్టింపజేసెను. సంగీతము నృత్యవాద్యాది కళలం దారితేరిన విద్వాంసులును నటీ నటకులును ఆయన దృష్టి నాకర్షించుటకై నియమింపబడిరి. ఇట్టి వాతావరణమునందు పెరుగుచున్న తన పుత్రు డెన్నటికిని వైరాగ్యమవలంబింపడని రాజు మున్ముటికి నమ్ముచుండెను. జరారోగ మరణ త్యాగముల నాతని కంటబడకుండ జేయుచుంటిమి గదా! ఇక భయమేమియని రాజు తలంచెడివాడు.

ఇట్లుండ సిద్ధార్థునకు పందొమ్మిదవయేడు మొదలుపెట్టెను. అంతట క్రోలీవంశజుడగు సుప్రబుద్ధుని కుమారి సర్వలక్షణ సంపన్నయు సౌందర్యరాశియు సుశీలయునగు గోప (లేక) యశోధరయను కన్యను వివాహముగావించిరి. ఇంతటితో పుత్రుని ప్రపంచమున బద్ధుని గావించినట్లు తండ్రి తలంచెడివాడు. అయినను జనుల సుఖ దుఃఖములందు పాల్గొని వారిని రక్షింపవలసిన నేను ఈ సుఖదుఃఖముల నా పుత్రునికంట బడకుండ మభ్యపెట్టుచుంటిని గాని నా కర్తవ్యమును సక్రమముగా నిర్వర్తించుచుంటినా? యన్న సందేహ మప్పుడప్పుడు రాజునకు గలుగుచునే యుండెను. మెల్లమెల్లగా సిద్ధార్థుడు బయటబడు శుభ సమయమాసన్నమయినది. ఒకనాడు సిద్ధార్థుడు తండ్రిని సమీపించి, 'తండ్రీ, ఈ సంసారము నాకు ప్రీతికరముగాలేదు' అని చెప్పి యాతని శ్రవణమున వజ్రపాతము గావించెను. రాజతని కెన్నో యుక్తుల జూపెను, భోగములసంఖ్యను హెచ్చించెను; కాని ప్రయోజనము లేదయ్యెను.

ఒకనాడు, కుమారుడు తన్నువిడిచి వెళ్లునేమోయన్న భయమువలన రాజుకుమారుని భోగములందును చిత్తమునందును మార్పు గలిగించుటకై పట్టణమునందలి వింతల జూపింప నేర్పాటు గావించెను. చెన్నుడు రథము నాయతముచేసి కంటకమును బూన్చి తీసికొని వచ్చెను. సిద్ధార్థుడు రథారోహణము గావించెను. సారథి సారథ్యమునకు బూనెను. విధిని రాజశక్తి జయింపగలదా! దేనిని పుత్రుని కంటబడకుండుటకై యిన్నాళ్లు రాజు సర్వసన్నాహములు గావించెనో ఆచతుష్టయమునే స్వయముగా రాజే పుత్రున కీవిధముగా జూపెను. పట్టణ విహారమునందు ప్రజల దుఃఖాత్మక జీవనమును కండ్లారజూచి సిద్ధార్థుడు చెన్నునితో నిట్లనెను: "ఇదియేమి? వీరెవరు? ఇట్టిపరిణామ మందఱకును సంభవించునా? నాకు, నా ప్రియురాలికి, తల్లిదండ్రులకు బంధుమిత్రులకెల్లరకును కలుగునా?"

చెన్నుడు:—(విధి బలమును గాంచి దుఃఖాక్రాంతుడై యిట్లు పలికెను): ఔను ప్రభూ! కాలగతి నెవరును మార్పజాలరు. ఏది నశ్వరమో దాని కిట్టి పరిణతియే ప్రాపించును.

ఇరువురును స్తబ్ధులై యిన్నకుండిరి. జ్యోతిష శాస్త్రజ్ఞులమాట నిజమై నిల్చినది. 'చక్రవర్తి వంశ మింతటితో నంతరించునేమో! నాప్రియ యజమానితో నెడబాటు గలుగనున్నదిగదా' యని చెన్నుడు దుఃఖింపజొచ్చెను. మహాను భావుడు తనమాటయే మఱచిపోయెను. రివ్వున దుఃఖము ఆయనహృదయము సమస్తమును ఆవరించెను. 'ఇట్టి శోకసముద్రమును దరించు టెట్లు? జరామరణవ్యాధి దుఃఖములను దరించు మార్గముగలదా?' యని యోచింపదొడగెను. కొంతసేపటికి సిద్ధార్థుడు 'చెన్నా! ముందునకు బొమ్ము' అనెను. ఇట శ్రీవారిమనస్సున నాటిన ప్రశ్నకు తక్షణమే ప్రత్యుత్తరము లభించెను. ఎదుట ప్రశాంతమై యానందమయమైన తేజస్సుగల సన్న్యాసి నిలిచెను. ఎప్పుడును నిట్టి వారిని జూడని సిద్ధార్థుడు మిక్కిలి యాగ్రహముతో 'ఇతడెవరు చెన్నా?' యనెను. చెన్నుడు వినయవినమిత శిరస్కుడై యిట్లు పలికెను: "ప్రభూ ఈయన త్యాగి. సంసారమందలి శోక దుఃఖముల దరించిన మహనీయుడు. భగవదుపాసనా సక్తుడై యానందము ననుభవించువాడు." "ఆహా ఇదిగో యుపాయ"మని సిద్ధార్థుడు 'చెన్నా! ఇక చాలు నన్నింటికిగొనిపొ'మ్మని యాజ్ఞాపించెను. రాజభవనము చేరినంతటనే యశోధర యొక మగబిడ్డను ప్రసవించెనని వార్తవచ్చెను. ఆవార్తాహరునకు తన మెడలోని రత్నహారము నిచ్చి సిద్ధార్థుడు మఱియొక బంధము తన్నావరించినదని తనలో తాననుకొనెను. అయినను 'ఎట్లయినను నే నీ రాత్రి యందే గృహమును త్యజించెదను. త్రితాపముల దహించి జీవులకు శాంతినొసగ గలిగినచో మఱలి వత్తును, లేనిచో రాను' అని పట్టు పట్టెను.

(సశేషము)



# గీతా యోగ శాస్త్రము

## శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ

'శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే...' అని భగవద్గీత యొక్క బిరుదావళి భగవద్గీతాసు=భగవంతునిచే పలుకబడినది. ఉపనిషత్సు = ఉపనిషదర్థముల జెప్పునది, బ్రహ్మవిద్యా=బ్రహ్మవిద్యను తెలియ జేయునది, యోగశాస్త్రే=యోగమును జెప్పెడి శాస్త్రము,

ఇందులో 'యోగ' మనగా నేమి?

ఈ యోగ శబ్దమున కనేకులు అనేకరకముల అర్థములు చెప్పియున్నారు. జ్యోతిషమందు గ్రహయోగమని, వైద్యమందు నౌషధయోగమని, లోకమందున అయోగము–వియోగము–సంయోగములని వివిధోపసర్గలతో వ్యవహరింపబడుచున్నది. పతంజలిముని 'యోగశ్చిత్తవృత్తి నిరోధః'—యోగమనగా చిత్తవృత్తులను నిరోధించుట యన్నాడు. 'వృత్తినిరోధ

మునకు సాధనము అభ్యాసము వైరాగ్యము, ఈశ్వర ప్రణిధానము' అనికూడ చెప్పెను. గీతలయందు 'సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే' (2-48) అని చెప్పబడినది. అదిగాక ప్రతి అధ్యాయమునకు విషాద, సాంఖ్య, కర్మ—యోగమనియిట్లు 18 అధ్యాయములకు చివర యోగశబ్దమును జేర్చినాడు. ఒక స్వల్పవస్తువు మహత్తరమైన విషయముతో కలియుటకూడ యోగ శబ్దార్థముగ జెప్పియున్నారుగదా! దీని ననుసరించి జీవాత్మ పరమాత్మలో కలియుట యోగమని ఉపనిషదభిప్రాయము. దీనికి కావలసిన సాధనము, గమ్యము కూడ గీతాయోగార్థములో నిమిడియేయున్నవి గనుక భగవద్గీత నొక మహామంత్రశాస్త్ర మన్నారు. 'మననేన త్రాయతే'—మరలమరల ఆలోచించుటచేత రక్షించునది కావున మంత్రము, దీని అంగన్యాస కరన్యాస ప్రారంభమున 'ఓం అస్య శ్రీమద్భగవద్గీతా మాలామంత్రస్య' అని వ్యవహరింపబడినది. ప్రతి గీతాశ్లోకమును మంత్రరూపముననేయున్నది. భగద్గీతయంతయు 18 అధ్యాయములలో వ్రాయబడి, 18 యోగ ప్రసక్తులను జేసియుండుటచేతను, కురుపాండవయుద్ధము 18 దినములు 15 అక్షౌహిణుల సైన్యముతో జరుపబడియుండుటచేతను, దీనికి తోడు మహాభారతముకూడ 18 పర్వాలతో చెప్పబడినది గనుకను, ఈ 18 సంఖ్యలో బ్రహ్మవిద్యారహస్య మిమిడియున్నదనియు, దానిని బట్టి 'బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే' అని భగవద్గీతా బిరుదావళిలో నున్నదనియు ఒక బలమైన వాదముగలదు. ఇంతటి మహోత్కృష్టమైన గ్రంథమునకు పరమప్రమాణమైన శాస్త్రమునకు, వారివారి బుద్ధిబలము ననుసరించి వారివారి లోకసంగ్రహకార్యవాదనల మూలముగ భగవద్గీతకు వ్యాఖ్యానములు ప్రబలుట సహజమే. కాని ఏ పాత్రలో త్రాగినను అమృతపానీయమె సుమాయని ధ్వనించునట్లు 'యేయథామాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్, మమవర్త్మానువర్తన్తే మనుష్యాః, పార్థ! సర్వశః' అని శ్రీకృష్ణపరమాత్మయే నిర్వచించియున్నాడు. సర్వమత సామరస్యముగల యిటువంటి భగవద్గీతలోని యోగశాస్త్రము ఏ యోగము నపేక్షించుచున్నదో తర్కించుట ప్రధానము గదా!

గీతలయందు జెప్పబడిన సమత్వరూప యోగము యోగశాస్త్రమందు చెప్పబడిన వృత్తినిరోధరూపయోగ మొక్కటియే గావచ్చును. కాని ఈ యోగములు కర్మయోగమనియు భక్తియోగమనియు జ్ఞానయోగమనియు ముఖ్యమగు మూడుయోగములు. గీతలలో ప్రతిచోటను 'యోగము' ఒకే అర్థమందు వాడబడెనా లేక భిన్న భిన్నార్థములయందు వాడబడెనా?

'అర్జున విషాదయోగము' అని ప్రథమాధ్యాయమునకు పేరు. ఇక్కడ వృత్తినిరోధమర్థముగా చెప్పెదమనినను సమత్వరూపమగు యోగమనినను అన్వయించదు కదా! విషాదపూరితుడైన వానికి సమత్వమెట్లు కలుగును? చిత్తవృత్తి నిరోధమైనను ఎట్లు ప్రాప్తించును?

ఈ యోగ శబ్దమునకు—'యోగస్సన్నహనోపాయ ధ్యానసంగతి యుక్తిషు' అని నిఘంటువర్థము చెప్పుచున్నది. యోగమనగా సిద్ధమగుట ఉపాయము, ధ్యానము, కలియుట, హేతువు - ఈఅర్థములు చెప్పబడుచున్నవి. ఈ అర్థములలో అన్ని స్థలములయందును 'యోగ' శబ్దమునకు 'ఉపాయము' అని చెప్పుకొనినచో సరిపడును. అర్జున విషాదయోగము—అనగా

అర్జునునకు కలిగిన విషాదము భగవచ్ఛరణా గతికి సాధనమైనది. లోకమున శోకమోహాో ద్రేకములు కలిగినపుడు ప్రాజ్ఞుడు భగవంతునే శరణు బొందును. పాశుపతాది దివ్యాస్త్రధారి యైనను అతనిధైర్యమును పాడుచేసి స్వధర్మ విముఖునిగా చేసినదీ శోకమే. ఇట్టి శోకము యొక్క నివృత్తి ఇహలోకరాజ్యము వలన గాని, పరలోక సుఖము వలనగాని కానేరదు. ఐనను, తాత్కాలిక శాంతియే; ఆత్యంతిక శోకనివృత్తి కాదు. ఆత్యంతిక శోకనివృత్తి కలిగినగాని పురుషునికి నిత్య సంపూర్ణసుఖము లభించదు. అందుకై అర్జునుడు తన శోకము యొక్క ఆత్యంతిక నివృత్తికై భగవచ్ఛరణా గతియే ఉపాయమని యెంచెను. ఆభగవంతు డును 'తమువాచ హృషీకేశం ప్రహసన్నివ భారత'అని దుఃఖనివృత్తికొరకు తగిన ఉపాయ మును అర్జును డడుగుచుండగా—'ప్రహస న్నివ' - నవ్వుచు, అర్జునుని జూచి 'దేహి దేహవిభాగమును సాంఖ్యయోగమునజెప్పెను. ఇది రెండవ అధ్యాయము.

ఇట్టి సాంఖ్యజ్ఞానము సాధకునికి చెప్పినంత మాత్రాన నిలువదు గనుక దానినిగురించి నిష్కా మకర్మయోగమని 3-వ అధ్యాయము, కర్మ ఆచరణకన్న సమత్వ రూపజ్ఞానమే శ్రేష్ఠమని జ్ఞానయోగమును, 4-వ అధ్యాయము, కర్మ సన్న్యాసయోగమని 5-వ అధ్యాయమును చెప్పబడినవి.

ఇట్లు ప్రతి అధ్యాయమునకును యోగ శబ్దము జేర్చుటచే ఒక్కొక్క అధ్యాయమందు జెప్పిన విషయము సాధకునికి ఒక్కొక్క ఉపా యమనెడి ఉద్దేశము వ్యక్తమగుచున్నది.

ఇంకను యోగమనగా సామాన్యముగ వాయుధారణమని లోకమున ప్రతీతి. ఆ శక్తి కలిగిన వానిని 'యోగి' అనుచున్నాము. అంత మాత్రాన యోగ శబ్దార్థము పూర్తి కాలేదు. 'ద్వే బీజే చిత్తవృక్షస్య ప్రాణస్పందనవాసనే' —చిత్తము చలించుటకు వాయుచలనము, వాసన, కారణములని జ్ఞానవాశిష్ఠమున ను న్నది. దీనిలో వాసనాక్షయమే ముఖ్య యో గము. అదియే పతంజలిమునిచే సూత్రించ బడినది.

గీతలయందు ప్రతిపాదించబడిన విషయము కూడ నిదియే. వాసనాక్షయ విజ్ఞాన మనోనాశ ములు—అనగా వైరాగ్య బోధోపరతులు— మూడును జ్ఞానమునకు పూర్ణత నాపాదించును. అపుడే పురుషుడు జీవన్ముక్తుడగును. దీనిలో వాసనాక్షయమునకు ఈశ్వరధ్యానము సాధన మనియు, మనోనాశమునకు వస్తువిచారణ మనియు, విజ్ఞానమునకు శ్రవణ మనన నిధి ధ్యాసనలు సాధనములనియు, చెప్పబడి యున్నది.

గీతాశాస్త్రము 18 అధ్యాయములు. ఈ 18 యును మోక్షోపాయములే. 'అద్వైతా మృతవర్షిణీ'—అనే ధ్యానశ్లోకమున ప్రతిపా ద్యాంశము అద్వైతమనియే సిద్ధమగుచున్నది. శ్రీ శంకరులు, భాష్యారంభమున ప్రవృత్తి నివృత్తి రూప వైదిక ధర్మద్వయమును బోధ జేయుటకు అర్జునుని నిమిత్తముగా లోకాను గ్రహముకొరకుపదేశించె నన్నారు. అటువంటి ధర్మద్వయమును ఎట్లాచరించవలెనో, దాని విధానమే యిందు జెప్పబడియున్నది. రెండవ అధ్యాయమున దేహిదేహ విభాగమును దెలి యజేయుటకు కారణమేమనగా సాధకుడు ప్రా రంభమున దేహాభిమానబద్ధుడై ప్రవృత్తి యందు సంకుచితుడగుచున్నాడు. నివృత్తియం దుకూడ భయమందుచున్నాడు. అందుకై సాధ

కునికి ప్రవృత్తి సంకోచము దేహాభిమానముచే కలిగెను. గనుక అట్టి దేహము అనిత్యమనియు, బాల్య యౌవన కౌమారములవలె రాకపోకలు కలవనియు, దానియం దభిమానముంచుకొని తనప్రవృత్తి సంకోచము జేసికొనుట అజ్ఞానమనియు, అట్టి యజ్ఞానము స్వరూపజ్ఞానము కలిగినగాని వదలదనియు దలంచి ముందుగ ప్రత్యగాత్మస్వరూపమే 'అశోచ్యా నన్వశోచ స్త్వం'' అను 2-11 శ్లోకము మొదలు, 'ఏషా తేభిహితా సాంఖ్యే' అను 2-39 శ్లోకము వరకు చెప్పబడినది. ఇక మూడవ అధ్యాయమున ప్రత్యగాత్మజ్ఞానము దేహేంద్రియాది స్వాభావికవృత్తులచేత ప్రతిక్షణమును కప్పబడుచుండును. అందుచేత ప్రత్యగాత్మజ్ఞానము స్థిరముగ నిలువదని నిష్కామ కర్మయోగము నుపదేశింపవలసి వచ్చెను. 'యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేర్జున ; కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్సవిశిష్యతే' (3-7) మానసేంద్రియములను నియమించుకొని కర్మయోగము నాచరింపుమనెను. మరియొక ఉపాయము—'యజ్ఞార్థాత్కర్మణో న్యత్ర లోకో యం కర్మబంధన! (3-9) అని ఈశ్వరప్రీతిగా జేయు కర్మలు బంధకములు కావనికూడ చెప్పెను. 'యస్త్వాత్మరతి రేవస్యాదాత్మతృప్తశ్చ మానవః ఆత్మన్యేవచ సంతుష్టస్తస్య కార్యం నవిద్యతే! నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన, నచాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥' (3-17, 18) ఆత్మనిష్ఠుడగు సన్న్యాసికి, నాచరింపవలసిన కార్యమొకటియును లేదు, అనగా నీ యజ్ఞములతో నెట్టి యవసరమును లేదు. ఆత్మజ్ఞానికి ముల్లోకములందును బొందదగు ప్రయోజనము లేదు కావున ప్రయోజనములకు సాధనభూతములగు కర్మలతో నవసరము లేదను తాత్పర్యముతో ఆత్మజ్ఞానికి కర్తృత్వమే లేదని జెప్పెను. ఇట్లు 2, 3 అధ్యాయములచే జ్ఞాననిష్ఠ, దానికి సాధనమైన నిష్కామకర్మనిష్ఠ రెండును, అర్జునుని గురించి ఉపదేశింపబడెను. ఇంతతో గీతార్థము పరిసమాప్తమైనట్లు. అటుపై జెప్పిన అధ్యాయములలో, ఈ రెండు విషయములుగాని, లేదా ఏ ఒకటిగాని, సంకోచ విస్తరభావముల చేత నుపదేశింపబడినవి.

దీనిలో ముఖ్యముగ సాధకుడు — అమానిత్వము, అదంభిత్వము, అహింస, క్షాంతి, ఆర్జవము, ఆచార్యోపాసనము, శౌచము, స్థైర్యము, ఆత్మనిగ్రహము, ఇంద్రియార్థములయందు వైరాగ్యము, అనహంకారము, జన్మమృత్యు జరాది దోషములను జ్ఞాపకముంచుకొనుట సమచిత్తము కలిగియుండుట—మొదలుగాగలవానిని అభ్యసింపవలెను. 'యమాన్సేవేతసతతం నియమాన్ నకదాచన। యమాన్పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్' —యమ నియమాది యోగసాధనములలో యమమునే మొదట నభ్యసింపవలెను. యమమును విడచి నియమమును నభ్యసించినవాడు చెడును. యమములనగా పైనిచెప్పిన అమానిత్వాది గుణములే. కనుక అమానిత్వాది గుణముల నాచరించుటయే ముఖ్యయోగము అని గీతయందు విపులీకరించబడిన యోగ శాస్త్రము.

# శ్రీ వివేకానంద సంభాషణలు

(శ్రీ సురేంద్రనాథసేను స్వంత దినచర్య నుండి)

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[మధురభావము—ప్రేమ—నామకీర్తన—దాని లోపము—జ్ఞానముతో గూడినభక్తి—ఒక వింతస్వప్నము.]

సోమవారము. 24-1-1898.

స్వామిజీని దర్శించుటకై మఱల వచ్చితిని. వారిచుట్టును ప్రేక్షకులు గుమిగూడియుండిరి. శ్రీ చైతన్యులయనుయాయులచే, అస్పష్టముగా నిర్వచింపబడిన, భగవంతుని భర్తగాభావించి, భక్తిసాధన జేయు, మధురభావమునుగూర్చి స్వామిజీ యుపన్యసించుచుండెను. ప్రపంచమంతయు సుఖాంతమేయని యప్పుడప్పుడు నుడువు అతిశయోక్తులవలన ప్రేక్షకులు నవ్వుచుండగా నొకరు "ప్రభువుయొక్క లీలలలో ఇంతటి పరిహాసమును గొల్పునదేమిగలదు ? వారు మహాత్ములుగారనియు, మానవకల్యాణమునకై సమస్తమును ఒసర్చిరనియు మీరు నమ్ముచుండుట లేదా?" యని ప్రశ్నించెను.

స్వామిజి :—ఎవరువారు? అయ్యా, అయితే నేను మిమ్ములను హేళనచేయుచుంటిననియా? తమరు దీనియందలి పరిహాసమునే గ్రహించితిరి. అంతియెగాదా? తమరు నేను నా జీవితములో ఎన్నెన్ని బాధలుపడి, కామినీ కాంచనములనుత్యజించి, యీ పరివ్రాజక జీవితమునుగడపుచు, నా యాదర్శమును, ప్రజలలో వ్యాపింపజేయుటకై, చేయుచున్న యత్నములను గమనించుట లేదు. శ్రీ చైతన్యప్రభువు, మహాత్యాగపురుషుడు. కామినీ కాంచనములతో ఆ మహనీయున కెట్టి సంబంధమునులేదు. పిమ్మట కొంతకాలమునకు, ఈతని శిష్యులు, స్త్రీలను తమ సంఘమునందు జేర్చుకొని, యా ప్రభువుపేరిట, వారితో విచ్చలవిడిగా సంచరించి, గొప్పకళంక మా సమాజమునకు దీసికొనివచ్చిరి. ఆ మహాప్రభువు, తన జీవితమునందు జూపిన యాదర్శప్రేమతత్త్వము, లింగభేదరహితమైనది. కామవాంఛారహితమైనది. అట్టి విశ్వవిరహప్రేమతత్త్వము, ప్రజాసమూహమున కందుబాటులో నెన్నడును నుండజాలదు. పిమ్మట వచ్చిన వైష్ణవగురువులు, ఆప్రభువుయొక్క త్యాగజీవితముపై ముఖ్యముగా లక్ష్యముంచి ప్రచారముచేయుటమాని, వారి పాండిత్యము, యుత్సాహము సమస్తము ఆతని ప్రేమతత్త్వమునుమాత్రమే, జనసామాన్యమునందు వ్యాపింపజేయుటచే, సామాన్యప్రజ లా దివ్యప్రేమ లక్ష్యమును గ్రహింపలేక, స్త్రీపురుషు లొండొరులు ప్రేమించుకొనుమార్గమే యాపరమ లక్ష్యమని తలంపజొచ్చిరి.

ప్రశ్న:—కాని, అయ్యా, వారు శ్రీహరి నామమును చండాలురకు సహితము బోధించిరిగదా? ఐనజనసామాన్యమునకు వారిప్రేమతత్త్వమును గ్రహించుటకేల హక్కు లేదు?

స్వామిజి:—ఆతని బోధనుగూర్చి నేను సంభాషించుచుండుట లేదు. రాధాదేవి, ఏ దివ్యప్రేమచే, జగద్రక్షకుడగు శ్రీకృష్ణుని ఆరాధించెనో, యీరాధాప్రేమను, తనలక్ష్యముగానుంచుకొని, యహోరాత్రములు, తనవ్యక్తిత్వమును ఆరాధయందు నిలిపి మైమరచియుండెనో యీ దివ్యమధుర భావమునుగూర్చి భాషించుచుంటిని.

ప్రశ్న:—జనులకందరికును, దానిని అందుబాటులోనుంచుననేల చేయరాదు?

స్వామిజి:—ఒకమారు భారతీయుల దిలకింపుము. ఈ దివ్యభావమును బోధించుటచే నెట్టి ఫలితములుగలిగెనో పరిశీలింపుము. జనసామాన్యమునకందరకాతత్త్వ ముపదేశించుటచే, యావన్మందియు అబలలైరి. ఒరిస్సాయంతయు భీరువులరాష్ట్రమయ్యెను. ఈ నాలుగు శతాబ్దములనుండియు, ఈరాధాప్రేమయందు మునిగి తేలుచున్న వంగిదేశమున పౌరుషము నశించిపోయెను. ప్రజలందరికిని, దుఃఖించుటయే జాతీయలక్షణమయ్యెను. జాతియొక్క భావములకును, ఉద్దేశములకును లక్ష్యమగు, వారి వాఙ్మయము నొకసారి పరిశీలింపుము. వంగవాఙ్మయమంతయును, దుఃఖాత్మకముగను, విచారాంతముగను గన్పడును. వీరరసమును పురికొల్పు, పద్యభాగ మొకటియైనను ఎచ్చటను మచ్చునకైననుగానరాదు.

ప్రశ్న:—అయిన ఈ దివ్యప్రేమకు హక్కుదారు లెవ్వరు?

స్వామిజి:—హృదయమునం దేమాత్రము కామవాసనయున్నను, నిజమగు ప్రేమతత్త్వమలవడ నేరదు. మానవులలో మహాత్యాగులు, మహాపురుషులు మాత్రమే యీ దివ్యప్రేమతత్త్వమున కధికారులు. సామాన్యజనులకీ ప్రేమతత్త్వమును బోధించినచో వారు తమ హృదయసీమలయందా భగవానుని స్త్రీమూర్తినిగా భావించుకొని ప్రేమవిరహమునం దుండు సమయమున, ఆ లక్ష్యమునుండి పతితులై స్వభార్యలందే మనస్సులగ్నమై, తమచ్యుతికే దారితీయగల పరిస్థితి సంభవించును.

ప్రశ్న:—తన్ను భార్యగను, భగవంతుని భర్తగను భావించి, ప్రేమమార్గమున భగవంతుని దెలియువిధము గృహస్థుల కసాధ్యమగు పద్ధతియా?

స్వామిజి:—కొన్ని మినహాయింపులతో, సామాన్య గృహస్థులకిది యసాధ్యమే. సందేహము లేదు. ఇతరమార్గముల నేకము లుండగా, ఈ మార్గమునందింత పట్టుదల యెందులకు? ఈ మధురభావముదప్ప, భగవంతుని ఆరాధించుట కితర బాంధవ్యములు లేవా? మిగిలిన చతుర్విధ మార్గములలో నేదియోయొకటి యభ్యసించి, నిశ్చల హృదయముతో ఆభగవానునినామమును, ఏల గైకొనరు? హృదయద్వారమును మొదట తెరువుడు. పిమ్మట సమస్తమును తమంతట తామే చేకూరగలవు. కాని కామవాసన యున్నంతవఱకు ప్రేమతత్త్వమలవడ నేరదను సత్యమునుమాత్రము మరవకుడు. మొదట పశువాంఛలను నిగ్రహించుట కేల ప్రయత్నింపరు? "నేను గృహస్థును గదా, అదెట్లు పొసగును?" అని నీవు

చెప్పవచ్చును. అర్థములేనిమాట, గృహస్థుడై నంతలో, విషయలోలుడై, నికృష్టసంబంధములతో జీవితమంతయును గడపవలయుననియా? ఈమధురభావము ననుసరించుటలో, పురుషుడు తాం స్త్రీమూర్తిగా భావించుకొనుట యెంత నికృష్టము!

ప్రశ్న:—అయ్యా, నిజమే. అనేకులు గలిసి నామసంకీర్తనము చేయుట, సంతోషదాయకముగా నుండగలదు. మనశాస్త్రము లారీతిగా ప్రవచించుచున్నవి. శ్రీచైతన్యప్రభువారీతిగాప్రజలకు బోధించెను. మృదంగము వాయించినంతనే హృదయమునందు నృత్యము జేయవలెననెడి భావము జ్వలనము కాగలదు.

స్వామిజి:—బాగుగనే ఉన్నది. కాని కీర్తన పాడుటయన నృత్యముచేయుట మాత్రమేయని తలంపరాదు. భగవంతుని మహిమాతిశయమును, నీ యిచ్ఛవచ్చినరీతి గానముచేయుటయే దాని భావము. ఆవైష్ణవులనృత్యము, భావగాంభీర్యము, ఆకర్షణీయమగు సత్పద్ధతియేగాని, దాని ననుసరించుటవలనగలుగు ప్రమాదములనుగూర్చి జాగరూకులై యుండవలయును. ప్రతిఫలమునందు, ప్రమాదము గూఢమైయుండును. ఈ నృత్యమునందు, భావములు పూర్తిగా ఉద్రేకమును పొందును. కన్నీటి బాష్పములు స్రవించును. బాహ్యస్మృతి గోల్పోయినరీతిగా, తలదిరుగును. కాని యా సంకీర్తన మాగిపోయినంతనే, యా భావము లెంతతీవ్రములై ఉద్రేకమును బొందెనో, యంత వేగముగనే చల్లారిపోవును. మహాసముద్రమునందు తరంగము లెంతయున్నతములై లేచునో, యంత వేగముగనే యథోన్మీలనములగును. ఈస్థితియందు సరియగు యుక్తాయుక్త విచక్షణాజ్ఞానము లేనిచో, దీని ప్రతిఫలమును, బడయుట మిక్కిలి యసాధ్యమై, కామవాహినిలో బడుట తటస్థించును. అమెరికా దేశము నందుగూడ ఇట్టిదృశ్యమును గాంచితిని. చాలమంది చర్చీలకుబోయి, భక్తితో ప్రార్థించి, భావోద్రేకముతో గానముచేసి, సువార్తల నాలకించుటలో అశ్రుధారలను గురిపించుచు, ఆ చర్చినివిడిచి గృహోన్ముఖులైనంతనే, దాని ప్రతిఫలముగా తీవ్రమగు పశువాంఛాముఖ గహ్వరమున బడుచుండిరి.

ప్రశ్న:—అయితే, మేము తప్పు దారిని బట్టక, శ్రీచైతన్యప్రభువు బోధించిన యే పద్ధతుల నాచరించిన, అభ్యుదయమును గాంతుమో, యామార్గము నుపదేశింతురా?

స్వామిజి:—జ్ఞానముతోగూడిన భక్తితో పరమేశ్వరుని పూజింపుము. భక్తితో విచక్షణాజ్ఞానమనుసంధానము చేయుము. ఇవిగాక, శ్రీ చైతన్యప్రభువుయొక్క హృదయమును, భూతదయను, భగవంతునియెడగల విరహవేదనను, త్యాగధర్మమును, నీ జీవిత లక్ష్యముగా గైకొనుము.

పృచ్ఛకుడు:—(స్వామిజీ నుద్దేశించి, ముకుళితహస్తుడై) "అయ్యా, మీరు సత్యమును వచించితిరని గ్రహించితిని. ఏదో పరిహాసముగా వైష్ణవుల మధురప్రేమను విమర్శించుచుండగా, మీభావములను గ్రహింపలేక ఆరీతిగా నధిక్షేపించితిని క్షమింపుడు."

స్వామిజి.—ఇటు వినుము. మనము తప్పని సరిగా విమర్శచేయవలయుననిన, భగవంతుని, తత్తుల్యులగువారినే, విమర్శింపవలయును. నన్ను నీవు విమర్శించినను, నేను నిన్ను విమర్శించినను, ఉభయుల మొండొరులపై కోపోద్రిక్తులమయ్యెదము. ఇట్లు జరుగదా? కాని భగవంతుడుగాని, తత్తుల్యులుగాని, ఎన్నడును, చెడ్డకు, చెడ్డనే ప్రతిఫలముగా జరుగనీయరు.

ఈ మహాశయుడు, స్వామిజీ పాదపద్మములకు నమస్కరించి వెడలిపోయెను. ఇట్టి సమావేశములు స్వామిజీ కలకత్తాయందున్నంత కాలము అనుదినము జరుగుచుండునని నే నిదివఱకే తెల్పియుంటిని. ప్రాతఃకాలము మొదలు, రాత్రి ఎనిమిది, తొమ్మిదిగంటలవఱకు, ప్రతిగంటయును, ప్రజ లశేషముగా స్వామిజీని చుట్టుముట్టియే యుందురు. దీనివలన, స్వామిజి భోజనము, వేళకు సరిగా కుదిరెడిది గాదు. అందుచే కొందరు, నిర్ణీతసమయములందే ప్రజలకు దర్శనమీయదగునని, సలహా నిచ్చియుండిరి. కాని మానవసేవకై యెట్టి త్యాగమునకైనను వెనుదీయని ప్రేమమూర్తియగు స్వామిజీ, మతజిజ్ఞాసులై, తనయొద్దకేతెంచు ప్రజలనుచూచి, కరుణార్ద్రహృదయుడై, యనారోగ్యముతోనున్నను, వారల విన్నపమును మన్నించలేదు. "వీరు తమగృహములనుండి, యిచ్చటికనేకబాధలనుసహించి, పాదచారులైరాగా, నే నిచ్చట నాయారోగ్యము చెడిపోవునని తలచి, వారితో ఏదియో కొద్దిగానైనను భాషింపకుండ, కూర్చుండియుండగలనా?" యని నవ్వినచిఱునవ్వే వారికి స్వామి సమాధానము.

సాయంత్రము నాలుగుగంటలకు సమావేశము పరిసమాప్తమయ్యెను. ప్రేక్షకులందరును వెడలిపోయిరి. ఇంగ్లండు, అమెరికా మొదలగు దేశములనుగూర్చి స్వామిజీ కొందఱు పెద్దలతో ముచ్చటించుచుండగా వారుమాత్రము నిల్చిపోయిరి. సంభాషణమధ్యమున, స్వామిజీ యీ క్రింది విధముగా నుడివెను :—

"ఇంగ్లండుదేశమునుండి నేను తిరిగి వచ్చుచుండగా, మార్గమధ్యమున నొక వింత స్వప్నమునుగాంచితిని. మధ్యధరాసముద్రమున ఓడదాటుచుండగా, నాసుషుప్త్యవస్థయందు, వయోవృద్ధుడును, పూజనీయుడును, ఋషిస్వరూపుడును అగు నొక మహాపురుషుడు నాయెదుట సాక్షాత్కరించి, "నీవు ఉద్ధరించుటకు వచ్చితివా! భారతఋషుల సత్యసిద్ధాంతములననుసరించిన వర్గమునకు నేను సంబంధించినవాడను. మాచేబోధింపబడిన పరమ సత్యములను, భావములను, క్రీస్తుమతస్థులపహరించి ఏసుక్రీస్తుచే బోధింపబడినవని ప్రకటనచేసిరి. ఈవిషయము మినహాగా, ఏసుక్రీస్తు అనువ్యక్తి అసలు లేనేలేడు. దీనిని ఋజువుచేయుటకనేక నిదర్శనములను పరిశీలించి చెప్పవచ్చును." 'ఏ స్థలమున పరిశీలించిన ఈ శాసనములు, నిదర్శనములు గాన్పింపగల'వని నేనడిగితిని. ఆవృద్ధుడు టర్కీదేశపు సరిహద్దున నొక స్థలమును జూపుచు, 'ఇచ్చట జూడుము' అని నుడివెను. వెనువెంటనే నేను మేల్కాంచి, ఓడ పైభాగమునకుబోయి, యందలి ప్రధాననావికుని, 'ఏ దేశపుపరిసరమున ఇప్పుడీ యోడగలదు' అని ప్రశ్నించితిని.అటుచూడుము, 'అదుగో,అచ్చట టర్కీదేశము, క్రీటాద్వీపముగల'వని జబాబిచ్చెను.

ఇది స్వప్నమేనా! లేక, యీ స్వప్నమందేదైన సత్యముగలదా? ఎవరికెరుక!



# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

'సన్న్యాసము'న. — 'సతి అధిష్ఠానే న్యాసం సర్వవైదిక కర్మఫలత్యాగమితి నిషేధవాది విషయో' = సర్వాధిష్ఠాన పరమేశ్వరునియందు సకలకర్మఫలత్యాగము నిషేధవాది అనగా గృహస్థ విషయమైన సన్న్యాసము మఱియు 'సతి అధిష్ఠానే సన్న్యాసం సకలేంద్రియవృత్తి వ్యాపారత్యాగమితి విధివాదివిషయో' = సర్వాధిష్ఠాన పరబ్రహ్మమునందు సకలేంద్రియవృత్తి వ్యాపారత్యాగము విధివాది అనగా తురీయాశ్రమస్థునివిషయమైన సన్న్యాసము. అనగా చతుర్థాశ్రమవాసి శమదమాది సంపన్నుడై సర్వేంద్రియవృత్తి వ్యాపారములను సమయజేసి యంతఃకరణమున సంతతమభినివేశపూర్వకముగ ప్రత్యగాత్మ విషయక ప్రత్యయసంతతి కరణమును (జ్ఞానావృత్తిని) చేయుచుండవలయునని శాస్త్రము." అంతట యోగాభ్యాసమునకారంభమగును. 'యోగ'మన. "శ్రవణాది సంజాత విజ్ఞానవంతం యోగినం స్వభావం-బ్రహ్మభావం యోజయతి గమయతీతి యోగో నిర్విశేషః పరమాత్మా పరంబ్రహ్మ"=సద్గురు సాన్నిధ్యమున వేదాంతశ్రవణాదుల (చూడు వర్ణకము 5.) ద్వారా స్వయముగసిద్ధించిన స్వాత్మ విజ్ఞానముగల యోగిని స్వభావమును-బ్రహ్మభావమును పొందించునదిగాన నిరుపాధిక చిద్రూపపరమాత్మ-పరబ్రహ్మ—'యోగ'మనబడును. నిత్యము నిరంతరము నిటువంటి పరబ్రహ్మ (జ్ఞానా) భ్యాసమువలన చిత్తము ఇంద్రియార్థములయందలి ప్రవర్తనమును విడిచి శుద్ధ చిదానందరూప ప్రత్యగభిన్న పరమాత్మయందు సకమై తదేకాయతమైయుండును. అంతట మసీ''త్యాది వేదాంతమహావాక్యతాత్పర్యమైన జీవబ్రహ్మైక్యజ్ఞానమపరోక్షముగ సాక్షాత్కరించును. అందువలన నరుణోదయముచేత నంధకారమంతమొందు చందమున, అనాదియు ఆత్మావరకమును కేవల బ్రహ్మాత్మైకత్వజ్ఞానాపనోద్యమునగు అజ్ఞానము నిశ్శేషముగ నంతమొందును. అంతట స్వస్వరూపమునందే అవస్థానము కలుగును. అనగా స్వచ్ఛమైన స్ఫటికము జపాకుసుమ సాన్నిధ్యమువలన లోహితరూపముగల దానివలె నవభాసించుచున్నభంగి, అద్వితీయాఖండైకరస సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమైన ఆత్మస్వరూపము స్వాజ్ఞానమువలన నన్యరూపముగ షడ్భావేత్యాది వికారములుగలదానివలె నవభాసించుచుండును. జపాకుసుమ సాన్నిధ్యము తొలగిన స్ఫటికము స్వాభిన్నముగ స్వస్వరూపమును

స్వయముగనే పొందిన చందమున, స్వాత్మ జ్ఞానముచేత అజ్ఞానము బాధితమగుచుండగా జీవాత్మ స్వాభిన్నముగ స్వస్వరూపమైన పరమాత్మభావమును స్వయముగనే అధిగమించును. అఖండైకరసత్వ మాత్మకు నిత్యమవ్యయైక రూపమైయున్నను, అజ్ఞానదశయందు తిరోహితమైయుండి జ్ఞానదశయందు ఆవిష్కృతమగును - బయలుపడినదగును. ఇదియే స్వస్వరూపప్రతిష్ఠ - స్థితి. ఇదియే కైవల్యము - మోక్షము అని భావము. ''తస్మాన్ముముక్షుభిః కార్య మాత్మజ్ఞానాభిలాషభిః। నిత్యం నైమిత్తికం కర్మ సదైవాఽఽత్మవిశుద్ధయే॥'' (నైష్కర్మ్యసిద్ధి 1-132) నిత్యనైమిత్తిక స్వధర్మ కర్మానుష్ఠానము చిత్తశోధనముద్వారా ఆత్మజ్ఞానోత్పాదకమగుటంజేసి ముముక్షువులు ఆత్మ (బుద్ధి) పారిశుద్ధ్యముకొఱకు నిత్యనైమిత్తిక స్వధర్మ కర్మములను నిత్యము తప్పక నిర్వర్తించుచుండవలయునని శాస్త్రాదేశము. ''అనంతకర్మ శౌచంచ జపోయజ్ఞ స్తథైవచ। తీర్థయాత్రాభిగమనం యావత్తత్త్వంనవిందతి॥'' (పైంగల. ఉ. 4-18.) స్వాత్మాపరోక్షజ్ఞానసాక్షాత్కారము సిద్ధించునంతపర్యంతమును స్వధర్మకర్మానుష్ఠానము, శమదమాద్యభ్యాసము జపము యజ్ఞములు తీర్థయాత్రలు శ్రద్ధాభక్తులతో నిత్యము నిర్వర్తించుచుండవలయును. ''నకర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే। నచ సన్న్యసనాదేవ సిద్ధింసమధిగచ్ఛతి॥'' (గీ 3-4) ''నిష్కలం నిష్క్రియం'' (శ్వే. 6-19) అనెడి శ్రుతిమానమున ఎచట కర్మములేదో అట్టి బ్రహ్మము నిష్కర్మమనబడును. దానిభావము నైష్కర్మ్యము అనబడును. అట్టి నైష్కర్మ్యమును - అనగా నిష్క్రియమైన బ్రహ్మము యొక్క ప్రతిష్ఠను (బ్రాహ్మీభావమును) పొందుటయను లక్షణముగల ముక్తిని—శ్రౌత స్మార్త నిత్యనైమిత్తికాది కర్మముల అనాచరణమువలన, ఉపాయము లేనందున పురుషుడు పొందనేరడు. ఉపాయముండినగాని ఉపేయము సిద్ధింపదు. ఉపాయభూతములైన కర్మముల ననుష్ఠింపకొండుటవలన ఉపేయభూతమైన జ్ఞానము తత్ఫలమగు నైష్కర్మ్యము (మోక్షము) ను పురుషునకు సిద్ధింపదు. కావున ముముక్షువగు పురుషుడు ఈశ్వరార్పణబుద్ధితో నిత్యనైమిత్తిక స్వధర్మకర్మముల నవశ్య మనుష్ఠించుచుండవలయును. తద్ద్వారా జ్ఞానము మోక్షమును సిద్ధించునని యర్థము. కర్మములు క్లేశభూయిష్ఠములనెడి బుద్ధిచేగాని, అలసత్వము (సోమరితనము) చే గాని, తాత్కాలికమైన అల్పవైరాగ్యమువలన శిఖాయజ్ఞోపవీతపరిత్యాగమాత్రముననే వేదాంత శ్రవణాది జన్య నిరర్గళాత్మజ్ఞానము వినాగా ముముక్షువగు బ్రాహ్మణుడు నైష్కర్మ్యసిద్ధిని అనగా విదేహముక్తిని పొందజాలడు. ఏలయన ''జ్ఞానాదేవతు కైవల్యమ్'' - జ్ఞానముచేతనే ముక్తియని శ్రుతిప్రసిద్ధిగలదు. మఱియు ''ప్రత్యక్తత్త్వ వివేకాయ సన్న్యాసః సర్వకర్మణాం। శ్రుత్యా విధీయతేతస్మా త్తత్త్యాగేపతితోభవేత్॥'' సర్వకర్మసన్న్యాసమును ప్రత్యక్తత్త్వవివేకజ్ఞానికొఱకు మాత్రమే శ్రుతి విధించుచున్నది. అట్లగుట కర్మత్యాగి పతితుడగును.'' అనెడి శ్రుతి ప్రమాణముగ స్వస్వరూపాపరోక్షజ్ఞానాభావమునందు పతితత్వస్మరణమువలన, ప్రత్యక్తత్త్వ వివేక విహీనముగ నిత్యనైమిత్తిక విధ్యుక్త కర్మసన్న్యాసమును చేసినయెడల, సంతమాత్రమున మోక్షము సిద్ధింపదుగనుక యతియైనను పతితుడగును. కావున ప్రత్యక్తత్త్వ వివేకము వినాగా తురీయాశ్రమ స్వీకారమాత్రమున

నట్టి సన్న్యాసముచేత మోక్షము ప్రాప్తించదు. కర్మత్యాగి ముక్తుడు గానేరడు. ఆహేతువుచే ముముక్షువగు యతియు సర్వవిధముల (త్రికరణశుద్ధిగ) సద్గురు ముఖమున వేదాంతశ్రవణాదికముద్వారా ఆత్మజ్ఞానమును పట్టుదలతో సంపాదింపవలయునని భగవంతునిచే సూచితమగుచున్నది. 'సన్న్యాసయోగము వలన' అని చెప్పబడిన విషయమున బ్రహ్మవిదులైన యతులయొక్క, బ్రహ్మమునందారోపితమైన నామరూప గ్రహణత్యాగమే, సన్న్యాస శబ్దముచేత చెప్పబడుచున్నది కాని కర్మసన్న్యాసము మాత్రము కాదు. ''శ్రౌతంచాపి తథాస్మార్తం కర్మాలంబ్యవసేద్ద్విజః। తద్విహీనః పతత్యేవ హ్యాలంబ రహితాంధవత్॥'' ద్విజుడుశ్రౌతస్మార్తస్వధర్మకర్మావలంబకుడే యైయుండవలయును. కర్మాలంబవిహీనుడు కరాలంబరహితుడైన యంధుని చందమున పతితుడగును. ''శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్హిమానవః। ఇహకీర్తి మవాప్నోతి ప్రేత్యచానుత్తమం సుఖం॥'' (మను. 2-9) శ్రుతిస్మృతి విహితమైన స్వధర్మకర్మమును అప్రమత్తుడై విధ్యుక్తముగననువర్తించు మానవుడు ఇహమందు సుఖసత్కీర్తులను పొందును. పరమందు స్వర్గాపవర్గాది అనుత్తమ సుఖము నధిగమించును. ''కర్మణా పితృలోకః। విద్యయా దేవలోకః॥'' (బృ. ఉ. 1-5-16) పుణ్యకర్మానుష్ఠానమువలన పితృలోకప్రాప్తియు, శివవిష్ణ్వాది దేవతాభేదజ్ఞానముతో కర్మానుష్ఠానము వలన నాయాదేవతాలోక ప్రాప్తియు గలుగును. ''విద్యాంచాఽవిద్యాంచయస్తద్వేదోభయంసహ। అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే॥'' (ఈశా. 11) ఎవడు విద్యయు అవిద్యయు ఉభయముకూడ

అనుష్ఠేయములని యెఱింగి నిరసింపక యనువర్తించునో అతడు అవిద్య (కర్మము) ద్వారా మృత్యువును అనగా ఆత్మజ్ఞాన ప్రతిబంధకమైన కల్మషరాశి నతిక్రమించి చిత్తశుద్ధినిబొంది, విద్య (జ్ఞానము) ద్వారా మోక్షమును బడయును. ''యావదిచ్ఛాతావత్కర్మస్వధికారః'' = ఎంతవఱకు ప్రపంచమునుగుఱించి ఆశయుండునో అంతవఱకును కర్మము ననుష్ఠింపక తప్పదని శాస్త్రనిబంధనము. ''తమేతిమాత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేనైతమేవ విదిత్వా మునిర్భవతి॥'' (బృ 4-4-22) బ్రాహ్మణులు వేదశాసనము ననుసరించి యజ్ఞదాన (అగ్నిహోత్రము-హవిర్దానము) తపోపవాసాది నిత్యనైమిత్తికాది వైదిక స్వధర్మకర్మానుష్ఠానము చేత చిత్తశుద్ధిని చిత్తైకాగ్రతనుపొంది యంతట జ్ఞానమును బడసి ఆయీ ఆత్మను దెలిసికొనుచున్నారు. స్వాత్మవిజ్ఞానమును పొంది మునిశ్రేష్ఠులగుచున్నారు- బ్రహ్మవిదులగుచున్నారు. ''కర్మాణి చిత్తశుద్ధ్యర్థ మైకాగ్ర్యార్థ ముపాసనా। మోక్షార్థం బ్రహ్మవిజ్ఞాన మితి వేదాంత డిండిమః॥'' (శంకరః) నిత్యనైమిత్తికాది కర్మములు చిత్తశుద్ధిసాధనములు. ఉపాసనాకర్మము చిత్తైకాగ్ర్యసాధకము, బ్రహ్మవిజ్ఞానము, సాక్షాన్మోక్షైకసాధనము. ఈవాస్తవగుణకథనముచేత వైదిక స్వధర్మకర్మము నుపేక్షింపక నిత్యము నిర్వర్తించుచునే యుండవలయుననెడి విధి విశదమగుచున్నది. కాన ''జ్ఞానినోఽజ్ఞానినశ్చాపి యావద్దేహస్యధారణం। తావద్వర్ణాశ్రమప్రాప్తం కర్తవ్యం కర్మసిద్ధయే॥'' (శ్రుతిముక్తాఫలం) జ్ఞానులకైనను అజ్ఞానులకైనను శరీరధారణ మున్నంతపర్యంతము నైష్కర్మ్యసిద్ధ్యర్థము స్వవర్ణాశ్రమప్రాప్తమైన నిత్యనైమిత్తి

శాదికర్మమవశ్యకర్తవ్యమని సర్వశాస్త్రసిద్ధాం
తము. అందువలన ''ఆదౌస్వవర్ణాశ్రమవర్ణితాః
క్రియాః కృత్వా సమాసాదిత శుద్ధమానసః।
సమాప్యతత్పూర్వ ముపాత్తసాధనః సమాశ్ర
యేత్సద్గురు మాత్మలబ్ధయే॥'' (శ్రీరామగీత. 7)
శాస్త్రమునందు విధింపబడిన స్వవర్ణాశ్రమో
చితకర్మములను యథావిధిగ మొదట నిర్వ
ర్తించుచు దానం జిత్తశుద్ధినిపొంది తరువాత
బ్రహ్మవిద్యా సంపాదనార్థము సద్గురూపసద
నము చేయుటకు బూర్వమే సంపూర్ణ సాధన
చతుష్టయ సంపన్నత్వముచేత బ్రహ్మవిద్యాధి
కారియై అంతట బ్రహ్మవిద్యార్థియగుచు శ్రోత్రి
యుడును బ్రహ్మనిష్ఠుడునగు ఆచార్యుని శాస్త్రో
క్తముగ నాశ్రయింపవలయును. ''జ్ఞానంనో
త్పద్యతే పుంసాం పాపోపహతచేతసాం॥'' స్వ
ధర్మకర్మములను పరిత్యజించి దుష్కర్ములగు
కల్మషచిత్తులకు సాధనచతుష్టయము స్వాధీన
ముకాదు. స్వాత్మతత్త్వ మనుభూతముకాదు.

''సాధనాన్యత్ర చత్వారికథితాని మనీషిభిః।
యేషుసత్స్వేవ సన్నిష్ఠాయదభావేన సిద్ధ్యతి॥''
(వివేకచూడామణి. 18.) బ్రహ్మవిద్యయం దధి
కారమును గలుగజేయు సాధనచతుష్టయము
విద్వాంసులచే వర్ణింపబడిన ప్రకారము వివ
రింపబడుచున్నది. సాధనచతుష్టయ సంపన్న
త్వము సిద్ధించిననే బ్రహ్మనిష్ఠ సిద్ధించును గాని
విపర్యయమునగాదు. ''ఆదౌనిత్యానిత్యవస్తు
వివేకః పరిగణ్యతే। ఇహాముత్రఫలభోగ విరాగ
స్తదనంతరం। శమాదిషట్కసంపత్తి ర్ముము
క్షుత్వమితిస్ఫుటమ్॥'' (వి.చూ.19.) 1. నిత్యా
నిత్యవస్తువివేకము. 2. ఇహాముత్రఫలభోగవిరా
గము. 3. శమాదిషట్కసంపత్తి. 4. ముముక్షు
త్వము అను నీ నాలుగు సాధనచతుష్టయమని
ప్రసిద్ధి.

1. నిత్యానిత్య వస్తువివేకము అనగా.—
''బ్రహ్మ సత్యం జగన్మిథ్యే త్యేవం రూపో విని
శ్చయః। సోఽయం నిత్యానిత్యవస్తు వివేకః
సముదాహృతః॥'' (వి. చూ. 20) సత్పదార్థము
లేక సత్యవస్తువు అవినాశియైన బ్రహ్మపదార్థ
ముగా నిర్ణయింపబడుచున్నదై 'సర్వసారోప
నిషత్తు'నం దిటుల ప్రతిపాదింపబడినది.—
''సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ। సత్యమవి
నాశి। అవినాశి నామ దేశకాలవస్తు నిమిత్తేషు
వినశ్యత్సు యన్నవినశ్యతి తదవినాశి। జ్ఞానం
నామోత్పత్తి వినాశరహితం నైరంతర్యం
చైతన్యం జ్ఞానమిత్యుచ్యతే। అనంతం నామ
మృద్వికారేషు మృదివ, స్వర్ణవికారేషు స్వర్ణ
మివ అవ్యక్తాది సృష్టిప్రపంచేషు పూర్ణం
వ్యాపకం చైతన్య మనంత మిత్యుచ్యతే॥''
(స. సా. ఉ.) బ్రహ్మము సత్యస్వరూపమును,
జ్ఞానస్వరూపమును, అనంతస్వరూపమునైయు
న్నది. సత్యస్వరూప మనునదే అవినాశి. అవి
నాశి యనగా దేశకాలవస్తుభేదములతోఁగూడిన
ఈ యఖిలప్రపంచము నశించినను సత్యవస్తు
వనునది నశింపదు. కావున సత్యవస్తువు అవి
నాశిగా జెప్పబడుచున్నది. జ్ఞానస్వరూపమనగా
ఉదయాస్తమయరహితమైన నైరంతర్య చైత
న్యము. అనంతస్వరూపమనగా మృద్వికార
ములయందు మృత్తికవలెను, సువర్ణవికారము
లయందు సువర్ణమురీతిని, అవ్యక్తాది స్వభావ
మైన ప్రపంచములయందు చైతన్యము పూర్ణము
వ్యాపకమునగుటంజేసి అనంతము. కావున
బ్రహ్మ సత్యము, ప్రపంచము మిథ్యాభూతము,
వినాశస్వభావముగలది అని సద్గురుబోధిత శ్రుతి
స్మృతి పురాణాదుల శ్రవణాదులచేత స్వయము
గనే స్ఫురించు నిశ్చయజ్ఞానము నిత్యానిత్యవస్తు
వివేకమనబడును.

2. ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము అనగా. —“తద్వైరాగ్యం జుగుప్సాయా దర్శన శ్రవణాదిభిః। దేహాది బ్రహ్మపర్యంతే హ్యనిత్యే భోగవస్తుని॥” (వి. చూ. 21) “తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవ మేవా ముత్ర పుణ్యచితో లోకః క్షీయతే॥” (ఛాం. 81-6) కృషి వాణిజ్యాదులచేత సంపాదింపబడిన ధన ధాన్యాదు లుపభుక్తములై క్షీణించుచున్న చందమున, మిశ్రకర్మ సంపాదితమైన ఇహలోకసుఖములును, పుణ్యకర్మ సంపాదితములైన పరలోకసుఖములునుగూడ నుపభుక్తములగుచు క్షీణించునవియే” అని శ్రుతులును, “యత్కృతకం తదనిత్యం” = కర్మసంపాదితము లనిత్యములు అని యుక్తులును, సకలలోకుల దర్శన శ్రవణాదులచే యనుభవములును, ఐహికాముష్మికార్థ ఫలభోగములయొక్క అనిత్యత్వమును నిరూపించుచున్నవి. మఱియు “శరీర మాద్యం ఖలుధర్మసాధనమ్” = సర్వధర్మానుష్ఠానమునందు శరీరము ప్రథమోపకరణమని ప్రసిద్ధము. అట్లగుట నిహమందు శరీరధారణ మాత్రమున కావశ్యకములగు విషయముల (లౌకికార్థముల) గ్రహణమును, అంతకు మిక్కిలి అన్నివిషయములందును, పరలోకవిషయములయందును శరీరాది బ్రహ్మపర్యంతము అనిత్యత్వమును గుర్తించి, ఐహికాముష్మికార్థ ఫలభోగమునందు శ్వవాంతాశన మూత్రపురీషాదులయందువలె వైరస్యము (వెగటు) ను ఇహాముత్రార్థఫలభోగవిరాగ మనబడును. రాగ మనగా ప్రేమ. రాగము లేకుండుట విరాగము. విరాగము కలవాడు విరాగి. విరాగియొక్క భావము వైరాగ్యము. “బ్రహ్మలోక తృణీకారో వైరాగ్యస్యావధిర్మతః॥” (పంచదశి. 6-285) చతుర్దశ భువనములలోను శ్రేష్ఠతమమైన బ్రహ్మలోకమగు సత్యలోకము సంప్రాప్తమైనను, అనిత్యత్వబుద్ధితో దానినిగూడ తృణీకరించుటయే వైరాగ్యముయొక్క పరమావధి- సంపూర్ణత్వము. “న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే॥” (నారదపరివ్రాజక. ఉ. 3-37) అగ్నిహోత్రము డాజ్యాది హవిస్సుల చేత నతిశయముగ నభివృద్ధిం జెందునే గాని ఉపశమింపదు. అట్లే విషయభోగాభిలాషయు విషయోపభోగముచేత విశేషముగ నభివృద్ధిం జెందునే గాని యెన్నటికిని ఉపశమింపదు. “భోగే రోగభయం కులేచ్యుతిభయం విత్తే నృపాలాద్భయం। మానేదైన్యభయం బలేరిపుభయం రూపేజరాయాభయం। శాస్త్రేవాదభయం గుణేఖలభయం కాయేకృతాంతాద్భయం। సర్వంవస్తుభయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయం॥” (భర్తృహరి.) ఇతి మీాఱిన విషయభోగానుభవమునందు రోగభయము గలదు. సత్కులభవమునందు భ్రష్టత్వభయము గలదు. ధనికత్వమునందు నృపాలాగ్ని తస్కరాదిభయము గలదు. “చత్వారో ధనదాయాదాః ధర్మాగ్ని నృపతస్కరాః। తస్య జ్యేష్ఠావమానేన త్రయః కుప్యంతి సోదరాః॥” ధర్మము అగ్ని నరపాలుడు తస్కరుడు నను నీ నలుగురును ధనమునకు దాయాదులు (జ్ఞాతులు). వీరియం దగ్రజునియొక్క అవజ్ఞచేత కడమ మువ్వురు సోదరులును క్రుద్ధులగుదురని ఆర్యోక్తి. సుహాసమునందు వార్ధకభయము గలదు. శాస్త్రవైదుష్యమునందు ప్రతివాది పండితభయము గలదు. అహంకారమునందు దైన్యభయము గలదు. శరీరబలమునం దరిభయము గలదు. సద్గుణవిశిష్టతయందు దుర్జనభయము గలదు. శరీరమునందు మృత్యు

భయముగలదు. ఇట్లరసిచూచిన లోకమున విషయములన్నియు భయరూపములే యగుటం జేసి యీ సంసారము మహాభయంకరమైనది. వైరాగ్యము అనగా విషయేచ్ఛారహితత్వము ఒక్కటిమాత్రము అభయస్వరూపము. అందు వలన భయావహమైన ఐహికాముష్మిక సుఖాను భవేచ్ఛను పరిత్యజించి భయాపహమైన వైరా గ్యము నవలంబింపవలయును. "పరిణామతాప సంస్కారదుఃఖైః గుణవృత్తి విరోధాశ్చ దుఃఖ మేవ సర్వం వివేకినః॥" (పతంజలి. సూ. 15) ఇహపరలోక సుఖభోగములన్నియు పరిణామము తాపము సంస్కారము దుఃఖమును స్వభావ ముగా గలవియగుటచేతను, సత్త్వరజస్తమో గుణములయొక్క వృత్తులు పరస్పర విరుద్ధము లగుటవలనను, లౌకికవిషయసుఖములన్నియు వివేకవంతునకు దుఃఖములే. అనగా లోకమునం దఖిల విషయములును అనృతదుఃఖరూపములు గాని సత్యసుఖరూపములుగావు కనుక దుఃఖ ప్రదములు, సుఖదాయకములు గానేరవని వివేకవంతుని నిశ్చయమని యర్థము. "విష యాశా మహాపాశాద్యో విముక్తః సుదుస్త్య జాత్। సఏవకల్పతే ముక్త్యైనాన్యః షట్శాస్త్ర వేద్యపి॥" (వి. చూ. 80) సులభముగ విడువ నలవిగాని విషయములనెడి మహాపాశముల వలన నుండి విముక్తుడైన మహాత్ముడే అపవర్గ సుఖమును బొంద నర్హుడు. షట్శాస్త్రముల యందు దసమాన ప్రతిభాన్వితుడైనను విషయ రూప మహాపాశబంధములవలననుండి విముక్తిని బొందనేరని విషయలోలుడు అపవర్గసుఖము నెన్నటికిని అధిగమించనేరడు. "న వైరాగ్యా త్పరం భాగ్యం న బోధా దపరస్సఖా। న హరే ర పరస్త్రాతా న సంసారాత్పరోరిపుః॥" (భారతము) వైరాగ్యముకంటె మించిన భాగ్యము లేదు. జ్ఞానముకంటె మించిన సుహృదుడు లేడు. శ్రీ హరికంటె మించిన సంరక్షకుడు లేడు. సంసార ముకంటె మించిన శత్రువు లేదు. (సశేషము)



శ్రీరామకృష్ణాయనమః

# గృహస్థముముక్షువుల ముఖ్యకర్మములు

శ్రీ దేవరకొండ నారాయణశాస్త్రి

ముముక్షువైన గృహమేధికి ముఖ్యకృత్య ములు జపధ్యానాది పారమార్థికములా?—ధన సంపాదనాది ప్రాపంచికములా?

శరీరమునకు జ్ఞానేంద్రియములవంటివి ఆధ్యా త్మిక కర్మములు. కర్మేంద్రియముల బోలునవి ఐహికకార్యములు. కనుక, ఈ ద్వివిధకర్మము లలో నేనినిగాని యప్రధానములుగా భావించి యలక్ష్యముచేయ వీలులేదు గృహస్థముముక్షు వులకు. ఈ విషయమునకు సంబంధించిన యొక కథ జ్ఞప్తికివచ్చుచున్నది అది యిది ఒక గ్రామమున అనవరతము వేదాంతగ్రంథపఠన మననములలో మునిగి, సాంసారికకృత్యముల నెంతమాత్రము లక్షింపని యొక వేదాంతి యుండెనట. ఆయన వేదాంతవిషయముల గురించి యోచించుచు దఱచుగా "ఇత్యర్థః, ఇతిభావః" అని పలుకుచుండెడివాడట. కాల మిట్లు గడపుచుండ నతనికుటుంబమునకు దరిద్ర దశ ఘటిల్లకుండునా?—ఘటిల్లినది. అట్టిస్థితిలో

ఒకనాటి మధ్యాహ్నసమయమున నతడు స్నానముచేసి భోజనముచేయుటకై వంటయింటిలోనికి బోయి కూర్చుండ నతనిభార్య విస్తరివేసి ప్రక్కన నీరుంచి యూరక నిలుచుండెనట. అప్పుడతడు ‘‘ఏమట్లు నిలుచుంటివి? వడ్డించు. ఏమిచేసినావీ దినము వంట? నంజుకొనుటకేమున్నది?’’ అని యడుగ, వెంటనే యాగృహిణి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెనట: ‘‘ఇంటిలో నేమున్నది వండుటకు? ముందు తెచ్చిన బదుళ్లనే యింకను ఈయకుండుట వలన ఎవ్వరును బదులుకూడ నీయరు. నేనేమైన జెప్పవచ్చిన నా మాటయే వినిపించుకొనక ‘ఇత్యర్థః, ఇతిభావః’ అని జపించుచుందురు. ‘‘ఇత్యర్థాలనే నంజుకోండి. ఇతిభావాలనే తినండి.’’ కాబట్టి సంసారులై యుండియు సాంసారిక కార్యముల నిర్లక్ష్యముచేసిరేని వారికి బైకథలోని సతీమణి వచించినట్లు ‘ఇత్యర్థాలు, ఇతిభావాలు’ ఆహారముకావలసివచ్చును. దేహధారణమున కాధారమైన యశనమే యభావమైనచో అమృతత్వప్రాప్తియేమో కాని మృతత్వప్రాప్తికి సందేహములేదు.

ఐనను, ‘‘కం. తినుటకు సరిపడు ద్రవ్యం - బును దగనార్జింపు మధికము గడింపగగో - రిన వ్యర్థముసుమ! జీవిత - మును వృథగావింప కట్టిమూర్ఖత్వమునన్.’’ అను విజ్ఞుల సూక్తిని బాటించి, యన్నవస్త్రాద్యత్యావశ్యకవస్తువులకు గావలసినంత ధనము సంపాదింప యత్నింపవలయును కాని, ఐహికభోగముల నధికముగా అనుభవించుటకై గడింప దొడగరాదు. ఏలయన, అది మోక్షసాధనలకు విఘ్నకారి ‘‘శ్లో. భోగైశ్వర్య ప్రసక్తానాం - తయాపహృతచేతసాం - వ్యవసాయాత్మికాబుద్ధి - స్సమాధౌన విధీయతే’’ అని కదా శ్రీ కృష్ణుడర్జునునకు జేసిన హితబోధ!

ఇక, ఈ యుపదేశము ననుసరించి యందఱును అన్నవస్త్రాది ముఖ్యవస్తువులకు జాలినంత మాత్రమే సంపాదింపబూనిన, దేశముయొక్క ఐశ్వర్యము తగ్గిపోవుట కవకాశము కలుగునే యని కొందఱువిశాలబుద్ధులు ప్రశ్నింపవచ్చును. ఈ ప్రశ్నమునకు సమాధానముగా ‘‘సర్వమానవులును బ్రహ్మచర్యము నవలంబించిన యెడల ప్రపంచము నిర్మానుష్యమగునే’’ యను శంకకు గాంధితాతగారు వక్కాణించిన యీ క్రింది సమాధానమునే గ్రహింపదగును. ‘‘మనము వర్తకమునకో వైద్యమునకో ప్రారంభించునప్పుడు లోకులందఱా వృత్తికే దిగిన యెడల లోకముగతి యెట్లుండునని చింతిల్లెదమా?’’ (ఆరోగ్యసాధనము.) సకలజనులు నేకవిధప్రకృతిగలవారగుట భూతకాలమునజరిగి యుండని సంగతి. కావున, నిష్ఫలాలోచనలను మాని, కార్యసాఫల్యమున కనుకూలించు మార్గము ననుసరించుటయే మనీషావంతులపని. ఐహికాముష్మిక కర్మముల నుచితరీతి నాచరించుట మోక్షాపేక్షగల గృహస్థులకు నిష్కంటకమైన ముక్తిపథము.

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
4-2-'16.

ప్రియ దే...

నీవు చాలవఱకు మనశ్శాంతిని బడసితివని తెలియుచున్నది. అదియే మనకు గావలసినది. ''ఓ మనస్సా! శరీరము దుఃఖమును జూచుకొనునుగాక! నీవు ఆనందముతోనుండుము''—ఇది శ్రీరామకృష్ణ గురుదేవుని లక్ష్యము. ఈ మార్గము ననుసరించినచో మనుష్యుడు తప్పక శాంతిని బొందగలడు. ఎల్లప్పుడును మనస్సును భగవానునియందు లగ్నముగావించుటయే ఆనందమనజెల్లును. దేహధారణమున దుఃఖమవశ్యభోక్తవ్యము. అట్లని భగవంతుని మఱువనేల? దుఃఖము చిరస్థాయికాదు. దుఃఖమును కష్టములును వచ్చినట్లువచ్చిపోవును. కాని, భగవంతుడు చిరస్థాయి; అవలంబనీయుడును. శరీరము సుఖదుఃఖములలో దేనినయినను ననుభవింపవచ్చును. వీనిని స్వీకరింపక మనస్సును సర్వకాల సర్వావస్థలయందును ఆనందమయుడగు పరమాత్మ స్మరణయందు మిళితము చేయుటయే యత్యుత్తమమగు కార్యము.

నీవు వచించునది సరియే. కాని యట్టి దృఢవిశ్వాసము గలుగుట మిక్కిలి కష్టము. సత్సంగము సద్విషయాన్వేషణము, సద్గ్రంథపఠనము—వీనివలన వలయు సాయము బడయవచ్చును. పిదప నిరంతరాభ్యాసమువలన మనస్సు పరిపక్వము చెందవచ్చును. భగవచ్ఛరణాగతుడై యుండుట యన్నింటికంటెను అత్యంతసులభోపాయము. నీవు శ్రీ బ్రహ్మానందస్వాముల వారిని, శ్రీ ప్రేమానందస్వాములవారిని కలిసికొంటివని విని నిన్ను మిక్కిలి ధన్యునిగా దలంచుచున్నాను. వారితోడిసాంగత్యము దుర్లభము, అమోఘము. నీవు స్వయముగా ఆ భాగ్యము ననుభవించియుండ నింక నేనేమి చెప్పవలయును. వారికి నా హృదయపూర్వక ప్రేమప్రణామముల దెలుపుము. వారిదర్శనము వలన మహానందము నందితివి. నిన్ను కృతార్థుని జేసికొంటివి. ఇదంతయు నిజముగా పూర్వపుణ్యఫలమే యని తెలిసికొనుము. నీ భాగ్యమువలన వారు నీయొద్ద నున్నంతకాలము వారికి సేవలుచేయుము; నీ జీవితమును ధన్యము, సార్థకముగావించుకొనుము. ఇట్టియవకాశము నీకు మఱియెన్నడును లభింపబోదని గుర్తెఱుంగుము. శ్రీ బ్రహ్మానందస్వాములవారెట్లుండిరో నాకు దెలుపుము. నీమూలమున వారు నా విషయమును దెలిసికొనుచున్నారని విని సంతసించుచున్నాను. వారికి నా హృదయపూర్వక ప్రణామములు.

ఇట్లు,
శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద



శ్రీరామకృష్ణశరణమ్

ఆల్మోరా,
18-6-'16.

ప్రియ దే...

మత్స్యమాంసాద్యాహారములగూర్చి యడిగితివి. ఈ విషయమున వివిధాభిప్రాయములు గలవు. ఒక్కొక దేశమున నొక్కొక్కవిధమయినయాచారవ్యవహారములుగలవు. అదియునుగాక మనుష్యప్రకృతులుగూడ గమనింపవలయునవియే. శరీరమునకు దగిన యాహారమును గైకొనవలసియుండును. లోకో భిన్న రుచి యన్నట్లు ఒకేయాహార మొకరికి సరిపడవచ్చును, మఱియొకరికి సరిపడకపోవచ్చును. శరీరము వ్యాధిగ్రస్తమయినపుడు ఆ శరీరానుగుణ్యమగు నాహారము నరయుట వేఱువిషయము, చికిత్సాశాస్త్రములందు దీనికి దగు విధానములు గలవు. నిషిద్ధవస్తువులును వేర్కొనబడియున్నవి. ఇట్లు మన శరీరమునకు దగిన ప్రయోగము లనేకములు గలవు. మొత్తముమీద ఎట్టి యాహారమును భుజించిన శరీరమును మనస్సును ఆరోగ్యముగ నుండునో దేనివలన నెట్టి పీడయు కలుగదో యట్టి యాహారమే శ్రేష్ఠమయినది. ఒకనికి సాత్త్వికాహారమగునదియే మఱియొకని కసాత్త్వికము గావచ్చును. ఇది స్పష్టముగా గోచరించును. పాలు అన్నింటికంటెను నుత్తమమగు నాహారము. దానివలన నించుమించుగా నెల్లరకును తేజస్సు, పుష్టి మొదలగు సద్గుణములు లభించును. అదియే సర్పమున కాహారమగుచో విషోత్పత్తికి కారణభూతమగును — "ఫణి పీత్వాక్షీరం వమతి గరళం దుస్సహతరం."

శ్రీరామకృష్ణ గురుదేవుని యుపదేశములందిది ముఖ్యమగునది: "దేనివలన మనస్సు భగవానునియందు సుస్థిరమై నిల్చునో యదియే శ్రేష్ఠమగు నాహారము. ఇదియే ఆ ఆహారము సాత్త్వికమా? అసాత్త్వికమా యని గుర్తింపగల యుపాయము. ఏలనన మనస్సు భగవదభిముఖమగుటయేకదా సాత్త్వికభావ గమ్యము. శ్రీ వివేకానందస్వాములవారును భక్తియోగమున ఆహారమునుగూర్చి ప్రత్యేకముగా విమర్శించియున్నారు. దేనివలన మనశ్శరీరములు చక్కబడునో యట్టి యాహారమునే సేవింపవలయును. మనస్సుమాత్రము భగవానునియందు లయింపవలయును. అదియే మన కర్తవ్యము. శరీరమును పుష్టికరముగ నుంచుకొని విషయసుఖాభిలాషులగువారికే విధినిషేధము లన్నియును. భగవద్భజనాసక్తులగువారియందీ విధినిషేధములు విపరీతములు గావచ్చును— సాఫల్య నైష్ఫల్యములు రెండును కలుగవచ్చును, కలుగకపోవచ్చునుగూడ. వారి లక్ష్యము భగవద్భజనయేగదా! శరీరము స్వస్థముగానున్నచో భగవద్భజన గావింపవచ్చును. కావున సదా భగవద్భజనానుకూలమగు నాహారమునే సేవించుట యుత్తమము.

ఇట్లు,
నా శుభాశీర్వచనములు,
శ్రీ తురీయానంద

# రాయలసీమ క్షామనివారణయందు శ్రీరామకృష్ణ సేవాసంఘ సహాయోద్యమము

రాయలసీమయందు నేడు ప్రబలిన కాటకము వర్ణనాతీతమని ప్రతి ఆంధ్రునకును దెలిసినవిషయమే. ఆహార పానీయములు లేక ప్రజలు అల్లల్లాడిపోవుచున్నారు. మిక్కుటమయిన ఎండలవలన, వర్షాభావమువలన పంటలు నశించుటయేకాక బావులు, చెఱువులు మున్నగునవన్నియు ఎండిపోయి, త్రాగుటకు సయితము నీరు దొరకక నానావస్థలకు ప్రజానీకము లోనుగావలసివచ్చినది. ప్రజలతోపాటు పశువులుగూడ మేత, నీరు లేక క్రుంగి కృశించి పోవుచున్నవి.

ఇట్టి భీభత్సపరిస్థితి యిటీవల నెప్పుడును సంభవింపలేదు. ఈ సమయమున 'అన్నమో రామచంద్రా' యనుచు నలమటించుచున్న ప్రజలకు సహాయము చేయుటకు శ్రీరామకృష్ణ (మిషన్) సేవాసంఘము పూనుకొన్నది. శ్రీరామకృష్ణసంస్థకు 'ఆంధ్రప్రభ' గూడ తోడు నీడయగుట వలన ఈ సంస్థవారు క్షామపీడితుల కపార సహాయము చేయగలుగుచున్నారు. ప్రతి దినము సోదరమానవసేవకై సేవాదళమునందు యువకులు విరివిగాజేరి కార్యక్రమమును చక్కగా నిర్వర్తించుటయందు ఈ సంస్థకు సహాయము చేయుచున్నారు.

రాజమహేంద్రవరమునందలి శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీనిత్యబోధానందస్వాముల వారు రాయలసీమ క్షామనివారణ కార్యక్రమమునకు బూనుకొని సేవాదళమును సమకూర్చి ఆంధ్రప్రభ నిధి సాయమున నచ్చటి క్షామపీడితుల కత్యంత సహాయము చేయుచున్నారు. వీరి సేవ నిరుపమానమని జిల్లా కలెక్టరులు మున్నగువారెల్లరు ప్రశంసించుచున్నారు.

శ్రీస్వాములవారు రాజ్యాంగమువారితో సంప్రతించి క్షామపీడిత ప్రాంతములకు ఉచిత రవాణా సౌకర్యములనుగల్పించి పల్లెపల్లెకు సాయము గావించుచున్నారు. ధనియర్ల చెఱువులో శ్రీరామకృష్ణసేవాసంఘము వారు ధాన్య పంపక కేంద్రమును ప్రారంభించిరి. దానికి అనంతపురము జిల్లాకలెక్టరు టి. జె. జాక్సన్ ప్రారంభోత్సవము చేశారు. ఈ కేంద్రంలో కొనుగోలుశక్తి నశించి నిరుపేదలయిన క్షామపీడితులకు ఉచితముగా ధాన్యము పంచి పెట్టుచున్నారు. 10 వ తేదీనాడు నంబులపల్లి కుంట గ్రామములో శ్రీరామకృష్ణ సేవాసంఘము వారు మరొక ధాన్యపంపక కేంద్రమును స్థాపించి రోజుకు తలకు ఎనిమిది ఔన్సుల ధాన్యమువంతున పంచిపెట్టుచున్నారు. ఈ కేంద్రములలో ఒక్కొక్క దానియందును దాదాపు ఎనుబది కుటుంబములవారికి తలకు

రోజుకు 8 ఔన్సుల వంతున ఉచితముగా ధాన్యము పంచిపెట్టుచున్నారు. మొత్తము మీద నిట్టి కేంద్రములు చిత్తూరు నందు, రెండు, కడపజిల్లాయందు అయిదు, అనంతపురము జిల్లాయందు రెండును ప్రారంభింపబడినవి. ఈ కేంద్రములన్నింటియందును ఒక్కొక్కదానియందు సరాసరి 300 బాధితులకు సహాయముచేయబడుచున్నది. చిన్న బిడ్డలకు పాలిచ్చుటకు కడపజిల్లాలో 4 కేంద్రములు ప్రారంభింపబడినవి. అందు ప్రతిరోజు సరాసరి 640 పిల్లలు రోజునకు రెండుపూటలు పాలు పుచ్చుకొనుచున్నారు.

బద్వేలి తాలూకా అంబవరము గ్రామమునందు అగ్నిప్రమాదమువలన ఇండ్లన్నియు కూలిపోగా శ్రీరామకృష్ణమిషను కార్యకర్తలు అచ్చటికి హుటాహుటినేగి బాధితులకు ఆహార ధాన్యపంపక కేంద్రమును నెలకొల్పి సహాయము చేయుచున్నారు. అగ్నిప్రమాదమువలన సర్వస్వమును గోలుపోయిన కుటుంబీకులకు మిషనువారు వస్త్రాలుగూడ పంచిపెట్టుటకు ఆలోచించుచున్నారు. తుమ్మలచెరువు చుట్టుప్రక్కల బావులను లోతుచేయుటకు మిషనువారు 1,700 రూపాయలు ఖర్చుపెట్టి యున్నారు. ఇట్టివి అనేకము గలవు.

తూర్పుగోదావరి జిల్లా వేళంగి గ్రామస్థులు పంపిన 250 బస్తాల బియ్యము, 60 బండ్లగడ్డి మిషనువారు కృతజ్ఞతతోనందుకొనియున్నారు. ఈ సందర్భమున తమకు దోడ్పడిన వేలాది సోదర మానవులకు మిషనువారు కృతజ్ఞత తెలుపుచున్నారు. ఇట్టి ధాన్యపంకము గడ్డి పంపకము కేంద్రములు, గంజి సత్రాలు అవసరమునకు దగినన్నింటిని బ్రారంభించుటకు మిషను వారు బద్ధకంకణులైయున్నారు.

పశువులకు ఉచితముగా గడ్డి పంచిపెట్టుటకు గడ్డి డిపోలుగూడ శ్రీరామకృష్ణ సేవాసంఘమువారు స్థాపించియున్నారు. ఈ కార్యమునందు సేవాసంఘమునకు 'ఆంధ్రప్రభ' చేయుచున్న సహాయ మనిర్వచనీయము. ఆంధ్రప్రజానీకము సోదరాంధ్రులకు సాయముచేయుటయందు శ్రీరామకృష్ణ సేవాసంఘమువారికి తోడ్పడుదురు గాత!

విరాళములు పంపగోరువారు,

కార్యదర్శి, శ్రీరామకృష్ణమిషన్, మైలాపూరు, మద్రాసు అనుచిరునామాకుగాని, శ్రీ నిత్యబోధానందస్వామి, రామకృష్ణసమాజము, కడప అను చిరునామాకుగాని పంపవలసినదిగా బ్రార్థించుచున్నాము.

ఎంతటి స్వల్ప విరాళములయినను కృతజ్ఞతతో నందుకొనబడును.

# సురజ్‌మల్స్




**313, ఎస్ప్లనేడ్, మద్రాసు.**

8—(S—10)




(L G 8-10)

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకా తాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

432 పుటలు పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3-0-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముగ్ధలాలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |
| గురూపదేశములు | ... | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | ... | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | ... | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | ... | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | ... | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | ... | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | ... | 0 | 1 | 0 |
| నా మతము 0 0 6 | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన 0 0 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-4-52.

# శ్రీ రామకృష్ణ ప్రభ

౧౯౫౨, మే—నందన, వైశాఖము

సంపుటము ౮ | సంచిక ౧౧






శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు

చెన్నపురి

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు నుంచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్‌వారి స్టాల్సులోఁ గాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య ను జ్ఞాపకరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములే కాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ శ్రీ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాను వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ } ౧౯౫౨ – మే : : నందన – వైశాఖము { సంచిక ౧౧

## ప్రార్థన

కల్యాణానాం నిధానం కలిమలమథనం పావనం పావనానాం
పాథేయం యన్ముముక్షోః సపది పరపదప్రాప్త ప్రాప్తయే ప్రస్థితస్య
విశ్రామస్థానమేకం కవివరవచసాం జీవనం సజ్జనానాం
బీజం ధర్మద్రుమస్య ప్రభవతు భవతాం భూతయే రామనామ ॥

ధర్మవృక్షమునకు బీజమైనదియు, సకలశుభములకు పుట్టినిల్లయినదియు, కలిమలధ్వంసకారియైనదియు, పావనముచేయగలవానినన్నింటిని పావనముచేయగలిగినట్టిదియు, శీఘ్రముగా పరమపదాభిలాషులగు ముముక్షువులకు ఆహారసదృశమును, కవివరుల వాక్కులకు విశ్రామస్థలోపమమును, సజ్జనులకు జీవమైనట్టిదియు నగు శ్రీరామనామము మీ యందరికి సంతోషము నిచ్చుగాక.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

28 నవంబరు, 1883.

కేశవుని కమలకుటీరమునుండి దక్షిణేశ్వరమునకు పోవుచు దారిలోనుండిన జయగోపాలసేనుని ఇంట శ్రీరామకృష్ణగురుదేవుడు కొంత కాలము విడిసెను. అప్పటికి సుమారు రాత్రి 7 ఘంటలయ్యెను.

జయగోపాలుని యింట అతని బంధువులు, మిత్రులు వేచియుండిరి. శ్రీవారు రాగానే జయగోపాలుని సహోదరుడైన వైకుంఠుడు, "అయ్యా! మేము సంసారులము. మా కేదైన తగిన ఉపదేశ మీయవలెను" అని ప్రార్థించెను.

శ్రీరామ:—భగవంతుని తెలిసికొని, ఒక చేతిని ఆయన పాదపద్మములందుంచి మరియొక చేతితో సంసారకార్యములను నిర్వహింపుము.

వైకుంఠుడు:—అయ్యా! సంసారము మిథ్యయా?

శ్రీరామ:—ఎంతకాలమువరకు మనము ఆయననుగుర్తింపలేకున్నామో అంతవరకుమిథ్య. అంతవరకు మనుష్యుడు ఆయనను మరచి, 'నాది, నాది' అనుకొనుచుండును. మాయచే కట్టువడి కామకాంచనములకు వశుడై ఇంకను మునిగిపోవును. మాయచే మానవుడు చెప్ప లేని అజ్ఞానిగా మారి తప్పుకొనిపోవుటకు మార్గమున్నప్పటికి తప్పుకొనలేడు.

ఒకపాట గలదు : దాని భావమిది :

"మహామాయయొక్క శక్తి ఎంత యద్భుతమైనది! బ్రహ్మ విష్ణువులే గ్రహింపరానిది. అచైతన్యజీవులేమి గ్రహింపగలరు.

చిన్నకాలువ త్రవ్వి దోనె అచ్చట పెట్టబడును. మీనము దానిలోనికి దూరి తిరిగివచ్చుటకు మార్గమున్నప్పటికి బయటకురాదు.

పట్టుపురుగు తాను చేసికొనిన పంజరమునందే పడి చచ్చును కాని తప్పించుకొనదు.

మహామాయయొక్క పంజరము చాల విచిత్రమైనది."

మీరందరు స్వయముగా సంసారము మిథ్య యని గ్రహించుచున్నారు. ఈ విధముగా తలంపుము. ఎందరో వచ్చిరి, ఎందరో పోయిరి. కొందరు పుట్టిరి, చచ్చిరి. ఈ ప్రపంచము ఇప్పుడున్నది, మీదనుండదు. అశాశ్వతమైనది. ఎవరిని ఇప్పుడు 'మావారు, మావార'ని చెప్పుచున్నావో వారు కండ్లుమూసికొన్న ఋణాను బంధము తీరును. దగ్గరచుట్టము లెవరు లేక పోయినప్పటికి, మనుమనికొరకు కాశీకికూడ పోవరు. 'అయ్యో! నా హరునికి ఏమి సంభవించునో' యని వారి భయము. ఇట్టి సంసారము మిథ్య, అనిత్యము.'

ఒకరు:—అయ్యా! సంసారమే మిథ్యయైనచో ఏల నేను ఒకచేతితో ఈశ్వరుని మరొకచేతితో సంసారమును పట్టుకొనవలెను.

శ్రీరామ:—ఆయనను కనుగొనిన పిమ్మట సంసారములో నుండిన అది అనిత్యముకాదు. దీనిని ఉదాహరించు పాట యొకటి గలదు.

(పాట భావము)

ఓ మనస్సా! నీవు కృషికర్మ నెఱుగవు. ఇట్టి మానవక్షేత్రము నీ యెదుటబడియున్నది.

కృషిచేసిన బంగారము పండగలదు. కాళీనామ ముతో కంచెగట్టినచో నీ చేను భద్రముగా నుండగలదు. ఆ ముక్తకేశి (కాళీదేవి) గట్టి కంచెను యముడుసైతము దాటజాలడు. నేడో శతాబ్దానంతరమో నీ భూమియంతయు జప్తి చేయబడును. కావున ఏకమనస్కుడవై కోతకోసి పంటను నిలుసేర్పుము. గురుదత్తబీజమును వెద వెట్టి భక్తి వారిని పారింపుము. అది కష్ట మయినచో రామప్రసాదు సహాయము నభిల షింపుము.

శ్రీరామ:—పాటను వింటివా? కాళీనామ మున కంచెగట్టినచో నీపొలమున కేభయ మును లేదట. భగవచ్ఛరణాగతుడవుగమ్ము. సకలమును నీకు లభించును. ఆ ముక్తకేశి కంచె గట్టిదైనది. దానిని యముడుసయితము సమీా పింపజాలడు. గట్టి కంచె. భగవానుని బడయ గలిగినచో సంసార మసారముగా గోచరించును. ఆయనను గనుగొనగలవారు జీవజగత్తంతయు భగవత్స్వరూపమే యని గ్రహింపగలరు. నీవు పిల్లలకు భోజనమిడుచున్నను సాక్షాత్ శ్రీకృష్ణ భగవానునకు నివేదనమిడుచున్నట్లు నీ మనస్సున భావింపవలయును. తల్లిదండ్రులను దేవిదేవరల వలె గౌరవించి సేవింపవలయును. భగవద్ జ్ఞానము సిద్ధించిన తరువాత సంసారమున నున్నపుడు భార్యతో నైహికసంబంధముండ నేరదు. ఇరువురును భక్తులగుదురు. కేవలము భగవద్విషయమే మాటాడుదురు. భగవన్నా మాలాపమే వారికి రుచించును. భక్తుల సేవిం తురు. సర్వభూతములందును భగవానుడే విరా జిల్లుచున్నట్లు సమస్తమునందును ఆయనను సేవింతురు.

ఒకవ్యక్తి:—అయ్యా! ఇట్టి భార్యాభర్త లివు డెచ్చటను గనుపింపరే?

శ్రీరామ:—ఉన్నారు; కాని చాలతక్కువ. విషయాసక్తులగువారిట్టివారిని త్వరలో గను గొనజాలరు. అయినను ఇది జరుగవలయునన్న భార్యాభర్తలిరువురును సజ్జనులు కావలయును. ఇరువురును భగవదానందమును బడయగలిగి నపుడే యిది సాధ్యమగును. దీనితోబాటు భగవత్కృపయు నత్యంతావశ్యకము. అది లేనిచో నెల్లప్పుడు నభిప్రాయభేదము గలుగు చుండును. అపుడొకరినివిడిచి యొకరుండవలసి వచ్చును. ఇరువురును ఏకీభవింపజాలనిచో చాల కష్టము కలుగును. భార్య లేయింబవ ళ్లిట్లు పలుకుచుండును: 'అయ్యా! తండ్రి నన్ని మను వేల యిచ్చెను? నాకా, భోజనములేదు, పిల్లలకును లేదు. చీరలా అసలే లేవు. పిల్లలకు బట్టలు లేవు. ఒక్కనగయైనను లేదు. నీవు నన్నేమి సుఖపెట్టితివి? కండ్లుమూసికొని యెల్ల ప్పుడు 'దేవుడా, దేవుడా' యని జపించు చున్నావు. ఇక నీ యీపిచ్చిపనులు చాలునులే.'

ఒకభక్తుడు:—ఇట్టి యాటంకములు గలవు. అంతేగాదు. బిడ్డలుగూడ దుండగీండ్రు గావచ్చును. ఇంకను ఎన్నెన్నియో యాపదలు గలవు. అయితే మా కుపాయమేది?

శ్రీరామ:—సంసారముననుండి భక్తిసాధన సలుపుట చాలకష్టము. ఎన్నియో యాటంక ములు కలుగుచుండును. మీాకు దెలియని దేమున్నది? రోగము, శోకము, దారిద్ర్యము, స్త్రీవివాదము, దుష్టసంతతి—ఇట్టివనేకము. కాని ఉపాయము లేకపోలేదు. అప్పుడప్పుడు నిర్జనస్థలమునకుబోయి భగవత్ప్రార్థన గావింప వలయును. భగవత్సాక్షాత్కారమునకై ప్రయ త్నింపవలయును.

ఒకడు:—అట్లయిన ఇల్లువదలిపోవలయునా యేమి?

శ్రీరామ:—సంపూర్తిగా (మూలముట్టుగా) కాదు. నీ కవకాశము లభించినపుడెల్ల ఒండు రెండు దినములు నీవు నిర్జనస్థలమున గడుప వలయును. అపుడు నీకు సంసారముతో నెట్టి సంబంధము నుండగూడదు. ఎట్టి విషయాసక్తులతోగూడ సాంసారిక ప్రసంగములు చేయరాదు. అట్టి నిర్జనవాసము లభింపనిచో సాధుసంగమ మాచరింపుము.

ఒకడు:—సాధువు నెట్లు గుర్తింపగలను?

శ్రీరామ:—ఎవరి మనఃప్రాణములు అంతరాత్మయగు భగవానునితో లయమగునో అతడే సాధువు. కామకాంచన త్యాగియే సాధువు. సాధువు తనభార్యను ఐహికదృష్టితో జూడక ఆంతరంగికదృష్టితో జూచును. అతడు స్త్రీల మధ్య నుండవలసినపుడు వారలను దనతల్లివలె జూచుచు పూజించును. భగవచ్చింతనము గావించువాడే సాధువు. అతడు భగవదన్యవిషయమును మాటాడడు. సకలభూతములందును భగవానుడే యున్నాడని తలచి వానిని సేవించును.

ఒకడు:—నిర్జనస్థలములం దెల్లప్పుడు నుండవలయునా?

శ్రీరామ:—బాటల కిరువైపుల నున్న చెట్లను జూచియున్నావుగదా? అవి చిన్నవిగా నున్నపుడు వానిచుట్టును కంచె వేతవలయును. లేనిచో గొడ్లు మేకలు ఆ మొక్కలను దిని వేయును. మొక్క మ్రానయిన తరువాత కంచె అవసరము లేదు. ఏనుగును గట్టినను ఆ చెట్టు విరుగదు. నీ మనస్సుగూడ అట్లే దృఢము గావింపగలిగిన పిదప నే భయమును లేదు. వివేకివగుటకు ప్రయత్నింపుము. అరచేతితో నూనెనంటి పనసపండును కోయుము. అపుడు ఆ పాలు నీ చేతికంటదు.

ఒకడు:—వివేకమనగా నేమి?

శ్రీరామ:—భగవంతుడే సత్తు. తక్కినదెల్ల నసత్తు. ఇదియే విచారము. సత్తనగా నిత్యవస్తువు. అసత్తు అనిత్యమయినది. వివేకము గలవాడు భగవానుడే సద్వస్తువనియు మిగిలినదెల్ల నసత్తనియు గ్రహించును. వివేకోదయము కాగానే భగవద్దర్శన కుతూహలము గలుగును. అసత్తును ప్రేమించినచో అనగా శరీరసుఖము, గౌరవము, ధనము—వీనిని ప్రేమించినచో సత్స్వరూపుడైన భగవంతుని దెలియవలయునన్న యభిలాషయే కలుగదు. సదసద్విచారబుద్ధి కలిగినంతనే భగవదన్వేషణాభిలాష పొడమును. ఈ పాట వినుము.

(పాట భావము)

ఓ మనస్సా! ఒకమారు షికారుపోవుదము రమ్ము. కాళి యను కల్పవృక్షముక్రింద నాలుగు విధములగు ఫలముల బడయుదువు. ప్రవృత్తి నివృత్తి యను నీ భార్యలిరువురలో నివృత్తిని నీతో దీసికొనిపొమ్ము. దానిపుత్రుడగు వివేకుని తత్త్వకథను జెప్పుమనుము. ఓ మనసా! శుచి యశుచులను గమనింపక నిరువైపుల వాని నుంచుకొని నీవు హాయిగా నిద్రింపగలవు. వీరిరువురను సంతోషపెట్టి యొకయింట నుంచగలిగినచో తల్లి శ్యామాదేవిని పొందగలవు. అహంకారము, అవిద్య యను నీ తలిదండ్రులను పారద్రోలుము. మోహము నిన్ను గుంటలోబడద్రోయ దలంచినచో ధైర్యమువిడువక పటుత్వముతో నుండుము. ధర్మాధర్మము లను రెండు మేకలను అల్పదృష్టితో నురికంబమునకు కట్టిపెట్టుము నీ మాటనుమీరినచో వానిని జ్ఞానఖడ్గమునకు బలినిమ్ము. ప్రథమభార్య పుత్రులకు దూరమునుండియే యుపదేశింపుము. వారు విననిచో జ్ఞానసింధువున ముంచివేయుము. రామప్రసా దిట్లు పలుకు

# శ్రీ బుద్ధ భగవానుడు

(గత సంచిక తరువాయి)

అర్థరాత్రమున సిద్ధార్థుడు చెన్నుని బిలిచి తన ప్రియకంటకము నాయత్తముచేయ బనిచెను. ప్రయాణమునకు పూర్వము యశోధర గదిలోనికిబోయి చిట్టచివరిసారి తనకుమారుడు రాహులుని యశోధరను జూచెను. కాని పూనుకొన్న మహత్కార్యమునకు ప్రియ పత్నీ ప్రేమను పుత్రవాత్సల్యమును బలియొసంగెను. అంతట నత్యంత వేగముగ ప్రయాణమై చాల దూరముపోయి మార్గమధ్యమున తన వేషమును మార్చుకొని 'అనోమా' నదీతీరమును జేరెను. అచ్చట చెన్నునిజూచి, 'చెన్నా! ఇక నీవు మఱలిపొమ్ము' అని పలికెను, కాని ఎన్ని విధముల బ్రతిమాలి వేడుకొన్నను సిద్ధార్థుడు ఇంటికి మఱల నిచ్చగింపడయ్యె. ఇక తన యజమాని తనపై నెక్కడుగదా యని దుఃఖించి కన్నీటి కాలువలలో బడి కంటకము మరణించెను. జగత్కల్యాణమునే లక్షించిన గౌతముడా యనోమానదిని దాటి రాజగృహాభిముఖుడయ్యెను. అచ్చట నెన్నియో గుహలు గలవు. ఆగుహలయం దెందఱో కఠోరతపస్సు చేయుచుండెడివారు. ఆలారకాలమను తపస్వికి శిష్యుడై కొంతకాలము గౌతముడు తీవ్రనిష్ఠాపరాయణుడై తపమాచరించెను. కాని తనకోర్కె ఫలించినదికాదు. పిమ్మట వారిని వదలి గౌతముడు వృద్ధకుడను శాస్త్రీయపండితుని దర్శించి యతనియొద్ద యోగశాస్త్రముల పఠించెను. శాస్త్రానుగుణ్యములగు సాధనల కుపక్రమించెను. శారీరక తపమువలన నభీష్టసిద్ధి కావచ్చునని కృచ్ఛ్రసాధనలకు పూనెను. ద్వితీయగురువునుకూడ వదలి ఉరావెళయను గంభీరారణ్యమున ఆహారము కొంచెము కొంచెము తగ్గించుచు తపమును బ్రారంభించెను. ఈ కఠోర తపస్సున కుప్పొంగి యైదుగురు శిష్యులువచ్చి ఆయనను సేవింప మొదలిడిరి. క్రమేపి శరీరము కృశింపదొడంగెను. చివరకు కండ్లు లొట్టలువడెను. శరీరమంతయు నస్థిపంజరమయ్యెను. ఉదరము వెన్నెముక నంటెను. ఈ ఎముకల నవలీలగ లెక్కింప వీలైయుండెను. ఈ శిష్యులందఱును 'మా గురువు శ్రేష్ఠుడు. జగత్తున సర్వశక్తిని ఆయన ఆర్జింపగల'డని తలంచిరి.

ఆకాలమున ఈదృశశక్తి సంపాదనయే మానవోద్దేశమయ్యెను. త్యాగము జ్ఞానసాధ్యము. కాని సాధారణముగా జనులు త్యాగిని, తీవ్ర తపమాచరించువారిని, జూచినంతటనే వారికి ఎక్కడలేని గౌరవమును గల్పింతురు. ఇప్పుడు ముండ్లమీద శయనించువారిని పంచాగ్నిమధ్యమున గూర్చుండువారిని— జూచుచున్నాము

గదా! కాని యట్టి తపస్సునందలి మార్గము నుల్లంఘించి యన్య పథగాము లయినంతనే ప్రజలు వారియందు గౌరవాభిమానములను విడుతురు. ఇట్లే గౌతముని శిష్యులు ఆయన యిట్టి శారీరక తపస్సు జ్ఞానోపలబ్ధికి కారకముకాదని తలంచి యామార్గమును వదలి యాహారసేవనమునకు బూనినంతనే ఆయన శిష్యులు ఆయనను 'వేషధారి' యని తలంచి వదలిపెట్టి తమదారిని వారణాశికభిముఖులై పోయిరి. ఆహారము సేవించినను గౌతముడు తన ధ్యాన జపములందు నమ్మకమును వీడలేదు. అభ్యాసమును ఆయన విడువలేదు.

ఇట్లుండ, 'నురువెళ'లో 'సేనాని' కుటుంబమున సుజాతయను కన్యయుండెను. యుక్తవయస్కయైనంత నామె యొకానొక అశ్వత్థవృక్షమును జేరి యిట్లు ప్రార్థింపజొచ్చెను: 'నాయంతస్తునకు దగిన భర్తలభించి యటుపైన ప్రప్రథమమున పురుష శిశువు జన్మించినచో నీకు వంద వరహాలు కానుకగా నర్పింతును'. ఆమె ప్రార్థనానుకూలముగ సమస్తమును సంభవించెను. అంతట సుజాత మంచి చిక్కని పాలలో బియ్యము వేసి పరమాన్నము తయారుచేసి బంగారపు కంచమున నా పరమాన్నమునుంచి, వేఱొక బంగారుపాత్రయందు జలమును గొని యశ్వత్థవృక్షమును జేరెను. ఆనాడు వైశాఖ పూర్ణిమ. ఆ చెట్టుక్రింద దేదీప్యమాన ముఖవర్చస్సుగలిగి పద్మాసనస్థుడై ధ్యాననిమగ్నుడై యున్న గౌతమునిగాంచి యతడే తన నైవేద్యమును గైకొన మనుష్యాకారమున వచ్చిన భగవానుడని తలచి అత్యంతసంతోషాతిశయముతో తాను దెచ్చిన నైవేద్యమును ఆయన యెదుటబెట్టి వెడలిపోయెను. సిద్ధార్థుడు ఆ నివేదన విషయమును తెలిసికొనకయే యెదుట ప్రవహించుచున్న నదియందు స్నానమాడి యా యాహారమును భుజించెను. అటుపిమ్మట సిద్ధార్థునకు అమానుష దృశ్యములు కొన్ని కాన్పించెను. అందువలన తన బంధుజనుల యందలి యభిమానము తన్ను విడువలేదనియు నహంకార మమకారములు తన మనస్సున నింకను నాట్యమాడుచున్నవనియు కనిపట్టి తానన్వేషించుచుండిన జ్ఞానోపలబ్ధియగునంతవఱకు నీయాసనమునుండి కదలనని ప్రతిజ్ఞ చేసెను. *

సంధ్యాకాలమాసన్నమయ్యెను. సూర్యాస్తమయానంతరము చంద్రుడు మెల్లమెల్లగా బయలుపడి తన శీతల కిరణకాంతిని ప్రపంచమున వెదజల్లెను. ప్రాపంచికాంధకారము దూరీకృత మగుచున్నకొలదిని గౌతముని హృదయాంధకారముగూడ కొంచెముకొంచెముగా నశింపజొచ్చియాతని హృదయమంతయు జ్ఞానతేజముతో పరిపూర్ణమయ్యెను. వాసనలన్నియు నశించెను. గౌతముడు బుద్ధుడయ్యెను. ఆయన ఆత్మ బ్రహ్మానందానుభవమున జొక్కడొడంగెను. పిదప వారము దినములు భగవానుడు ఆ చెట్టుక్రిందనే కాలముగడపెను. అంతట తనకర్తవ్యము నిశ్చయముచేసికొని ధర్మచక్రమును, ప్రవర్తింప నారంభించెను. ప్రప్రథమమున వణిజులిరువురు వారికి శిష్యులైరి. మఱల ఇసీపట్టణముదగ్గరకు వచ్చినంతనే పూర్వము భగవానుని వదలిన శిష్యపంచకము కలిసికొనిరి. కాని ప్రథమమున వారు భగ

* ఇహాసనే శుష్యతు మేశరీరం, త్వగస్థిమాంసం ప్రలయంచయాతు, అప్రాప్యబోధిం బహుకల్పదుర్లభం నైవాసనాత్ కాయమతశ్చలిష్యతే.

వానుని సన్మానించినవారు కారు. కాని భగవానుడు తనతపోఫలమును వివరించి జరామరణ రాహిత్యమును గల్పింపగలశక్తి తనయందు గలదని వివరించి యుపదేశింప వారు మఱల ఆయనను తమగురువుగా పరిగణించిరి. 'సంసారము దుఃఖమయము, తృష్ణయే—విషయాసక్తియే — దుఃఖమునకు మూలకారణము తృష్ణాజయమే దుఃఖనివృత్తికి మార్గము. ఈవిషయాసక్తి విసర్జనమున నెనిమిది మార్గములుగలవు. 1. సమ్యగ్దృష్టి, 2. సమ్యక్సంకల్పము అనగా దృఢసంకల్పము, 3. సమ్యగ్వాక్యము—సత్యమును ప్రియమును వచించుట, 4. సమ్యక్కర్మాంతము—సదాచార పరాయణత, 5. సమ్యగ్జీవము—అహింసాపరాయణులై సాధుభావయుక్తులై జీవనోపాధిచేసికొనుట, 6. సమ్యగ్వ్యాయామము—ఆత్మసంయమముచేసి యింద్రియాదుల జయించి యాత్మోన్నతికి ప్రయత్నించుట, 7. సమ్యగ్స్మృతి—సరియగు ధారణ నవలంభించుట, యనగా స్మృతినాశనముగాకుండుట, 8. సమ్యగ్సమాధి—ధ్యానపరాయణులై గంభీరతత్త్వము లన్నింటిని సంపాదించుట. ఇట్టి అష్టాంగయోగముల జక్కగా నభ్యసించినచో అరిషడ్వర్గ సంయోగమువలన గలుగు దుఃఖ సముదాయము నశించును. ఇట్లు త్రితాపముల నతిక్రమించి శాంతి పరిపూర్ణమైన నిర్వాణస్థితిని బడయగలరు.' అని శ్రీ భగవానుడు వారికుపదేశించెను. ఈ యుపదేశమును గ్రహించిన వారందఱు భగవానుని వాక్యానుసారము అష్టాంగమార్గము నభ్యసించి అర్హతను బడసిరి.

'ప్రాణిహింసాకార్యము, సురాపానము, వ్యభిచారము, అసత్యభాషణము — వీనిని దూరీకరించవలయును. రెండుపూటల భుజించుట, నాట్యకళాది దర్శనము, అమూల్య వస్త్రధారణము, శయ్యా స్వర్ణరూపదాన పరిగ్రహణము—వీనిని వదలిపెట్టవలయును.' అని శిష్యులకు భగవానుడు బోధించెను. వీనికే దశశీలములని పేరు. కొద్దికొద్దిగా శిష్యుల సంఖ్య హెచ్చెను. అన్నిజాతులవారును అన్ని తరగతులవారును శిష్యులైరి.

ఇప్పటికి భగవానుడు గృహమును త్యజించి, ఎనిమిదేండ్లు. ఆయనకీర్తి నలుదెసల వ్యాపించి శుద్ధోధనుని చెవినిబడినది. కుమారుని తనకడకు రమ్మని ఎన్నియోసార్లు శుద్ధోధనుడు కబురంపెను. కాని ఆవార్తాహరులెల్లరును తమకార్యమును మఱచి శ్రీభగవానుని బోధనలవిని శ్రీవారి శిష్యులై యందే నిలిచిపోవుచుండిరి. ఇట్లుండ కొలది కాలమునకు కపిలవస్తునగర ప్రాంతములందు భగవానుడు బోధించుచున్నాడన్న విషయము శుద్ధోధనుడు వినెను.

(సశేషము)

# శ్రీ వివేకానంద సంభాషణలు

(ఒక భక్తుని దినచర్య నుండి)

అనువాదకుడు: శ్రీ పిన్నింటి సుబ్బారావు

(భక్తి జ్ఞానముల సమన్వయము—సచ్చిదానందము—శాఖాభేదము లెట్లుద్భవించెను—శ్రద్ధను, అవతారములను, శక్తిని ఉపాసించుటను మఱల పునరుద్ధరింపుము—వీరారాధనమే మనకు నేడు గావలసినది—మధురభావముగాదు—శ్రీరామకృష్ణుడు—అవతారపురుషుడు.)

శిష్యుడు:—స్వామిజీ! దయజేసి, జ్ఞానము, భక్తి ఎట్లు సమన్వయమగునో సెలవిచ్చెదరా? భక్తిమార్గీయులు, శంకరుని నామమును వినినంతనే శ్రోత్రములను మూసికొనుటయు, జ్ఞానమార్గీయులు, భక్తుల యశ్రుధారలతోడి నామసంకీర్తనా తన్మయత్వమును బొందుటనుగాంచి, మత పిచ్చిగలవారని పిల్చుకొనుచుండుటయు మనము చూచుచున్నాము.

స్వామిజి:— ఈ గందరగోళమంతయు, భక్తి జ్ఞాన యోగముల యారంభదశయందు మాత్రమే. శ్రీరామకృష్ణులు దెలిపెడి "శివుని రాక్షసులయొక్కయు, రాముని కోతులయొక్కయు" కథను విని యుండలేదా?

శిష్యుడు:—అవును, అయ్యా, వినియుంటిని.

స్వామిజి:—కాని తీవ్రమగు భక్తికిని, జ్ఞానమునకును వ్యత్యాసము లేదు. పరాభక్తియందు పరమేశ్వరిని ప్రేమమూర్తిగా గ్రహించవలయును. ఎల్లయెడలను. అన్నిటియందును, ప్రేమతత్త్వముగా, భగవంతుని దర్శించుచో, ఇతరులను నీవు, ఎట్లు బాధించగలవు? అసహ్యించగలవు? ప్రేమ తత్త్వము, శ్రీరామకృష్ణులు నుడివినటుల, హృదయమున ఎంతవఱకు కామినీకాంచనములయం దాశగలదో యంతవఱకు సిద్ధిగానేరదు. భక్తిపుంభావములో, స్వశరీర స్పృహగూడ మృగ్యమైపోవును, అదే విధముగా పూర్ణజ్ఞానమునందు సమస్తమును ఒక్కటియే యనియును, సమస్తమును తన రూపమేయనియును తెలియవలయును. అహంకార మేమాత్రమున్నను, ఈ జ్ఞాన సిద్ధి లభ్యము గానేరదు.

శిష్యుడు:—అయితే, ప్రేమయు, ఉత్కృష్ట జ్ఞానమును రెండును సమానములేనా?

స్వామిజి:—యథార్థముగా, భక్తియోగము నందలి సిద్ధి, జ్ఞాన సిద్ధి యనంతరము గాని లభింపనేరదు. బ్రహ్మము

సత్యజ్ఞానానందస్వరూపుడని వేదాంతము చెప్పుచుండుట లేదా?

శిష్యుడు:—అయ్యా, అవును.

స్వామిజి:—సచ్చిదానందమనగా, సత్ = ఎల్ల కాలములయందుండునది, చిత్ = జ్ఞానమే రూపముగాగలది, ఆనంద = ప్రేమతత్త్వము వలె అఖండానందమైనది. భక్తులును, జ్ఞానులును భగవంతుడు త్రికాలాబాధితు డను విషయము నంగీకరింతురు. జ్ఞానులు, ఆయన జ్ఞానరూపమునందును, భక్తులు, ఆయన యానందరూపమునందును ఎక్కువ లక్ష్యమును జూపుదురు. కాని భగవంతుని జ్ఞానరూపమును గుర్తించినంతనే, యాతని యానందరూపముగూడ దెలియబడగలదు. జ్ఞానమన ఆనందముయొక్క మారు రూపమే.

శిష్యుడు:— అయితే, భారతదేశములో ఈ బహు శాఖాభేదము లెట్లుద్భవించెను? జ్ఞానగ్రంథములకును, భక్తిగ్రంథములకును, ఇంతటి తీవ్ర వివాదము లేల తటస్థించెను?

స్వామిజి:- -అసలు విషయమిది. జ్ఞానమును గాని, భక్తినిగాని అవలంబించుటకు మొదట, ఏయేవిషయముల నాదర్శముగా నుంచుకొనవలయునో, యా ప్రాతిపదిక యందే యీ వివాదమని గ్రహింపుము. ఆరంభమా, యంత్యమా, యీ రెంటి యందేది ముఖ్యము? అంత్యముకంటె ఆది ఎన్నడును అధికముగానేరదు. ఏలయన సాధకుల బుద్ధిబలమును, శక్తి సామర్థ్యము లనుబట్టి, లక్ష్యసిద్ధికి ఉపాయాంతరము లనేకములై యుండవచ్చును. జపమాలలను ద్రిప్పుట, ధ్యానము, ఆరాధనము, అగ్ని యందు హోమమునుజేయుట, మొదలైనవి, మతముయొక్క వివిధాంగములు, సాధనాంతరములు. పరభక్తిని లేక, పరిపూర్ణ బ్రహ్మసిద్ధిని బొందుట ముఖ్య విషయము. నీవు దీర్ఘముగా విచారించినచో, వీరు దేనికొరకు కలహించుచున్నారో నీకు దెలియును. ఒకడు "తూర్పుదిక్కుగాతిరిగి, భగవంతుని ప్రార్థించిన ఆయనను దెలియగలవ"ని నుడువును. ఇంకొకడు, కాదు నీవు "పడమటివైపునకు దిరిగి, ప్రార్థించినగాని, ఆయనను దెలియజాలవని" నుడువుచున్నాడు. కొన్నియుగములకు పూర్వమొకడు, బహుశా, తూర్పుముఖాభిముఖుడై, ధ్యానముచేసి, భగవంతుని గ్రహించగా, ఆతనిశిష్యులు, తూర్పుముఖముగా గూర్చున్నగాని, ఆత్మసాక్షాత్కారము లభింపనేరదని నుడివియుండవచ్చును. ఆరీతిగనే, మఱియొకడువచ్చి, "యిది ఎట్లు సంభవమగును? ఒకానొకడు, పశ్చిమాభిముఖుడై ధ్యానించగనే సిద్ధినిబడయుట మేము కన్నులార, ప్రత్యక్షముగా జూచియున్నాము." అని పలుకును. ఈ విధముగానే ఈ శాఖాభేదములన్నియును ఉద్భవించినవి. ఒకానొకడు, హరినామమును గానముజేసినంత మాత్రముననే, మోక్షప్రాప్తినొంది, శాస్త్రములయందీవిషయమును "హరేర్నామ, హరేర్నామ, హరేర్నామైవ కేవలం, కలౌనాస్త్యేవ, నాస్త్యేవ, నాస్త్యేవ, గతిరన్యథా" ఈ కలిలో హరినామముదప్ప, దీనికిమించి మఱియొకమార్గము లేదు, లేదు, లేదు అని వ్రాసియుంచిరి.

మఱియొకటి ఊహింతము. ఇంకొకడు, అల్లాయనునామజపముతో మోక్షమును బొందె

నను కొందము. అతని యనుయాయులింకొక శాఖను సృజించెదరు. ఈ రీతిగా అనేక శాఖాంతరము లుద్భవించినవి. ఈ వివిధసాధనలు, ఆరాధనా విధానములు, ఏక లక్ష్యసిద్ధికై మార్గమునుజూపుచున్నవి! ఫలితము శ్రద్ధ. శ్రద్ధ యనునది సంస్కృతశబ్దము. దానికి సరియగు పర్యాయపదము మనమాతృభాషలో లేదు. ఉపనిషత్తు, నచికేతుని హృదయమునందు శ్రద్ధ ప్రవేశించెను అని చెప్పుచున్నది. ఏకాగ్రత యను పదమును పర్యాయపదముగా గ్రహించినను, శ్రద్ధయను పదమునం దిమిడియున్న యర్థము నీయజాలదు. నీవు, ఏసత్యమునైనను నిశ్చలభక్తితో, ఏకాగ్రచిత్తముతో, ధ్యానించినచో, మనస్సు ఏకత్వమును గ్రహించుటకై, సచ్చిదానందమును గ్రహించుటకై యభిముఖమగుచుండుటను గ్రహింపగలవు. భక్తి గ్రంథములుగాని, జ్ఞానగ్రంథములుగాని, ఎవ్వరేమార్గము నవలంబించినను, ఇట్టి నిష్ఠను ముఖ్యముగా నవలంబించవలయునని చెప్పుచున్నవి. అనేకయుగములు గతించుటచే, ఉత్కృష్ట సత్యముల కపార్థములు గల్పింపబడి, క్రమక్రమముగా దేశాచారములుగా మార్పు చెందెను. ఈ రీతిగా ఒక్క భారతదేశమునందే గాదు ప్రపంచమందలి ప్రతిదేశమునందును, ప్రతిజాతియందును సంభవించెను. సామాన్య ప్రజలు, విచక్షణాజ్ఞానములేక, ఈ దేశాచారములనుగూర్చి తర్జన భర్జనలు, అంతఃకలహములను అవలంబించుచున్నారు. వీనికన్నిటికిని, ఏది పరమార్థమో దానిని మఱచుటచే, ఈ వివిధశాఖాంతరములు, అంతఃకలహములు, జరుగుచున్నవి.

శిష్యుడు:—స్వామిజీ! దీనినుండి తప్పించుకొను మార్గము లేదా?

స్వామిజీ:— పూర్వకాలమునందువలె యథార్థమగు, సత్యమును మఱల పునరుద్ధరింపవలసియున్నది. కలుపు మొక్కలను, మూలసహితముగా లాగివేయవలయును, ప్రతి మతమునందును, ప్రతి మార్గమునందును, నిర్వివాదాంశములై దేశ, కాలముల కతీతములగు సత్యములు కొన్ని గలవు. కాని వానియందు గొంత మాలిన్యము చేకూరినది. దీనిని పూర్తిగా తొలగించి, యా సనాతన ధర్మములను మరల ప్రజలయందు ప్రతిష్ఠించిననాడే, మనమతము, మన దేశము యథార్థముగా లాభమును పొందగలదు.

శిష్యుడు:—అది, యేవిధముగా జరుగగలదు?

స్వామిజీ:—ఎందుచేత? మొదట మనము, మన దేశములో ఋషులను పూజించు ఆచారమును ప్రవేశపెట్టవలయును. శాశ్వత ధర్మములను గనుగొనిన యా మహనీయుల చరిత్రలను, ఉదాహరణముగా, శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, మహావీరుడు, శ్రీరామకృష్ణుడు మొదలగువారి చరితములను జనసామాన్యమునకు బోధించి, వారిని ఆదర్శమూర్తులుగా గైకొనదగునని బోధింపవలయును. శ్రీరామచంద్రుని యొక్కయు, మహావీరునియొక్కయు, యారాధనము, ఈ దేశమున ప్రచారమునకు దీసికొనిరాగలవా? శ్రీకృష్ణునియొక్క బృందావనజీవితగాథ నటుంచి, సింహగర్జనముతో, ఏ గీతోపదేశ మొనరించెనో, యా దివ్యభాగమును విపులముగా ప్రచారము చేయుము. సర్వశక్తిస్వరూపిణియగు, ఆ యాదిశక్తియొక్క యారాధన మాచరణలోనికి దీసికొని రమ్ము.

శిష్యుడు:— అయితే, బృందావనమండలి, గోపస్త్రీలతో చరించిన శ్రీకృష్ణుని చరితము అపరిశుద్ధమనియా, తమ యభిప్రాయము?

స్వామిజి:—ఈ ప్రస్తుత పరిస్థితులలో ఆ యారాధనమంతగా ఉపయోగకారికాదు. పిల్లనగ్రోవి నూదుట మొదలగువానిచే, దేశము త్కృష్టస్థితికి రానేరదు. ఎవనినరము నరమునకును, ఆపాదమస్తకము, నిండి నిబిడీకృతమగు రజోగుణము మూర్తీభవించియుండునో, సత్యమును గ్రహించుటలో మరణమునకుగూడ నెవరువెనుదీయరో, ఎవనికవచమునై రాగ్యమో,ఎవనిఖడ్గముజ్ఞానమో, యట్టి వీరపూజ నేడు ముఖ్యముగా గావలయును. జీవిత యుద్ధరంగమందు, యుద్ధవీరునివలె ధైర్యసాహసములను ప్రదర్శించు వీరులు నేడు కావలయునుగాని, జీవితమన ఆనందోద్యానవనమని తలచి, ప్రేమను ఆశ్వాదించువలవు గాదు.

శిష్యుడు:—గోపికా గీతములందు ఏ ప్రేమయాదర్శనీయముగా వర్ణింపబడియున్నదో యాప్రేమ విధానము దోషమనియా తమ యభిప్రాయము?

స్వామిజి:—ఆవిధముగా ఎవరు చెప్పిరి? నేను గాదు. అదియొక యుత్కృష్టసాధనా విశేషము. ఇంద్రియసౌఖ్యములయందును, ధనమునందును గాఢముగా సంసర్గము గలిగియున్న యీ రోజులలో, ఈ యుత్కృష్ట ధర్మములను గ్రహింపగలిగినవారు గూడ బహుకొద్దిమంది మాత్రమే కలరు.

శిష్యుడు:—భగవంతుని భర్తగాగాని, మధుర భావముతోగాని, యారాధించువారలు క్రమమగు మార్గము ననుసరించుట లేదనియా?

స్వామిజి:—కాదని నేను ధైర్యముగా జెప్ప గలను. ఏమైనా కొన్నిమినహాయింపులుండ వచ్చును. కాని వీరిలో బహుసంఖ్యాకులు తమోగుణప్రధానులును, అనారోగ్యవంతులును, బలహీనులునై యున్నారు. దేశము నుద్ధరించవలయును. ప్రతినిత్యము ప్రతి గృహమునందును మహావీరుని యారాధనము, శక్తిపూజారాధనమును, శ్రీరామచంద్రార్చనమును, విధిగా అనుష్ఠింపబడవలయును. నీయొక్క యభివృద్ధి, దేశము యొక్క క్షేమము దీనియందే కలవు. ఇంకొకమార్గము లేదు.

శిష్యుడు:— శ్రీరామకృష్ణ భగవానుడు భగవన్నామమును గాఢముగా గానము చేసెడి వాడని తరచు నేను వినియుంటిని.

స్వామిజి:—ఆలాగుననే, ఆయనపరిస్థితి వేరు. సామాన్య మానవునకును, ఆదివ్యపురుషునకును సామ్యమేమి? తన జీవితములో ఆ యవతారమూర్తి, యన్ని మతాదర్శములను అనుష్ఠించి ఎవ్వరు, ఏరీతిగా ఆచరించినను, ఒకేసత్యమును చేరగలరను సర్వసమన్వయము తన స్వానుభవముచే గ్రహించి, చూపించెను. నీవుగాని, నేను గాని యామహాపురుషు డొనర్చినదంత యును అనుష్ఠించగలమా? మనలో ఎవ్వరును ఆ మహాపురుషుని పూర్తిగాగ్రహించి యుండలేదు. అందుచే ఆ దివ్యపురుషుని గూర్చి యెచ్చటను ముచ్చటించుటకు సాహసింపలేక పోవుచుంటిని. ఆతడెవ్వరో యాతనికే తెలియవలయును. ఆయన శరీరనిర్మా

ణముమాత్రము మానవాకారమే, కాని ఆయననుగూర్చిన సమస్త విషయములు మనకు భిన్నములే.

శిష్యుడు:—తమరు వారిని అవతారపురుషులుగా నమ్ముచున్నారని నేను దలపవచ్చునా?

స్వామిజి:—అవతారపురుషులన అర్థమేమియో మొదట నాకు దెల్పుము.

శిష్యుడు:—ఎందుచేత, శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, శ్రీగౌరాంగుడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు మొదలైనవారివలెను.

స్వామిజి:— నీవిప్పుడు నుడివిన వారందరికంటెనుగూడ, శ్రీరామకృష్ణ భగవానుడు గొప్పవాడని నేను జెప్పగలను. నమ్ముటయని, నీచార్థముగా పలుకవలదు, నేను ఎరుగుదును అని తెల్పుము. ప్రస్తుత మీ విషయ మింతతో నాపుదము. మఱియొకప్పుడు విపులముగా ముచ్చటింతము.

కొంతసేపు ఆగి, స్వామిజి యీ క్రింది విధముగా నుపన్యసించెను.

కాలపరిస్థితిని, సంఘస్థితిని అనుసరించి, ధర్మసంస్థాపన జేయుటకై మహాపురుషు లుద్భవించుచుందురు. వారిని నీవు అవతారపురుషులనుము, మహాపురుషులనుము, మఱి యేవిధముగ బిల్చినను సరియే; వారు తమ జీవితము నందాదర్శమును బహిర్గతము జేయుదురు. క్రమక్రమముగా వారి ననుసరించి మానవులు తయారుచేయబడిరి. పిమ్మట పలువిధములగు శాఖలు బయలుదేరినవి. కాలముగడచినంతనే, యీ శాఖలు క్షీణించగా, సంస్కర్తలు తిరిగి బయలుదేరెదరు. ఈ విధముగా యుగాంతరములనుండి, ప్రవాహరూపమున జరుగుచున్నది.

శిష్యుడు:—శ్రీరామకృష్ణుడు అవతారపురుషుడని ఏల తమరు ప్రచారముచేయరు? దానికి వలయు శక్తి, వాగ్ధోరణియును సమస్తమును తమకుగలవే?

స్వామిజి:—నిజముగా నేను చెప్పుచున్నాను. ఆయననుగూర్చి నేను గ్రహించినది బహుస్వల్పము. ఆయననాకు ఎంత ఘనముగా గానబడుచున్నాడనిన, ఎప్పుడు ఆయనను గూర్చి నేను చెప్పగడంగుదునో నిజము పూర్తిగా జెప్పలేదనియో, కొన్ని విషయములు మరచితిననియో, ఆయననుగూర్చి చెప్పుటకు నాకు సామర్థ్యములేదనియో లేక వారినిగూర్చి చెప్పునపుడు, నా యభిరుచులననుసరించి వర్ణించుచుంటిననియో లేక ఆయన నారీతిగా చిన్నపుచ్చుచున్నాననియో భయము గలుగుచుండును.

శిష్యుడు:—కాని చాలామంది వారిని అవతారపురుషులుగా బోధించుచున్నారు.

స్వామిజి:— వారిష్టమువచ్చినరీతిగా వారిని జేయనిమ్ము, వారు ఆయననుగ్రహించిన రీతిగా జేయుచున్నారు. నీకుగూడ ఆరీతిగా యర్థమైన, నీవుగూడబోయి, యారీతిగా ప్రచారముచేయుము.

శిష్యుడు:— శ్రీరామకృష్ణునిగూర్చి ఏమి చెప్పవలయునో నేను తమరుచెప్పునది గ్రహింపలేకయున్నాను. తమదయను స్వల్పముగానైనను సంపాదించినచో, ఈ నా జీవితము ధన్యమని దలచెదను.

# లక్ష్మీ మణి దేవి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

శ్రీ రామకృష్ణ పరమహంసదేవుడు లోకావతారమె తన యాంతరంగిక, అనుచర (సాంగోపాంగ) సహితముగ నావిర్భవించినట్లు శ్రీవారి దివ్యలీలల నలౌకికదృష్టితో జూచువారలకు ద్యోతకమగును. శ్రీరామకృష్ణుల సంస్కృతికి జెందిన, వారి పరంపరలోనివ్యక్తుల జీవితములను, వారివారి గుణములను గ్రహించువారలకు, శ్రీవారి లీల లీనాటికిని స్ఫురింపగలవు. శ్రీరామకృష్ణులయన్నగారి కుమార్తెయు, బాలవితంతువునగు లక్ష్మీమణిదేవి జీవితచరిత్ర మీారంగమునందు, శ్రీవారి స్వజనమునందలియొక ముఖ్యపాత్ర, శ్రీరామకృష్ణుడు తిరిగి యావిర్భవించినను, ఆయనతో దాము జన్మించువాంఛ లేదని, లక్ష్మీదేవి చెప్ప, "నీవెచటికి వెళ్లగలవు? దుబ్బును లాగినచో సమూలముగ వచ్చి వేయునుగా" యని శ్రీ రామకృష్ణులనిరి. నిష్ఠ, భక్తి, విశ్వాసము, సాధన, భజనలకుగల సూత్రము లీమె దివ్యచరిత్రమున గనబడును. శ్రీరామకృష్ణులు చెప్పినటుల నీ హిందూ వితంతువగు లక్ష్మీమణిదేవియందు నిష్ఠ, భక్తి, అపారానందరసావేశము, దైవీసంపదస్ఫురణల సత్యము నీమెయందు జవిజూడగలము. ఈమెను గూర్చి ప్రశంసించుట కళ్యాణప్రదము. పరాప్రేమ – భక్తిమార్గమున మానవరూపమున నీమె నాజగదీశుడగు శంకరుని పరిణయమాడి, స్త్రీ, కైవల్యమునొందగల్గుట యీ బాలవితంతు చరిత్రమున నిరూపితమగును. ఈమె చైతన్య మహాప్రభువుల సంస్కృతికి జెందినది. భక్త మీరాబాయి వంటిది. ఆంధ్రావనియందు రామాయణమును రచించిన కుమ్మరి మొల్ల, శ్రీవేంకటాచలమాహాత్మ్యమును రచించిన తరిగొండ వెంకమ్మగారలు లక్ష్మీదేవి చరిత్రమును స్ఫురణకు దెత్తురు. శ్రీరామకృష్ణు లీమెను, దమయింట నారాధించెడి, శీతలాంబ యంశ యనెడివారు.

లక్ష్మీమణిదేవి పుట్టిల్లు, శ్రీరామకృష్ణుల జననముచే నలుదిశలను బేరుమ్రోగి, దేశదేశములనుండి యాధ్యాత్మికపిపాసువుల తృష్ణను దీర్చి, వారల కాత్మశాంతి నిచ్చుచున్న వంగదేశమునందలి, హుగ్లీ జిల్లాలోని కుగ్రామమగు కమార్‌పుకురే! ఈమెతండ్రి శ్రీరామకృష్ణుల కన్నగారగు రామేశ్వర నామధేయులు. వీరు బహుయోగ్యులు, సరళహృదయులు, అనేక తీర్థయాత్రలు భక్తిపరులై సేవించిన పవిత్ర జీవులు. ఈమె తల్లిపేరు సాకంబరా దేవి. ఈమెయు గొప్పభక్తురాలు. ఈమెచేతి యన్నమును దిన్నవారలకు విరిగిన యెముక లతుకకొనునని ప్రతీతి. అందువలన శ్రీరామకృష్ణు లామెను రామదాస వైద్యయని పిలుచువారు. ఈ యనుక్రమణికవలన లక్ష్మీదేవిని అసాధారణమైన మహా వైద్యయనియు, శారదామాతను సామాన్య వైద్యయనియు శ్రీరామకృష్ణులు

పిలిచెడివారు. సాకంబరాదేవి యొకానొకకళింగ దేశపు సాధువు (ఓడ్ర) వలన నుపదేశమును బొంది, గురువుతో పూరీ జగన్నాథక్షేత్రము నకు బోవుచు, త్రోవలో వైతరణీనదియొడ్డున గల జాజ్‌పూర్ నందు పరమపదించెను. అచ్చట నాసాధువు సాకంబరాదేవి కంత్య సంస్కారములు చేసెను. ఇట్టి పుణ్యాదంపతు లకు 1864–వ సంవత్సరమున వంగదేశమునం దంతటను గొప్ప శోభగను, వైభవముగను విరాజిల్లు సరస్వతీపూజోత్సవములు చేయు శుద్ధ పంచమినాడు లక్ష్మీమణిదేవి జన్మించెను.

చిన్ననాట లక్ష్మి సతతము రోదనము పెట్టు చుండెడిది. అంత దానికి నామె పెదతండ్రి కుమారుడగు నక్షయకుమారుడు చికాకువడి, యొకనాటి మధ్యాహ్న మెవరును జూడకుండ, రహస్యముగ లక్ష్మినెత్తుకొనిపోయి, యూరి బయట భూతీర్‌ఖాల్ (దెయ్యాలకాల్వ) వద్ద స్మశానవాటికయందు విడిచిపెట్టెను. అంత దల్లియు బంధువులును గడు నావేదనతో నామెకై వెదకి వెదకి, చివర కక్షయు నడిగి, యడిగి, లక్ష్మియొక్క జాడను దెలిసికొని, మరునాడుదయము జూడబోయిరికదా, లక్ష్మి యాస్మశానవాటికయందు సురక్షితముగా నాడు కొనుచుండెను. నాటినుండియు లక్ష్మి యా యేడుపు మానెను. పంచవర్షప్రాయమునాటి నుండియు లక్ష్మికి బూజాపునస్కారముల యందు బ్రీతి. లక్ష్మి, ఇలువేలుపులగు రఘు వీరునకు, శీతలాంబకు నిత్యపూజలకు చందనాది ద్రవ్యముల నాయత్తపరచెడిది. ఆమె పళ్లెము నందు రాధాకృష్ణుల పాదముల లిఖించి, వానిని పుష్పములతోను, తులసీదళములతోను, మంచి గంధముతోను నిత్యము పూజలొనర్చెడిది. ఇంతకన్న నామె యాటల, పాటల చిన్ననాట నెరుంగదు. తఱుచామెయేదియో తనలోదాను చింతనలో నిలిచిపోయియుండు స్వభావము గలది. ఇతరులతో మాటలాడక మిన్నకుండు టచే క్రొత్తగావచ్చిన వార లామె మూగ దనుకొనెడివారు. ఒకసారి దుర్గాపూజకు దల్లితో నామెను గౌర్‌హాటికి మాతామహు నింటికి తీసికొనివెళ్లిరి. ఆమెకు పంచదారతో దయారైన మిఠాయిని, జిలేబిని తినుటలవాటు. ఇచ్చట బెల్లముతో దయారైన లస్కారయుండ లను, మురమరాలయుండలను లక్ష్మికి దినుటకు ఇచ్చిరి. లక్ష్మి గట్టివస్తువులను తిను నాచారము లేక మెత్తబరచి, వానిని భుజించెడిది, అంత నా యిచ్చినవాని నెటుల దినగలనని తల్లినడుగ, బ్రక్కవారామె కప్పుడు మాటలువచ్చుననియు, మూగపిల్లగాదనియు గ్రహింపగలిగిరి. ఆమెకు గిరి, కామిని, రుక్మిణి యనువారలు చెలి కత్తెలు.

ఆమె విద్యాభ్యాసమునుగూర్చి శారదా మాత యిటులచెప్పెను: ''నేనును, లక్ష్మియు గమార్‌పకుర్‌న వంగభాషయందలి ప్రథమ వాచక పుస్తకము (రు. 0–1–0) చదువుకొనెడి వారము. ఒకనాడు శ్రీరామకృష్ణుల పినతండ్రి మనుమడగు హృదయుడు మాచదువుజూచి, నాయొద్దగల పుస్తకమును లాగుకొనెను. స్త్రీలు చదువుకొనగూడదు. ఇప్పుడు చదువుకొనిన, పెదిగినతర్వాత నీవేమిచేయుదువు? నవలలను, నాటకములను జదివికొనియెదవా?'' యనెను. లక్ష్మి పుస్తకములను వదలలేదు. లక్ష్మి యా యూరి ప్రాథమిక పాఠశాలకు బోవుచు, నప్పు డప్పుడు నాకును బోధించెడిది. లక్ష్మి దక్షి ణేశ్వరమువచ్చి నాతో నివసించునప్పుడు శ్రీ రామకృష్ణదేవులు శరత్ భండారియను నొక చిన్నవానిని మాయుభయులకు జదువుచెప్పుట

కేర్పరచిరి. ఆతడు రెండవ ప్రథమపాఠ పుస్తకము వరకునుజెప్పి, యిక మేము రామాయణము, మహాభారతాది గ్రంథములను జులకనగా జదువగలమని చెప్పెను.........భావముఖర్జీతాలూకాలోకపిల్ల నాకప్పుడప్పుడు పాఠములను జెప్పుచుండెను.''

రామేశ్వరుడు లక్ష్మికి కమార్పకుర్ పరిసరగ్రామమగు గోఘట్ నందలి వాడును, వైష్ణవసాంప్రదాయము గలవాడును, గౌరాంగుని ప్రపత్తికి జెందినవాడునగు ధనకృష్ణఘటక్ అనునతని కిచ్చి వివాహముచేయ స్థిరపరచెను. ఇంతలో రామేశ్వరుడు చనిపోయెను. ఆయన చనిపోవుముందర దనమాటను నిలబెట్టి లక్ష్మిని తాను స్థిరపరచిన వరునకిమ్మని కోరెను. రామేశ్వరునికోరిక ప్రకారము సదాచార సంపత్తితో త్వరలోనే లక్ష్మీదేవికి పదకొండు సంవత్సరములు వచ్చి అరక్షణీయగా నుండరాదుగాన సపకర్ష వివాహ కన్యాప్రదానముజరిగెను.

ఈ వివాహమైన రెండుమాసములకు రామేశ్వరుని యస్థికలను గంగలో గలుపుటకై రామలాల్ దాదా దక్షిణేశ్వరము వచ్చెను. రామ్‌లాల్ దాదా శ్రీరామకృష్ణుల గదిలో ప్రవేశింపగనే, శ్రీరామకృష్ణులు హృదయునితో జిన్నమంచముపై కూర్చొనియుండి, రామ్‌లాల్ దాదాను జూచి కామార్పుకుర్ నుగూర్చి, లక్ష్మీదేవినిగూర్చి కుశలమడిగిరి. రామ్‌లాల్ దాదా లక్ష్మి వివాహమునుగూర్చి చెప్పెను. వెంటనే శ్రీరామకృష్ణులు పరవశులై యుండుటచే లక్ష్మికి త్వరలో వైధవ్యప్రాప్తి కలుగుననిరి. హృదయుడా మాటను విని, ''లక్ష్మి నంతగ ప్రేమించు నీ వామె నాశీర్వదించుటకు బదు లిటు లేల యంటి'' వనెను. శ్రీరామకృష్ణులు ''నేనేమంటి'' నని యడుగ, హృదయుడు శ్రీరామకృష్ణులు మతిలేక యవకతవక మాటలాడి యున్నారని జరిగినది చెప్పెను. అంత శ్రీరామకృష్ణు లిట్లు బదులు చెప్పిరి: ''ఈ పలుకులాడుటకు నే నెవ్వడను. తల్లి నాచే నటుల పలికించినది. ఎవ్వారనిన నందఱు భయపడుదురో, యట్టి శీతలాంబ యంశ లక్ష్మి. ఆమె గొప్పశక్తినిగల దేవి. ఆమెను బరిణయమాడిన వ్యక్తి సామాన్యుడు. అట్టివా డామె దాపున భస్మమగును. ఆమెకు బ్రభువు శంకరు డొక్కడే.'' లోగడ శ్రీరామకృష్ణులు కామార్పుకుర్ నందుండిన దినములందొకనా డామె యధీనము తప్పిన స్త్రీగ నుండినచో, లక్ష్మి తమయింట గృహదేవతారాధనలు సల్పుచుండునని చెప్పియుండిరి.

పెండ్లి జరిగిన రెండుమాసములకుద్యోగము సంపాదించు కోర్కెతో లక్ష్మి భర్త కామార్పుకుర్ వచ్చి, యత్తవారియొద్ద సెలవుపుచ్చుకొని వెళ్లెను. అటుపిమ్మట లక్ష్మీదేవి భర్తకై నిరీక్షించుటయే గాని పంద్రెండేండ్లైనను నతని జాడ తెలియలేదు. అంత నాతడు మృతిజెందెనని పెద్దలు నిశ్చయించిరి. భర్తకు, లక్ష్మి పలాశవిధి నంత్యక్రియలు జరిపించి వైధవ్యమునకు దగినట్లు బ్రవర్తించుచుండెను. ఆమె యత్తవారు భాగ్యవంతులు; కాని లక్ష్మికి పిల్లలు లేరు. గనుక నామె భర్తయొక్క యాస్తినిగాని, అత్తవారి దేవాదాయములనుగాని గ్రహింపరాదని శ్రీరామకృష్ణులు లక్ష్మికి జెప్పిరి. అంత లక్ష్మి అత్తవారియింటికి శ్రీరామకృష్ణుల నిర్యాణానంతర మొక్కపర్యాయము తప్ప, నత్తవారి యిలుత్రొక్కుటగాని, వారి యాస్తిని గ్రహించుటగాని చేయదామె. ఆ జన్మాంతము కఠినదారిద్ర్యమునైన ననుభవించుటకే యామె స్థిరపరచికొనెను. (సశేషము)



# సమస్తజీవులును సర్వాంతరవ్యాపియు రూపరహితుడునగు భగవంతుని స్వరూపములు

శ్రీ నూలు నరసింగరావు

కొన్ని వేలసంవత్సరములకుపూర్వము మానవుడు ఇతరజాతుల జంతువులవలె దిగంబరియై విచ్చలవిడిగా దిరుగాడుచు, పచనముచేయని శాక, మాంసాహారములను దినుచు, కొండ గుహలను, వృక్షములను నివాసస్థలములుగా వినియోగించుచు తన జీవయాత్రను గడిపి యుండెనని పూర్వగ్రంథములు తెలుపుచున్నవి. అప్పటినుండి యిప్పటివరకు క్రమానుసారముగా మానవుడు తన బుద్ధివికాసములను పెంపొందించి, మిగిలిన అన్నిరకముల జీవులను తన స్వాధీనముజేసికొని యిచ్చవచ్చినటుల వినియోగించుకొనుచు తద్వారా లభించు సౌఖ్యమును పొందుచున్నాడు. కావున మానవజన్మ అన్ని జాతుల (జంతువులు, పక్షులు, వృక్షములు, క్రిమి కీటకాదుల) జన్మకన్న ఉత్కృష్టజన్మయని తేటతెల్లమగుచున్నది.

సంఘజీవియైన మానవుడు ఇతరజీవుల కన్న పరస్పరాను సహాయభూతుడగుట వలన అధిక సౌఖ్యమును పొందుచున్నాడు. పశుజ్ఞానము మానవజ్ఞానముగా రూపొందించిన మానవుడు తాను పొందు సౌఖ్యములు అనిత్యములనియు, స్వల్పములనియు తెలిసికొని వానితోడనే తృప్తిజెందక శాశ్వత సౌఖ్యముకొఱకు కృషిసల్పుచున్నాడు. శాశ్వత సౌఖ్యము గావలయునన్న మానవ జ్ఞానమునకు మించిన అతీతమైన జ్ఞానము (దివ్యజ్ఞానము) ఉండితీరవలయునని మానవునకు ఋజువైనది. పశువుకన్న తాను ఎట్లు విజ్ఞానియై తాత్కాలిక సౌఖ్యము ననుభవించుచున్నాడో అట్లే తనకన్న ఒక మహత్తరమైన శక్తి దివ్యజ్ఞానమును పొంది నిత్యసౌఖ్యముల ననుభవించుచుండవలయునని తలంచి, ఆశక్తికి భగవంతుడని పేరిడినాడు. తనజాతీయులైన మానవులు కొందరు దివ్యజ్ఞానమును సంపాదించుచు తగిన సౌఖ్యముల ననుభవించుచుండుట జూచి భగవంతుడున్నాడని స్థిరమైన నిర్ధారణకు వచ్చెను. తాను గూడ నిత్యసౌఖ్యమును పొందుట కుత్సాహపూరితుడై దివ్యజ్ఞానమును సంపాదింపగోరి భగవంతుని సహాయ మపేక్షించి వానిని పదే పదే ప్రార్థించుచున్నాడు.

మానవుడు తన ఆత్మను పశుజ్ఞానమునుండి మానవజ్ఞానముగా నెట్లు వికసింపజేసికొనెనో అట్లే తన బుద్ధికుశలతను వినియోగించి దివ్యజ్ఞానముగా వికసింపజేసి భగవంతునితో నైక్య

మగుటకు ప్రయత్నించుచున్నాడు. కావున మానవుడు భగవత్ స్వరూపు డగుచున్నాడు. మానవుడే భగవత్ స్వరూపుడైన యెడల అంతకు పూర్వము తన ఆత్మవికాసముతో సమానమైన యితర జీవులన్నియుగూడ భగవత్ స్వరూపములే యగుచున్నవి. భగవత్ స్వరూపులగు జీవులు ప్రపంచమందంతటను వ్యాపించియుండుట వలన భగవంతుడు సర్వాంతరవ్యాపి యన వచ్చును.

మానవుడు తన సౌకర్యార్థమై నివసించుటకు గృహమును, జీవనోపాధికై పంటలను, పచనముచేయుటకు పాత్రలను, ధరించుటకు దుస్తులను–ఇట్లు అనేకములగు వస్తువులను కల్పించెను. పైని పేర్కొనబడిన వస్తువులన్నియును తన ఆత్మవికాసము (నాగరికత) వలన గలిగెడు స్వభావము ననుసరించి కొందరి మానవుల సహాయముతో కల్పింపబడెను. కావున సృష్టి ఆత్మస్వభావము ననుసరించి జరుగుచున్నదని మనమూహింపవచ్చును.

కేవలము మాంసమునే ఆహారముగా నుపయోగించు స్వభావముగల సింహము, పులి వానియొక్క వాడియైన గోళ్లుగల పంజాల సహాయమున తమకంటె ననేకరెట్లు పెద్దవగు ఏనుగులను పడగొట్టి తమ పొడుగాటి దృఢమైన కోరలతో చీల్చి భక్షించును. గాన వాని స్వభావము ననుసరించియేగదా వాడియైన గోళ్లుగల పంజాలు, పొడుగాటి దృఢమైన కోరలు సృష్టింపబడుట జరిగినది. అట్లే అవయవములతోగూడిన శరీరములన్నియు వాని స్వభావముల ననుసరించి సృష్టింపబడ్డవని మనమేల యూహింపరాదు ? మదస్వభావము ననుసరించియేగదా ఆ లావుపాటి శరీరమును ఏనుగు కలిగియుండుటకు కారణము. గాలిలో నెగిరి సంచరించు స్వభావము పక్షులకు గలుగుటవలన గదా వాటి కనుకూలముగా వెంట్రుకలుగల రెక్కలుండుటకు గారణము. జంతువులు, పక్షులు వాటి స్వభావముల ననుసరించి వాటి శరీరము లెట్లు సృష్టింపబడ్డవో అట్లే మానవులు, ఇంకా మిగిలిన సమస్తజీవులు వాని స్వభావముల ననుసరించి వాని శరీరములు సృష్టింపబడ్డవని పైనుదాహరణలవలన విశదమగుచున్నది. మానవుడు తనసౌఖ్యముకొరకు తనస్వభావము ననుసరించి అనేకవస్తువుల (గృహము, పంటలు, పాత్రలు, దుస్తులు మొదలగువాని) నెట్లు సృష్టించుకొనెనో అట్లే సమస్త జీవులు వాని ఆత్మవికాసమువలన కలిగెడు స్వభావముల ననుసరించి వాటి శరీరములను అవియే సృష్టించుకొన్నవని తలంపవచ్చును. ఏ జీవియైనను తన జన్మలో ఆత్మజ్ఞానమును పెంపొందింపజేసినయెడల భావి జన్మలో నుత్కృష్టజన్మగాను, అజ్ఞానముగా దిగజార్చిన యెడల నీచజన్మగాను తయారగుటకు సందేహము లేదని పైవిషయమువలన తెలిసికొనగలము.

మానవులలో కొందరు పుట్టుగ్రుడ్డి మొదలగు అంగవిహీనులుగా జన్మించుచుండుట మనము చూచుచున్నాము. వారట్లు జన్మించుటకు కారణమేమన క్రిందటి జన్మలో వారిచే నిర్మింపబడిన శరీరములో నొకభాగమగు కండ్లను వారు అప్రమత్తతవలన పూర్తిగా నిరుపయోగము జేసిరి. క్రిందటిజన్మనుంచి యీ జన్మకు వచ్చునపుడు పూర్వపు స్వభావముల ననుసరించి కండ్లు నిరుపయోగములని తలంచి తమ శరీరములను కండ్లులేని వానినిగా జేసి

కొనిరి. ఇట్లే మిగిలిన అంగవిహీనులందరును పూర్వపు స్వభావముల ననుసరించి తమ శరీర ములను తామే సృష్టించుకొనిరని రూఢిగా జెప్పవచ్చును.

ప్రతి జీవి పంచభూతముల నుపయోగించి తనశరీరమును నిర్మించి దానిని అధికప్రేమతో ప్రేమించుచున్నది. పంచభూతములతో తయారు గాబడ్డ పదార్థములను, వస్తువులనుగూడ అధిక ప్రేమతో నుపయోగపరచుకొనుచున్నది. ఈ విధముగా పంచభూతములను మిక్కుటముగా ప్రేమించినందువలన సుఖ దుఃఖములను పొందుచున్నది. జీవి శాశ్వతసుఖము గావలయు నన్న పంచభూతములను విసర్జింపవలెను. అనగా పంచభూతములతో తయారుగాబడ్డ శరీరమును గూడ విసర్జింపవలెను. శరీరమును విసర్జింపవలె నన్న పంచభూతములయందు పూర్తిగా విరక్తి జనించవలెను. అట్లు జరిగిననాడు తనశరీరము అంతమొందినపిదప తన పూర్వజన్మ స్వభావము ననుసరించి పునర్జన్మ పొందకుండ నుండును. అనగా తన ఆత్మ పంచభూతములకు వేరై భగ వంతునిదరిజేరి వానివలె నిత్యసుఖియైయుండును. దీనినిబట్టి భగవంతుడు రూపరహితుడై యున్నా డని విశదమగుచున్నది.

సమస్తజీవులును రూపరహితుడగు భగవం తునియొక్క స్వరూపములే యని యీ వ్యాస మువలన తెలియనగును.



# తత్త్వసాక్షాత్కారము

మూలం :
శ్రీ బాబూలాల్ జీగుప్త

అనువాదం
శ్రీ సాలగ్రామ కాశీవిశ్వనాథశర్మ

పరమాత్మ జ్ఞానస్వరూపము. చిత్తమం దావ ర్ణము లేనిదానియందు జ్ఞానవికాసమగుచున్నది. జ్ఞానస్వరూపుడైన భగవానుడు ఆ వినిర్మల చిత్తమునందే సదా ఆబద్ధమైయుండును. ఏమన స్వచ్ఛమైన చిత్తదర్పణములో విశ్వవ్యాపియగు ప్రభుస్వరూపము ప్రతిబింబించకుండ నుండదు. ఈ కారణమున సాధనముయొక్క ప్రథమసోపా నము - చిత్తశుద్ధి, చిత్తావరణమున తమో గుణము మలినత్వమును - రజోగుణము చంచ లత్వమును కలిగించుచున్నవి. సత్త్వగుణోదయ మగుటవలన చిత్తము వినిర్మలమగుచున్నది. జీవనముయొక్క ముఖ్యోద్దేశము తత్త్వజిజ్ఞాస. కర్మానుష్ఠానముద్వారా జీవనమునకు విషయ భోగము ప్రయోజనము కానేరదు. కనుక ధర్మార్థకామములవలని జీవన ధారణమున తత్త్వజిజ్ఞాసయే కర్తవ్యమైయున్నది. కర్మ లచే పొందబడిన స్వర్గాదికములు శ్రేష్ఠఫలములు కానేరవు.

శ్లో॥ కామస్య నేంద్రియ ప్రీతి
ర్లాభో జీవేత యావతా ।
జీవస్య తత్త్వ జిజ్ఞాసా
నార్థోం యశ్చేహ కర్మభిః॥

సాక్షాత్కారము కానంతవరకు జీవుడు కృతార్థుడు కానేరడు. స్వర్గలోకము - బ్రహ్మలోకము - పితృలోకము - వీనిలో ఎందేగినను పుణ్య క్షయానంతరము పతనమే ప్ర ...లమై యున్నది.

శ్లో॥ క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి।

కాని తత్త్వసాక్షాత్కారమైన పిమ్మట తిరిగి పతనభయము కలుగదు. అందుచే శ్రుతులు మాటిమాటికి తత్త్వసాక్షాత్కారముయొక్క ఆదేశమిచ్చియున్నవి.

శ్లో॥ ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో
మంతవ్యో నిధిధ్యాసితవ్యః।

బ్రహ్మ - పరమాత్మ - భగవంతుడు - వీనిలో ఏ భావముచేతనైన తత్త్వసాక్షాత్కారము బడయుటలో ప్రథమమున శ్రద్ధ ప్రబల ప్రయోజనమై యున్నది.

శ్లో॥ శ్రద్ధావాం ల్లభతే జ్ఞానం
తత్పరః సంయతేంద్రియః।

శ్రద్ధావంతుడగు వ్యక్తి శ్రీగురుపాదాశ్రయుడై —

శ్లో॥ తద్ వి నార్థంస గురు మేవాభి గచ్ఛేత్।

గురువుయొక్క ఆదేశానుసారము సాధనమందు నిమగ్నుడై మెల్లమెల్లగా జ్ఞాన లాభమును పొందుచున్నాడు. జ్ఞాన యోగము - లేక - భక్తియోగము - ప్రతి మార్గమందును శ్రద్ధయే పరమావశ్యకమై యున్నది.

జ్ఞానము - యోగము - భ మొదలగు భేదసాధనలలో క్రమముగా జ్ఞాని - యోగి - భక్తుడు - గురుచరణాశ్రయమును పొందవలసి యున్నది. మఱియొకవిధమున నున్నతినిపొంద నేరడు. గురుపదాశ్రయమునుపొంది శ్రవణము - మననము - నిధిధ్యాసనము చేయుటచే తత్త్వసాక్షాత్కారము కలుగుచున్నది.

శ్లో॥ శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యో
మంతవ్య శ్చోపపత్తిభిః।
మత్వా చ సతతం ధ్యేయ
మేతే దర్శన హేతవః॥

జ్ఞానము - యోగము - భక్తి—ఈ మూడిండిలో శ్రవణము - మననము - నిధిధ్యాసనము కలుగుచున్నవి. కాని అందు భేదము కలదు. జ్ఞానమార్గమందు జీవుడు బ్రహ్మైక్యము—యోగ మార్గమందు జీవ, పరమాత్మలయొక్క కలయిక - సమాధి, భక్తిమార్గమునందు భగవానుని నామము - రూపము - గుణము - కథా శ్రవణము - మననము కలుగుచున్నవి. అనంతరమున జ్ఞానయోగపథములందు ధ్యానరూపము - నిధిధ్యాసనము—భక్తిపథమందు - ఉపాసన చేయబడుచున్నది. నిధిధ్యాసనము సిద్ధమయిన పిదప జ్ఞానికి జ్ఞానపథమందు తత్త్వసాక్షాత్కారము కలుగుచున్నది. "తత్త్వమసి శ్వేతకేతో" (చాందోగ్య) యోగికి ధ్యానసమాధియందు హృదయాంతరాంతర్యామి యొక్క సాక్షాత్కారమగుచున్నది. భక్తునికి భావసమాధియందు - బాహ్యాంతరములయందు శ్రీ భగవత్ సాక్షాత్కారమగుచున్నది.

శ్లో॥ సర్వభూతేషు యః పశ్యేద్
భగవద్భావ మాత్మనః।
భూతాని భగవత్యాత్మ
న్యేషభాగవతోత్తమః॥

జ్ఞానికి జ్ఞానమువలన - యోగికి ధ్యానము వలన - భక్తునకు ప్రేమవలన తత్త్వసాక్షాత్కారము కలుగుచున్నది. ఇందు రహస్య మొండు గలదు. ఆ రహస్యము భక్తియుక్తజ్ఞానయోగ మువలన బ్రహ్మసాక్షాత్కారమగుచున్నది. భక్తియుక్తమైన అష్టాంగయోగమువలన పరమాత్మ సాక్షాత్కారమగుచున్నది. శుద్ధభక్తి యోగమువలన భగవత్సాక్షాత్కారము కలుగుచున్నది. భక్తియుక్తసాధనమే ఫలవంతమైనది. భక్తిహీనమైన మరేసాధనమువలనను ఫలము దుర్లభము.

ఆ భక్తి మూడిటియందుగలదు. జ్ఞానశాస్త్రమందు సర్వపరిత్యాగపూర్వకముగ నిర్గుణోపాసన యే విధముగా విహితమైయున్నదో ఆ విధముగనే భక్తిశాస్త్రమందును సర్వపరిత్యాగపూర్వకమైన నిర్గుణ గోవిందుని భజన కుపదేశమైయున్నది. బ్రహ్మజ్ఞానపూర్వకముగా సమస్తదేవతారాధన జ్ఞానికి ఏ విధముగా దోషావహము కానేరదో - ఆ విధముగనే శ్రీ గోవింద విభూతిజ్ఞానముచే సమస్తదేవతోపాసన భక్తునికి దోషముకాదు. భిన్న ఈశ్వరజ్ఞానము దోషమైనదని శ్రుతి పలికెను. శ్రీ గోవిందుని సంబంధములేక అన్యాసక్తుడగుట దోషావహము. శ్రీ గోవిందుని భజనచేసి అన్యదేవతను నిందించుట మిక్కిలి దోషావహము.

శ్లో॥ గోపాలం పూజయేద్ యస్తు
నిందయే దన్యదేవతాః।
అస్తుతావత్ పరే ధర్మః
పూర్వధర్మో వినశ్యతి॥

శ్లో॥ హరిరేవ సదాఽఽరాధ్యః
సర్వదేవేశ్వరేశ్వరః।
ఇతరే బ్రహ్మరుద్రాద్యా
నావజ్ఞేయాః కదాచన॥

శ్లో॥ జ్ఞాన విజ్ఞాన నిధయే
బ్రహ్మణేఽనంతశక్తయే।
అగుణాయా వికారాయ
నమస్తేఽప్రాకృతాయ చ॥

ఇది నిర్గుణ గోవిందోపాసన. సనాతనశాస్త్రములందు సర్వవిధముల కలహ మభావమై యున్నది. పామండుని స్వభావమే కలహము. తత్త్వజిజ్ఞాసయే ముఖ్యధ్యేయము. అది భక్తి జ్ఞానసాధనాప్రణాళికకు ధ్యేయనిరూపణము. ఇంక జ్ఞానయోగము మొదలగు అష్టాంగయోగముయొక్క ధ్యానలక్షణము-సాధనము-అనుభవముయొక్క ఉపయోగాదుల వర్ణింపబడుచున్నవి. ఆనందమగ్నమైయుండగా ఏకమాత్ర పరమాత్మయొక్క భావములో లేక పరమాత్మయొక్క నామములో మనస్సున కేకాగ్రత కల్గుట జ్ఞానయోగ - అష్టాంగయోగముల యొక్క ధ్యానలక్షణము. "ధ్యానం నిర్విషయం మనః" కనుక ఇష్టాతిరిక్తవిషయ రహితమై యిష్టవస్తువునందు మనస్సంలగ్నము - ఏకాగ్రత - ధ్యానమని చెప్పబడుచున్నది.

"తత్రప్రత్యయైకతానతాధ్యానం" మఱియు నీ యేకాగ్రత పరమాత్మరూపమునందు పొందినచో ఈ ధ్యానము భక్తియోగముయొక్క అంగమగుచున్నది. ఫలము రెంటికిని నొక్క

టియే. సంకల్ప వికల్ప రాహిత్యము రెండింటి యందును కలుగుచున్నది. ధ్యానస్థితి పెరిగిన కొలది కేవల మీా భావమే ఉదయమగుచున్నది.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ
సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చ మధ్యం చ
భూతానా మంత ఏవ చ॥

అప్పుడు తనకు సవికల్ప - సమాధి భూమిక పొందబడినదని యెరుంగవలయును. ఈ సితి యొక్క పశ్చాద్దశయందు శుద్ధమైన "అస్మితా" కలుగుచున్నది. (అస్మితా = అహమస్మి యని భావము) సవికల్పసమాధినుండి ఉత్థానకాల మందు బాహ్యాభ్యంతర సంపూర్ణ వృత్తులు - లేక సృష్టి - తనయందు స్వగతభేదరూపముగా ప్రకాశించుచున్నది.

శ్లో॥ సర్వభూతేషు చాత్మానం
సర్వభూతాని చాత్మని।

అని యనుభూతమగుచున్నది. ఏ విషయమందు చిత్తమాబద్ధమై తద్గతభావంబున నిర్దిష్టసమయ మున అవిచ్ఛిన్నరూపమున స్థిరమగుచున్నదో యదియే "ఏకాగ్రమనఃస్థితి" యని చెప్పు చున్నారు. "తైలధారావతు" లేక "మధు ధారావతు". అవిచ్ఛిన్నరూపముగా మనస్సు యొక్క అవస్థయే "ఏకాగ్రమనఃస్థితి".

సూత్రకారు డిట్లు చెప్పుచున్నాడు: ఒక వృత్తి నివృత్తియైన పిదప మరల నట్టి వృత్తియే సంభవమగుచున్నది. తదనురూపవృత్తి ప్రవా హము సాగుచున్నచో - అట్టిచిత్తమే ఏకాగ్ర చిత్తమని చెప్పబడుచున్నది. చిత్తమేకాగ్ర స్వభావము నెప్పుడు పొందునో - అహోరాత్ర ములు అధికాంశసమయములందు - చిత్తమేకా గ్రమగుచున్నది. స్వప్నావస్థయం దేకాగ్ర స్వప్నము కలుగునపు డా చిత్త మేకాగ్ర మని చెప్పబడుచున్నది. జాగ్రదవస్థా సంస్కార ములవలన స్వప్నము సంభవించును. జాగ్రద వస్థయందు అత్యధికకాలము సహజముగా చిత్త మేకాగ్రమైనచో - స్వప్నములోగూడ నట్లే యుండును.

ఏకాగ్రతయొక్క లక్షణము - ధృవస్మృతి లేక ఆత్మస్మృతి. జాగ్రత్సంస్కారముచే స్వప్న మందుకూడ ఆత్మ విస్మరణము కానేరదు. కేవల శారీరకస్వభావ వశమగు నింద్రియములు జడమగుచున్నవి. ఏకాగ్రభూమిక ఆయత్తమైన సంప్రజ్ఞాత సమాధిసిద్ధియగుచున్నది. ఆ సమా ధియే కైవల్యసాధకము. యోగీశ్వరుల మనస్సు సమాధ్యవస్థలో సర్వవిధముల చింతారహిత మగుచున్నది. సుషుప్త్యవస్థలో అనగా స్వప్న శూన్యమైన గాఢనిద్రలో మనస్సు చింతనా శక్తిలేనిదగుచున్నది. తదవస్థాపన్నమగు మనస్సు "నిరుద్ధమనస్సు"ని చెప్పబడుచున్నది.

నిరోధసమాధి అభ్యాసముద్వారా చిత్తము దీర్ఘకాలమువరకు స్థాయియగు నిరోధ మాయత్తమగునప్పు డా చిత్తావస్థ "నిరోధ భూమి" యని చెప్పుదురు. నిరోధభూమి ద్వారా చిత్తము విలీనమై కైవల్యప్రాప్తమగు చున్నది. సమాధి లాభము పొందినవాడై వశుడు - సంయమియగు పురుషుడు సర్వాం గీణశుద్ధిని పొంది త్రితాపముక్తిని పొందు చున్నాడు

శ్లో॥ అయం తు పరమో ధర్మో
యద్ యోగే నాత్మదర్శనమ్।
అపి చ—
వినిష్పన్న సమాధిస్తు

ముక్తిం తత్రైవ జన్మని।
ప్రాప్నోతి యోగీ యోగాగ్ని
దగ్ధకర్మ చ యోఽచిరాత్॥

ఈ యేకాగ్రము - నిరుద్ధమనస్సు అసాధారణము, అమోఘము. ఈ యవస్థను తెలిసికొనుటకై శాస్త్రకారు లిట్టి దృష్టాంతములను ప్రదర్శించుచున్నారు.

పగటివేళ మండుస్వభావముగల ఏ పదార్థముంచినను మండుటెండలో దగ్ధముకానేరదు. భూతద్దమున కిరణములు ఘనీభూతమై దానిచే దాహ్యపదార్థము దగ్ధమై భస్మమగుచున్నది. దీనికి కారణమేమన ఆ భూతద్దములో సూర్యకిరణసమూహము ఘనీభూతమై కేంద్రీభూతమగుటవలన దాని శక్తి వేయిరెట్లు వృద్ధిపొందుచున్నది. ఆ రీతిగా చంచలమనస్సు ఒకపర్యాయమేకాగ్రము లేక నిరుద్ధముచేయజాలినమీద దానివలన విషయవాసనలు సమూలముగా భస్మీభూతమగును. ఇందాశ్చర్యకరమైన దేదియులేదు. మనస్సు ఏకాగ్రము - లేక - నిరుద్ధమొనరించుటలో అభ్యస్తము చేయని మనుష్యుడు వానినెరుంగుట మిక్కిలి కఠినము. ఏకాగ్రతలేక నిరుద్ధమనస్సునందు కామక్రోధాదులు - హర్షశోకాదులు - సుఖదుఃఖాదులు నిలువనేరవు.

భోగవాసనాశూన్యుడు కానప్పుడు మనస్సు స్థిరమై - ధ్యానమునందు నిమగ్నుడు కానేరడు. అనగా వైరాగ్యయుక్తుడు కానేరడు. పరమాత్మతో అభిన్నభావమువలన ఆత్మచైతన్యజ్ఞానమైన పిదప దేహాత్మబుద్ధి నష్టమగుచున్నది. ధ్యానయోగమువలన తన నిత్యచైతన్యస్వరూపధారణ నిశ్చితమైన పిదపనే సర్వభూతములందు చైతన్యశక్తి లేక బ్రహ్మశక్తి ఉపలబ్ధమగుచున్నది. ఆత్మధ్యానావలంబనుడగు సాధకుడు తన పృథక్ సత్తాస్వరూపమును విస్మరించి పరమాత్మయొక్క చిత్ స్వరూపమును పొందుచున్నాడు. మధ్యలో ఆత్మసాక్షాత్కారమున ఎల్లప్పుడును సత్యపాలనము - చిత్తైకాగ్రతా సాధనము - అంతటను జ్ఞానవికాసదర్శనము - బ్రహ్మచర్యము ఆవశ్యకమైయున్నవి. ఎట్లు స్వప్నజాతుడైన పుత్రునియొక్క అంతఃకరణముకంటె వేరు సత్తా లేదో ఆ విధముగనే అవిద్యయొక్క విషయసృష్టపదార్థములకు ఆత్మాతిరిక్తమగు పృథక్ సత్తా లేదు. ఏ విధముగా స్వర్ణముకంటె భిన్నాలంకారముల సత్తా లేదో - దేశకాలవిచ్ఛిన్నమైన స్వర్ణముయొక్క అనిత్య - ఆకారము మాత్రము అలంకారనామముచే ఖ్యాతిని పొందియు స్వర్ణము ఎట్లు సత్యమైనదో - ఆవిధముగనే బ్రహ్మాతిరిక్తమైన విశ్వముయొక్క భిన్నసత్తా లేదు. బ్రహ్మమే సత్యము. బ్రహ్మము జ్ఞానమువలన జగత్తు. బ్రహ్మజ్ఞానహీనులైన మనుష్యులయెడల జడరూపముగా గోచరించును ఈ జగత్తుకాని బ్రహ్మస్వరూపముకంటె భిన్నమైనదికాదు.

ఓం తత్సత్.

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
19-7-'16.

ప్రియ దే...

నీవు వ్రాసిన యుత్తరము చేరినది. నీవు క్షేమముగా నున్నావనియు, భగవద్ధ్యాన భజనాదుల నాచరించుచున్నావనియువిని యెంతయు సంతసించుచున్నాను. భోజనమున గ్రాహ్యాగ్రాహ్యములన్న విభేదము ప్రవర్తకులకొఱకే గాని యితరులకుగాదు. ఎవనికి మనస్సు భగవల్లగ్నమై యుండునో అతని కీ విభేదము లనావశ్యకములు. మనస్సు భగవల్లగ్నము గావించుటయే ముఖ్యాశయము. శ్రీ వివేకానంద స్వాములవారి గ్రంథములందు పఠించిన విషయము జ్ఞప్తియందుండవచ్చును. ఒకానొకచోట వారిట్లు పలికియున్నారు: 'ఒకానొక వ్యక్తి ఒకానొకప్పుడు మాంసపుముక్కనో లేక ఏదేని నిషిద్ధాహారమునో సేవించినంత మాత్రమున భగవత్కరుణాసాగరమే శుష్కించినచో అట్టి భగవదుపాసనవలని ప్రయోజనమేమి?' అనగా ఆహారవిషయము అంత ముఖ్యమయినదికాదు. భావమునే శుద్ధము గావించుకొనవలయును. ఒకడు పందిమాంసమును దినినను భగవంతుని సేవింపగలిగినచో నదియే యాతనికి హవిష్యాన్నము కాగలదు. హవిష్యాన్నమును భుజించినను వాడు నీచప్రవృత్తికలిగియుండెనేని — ద్వేషము మాత్సర్యము మున్నగు నీచగుణములను గలిగియుండెనేని — ఆ యాహారమువలని ప్రయోజనమేమి? నేను హవిష్యాన్నమును భుజించువాడనుగదా యన్న దంభము అహంకారము ప్రబలి యతనిని అధోగతికి దీసికొనిపోవును.

మాటలనుబట్టి ఖాద్యాఖాద్యవిభేదము అనవసరమని, అందువలన ప్రయోజనమేమాత్రము లేదని తలపవలదు. ఈ విషయమునందు మనస్సునింతగా జొరనీయరాదనియే నా యభిప్రాయముగా గుర్తించియుందువు. మన మనస్సంతయు భగవంతునికే చెందవలసినది. ధనమును విడిచి విడిబట్టను ముడివైచుటవంటిది యిది. ముడివైచుట ధనముకొఱకేగదా? ఆ ధనము లేని ముడివలని ప్రయోజనమేమి? అట్లే నియమములన్నియును భక్తిసాధనలన్నియును భగవంతుని బ్రాపించుటకే. మన మనస్సు భగవల్లగ్నము కానిచో నియమమువలన నే ప్రయోజనము గలుగగలదు? సమస్తమును వ్యర్థమే. చిన్ననాడు నేను విన్న పాట యొకటి జ్ఞప్తికివచ్చుచున్నది. పాటభావము:

'నేనే ధనముతో జీవింతును? ఓ భగవానుడా? అమూల్యరత్న మనదగు హృదయమునకు ధనమువంటివాడవు నీవు. నిన్ను మాత్రము నేను దాచుకొనగలిగినచో నిక సమస్తమును వదలి పర్ణశాలయందైనను హాయిగా జీవింపగలను. ఆ సమయమున నా హృదయాధినాథుడ

వైన నీవు నా హృదయమునంతటిని నీ యుజ్జ్వల కాంతిమయము గావింతువు.

నేను సమస్తదుఃఖములనుండి తప్పించుకొని నిన్ను పిలిచినపుడు నీవు నన్ను విడిచిపోవలదు. నిన్ను విడిచి సంసారమధ్యమున నే నెట్లు నివసింపగలను.

ధనము, గౌరవము—వీనివలని ప్రయోజన మేమి? ఇవియన్నియు నాతో రాజాలవుగదా?

నీవు నా వాడవు, నేను నీ వాడను. నా కెన్నటికిని నీవే.'

ఇదియే భావము. మిగిలినవన్నియు తన్ను విడిచిపోవునదియే. మూన్నాళ్ల ముచ్చటయే. శాశ్వతములుగావు. భగవంతుడొక్కడే శాశ్వతుడు. భగవంతుడుమాత్రము మనతోనున్నచో నెన్నటికిని దుఃఖము కలుగనేరదు. మహా దుఃఖము సైతము హృదయమున భగవానుని జూడగలిగినచో నపారానందముగా మారిపోవును. భగవానుని మనవానినిగా జేసికొన్నచో నింక నేదియు మనకవసరములేదు. 'యాఖయిాసాధే సబ్ సాధే సబ్ జాయే, జ్యాయాసించే మురకో ఫూలే ఫలే అజ్ హాయ్—ఒకదానియం దాశపెట్టుకొన్నచో ఆ యాశ నెరవేరగలదు. పదింటియం దాశ పెట్టుకొన్నచో నది నెరవేరజాలదు. ఒకచెట్టు మూలమున నీరుపోసినచో పుష్పములతోడను ఫలములతోడను ఆ చెట్టు నిండును. కాని ఆ నీటినే పలుచోట్ల జల్లినచో ఏ ఫలమును గలుగజాలదు. అందువలననే భగవానుని గనుగొనగలిగినవారందరును 'నిన్ను వినా నేను దేనిని గ్రహింతును' అని పలికియున్నారు.

ఇచ్చట శీతకాలమున చాల బాగుగా నుండును. గ్రీష్మకాలమునందును కొద్దిగ బాగుగనేయుండును. శీతకాలమున నిచ్చట చలి భరింపరానిది. గ్రీష్మకాలమున మనోహరముగా నుండును. అందువలననే యనేకులా సమయమున నిచ్చట నివాసమును గల్పించుకొందురు. మార్గము అత్యంతకష్టమే. అయినను ఒకపరి వచ్చినచో ఈ పర్వతశ్రేణి సౌందర్యము, నిర్మలవాయుప్రసారము—వీనివలన ఆ కష్టములన్నియు మటుమాయములగును. కాశీహరిద్వారమునకువలె నీ ప్రదేశమునకుగూడ శాస్త్రీయ ప్రఖ్యాతి కలదో లేదో యెఱుగను గాని హిమాలయప్రదేశమున నిది ఉత్తరఖండము. పార్వతీ పరమేశ్వరుల స్థానము. మఱియు శ్రీ వివేకానందస్వాములవారి స్మృతియందు మాకు సన్నిహితము. అందెంతమాత్రము సందియములేదు.

నా శుభాశీర్వచనములు,
ఇట్లు,
శ్రీ తురీయానంద

# రాయలసీమ క్షామనివారణయందు శ్రీరామకృష్ణ సేవాసంఘ సహాయోద్యమము

[స్వాతంత్రసిద్ధి కలిగినను, నాటినుండియును భారతవర్ష ప్రజలకు నిత్యావసరములగు కూడు గుడ్డలయం దసలే కొఱతనివారింపబడలేదని యెల్లరకును విశదమే! నేటి యీ క్షామపరిస్థితియు, ఇంతటి భీషణ గ్రీష్మమును 1886 పిదప నెన్నడును ప్రజానీకము అనుభవించి యుండలేదని చరిత్రవలన దెలియుచున్నది. జరిగిన నాలుగు సంవత్సరములనుండియు వర్షములు కురియక పంటలుపండక ప్రజలు తిండికి గుడ్డలకు ఎంతో కష్టమునబడి అల్లలాడి పోవుచున్నారు. ముఖ్యముగా రాయలసీమయందు ప్రజలు ఎంతో దీనగతికిలోనై త్రాగుటకు నీరు సయితము లేనివారై అల్లల్లాడి పోవుచున్నారు. ఈ సమయమున సుభిక్షముగనున్న ప్రదేశములందలి ప్రజలు సోదర మానవుల ప్రాణరక్షణమున నెంతయు సాయముచేయవలసియున్నారు. రాజ్యాంగమువారు కొంత సేవచేయుచున్నారు. అది అసమగ్రము. ప్రజలలోని విషయప్రచారార్థము మేము గతమాసము ప్రచురించిన నివేదికను మఱల ప్రచురించుచున్నాము.]

రాయలసీమయందు నేడు ప్రబలిన కాటకము వర్ణనాతీతమని ప్రతి ఆంధ్రునకును దెలిసినవిషయమే. ఆహార పానీయములు లేక ప్రజలు అల్లల్లాడిపోవుచున్నారు. మిక్కుటమయిన ఎండలవలన, వర్షాభావమువలన పంటలు నశించుటయేకాక బావులు, చెఱువులు మున్నగునవన్నియు ఎండిపోయి, త్రాగుటకు సయితము నీరు దొరకక నానావస్థలకు ప్రజానీకము లోనుగావలసివచ్చినది. ప్రజలతోపాటు పశువులుగూడ మేత, నీరు లేక క్రుంగి కృశించి పోవుచున్నవి.

ఇట్టి భీభత్సపరిస్థితి యిటీవల నెప్పుడును సంభవింపలేదు. ఈ సమయమున 'అన్నమో రామచంద్రా' యనుచు నలమటించుచున్న ప్రజలకు సహాయము చేయుటకు శ్రీరామకృష్ణ (మిషన్) సేవాసంఘము పూనుకొన్నది. శ్రీ రామకృష్ణసంస్థకు 'ఆంధ్రప్రభ' గూడ తోడునీడయగుట వలన ఈ సంస్థవారు క్షామపీడితుల కపార సహాయము చేయగలుగుచున్నారు. ప్రతి దినము సోదరమానవసేవకై సేవాదళమునందు యువకులు విరివిగాజేరి కార్యక్రమమును చక్కగా నిర్వర్తించుటయందు ఈ సంస్థకు సహాయము చేయుచున్నారు.

రాజమహేంద్రవరమునందలి శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీనిత్యబోధానందస్వాముల వారు రాయలసీమ క్షామనివారణ కార్యక్రమమునకు బూనుకొని సేవాదళమును సమకూర్చి 'ఆంధ్రప్రభ నిధి' సాయమున నచ్చటి క్షామపీడితుల కత్యంత సహాయము చేయుచున్నారు. వీరి సేవ నిరుపమానమని జిల్లా కలెక్టరులు మున్నగువారెల్లరు ప్రశంసించుచున్నారు.

శ్రీస్వాములవారు రాజ్యాంగమువారితో సంప్రతించి క్షామపీడిత ప్రాంతములకు ఉచిత రవాణా సౌకర్యములనుగల్పించి పల్లెపల్లెకు

సాయము గావించుచున్నారు. ధనియర్ చెఱువులో శ్రీరామకృష్ణసేవాసంఘమువారు ధాన్యపంపక కేంద్రమును ప్రారంభించిరి. దానికి అనంతపురము జిల్లాకలెక్టరు టి. జె. జాక్సన్ ప్రారంభోత్సవము చేశారు. ఈ కేంద్రంలో కొనుగోలుశక్తి నశించి నిరుపేదలయిన క్షామపీడితులకు ఉచితముగా ధాన్యము పంచి పెట్టుచున్నారు. 10–వ తేదీనాడు నంబులపల్లి కుంట గ్రామములో శ్రీరామకృష్ణ సేవాసంఘము వారు మరొక ధాన్యపంపక కేంద్రమును స్థాపించి రోజుకు తలకు ఎనిమిది ఔన్సుల ధాన్యమువంతున పంచిపెట్టుచున్నారు. ఈ కేంద్రములలో ఒక్కొక్క దానియందును దాదాపు ఎనుబది కుటుంబములవారికి తలకు రోజుకు 8 ఔన్సుల వంతున ఉచితముగా ధాన్యము పంచిపెట్టుచున్నారు. మొత్తము మీద నిట్టి కేంద్రములు చిత్తూరునందు రెండు, కడప జిల్లాయందు అయిదు, అనంతపురము జిల్లాయందు రెండును ప్రారంభింపబడినవి. ఈ కేంద్రములన్నింటియందును ఒక్కొక్కదానియందు సరాసరి 300 బాధితులకు సహాయముచేయబడుచున్నది. చిన్న బిడ్డలకు పాలిచ్చుటకు కడపజిల్లాలో 4 కేంద్రములు ప్రారంభింపబడినవి. అందు ప్రతిరోజు సరాసరి 640 పిల్లలు రోజునకు రెండుపూటలు పాలు పుచ్చుకొనుచున్నారు.

బద్వేలి తాలూకా అంబవరము గ్రామమునందు అగ్నిప్రమాదమువలన ఇండ్లన్నియు కూలిపోగా శ్రీరామకృష్ణమిషను కార్యకర్తలు అచ్చటికి హుటాహుటినేగి బాధితులకు ఆహారధాన్యపంపక కేంద్రమును నెలకొల్పి సహాయము చేయుచున్నారు. అగ్నిప్రమాదమువలన సర్వస్వమును గోలుపోయిన కుటుంబీకులకు మిషను వారు వస్త్రాలుగూడ పంచిపెట్టుటకు ఆలోచించుచున్నారు. తుమ్మలచెరువు చుట్టుప్రక్కల బావులను లోతుచేయుటకు మిషనువారు 1,700 రూపాయలు ఖర్చుపెట్టి యున్నారు. ఇట్టివి అనేకము గలవు.

తూర్పుగోదావరి జిల్లా వేళంగి గ్రామస్థులు పంపిన 250 బస్తాల బియ్యము, 60 బండ్లగడ్డి మిషనువారు కృతజ్ఞతతోనందుకొనియున్నారు. ఈ సందర్భమున తమకు దోడ్పడిన వేలాది సోదర మానవులకు మిషనువారు కృతజ్ఞత తెలుపుచున్నారు. ఇట్టి ధాన్యపంపక, గడ్డి పంపక కేంద్రములు, గంజి సత్రాలు అవసరమునకు దగినన్నింటిని బ్రారంభించుటకు మిషనువారు బద్ధకంకణులై యున్నారు.

పశువులకు ఉచితముగా గడ్డి పంచిపెట్టుటకు గడ్డి డిపోలుగూడ శ్రీరామకృష్ణ సేవాసంఘమువారు స్థాపించియున్నారు. ఈ కార్యమునందు సేవాసంఘమునకు 'ఆంధ్రప్రభ' చేయుచున్న సహాయ మనిర్వచనీయము. ఆంధ్రప్రజానీకము సోదరాంధ్రులకు సాయముచేయుటయందు శ్రీరామకృష్ణ సేవాసంఘమువారికి తోడ్పడును గాత!

విరాళములు పంపగోరువారు :

కార్యదర్శి, శ్రీరామకృష్ణమిషన్, మైలాపూరు, మద్రాసు అనుచిరునామాకుగాని, శ్రీ నిత్యబోధానందస్వామి, రామకృష్ణసమాజము, కడప అను చిరునామాకుగాని పంపవలసినదిగా బ్రార్థించుచున్నాము.

ఎంతటి స్వల్ప విరాళములయినను కృతజ్ఞతతో నందుకొనబడును.



సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే శి జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-5-52.

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము ?0-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు దాఁచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములే కాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునెనుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ | ౧౯౫౨ - జూన్ : : నందన - జ్యేష్ఠము | సంచిక ౧౨

## ప్రార్థన

మధుర మధుర మే తత్ మంగళం మంగళానామ్
సకల నిగమవల్లీ సత్ఫలమ్ చిత్స్వరూపం
సకృదపి పరిగీతం శ్రద్ధయా హేలయావా
భృగువర ! నరమాత్రం తారయేత్ కృష్ణనామః.

శ్రీకృష్ణుని నామము మధురమాత్రమే కాదు. మధురములగు వస్తువులన్నింటికంటెను మధురమయినది. వేదశాస్త్రలతలకు శ్రేష్ఠమయిన ఫలము. కేవలము చిత్స్వరూపము గలది. ఒక్కపరి శ్రద్ధతోడనో వినోదముగనో ఉచ్చరించినచో నరులను తరింపజేయును.

—శ్రీమద్భాగవతము



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

## దక్షిణేశ్వరాలయమున భక్తులతో శ్రీ రామకృష్ణుడు

ఆదివారము,

9 డిసెంబరు 1883

మార్గశిరము శుద్ధ దశమి

సుమారు మధ్యాహ్నము ఒంటిగంటయైనది. శ్రీ రామకృష్ణ గురుదేవుడు తన గదిలో చిన్నమంచముపై గూర్చొని భగవద్విషయాలాపనము గావించుచుండెను. అధరుడు, మనోమోహనుడు, శివచంద్రుడు, రాఖాల్, 'మ.' మున్నగు భక్తులు కొందరు వచ్చియుండిరి. శ్రీ రామకృష్ణ గురుదేవుడు చైతన్యులవారి భావావస్థలను వర్ణించుచుండెను.

శ్రీరామ:—(భక్తులతో) చైతన్యునకు ముప్పిధములగు భావావస్థలు కలుగుచుండెడివి. (1) బాహ్యదశ. ఈ దశయందు స్థూల సూక్ష్మ వస్తువులయందే ఆయన మనస్సు లయించియుండెడిది. (2) అర్ధబాహ్యదశ. ఈ దశయందు ఆయన మనస్సు కారణశరీరమునందు లయించి కారణానందమున నిమగ్నమయ్యెడిది. (3) అంతర్దశ. ఈ దశయందు మహాకారణమున ఆయన మనస్సు లయించెడిది. వేదాంత ప్రోక్తములగు పంచకోశములకును ఈ దశలకును సన్నిహితసంబంధము గలదు. స్థూలశరీరమన అన్నమయ ప్రాణమయ కోశములు. సూక్ష్మశరీరమనగా మనోమయ విజ్ఞానమయ కోశములు. కారణశరీరమనగా ఆనందమయ కోశము. మహాకారణము పంచకోశములకును అతీతమయినది. మహాకారణమున మనస్సు లీనమయినచో మానవుడు సమాధిస్థితుడగును. దీనినే నిర్వికల్పసమాధి యనియు జడసమాధి యనియు వచింతురు. శ్రీ చైతన్యదేవుడు బాహ్యదశయందుండగా నామసంకీర్తనము చేయువాడు. అర్ధబాహ్యదశయందు భక్తబృందములతో నృత్యముచేసెడివాడు. అంతర్దశయందు సమాధిగతుడగువాడు.

'మ.':—(తనలో) శ్రీ రామకృష్ణ గురుదేవుడు తన యవస్థనే యిట్లు మనకు బోధించుచుండెనా యేమి? వీరి భావావస్థలుగూడ శ్రీ చైతన్యదేవునివంటివే.

శ్రీరామ:—చైతన్యుడు 'భక్తి' అవతారము. జీవులకు భక్తిని నేర్పుటకై యవతరించెను. భగవద్భక్తి సమకూరినచో సమస్తమును సమకూరినట్లే. హఠయోగమువలన ప్రయోజనము లేదు.

ఒకభక్తుడు:—చిత్తము, హఠయోగమెట్టిది?

రామ:—హఠయోగమున శరీరమునందెక్కువగా మనస్సును నిలుపుదురు. వీరు శరీరమునందలి అంతఃప్రక్షాళనముకొఱకు జలమును గుహ్యద్వారమువలన లోనికి బీల్చుకొందురు. జిహ్వాసిద్ధి నభ్యసింతురు. వాయుస్తంభనయు జలస్తంభనయు జేయుదురు. ఇవన్నియు వాయుక్రియలు. ఒక డింద్రజాలమును జూచుచుండ నతని నాలుక మడతపడి యంగిట నంటుకొనెను. వెంటనే యతని శరీరము స్థిరమయ్యెను. అపుడు జనులందరు నతడు మరణించెనని తలంచిరి. ఆ శరీరమును భూస్థాపితము గావించిరి. బహుకాలానంతర మా మన్ను శిథిలమయ్యెను. హఠాత్తుగా నతనికి చైతన్యము కలిగెను

వెంటనే యతడు లేచి 'ఓం హ్రాం మహాకాళీ భద్రకాళీ జం జం ఫట్ ఫట్' అని కేకలువేయ దొడంగెను. ఇదంతయువాయుస్తంభన కార్యమే. వేదాంతవాదులు హఠయోగము నంగీకరింపరు. మఱియొక యోగము రాజయోగము. రాజయోగము మానసికము. భక్తివలనను విచారమువలనను యోగము కలుగవచ్చును. ఈ యోగములే మంచివి. హఠయోగము మంచిదికాదు. కలియుగమున మానవులెల్లరును అన్నగతప్రాణులు.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు నహబత్ దగ్గరిదారియందు నిలుచుకొనియుండెను. నహబత్ వసారాలో పూలచెట్ల కంచె చాటున కూర్చొని 'మ.' చింతాపరవశుడై యుండెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు సరివితోటలోనికి వెళ్లి మరలివచ్చి ముఖము కడుగుకొని యతని యెదుట నిలుచుకొనెను.

శ్రీరామ:—ఏమోయ్! ఇందు కూర్చుంటివే. నీ కన్నియు త్వరలో లభించును. నీ వేమియునను కొంత యాచరించినచో నొక మహనీయుడు నీకు మార్గము చూపును.

'మ.': చకితుడై శ్రీ రామకృష్ణ గురుదేవుని జూడ నారంభించెను. కూర్చున్నస్థలము నుండి లేవలేను.

శ్రీరామ:—నీ కాలము సమీపించినది. పిట్ట గ్రుడ్డు ప్రిదులు సమయము వచ్చినపుడే గ్రుడ్లు చిట్లును. ఎది నీ యిష్టమని నేను పలికితినో నదియే నీ యిష్టదైవము.

అని పలికి శ్రీ రామకృష్ణ గురుదేవుడు మఱల ఇష్టదైవమును సూచించెను. అందరును చాల తపమాచరింపవలయునన్న నియమము లేదు. నేనుమాత్రము చాల కష్టపడవలసి వచ్చినది. నేను భూమిమీద శయనించి మంటి ముద్దనే తలగడగా ధరించెడివాడను. ఆ దినము లెట్లు గడచినవో! ఎల్లప్పుడును 'అమ్మా! అమ్మా!' యని పిలిచెడివాడను; ఏడ్చెడివాడను.

రామకృష్ణ గురుదేవునియొద్దకు 'మ.' రెండేండ్లనుండి వచ్చుచున్నాడు. ఆంగ్ల మభ్యసించినవాడు, కేశవుడు మున్నగు పండితుల యుపన్యాసముల వినుటయం దభిలాషగలవాడు. కాని శ్రీ రామకృష్ణ గురుదేవుని సాన్నిధ్యమవలబించినప్పటినుండియు ఐరోపీయ పండితుల గ్రంథములను ఆంగ్లేయ భాషయందలిగాని యితరభాషలయ దలిగాని యుపన్యాసము లాతనికి సహింపరానివయ్యెను. ఇపుడతనికి వారి దర్శనము, వారి వాక్యశ్రవణము—ఇవియే అమృతమయానందమును గలిగించుచుండెను. 'భక్తిసాధనలవలన భగవానుని మనము దర్శింపవచ్చును. భగవద్దర్శనమే మానవజీవిత ముఖ్యోద్దేశము' అని వారు పలికిన వాక్యములను నతడెల్లపుడును తలంచుచుండెను.

శ్రీరామ:—నీవు కొంత ఆచరించినచో సాయము తనంతట తానే లభించును. నీ వేకాదశీవ్రత మనుష్ఠింపుము. మీరందఱును నా స్వజనమే. నా బంధువులు. అట్లుకానిచో నీవేల యిచటికి వత్తువు? ఒకనాడు సంకీర్తనము వినుచుండగా వ్రజమండలములో రాఖాలుని జూచితిని. నరేంద్రుడుగూడ మిక్కిలి యుచ్చశ్రేణికి జెందినవాడు. మరియొకడు హీరానందుడు. అతని దెంతటి బాలకస్వభావమో! అతని భావము మిక్కిలి మధురమయినది. అతనిని జూడవలయునని కోరిక పొడముచున్నది.

గౌరాంగుని సాంగోపాంగముగ జూచితిని. భావావేశమున గాదు. ఈ కండ్లతోనే జూచి

అప్పటి నా యవస్థలో ఈ సాధారణ

నేత్రములతోడనే సమస్తదర్శనములను గాంచెడి వాడను. ఇప్పుడా భావము లేదు.

గౌరాంగుని సాంగోపాంగముగ ఈ కనులతో జూచితిని. అందు నీవుగూడ నుంటివి. బలరామునిగూడ చూచినట్లు తోచుచున్నది.

కొందరను జూడగనే యులికిపడి లేచువాడను. ఏలనో తెలియునా? స్వబంధువును చాల దినముల కావల జూచిన నట్లే జరుగును. జగన్మాతకడ నేడ్చుచు, 'అమ్మా! భక్తులజూచుటకొఱకు నా ప్రాణము తహతహలాడుచున్నది. వారిని శీఘ్రముగ నా కడకు గొనిరమ్మని ప్రార్థించువాడను. నా ప్రార్థనలెల్ల ఫలించెడివి.

పంచవటియందొక తులసీవనము నేర్పఱచితిని. అచ్చట జపధ్యానములు చేయవలయునని నా యభిలాష. వెదురుకఱ్ఱలతో దానికి కంచె గట్టవలయునని కోర్కె పొడమెను. నదిఒడ్డున కొంతసేపటికి త్రాడు, వెదురుబొంగులు వచ్చి పడియున్నవి. దేవాలయపు నౌకరి యిది చూచి మిక్కిలి యానందముతో నృత్యముచేయుచు నాకీ వార్తను దెలిపెను.

ఈ యవస్థయందు దేవిని అర్చింపజాలక పోయితిని. అపుడు జగన్మాతను సమీపించి, 'తల్లీ! నన్నింకెవరు రక్షింతురు. నా భారమును భరింపగల శక్తి నాకు లేదు. ఎల్లప్పుడు నీ గాథలనే వినవలయునని కోరిక కలుగుచున్నది. భక్తులకు ఆహారము పంచిపెట్టవలయునని ఆశ పొడముచున్నది. ఎవరినైన జూచినచో వారికేదేని పెట్టవలయుననిపించుచున్నది. తల్లీ! ఇవన్నియు నెట్లు జరుగును? ఏదో గొప్పధనికు నొకని నాకు సహాయునిగా జేయుమని కోరితిని. అందుచేతనే మథురబాబు నా కింత సేవ చేసెను.'

మఱియొకపుడు, 'అమ్మా, నాకు సంతానము కలుగదుకదా! కాని శుద్ధభక్తుడగు బాలు డొకడు నాతో నుండునట్లు చేయు'మని ప్రార్థించితిని. అందువలననే రాఖాల్ వచ్చి చేరెను. నా స్వజనముగా నెవరెవరిని తలంచుచుంటినో వారందఱును నా యంశము, లేక కళ.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు పిదప పంచవటి కభిముఖుడై పోవుచుండ 'మ.' కూడ ఆయన ననుసరించెను. నవ్వుచు శ్రీ రామకృష్ణ గురుదేవు డతనితో వివిధ విషయములగూర్చి మాటాడుచుండెను.

శ్రీరామ:—ఒకనాడు నాకు అద్భుతదర్శనము కలిగినది. కాళీదేవాలయమునుండి పంచవటివఱకు ఆశ్చర్యమయిన మూర్తి. దీనిని నీవు నమ్మెదవా?

'మ.' ఏమియు పలుకజాలక ఆశ్చర్యనిమగ్నుడయ్యెను పంచవటియందలి చెట్ల యాకులను జేబులో నుంచుకొనెను.

శ్రీరామ:—ఇదిగో ఈ కొమ్మ పడిపోయిన చోటనే నేను కూర్చొనువాడను.

'మ.':—ఇచ్చటనుండి యొక చిన్న కొమ్మను విఱచి నే నింటికి గొనిపోయితిని. అది నా యింట నున్నది.

శ్రీరామ:—(నవ్వుచు) అది యెందుకు?

'మ.':—దానిని జూచినచో నేనుమిక్కిలి యానందింతును. ఇదంతయు ముగిసిన పిదప ఈ స్థలము మహాపవిత్ర తీర్థముగా మారును.

శ్రీరామ:—ఎట్టి మహాతీర్థము. పాణీహాటీ వంటిదేనా?

పాణీహాటీలో ప్రతిసంవత్సరము రాఘవ పండితుని మహోత్సవము జరుగును. శ్రీ రామకృష్ణ గురుదేవు డచటికిబోయి యుత్సవమున బాల్గొని ప్రేమానందముతో నృత్యముచేసెడి వాడు.

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
5-8-'16.

ప్రియ దే...

నీ జీవితము సర్వదా ఆనందమయమై యారోగ్యముతో గడచిపోవుచున్నదని విని సంతసించుచున్నాను. సదా భగవద్ధ్యాన జప తపాదులతో జీవనముగడుపు నీవు ఆనందముతో నుండుటయం దాశ్చర్యమేమి? మన కోరిక లన్నియు భగవంతునివే యన్న సుస్థిరభావము అజ్ఞానావస్థయందు గలుగజాలదు. భగవంతుడు సదా సత్యసంకల్పుడు, మానవసంకల్పము ఒక మారు సత్యము గావచ్చును వేరొకమారు కాకపోవచ్చునుకూడ. భగవత్కారుణ్యము వలన మన మనస్సు పరిశుద్ధమయినచో నీ విషయమునందలి సరియగు భావము మనము తెలిసికొనగలము.

ఇట్లు,
నా శుభాశీర్వచనములు,
శ్రీ తురీయానంద

---

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
4-3-'16.

ప్రియ దే...

నీవు 17 వ తారీఖున వ్రాసిన యుత్తరమును జూచితిని. బేలూరు మఠమున శ్రీ బ్రహ్మానంద స్వాములవారును ఇతరస్వాములవారును వచ్చి చేరిరన్న విషయము వ్రాసియుంటివి. వారి సాంగత్యమువలన నీవెంతో యానందమును నుపకారమును పొందుచుంటివని విని యపరిమితానందము నందితిని. మహాభాగ్యవంతుడవు కానిచో ఇట్టివారి సాంగత్యము నీకు లభింపదు. ఇక శ్రీవారి కృపారసము నిరాటంకముగా నీయందు ప్రసరించి నానాటికి అభివృద్ధి నందుటకై నీవు ప్రయత్నింపవలయును. వారి సాంగత్యమువలన నీకు కలుగు శుభఫలముగూడ నానాటికి ప్రవర్ధిల్లునట్లు నీవు ఆచరింపవలయును. ఇక ముఖ్యమయిన నా వేడికోలు భగవచ్చింతనము, ప్రార్థనము చిరస్థాయి గావించుకొనుటయే. అది మఱువవలదు. చిత్తవృత్తి యసద్విషయముల గమించినను దాని భగవన్మార్గాభిముఖము గావించుటయే సత్సంగమువలని పరమలాభము. ఎవరి సాంగత్యము వలన భగవద్భావము మనమున పొడమి యభివృద్ధి యగునో యతడే సాధువు. అందువలననే తులసీదా సిట్లు వచించియున్నాడు: 'సంగత కరిమే సాధుకీ హరే అవుర్ కే వ్యాధి, ఓఛీ సంగత నీచకీ ఆటోపహర్ ఉపాధి——సాధుసంగమ మాచరింపుము. దానివలన నితర వ్యాధులన్నియు దూరీకృతములుగావింపబడును. కాని నీచసాంగత్యము చేసినచో అష్టవిధములగు ఉపాధులను ఉపద్రవములు కలుగును.'

ఇట్లు,
నా శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద

---

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
21-5-'16.

ప్రియ దే...

ఇపుడు నీవు క్షేమముగా నున్నావని విని సంతసించుచున్నాను. 'తద్దినం దుర్దినమ్మన్యే

మేఘాచ్ఛన్నం న దుర్దినమ్, యద్దినం హరిసంలాప కథా పీయూష వర్జితం—మేఘాచ్ఛన్నమయిన దినము దుర్దినముకాదు. హరికథామృతపాన వివర్జితమయిన దినమే దుర్దినము.' ఒక్కొక్క దినమును సుఖదుఃఖములతోడను మంచిచెడ్డలతోడను గడచిపోవుచుండును. కాని ఏదినముభగవద్భజన విహీనమై గడచినదో అది వృథాఆయుక్షయకరమయిన దినము. ఈ కాలమున నీకు మనస్సు భగవద్భజనమునందు సుస్థిరమైయానందము ననుభవించుచున్నట్లు వ్రాసియుంటివి. అది విన్న నాయానందమునకు మేర లేదు. చక్కగా భజింపుము. అపుడే జీవితము సార్థకము కాగలదు. జీవనార్థము పడవలయు పాటు తప్పనిసరి. అదియును స్థిరబుద్ధితో నాచరింపవలయును. ఏ పనియును విరక్తిభావముతో నాచరింపరాదు. అట్లాచరించిన చో ప్రయోజనము శూన్యము. భగవంతుడు నిన్నుంచిన స్థలముననే నిలిచి హృదయపూర్వకముగా భగవత్ప్రార్థనమును సలుపుము. స్థానమువలన నేమియు కలుగజాలదు. అయినను భగవత్ప్రార్థనానుకూలమగు స్థలమునందే యుండవలయును. ఇంటనేయుండి ప్రార్థింపగలిగినచో బయటికిపోవలయు నవసరమేమి? విషయకర్మములు వీలగునంతటి నిర్లిప్తభావముతో నాచరింప ప్రయత్నింపవలయును. ఇట్లభ్యసించినచో సకలకార్యములును సక్రమముగ జేయగలుగుదుము. భారమంతయు భగవానునకు వదలి శాంతమనస్కుడవై యుండుటకే ప్రయత్నింపుము. మోహావేశముచేత జీవుడు తాను కర్తనని తలంచి బద్ధుడగును. 'నాహం నాహం, తుహు తుహు' మహామంత్రమును మఱువవలదు. ఇట్లు ప్రవర్తించిన చో ఇతరచింతలన్నియు నిన్ను వదలిపోవును. మనస్సు ఎన్నాళ్లవఱకు శారీరకమై యుండునో అనగా శరీరము అస్వస్థమై భగవచ్చింతనమునకు వెలియగుచుండునో అంతవఱకును శరీరమును ఆరోగ్యము నంతముగా నుంచుకొన ప్రయత్నింపుము. శరీరమును పోషించుట దానికొఱకుగాదు. భగవద్ధ్యానమునకు సహాయకరమగుటకొఱకే దానిని పోషింపవలయును.

నీ కోరికయును నుత్సాహమును విని నే నెంతయు సంతసించుచున్నాను. అట్లే యుండవలయును. నానాటికి నీ కోరికలన్నియు సఫలములగుగాక. ఉత్సాహము లేనివాడు నానాటికి విషాదము నందుచుండును. భగవచ్ఛరణాగతుడవై యున్నచో నీకే బాధయు కలుగదు. ఆయన నీ కెల్లవిధముల దోడ్పడి నిన్ను తనయొద్దకు దీసికొనిపోవును. మనస్సు పాటుపోట్లను కలిగియుండును. ఒకప్పుడు భగవల్లాభమునందు రుచియు ఆనందమును పొడమును. మఱియొకప్పుడు ఏదియు నచ్చదు. భగవద్భజనయం దభిరుచియే యుండదు. నిరానందముతో హృదయము నిండిపోవును. కాని ఈ అవస్థాద్వయమునందును భగవంతుని భజించుచు నచ్చినను నచ్చకపోయినను వదలక ప్రార్థించుచున్నచో నట్టివాడీ పాటుపోట్లను దాటి నిశ్చలభావమును బడయును. అట్టివాడు ప్రయత్నరహితుడైనను వాని మనస్సు సదా భగవద్భావపూర్ణమై యలరారుచుండును. హర్షవిషాదము లతని నేమియు జేయజాలవు. అతడు సకలావస్థలయందును భగవంతుని భజించుచు మహానందము ననుభవించుచుండును. భగవత్కృపవలన నిట్టి యవస్థ ప్రాపించినవాడు ధన్యుడు.

ఇట్లు,

నా శుభాశీర్వచనములతో,

శ్రీ తురీయానంద

# శ్రీ బుద్ధ భగవానుడు

(గత సంచిక తరువాయి)

కపిలవస్తు పట్టణమునకు సమీపమున తన ప్రియపుత్రుడు శిష్యవర్గముతో విడిసియున్నట్లు తెలిసి యపరిమితానందభరితుడై శుద్ధోధనుడు, ఆయనకు తన యాహ్వానమును దెలిపి తన నగరమునకు రమ్మని యభ్యర్థింపనేగెను. కాని యచ్చట కాషాయవస్త్రములతో భిక్షుకరూపమున నున్న తనకుమారుని జూడగనే ఆ మహారాజునకు పట్టరాని దుఃఖము కలిగెను. అంతట నతడు సిద్ధార్థుని జూచి, 'నాయనా! శాక్య వంశ సంజనితుడవగు నీ విట్లేల వంశమర్యాదలకు దగని హీనకార్యము లాచరించుచుంటివి?' అని మందలింప భగవానుడు ఇట్లు వచించెను. "ఇట్టి కార్యము నేనొక్కడనుమాత్రమే చేయుచుండుట లేదు. మనపూర్వులుగూడ ఎందఱో ఈ విధముగ ప్రవర్తించిరి. మానవ జీవితమున దుఃఖమే ఎక్కువ. దీనికి మూల కారణము అవిద్య.* ఈ ప్రపంచమునందలి సమస్త వస్తుజాలమును క్షయశీలము గలది. అవిద్య ప్రకృతితత్త్వమును జీవునియొద్దనుండి మఱుగుపఱచి సమస్తదుఃఖానుభూతిని కలిగించుచున్నది. ఇందులకు ముఖ్యకారణము తృష్ణ లేక ఆసక్తి. పూర్వజన్మయందలి కర్మఫలము వలననే మనకీ జన్మ కలిగినది. ధర్మము నాశ్రయింపుము. సత్యము, ప్రియవాక్యము, ధైర్యము, క్షమ, అహింస మున్నగు సద్గుణములవలన మెల్లమెల్లగా కర్మపాశములను త్రెంచి నిర్వాణపదమును బడయవలయును"

బుద్ధభగవానుడు బ్రహ్మము, ఈశ్వరుడు— వీనినిగూర్చి ఏమియు వచింపకపోయినను వారి యనంతరము ఆ సంప్రదాయస్థులు వివిధశాఖలతోగూడిన శూన్యవాదము, నిరీశ్వరవాదము -వీనిని ప్రచారించుచు ఆయా దర్శనశాస్త్రములనుగూడ సృష్టించిరి. కాని బుద్ధభగవానుని వచనములనుబట్టి, 'వేదాంతినాఖ్యోపదేశములకు రూపాంతర కల్పనమే' వారి యభిప్రాయమని తేలుచున్నది. అద్వైతవాదులును బౌద్ధ

* బౌద్ధుల అవిద్యకును వేదాంతసాంఖ్యదర్శనములలో జెప్పబడిన అవిద్యకును భేదము గలదు. బుద్ధభగవానుడు బ్రహ్మము, ఈశ్వరుడు, పురుషుడు—వీనినిగూర్చి ఏ యభిప్రాయమును వెలిబుచ్చియుండలేదు. వేదాంతమతానుసారము జీవ బ్రహ్మముల భేదము అవిద్యామూలముననే పొడముచున్నది. స్వస్వరూపమును సరిగా గ్రహింపలేని పరిస్థితి కలిగించుకొనుటవలననే సకలానర్థములును కలుగుచున్నవి. అవిద్య నశించినచో జీవబ్రహ్మైక్యము సిద్ధించును. సాంఖ్యులు ఇట్లు వచింతురు: 'ప్రకృతి, లేక అవిద్యయే ప్రధానమయినది. దాని యిచ్ఛానుసారమే లేక త్రిగుణాత్మకము దాని నృత్యములకు పురుషుడు ముగ్ధుడై దానితో నభేదబుద్ధికలిగి కష్టములపాలగును.' పురుషుడు నిర్వికారచిత్తుడై ఈ మాయాజాలమునుండి యెపుడు తప్పించుకొనునో యపుడే ముక్తుడై ఆనందమయస్థితిని జేరును.

లునుగూడ అవిద్యను నిత్యముగా పరిగణించిన వారు కారు. ఆ యుగమునుబట్టి బుద్ధదేవుని మతము అవశ్యానుసరణీయమైయుండెను. ప్రజలు ఆత్మవిద్యా ధ్యానమును సంపూర్ణముగా వదలి స్వర్గములకుబోయి యింద్రభోగముల ననుభవించుటయే పరమార్థముగ నెంచి దేవతలను సంతోషపెట్టుటకు జీవహింసాత్మకములగు యజ్ఞములను యాగములను జేయుచుండిరి. వారు యోగాభ్యాసమున కలవడినను ఐశ్వర్యాది సిద్ధులే వారిలక్ష్యమై యుండెను. కావుననే శ్రీ బుద్ధభగవానుడు 'సంసారము దుఃఖమయమయినదని వివరించి భోగానుభవమువలన మానవుడెన్నటికిని శాశ్వతసుఖమును బడయజాలడు. బ్రహ్మేశ్వరవాదముల నటుంచి మనము ప్రస్తుత మీ త్రివిధతాపములనుండి తప్పించుకొని బయటబడు మార్గమును వెదుకవలయు'నని ప్రబోధించిరి.

కపిలవస్తు నగరమున నెందఱో వారి శిష్యగణమున జేరిరి. వారిలో ముఖ్యులు తమ సవతి తమ్ముడగు ఆనందుడు, బావమఱదియగు దేవదత్తుడు; అనిరుద్ధుడు. పిదప భగవానుని ధర్మపత్ని యశోధర శ్రీవారి యుపదేశమునంది కృతార్థురాలాయెను. కుమారుడు రాహులుడును శిష్యవర్గమున జేరెను.

ఇక రాజగృహము పోవుమార్గమునగూడ భగవానుని యుపదేశములవలన నాకర్షింపబడి యెందఱో వారిశిష్యగణమున జేరిరి. ఈ బౌద్ధసంఘము మన దేశమున మెల్లమెల్లగా రూపొందుట నొకానొక విశేషము. రెండువేల సంవత్సరములకు పూర్వము ఈ మహానుభావుడు ఎట్టి ఆదర్శజీవనమును గడపెనో అది మనము విచారింపదగినది. ఆ కాలమున భగవానుడు ప్రతిదినము నెట్లు గడపెడివారో తెలియుటకై వారి దినచర్యను పొందుపఱచుచున్నాము:

వేగుజామున నే శయ్యనువిడిచి ప్రాతఃకృత్యములను ముగించి స్నానమాచరించెడివారు. పిదప ప్రశాంత ప్రదేశమునుజేరి గంభీరముగ ధ్యాననిమగ్నులయ్యెడివారు. షుమారు పది పదునొకండు గంటలకు భిక్షాపాత్రను దీసికొని ఏకాకిగనో లేక ఒక్క శిష్యునితోడనో భిక్షకు బయలుదేరెడివారు. ఆమహానుభావునకు భిక్షనిడి కృతార్థులు కావుటకై యెందఱో ఎదురుచూచుచుండెడివారు. భగవానుడు రాగనే ఆ పాత్రను ఆహారముతోనింపెడివారు. ఆహారము గైకొన్న పిదప భగవానుడు తన శిష్యవర్గమునకు ఉపదేశము లొసగెడివారు. తర్వాత విడిదికి జని ఆనాటి కార్యముల నాలోచించెడివారు. అనంతరము తన కుటీరద్వారమునొద్ద నిలుచుకొని 'సత్యము నాశ్రయించియుండుము నీ సంకల్పము దృఢమగుగాక! ఈ ప్రపంచమున బుద్ధదేవుని దర్శనము దుర్లభము. అట్టిదానిని నీవు పడసితివి. జీవితమును వృథసేయకుము' అని ప్రవచించెడివారు. తదుపరి సాయంకాలము వఱకు లోపల విశ్రమించెడివారు. ఆ వెనుక బయటికివచ్చి యచటనున్నవారికి వలయు నుపదేశములొసగి వారి సందేహముల దీర్చి రాత్రి ప్రథమయామమువఱకు (9 ఘంటలవఱకు) నుండి యందరిని ఆశీర్వదించి పంపెడివారు. మిగిలిన రాత్రియందు కొంతకాలము ధ్యానమునను కొంత సంఘశ్రేయస్సునుగూర్చి యాలోచించుటయందును గడపెడివారు.

ఇట్లు వారు ఉత్తరభారతమునందంతట దిరిగి సంచరించి, ప్రచారము చేయుచుండిరి. వారి ఔదార్యము మనుష్యులను గుంపులు

గుంపులుగా నాకర్షించెడిది. అన్నితరగతుల వారును వారి శిష్యవర్గమున బ్రవేశించిరి. ఉత్తరమున సరస్వతీనదినుండి దక్షిణమున పాటలీగ్రామమువఱకు పలుసార్లు సంచరించి శ్రీవారు బ్రహ్మమార్గమును ప్రచారము గావించిరి. వారు ఎనుబదియేండ్ల ప్రాయమువఱకు జీవించియుండిరి. వృద్ధాప్యమునందును వారు నియమములను సక్రమముగ ననుసరించెడివారు. దేహత్యాగపర్యంతము తాము ఎవరికైనను సాయముచేయ సంసిద్ధులైయుండి సాయము చేయుచుండిరి.

శ్రీ బుద్ధభగవానుని కారుణ్యమెట్టిదో యావజ్జీవమును వారి యీ సుగుణము శరీరమున నెట్లు మిళితమై యుండినదో యీ క్రింది సంభవమువలన విశదము కాగలదు.

తమ అవసానకాలమున శ్రీవారు అనుచితాహారసేవనమువలన 'శీతభేది'కి లోనై అనారోగ్యమునకు గురియై కుటీరమున శయనించి యుండిరి. ఆ సమయమున ఏమాత్ర మలజడి జరిగినను—చీమ చిటుక్కుమన్నను—ఏమాత్రము విసిగించినను, ప్రాణముపోవునేమో యన్న భయము తోచినది శ్రీవారి శిష్యులకు. కావున శ్రీవారి కెట్టి శ్రమయు కలిగింపనీయ రాదని తలంచి ఎవరినీ లోనికి బోనీయకుండ వలయునని పట్టువట్టి ఆనందుడు ద్వారమునొద్ద కాపలా కాయుచుండెను. ఒకప్పుడు శ్రీవారి యుపదేశములు నచ్చకపోవుటవలన వారి శిష్యగణమున జేర మనస్కరింపక వెళ్లిపోయిన సుబద్ధు (సుభద్రు) డను నతడు శ్రీవారి యవసానము సమీపించినట్లు విని యిప్పుడైనను వారిని దర్శించి తన సందియముల బాపుకొనదలంచి యా కుటీరమును సమీపించెను కాని ఆనందు డాతని ప్రవేశమున కడ్డుతగిలెను. వీరి సంభాషణమును విన్న కారుణ్యమూర్తి శ్రీ బుద్ధభగవానుడు 'ఆనందా! చాలు నీ వాదము. సుబద్ధు నడ్డుపెట్టకుము. సుబద్ధుని తథాగతుని జూడనిమ్ము. సుబద్ధు డేమైన నడిగినచో జ్ఞానమునే యభిలషించును. కాని నన్ను విసిగింపడు. ఎంత సూక్ష్మముగ ప్రత్యుత్తరము లిచ్చినను సుబద్ధు డవగాహన జేసికొనగలడు' అని తన ప్రాహోత్క్రమణమునుగూడ లక్షింపక శిష్యునికి జ్ఞానదానముచేయుటకు బద్ధకంకణుడయ్యెను. ఆనందుడు మరుమాటాడజాలక సుబద్ధుని లోనికి ప్రవేశపెట్టెను. క్లుప్తసంభాషణముననే భగవాను డాతని సందియముల నెల్ల మూలముట్టుగ దీర్చివైచెను. సుబద్ధుడును శ్రీవారి జ్ఞానోపదేశమునంది దిగ్భ్రాంతుడై వారికి శిష్యుడయ్యెను. ఈతడే శ్రీవారికి చిట్టచివరి శిష్యుడు.

ఆదర్శత్యాగి, నీతిమంతమగు జీవితమును ప్రజలకు నిరూపించిన మహాపురుషుడు, సామ్యమైత్రీభావములందు ప్రథమప్రచారకుడు అయిన శ్రీ బుద్ధభగవానుని, 'బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి' అని ప్రార్థించుచు శ్రీవారి కృపాపాత్రులమగుదుముగాక.

# శ్రీ వివేకానంద సంభాషణలు

## (శ్రీ బాబు శరశ్చంద్ర చక్రవర్తి దినచర్యనుండి)

అనువాదకుడు: శ్రీ పిన్నింటి సుబ్బారావు

స్థలము: ఆలంబజారు మఠము, సం॥ రం 1897.

స్వామిజి పాశ్చాత్యదేశ సంచారము ముగించి, ప్రథమమున కలకత్తానగరమున కేతెంచినదాది, తనదర్శనమున కేతెంచు నుత్సాహవంతులగు యువకులకు త్యాగమహిమను గూర్చి యుద్బోధించుచు, అందెవ్వరైనను సన్న్యాసదీక్షను గైకొనుటకుత్సాహము జూపించుచో, వారి నత్యధికముగా నభినందించుచు ప్రోత్సహించుచుండిరి. ఈ విధముగా గొప్ప కుటుంబములయం దుద్భవించిన యువకులు కొంద ఱుత్సాహముతో, వారి బోధన లాలకించి సన్న్యాసదీక్షను గైకొనిరి. ఈ యువకులలో తొలుదొలుత నలుగురు సన్న్యాసదీక్షను గైకొనుసమయమున ఈశిష్యు డచ్చటనుండుట తటస్థించెను.

మఠమునందున్న స్వామిజీయొక్క సోదర సన్న్యాసులు, పదేపదే ప్రత్యేకముగా నొక యువకునకు సన్న్యాసదీక్షనివ్వ జనదని ప్రార్థింపగా, ఆ మాటలాలించి స్వామిజి వారి నుద్దేశించి, "పాపాత్ములయొక్కయు, దుఃఖభాగులయొక్కయు, దీనులయొక్కయు, సంసారభారముతో బాధపడుచున్నవారి యొక్కయు తరణోపాయమునుగూర్చి కృషిచేయుటకు మనమే వెనుదీయుచో, ఇంకెవ్వరు వారల నుద్ధరింపగలరు? మీరు దయచేసి నామార్గమున కవరోధమును గలిగింపకుడు," అని నుడివిరి. ఈ విధముగ స్వామిజీ వారలను సంతృప్తిపరచి, యా దీనరక్షకుడు, తన కృపారసము వెల్లివిరియ, ఆ యువకునకు సన్న్యాసదీక్ష నిచ్చెను.

ఈ శిష్యుడు మఠమునందు గత రెండు దినములనుండియు వసించుచుండుటచే, స్వామిజి ఆయనను బిలిచి, "నీవు బ్రాహ్మణకుటుంబమునకు జెందినవాడవు. రేపు వారలచే శ్రాద్ధకర్మమాచరింపజేయుము. ఆ మరునాడు నేను వారికి సన్న్యాసదీక్ష నిత్తును. అందుచే, శ్రాద్ధకర్మయెట్లు నిర్వర్తింపవలయునో, సూత్రగ్రంథములను పరిశీలించి సిద్ధముగానుండు"మనెను. మన ఈ శిష్యుడు స్వామిజీ యాజ్ఞను శిరసావహించెను. సన్న్యాసదీక్ష క్రమముగానిర్వర్తింపబడెను. కాని యీ శిష్యుడు సన్న్యాసదీక్షయందలి యసిధారాధర్మములను విని చాల నిరుత్సాహపడెను. స్వామిజి యీ శిష్యుని మానసికాందోళనమును గ్రహించి, "నీవు ఈ విషయమంతయునుజూచి, మనమునందు భయాందోళనములను నందియుంటివిగదా" యన, ఈ

శిష్యుడు 'యథార్థమే'యని నుడివినంతనే, స్వామిజీ "ఈ దినము మొదలు ఈ నలువురును, ప్రపంచమునందు మృతులైనవారితో సమానులు. క్రొత్త శరీరములు, నవీనభావములు, క్రొత్త దుస్తులు, రేపటినుండి వారికి లభ్యమగును. 'నకర్మణా నప్రజయాధనేన, త్యాగేనైకే అమృతత్వమానశుః'—కర్మవల్లగాని, ప్రజాసృష్టివలనగాని, ధనమువలనగాని కాక, యొక్క త్యాగమువలననే మోక్షము లభ్యమగును అను సూత్రము ప్రకారము, వీరు పరబ్రహ్మమునందు, ధ్రువతారలవలె ప్రకాశింపగలరు," అని నుడివిరి.

ఈ కర్మకాండయంతయు, ముగిసినపిమ్మట యా బ్రహ్మచారులు నలువురు, స్వామిజి పాదపద్మములకు నమస్కరించిరి. వారు వారిని ఆశీర్వదించి, 'మీరు మానవజీవితమందలి యుత్కృష్టస్థానమును జేరుకొనవలెననెడి యుత్సాహముగలిగియున్నారు. మీజన్మ ధన్యము, మీవంశము ధన్యము, మిమ్ములను గనిన మీ తల్లులు ధన్యలు. "కులంపవిత్రం జననీ కృతార్థ" వంశమంతయు కృతార్థతజెందును. తల్లికి ఉత్తమగతి లభ్యపడగలదు" అని యాశీర్వదించిరి.

ఆ దినమున రాత్రిభోజనమైన పిమ్మట స్వామిజి సన్న్యాసధర్మములను గూర్చి యుపన్యసించిరి. సన్న్యాసదీక్షయందుత్సాహముగలిగియున్న యా యువకులతో సన్న్యాసము యొక్క యాదర్శమును దేటతెల్లముచేసి సన్న్యాసదీక్ష గైకొననిచో, బ్రహ్మమును తెలిసికొననేరడనియు, వేద వేదాంగములీ సత్యమునే చెప్పుచున్నవనియు నుడివిరి. "'ఐహికజీవితమును గడపుచు, బ్రహ్మమును గ్రహింపవచ్చును' అనెడి వారల మాటలను విశ్వసింపకుము. అవి వైహిక విషయములను విడువలేక, వానితో ప్రాకులాడు దాంబికాచారులగు స్వార్థపరుల మాటలు. విషయభోగములయందు లేశమాత్రమైనను ఎవ్వరు అభిలాషను గలిగియుందురో, వారు మీ భవిష్యజ్జీవితవిధానమునుజూచి భయపడి, తమ మనోతృప్తికై, యశక్యమగు భోగత్యాగముల సమన్వయమును బోధింతురు. అవి వెఱ్ఱివారల అసందర్భప్రలాపములు, పిచ్చిచేష్టలు, వేదశాస్త్రములకు నిషిద్ధములైన వ్యర్థసిద్ధాంతములు. త్యాగము లేనిదే మోక్షము సిద్ధిపదు. త్యాగము లేనిచో, పరాభక్తి సిద్ధిప చేరదు.

"ప్రపంచబంధనములను త్యజింపనిదే, యెవ్వరును మోక్షమునుబొందజాలరు. ఎవ్వరో యొక్కరు వైహికజీవితమును గడపుచున్నారనినచో, వారలేదియో యొక కోరికకు బద్ధులైయుండిరని గ్రహింపుము. అదిలేనిచో, ఆ జీవితమునకు ఏల బద్ధులైయుండవలయును? అతడు కామినీకాంచనములకుగాని, గౌరవప్రతిష్ఠలకుగాని, పాండిత్యప్రకటనలకుగాని, బద్ధుడైయుండి యుండవలయును. వీనినన్నిటిని త్యజించిననాడుగాని, యెవ్వరును మోక్షమార్గమున నడువజాలరు. ఎవ్వరెన్నివిధములుగా పూర్వపక్షము జేసినను సరియే, యీ బంధనములన్నింటిని త్యజించినగాని, సన్న్యాసదీక్షను స్వీకరించినగాని, యెవ్వరును కృతార్థులు గానేరరనియు, బ్రహ్మజ్ఞానసిద్ధి యలవడదనియు నా నిశ్చితాభిప్రాయము."

శిష్యుడు:—అయ్యా, సన్న్యాసదీక్షను గైకొన్నంతమాత్రముననే యది జీవితలక్ష్యమునకు మార్గము జూపునని తమ యభిప్రాయమా?

స్వామిజి:—జీవితలక్ష్యమును జేరుకొనగలమా, లేదా యనునది గాదు మనమిప్పు డాలో చింపవలసినవిషయము. కాని నీవీ సంసార బంధనముల నెంతవఱకు విసర్జింపవో, నీవు కామమున కెంతకాలము బానిసవై యుం దువో, యంతవఱకు భక్తినిగాని, ముక్తిని గాని బడయజాలవు. బ్రహ్మజ్ఞానికి, అమా నుషశక్తులు, అభివృద్ధి మిక్కిలి యల్పవిష యములు.

శిష్యుడు:—అయ్యా, సన్న్యాసమున కేమైనను కాలనియమము గలదా? దానియందేమై నను ఇతర మార్గములు గలవా?

స్వామిజి:—సన్న్యాసదీక్షకుప్రత్యేకించి కాలము నిర్ణయింపబడియుండలేదు. శృతి "యద హరేవ విరజేత్, తదహరేవ ప్రవ్రజేత్" ఎన్నడు త్యాగముచేయుటయందుత్సా హము గల్గునో, వెంటనే సన్న్యసింపవలయు ననియు, యోగవాశిష్ఠమునందు "యువైవ ధర్మశీలః స్యాత్ అనిత్యం ఖలుజీవితం, కోహి జానాతి కస్యాద్య మృత్యు కాలే భవి ష్యతి". "మానవజీవితము మిక్కిలి బుద్బుద ప్రాయము, అశాశ్వతము అగుటచే, యౌవ్వనమందే మానవుడు తరణోపాయ మును జూచుకొనవలయును. ఈ శరీరము ఎప్పుడు నశించిపోవునో ఎవని కెఱుక." సన్న్యాసమునాలుగువిధములని శాస్త్రములు దెల్పుచున్నవి. అవి 1. విద్వత్, 2. వివి దిష, 3. మర్కట, 4. ఆతుర యని పిలువబడుచున్నవి. పూర్ణవైరాగ్యముగలిగి వెంటనే, సమస్తమును త్యజించి సన్న్యసిం చుట, అకస్మాత్తుగా సంభవమగు ఘటన గాదు. పూర్వజన్మ సుకృతమున్నగాని యట్టిది లభింపనేరదు. దీనిని విద్వత్ సన్న్యాస మందురు. తీవ్రమోక్షేచ్ఛతో, మతగ్రంథములను పఠించి, మతసాధనముల నొనరించి, యధ్యాత్మవిద్యయందు బ్రహ్మ నిష్ఠగల సంయమీంద్రునిచెంతకేగి సన్న్య సించి, యా యాశ్రమవిధుల ననుసరించు చుండుట వివిదిషసన్న్యాసమందురు. బంధు మిత్రాదుల మరణముచే విరక్తి దోచి సన్న్య సించుట మర్కటసన్న్యాస మందురు. కాని ఈ వైరాగ్యము చిరకాలము నిలువజాలదు. శ్రీ రామకృష్ణులవారీ సన్న్యాసమునుగూర్చి యీ విధముగా నుడివెడివారు: "ఒక డుత్తరదేశమునకు పారిపోయి, యచ్చట నేదియో యొక యుద్యోగము సంపా దించి, పిమ్మట భార్యను అచ్చటికి రప్పించు కొనుటయో లేక యింకొక స్త్రీని వివాహ మాడుటయో జరుగుటవంటిది." మృత్యు శయ్యపై నుండి, యిక జీవించునెడి యాశ లేనపుడు శాస్త్రములు అట్టివాని కింకొక రకమగు సన్న్యాసమును విధించుచున్నవి. మరణసమయమున అనేక ప్రాయశ్చిత్తము లచే, అనేక శపథములను పఠించుటచే, ఉత్తరజన్మమున వీని ఫలితము వానికి లభిం పగలదు. ఒకవేళ ఆతడు జీవించినచో, తన పూర్వాశ్రమమునకుబోక, బ్రహ్మజ్ఞాన జీవితమును గడపవలయును. నీయొక్క మేనమామకు ఇట్టి సన్న్యాసము శివానంద స్వామి యిచ్చియున్నారు. అందుచే జ్ఞాన సిద్ధికి సన్న్యాసమువినా మఱియొకమార్గము లేదు.

శిష్యుడు:—అయ్యా, అయితే గృహస్థులు తరించు మార్గమేది?

స్వామిజి:—సత్కర్మలొనర్చినచో, భవిష్య జ్జన్మములలో ఈ సన్న్యాసము సిద్ధింప

గలదు. ఎన్నడీ త్యాగసిద్ధి లభించునో, యానాడు వెంటనే జననమరణముల బాధ తొలగిపోగలదు. అన్నిధర్మములకును కొన్ని మినహాయింపులు గలవు. కోటానుకోట్ల ప్రజలలో, మన నాగమహాశయుని వలె, గృహస్థాశ్రమమునందున్నను, తరించినవారేకొందఱో యుందురు.

శిష్యుడు:—అయ్యా, ఉపనిషదాదిగ్రంథములు త్యాగమును, సన్న్యాసమును స్పష్టముగా బోధించుటలేదు.

స్వామిజి:—పిచ్చివానివలె నీ రీతిగ మాట్లాడుచుంటివేమి! సమస్త ఉపనిషత్తులయొక్క హృదయము త్యాగమే. ఆత్మానాత్మవిచారణ వలనగలిగినవివేకమాయుపనిషన్నతలక్ష్యము. బుద్ధునికి పిమ్మట ఈ సన్న్యాస లక్షణము భారతదేశమున విరివిగా ప్రచారము గావింపబడి, యింద్రియవిషయభోగవిరక్తి, త్యాగధర్మము, ముముక్షుత్వమునకు లక్ష్యసిద్ధియని గుర్తింపబడినదని నా యభిప్రాయము. బౌద్ధమతమందలి యీ త్యాగధర్మమును హిందూమతము తనలో నిముడ్చుకొన్నది. త్యాగమునందింత యుత్కృష్టసిద్ధిని బడసిన పురుషుడీ జగత్తులో బుద్ధునివలె ఇంకొకడు గానరాడు.

శిష్యుడు:—అయ్యా, అయితే బుద్ధునికి పూర్వము, భారతదేశములో, త్యాగబుద్ధి యంతగా లేదనియు, సన్న్యాసులు మృగ్యమనియు తమ దృఢాభిప్రాయమా?

స్వామిజి:—ఆ విధముగా నెవరు చెప్పిరి? సన్న్యాసాశ్రమము అంతకుపూర్వమే విధింపబడియున్నది. కాని ప్రజాబాహుళ్యము, దానిని తమ జీవితాదర్శముగా స్వీకరించియుండలేదు. త్యాగమునందు తీవ్రమగు ఇచ్ఛ, మోక్షేచ్ఛ యలవడియుండలేదు. అందుచేతనే బుద్ధుడు ఎందఱో సాధువులను యోగులను ఆశ్రయించినను, తనకు గావలసిన శాంతిని బడయలేకపోయెను. పిమ్మట స్వయంసహాయముపై నాధారపడి, యొక స్థలమున "ఇహాసనే శుష్యతు మే శరీరం..." అని దృఢసంకల్పముతో గూర్చుండి, జ్ఞానమును బడసిగాని, బుద్ధత్వమును బడసిగాని, ఉత్థిష్ఠుడు గాలేదు. నేడు భారతదేశమున సన్న్యాసులకు నిలయములైయున్న మఠములు, ఆశ్రమములు—అన్నియు, ఒకానొకతరి బౌద్ధమతప్రాబల్యమున నుండియున్నవే. నిజముగా చెప్పవలెనన్నచో, బుద్ధుడే సన్న్యాసమును స్థాపించినవాడు. అతడే యీ జీవితమునకు నూతన శోభను గలిగించిన మహామహుడు.

స్వామిజియొక్క సోదరసన్న్యాసులలో నొకరగు రామకృష్ణానందస్వామి "మన ధర్మశాస్త్రములు, పురాణములు, బుద్ధునికి పూర్వమే భారతదేశమున నాలుగు ఆశ్రమధర్మములు ఏర్పడియున్నట్లు ఋజువుచేయుచున్న"వని యడ్డుప్రశ్న వేసెను. స్వామిజి యంతట "పురాణములలో చాలభాగమును, మనుస్మృత్యాది ధర్మశాస్త్రములును, మహాభారతమును, బుద్ధునకు పిమ్మట వ్రాయబడినవి. బుద్ధుడు వీనికన్నిటికిని పూర్వపువాడు అని వివరించిరి. అటుపై రామకృష్ణానందస్వామి, "బౌద్ధమతముపై విమర్శనలు, వేదములయందును, ఉపనిషత్తులయందును, ధర్మశాస్త్రములయందును, పురాణాది యితిహాస గ్రంథములయందును గనబడకున్నవి. ఇట్టి విమర్శన లా గ్రంథమున లేకపోయినను, బుద్ధుడు వీనికి పూర్వతరమువాడని

యెట్లు జెప్పగలము? పూర్వపురాణములయందు, బౌద్ధమతమునుగూర్చి యసంపూర్తిగా నుదాహరింపబడియున్నది. అందుచే మన్వాది ధర్మశాస్త్రములు, పురాణములు, బుద్ధుని కిటీవలవి యని చెప్పవలనుపడదు'' అని వాదించిరి.

స్వామిజి:—చరిత్రను తిరిగి పఠింపుడు. బౌద్ధమతమందలి సర్వధర్మములను హిందూమతము స్వీకరించుటచేతనే, యిది యింత విశాలమతమై వెలసినదని గ్రహింపగలవు.

రామకృష్ణానందస్వామి:—బుద్ధుడు తన జీవితములో త్యాగధర్మమును, నిష్కామకర్మమును పూర్తిగా ఆచరించి, హిందూమతమునకు నూతనజీవితమును గలిగించెనని నా యభిప్రాయము.

స్వామిజి:—కాని యీ సత్యమును ఋజువు చేయుట చాల కష్టము. బుద్ధుని పుట్టుకకు పూర్వము చరిత్రాధారగ్రంథములేవియును అంతగా గనబడవు. చరిత్రనే మనము ముఖ్యాధారముగా గైకొనినచో, ప్రాచీనయుగమునందలి యంధకారపుదినములలో, బుద్ధుడొక్కడే జ్ఞానభాస్కరుడై ప్రకాశించెనని మనము అంగీకరింపవలసియున్నది.

సన్న్యాసమునుగూర్చి మఱల సంభాషణ ఆరంభింపబడెను. స్వామిజి ''సన్న్యాసధర్మమును ఎవరు స్థాపించినను, త్యాగధర్మమును స్వీకరించి బ్రహ్మజ్ఞానమును బడయుటయే జీవితలక్ష్యమని యెరుగవలయును. జీవితచరమావస్థ సన్న్యాసదీక్ష. ఎవ్వరు ఐహికబంధనములను త్యజించి, త్యాగబుద్ధిని అవలంబింతురో వారే ధన్యులు'' అని నుడివిరి.

శిష్యుడు:—కాని అయ్యా! దేశమందు సన్న్యాసుల సంఖ్య పెరిగిపోవుచుండుటచే చాలమంది ప్రజలు, వీరివలన భారతదేశపు ఆర్థికాభివృద్ధి కుంటుపడుచున్నదని భావించుచున్నారు. వీరందరు తమ భుక్తికై, సౌకర్యములకై గృహస్థుల నాధారపడుచున్నారనియు, వీరు వృథాగా సంచరించుచు, దేశముయొక్క సాంఘిక, జాతీయాభివృద్ధుల కిసుమంతయు నుపకరించుట లేదనియు ప్రజలు దలచుచున్నారు.

స్వామిజి:—నీవు మొదట సాంఘిక, ఆర్థికాభివృద్ధులన నేమియో నాకు విపులముగా వివరింపుము.

శిష్యుడు:—ప్రజలయందు విద్యాభివృద్ధియొనర్చి, దైనికజీవితమునకు వలయు సౌకర్యములను గలిగించుటయు, విజ్ఞానశాస్త్రాభివృద్ధియొనర్చి, వర్తక, పరిశ్రమ, ప్రయాణసౌకర్యాదివిషయములను పెంపొందించుటయును ఆర్థికాభివృద్ధులు.

స్వామిజి:—మానవునియందు రజోగుణము పూర్తిగా వృద్ధియైనగాని, యీ పనులు నెరవేరగలవా? నేను హిందూదేశమును గాలించి తిరిగితిని. ఎచ్చటను ఈ రజోగుణము నాకు గాన్పించలేదు. అంతటను తమోగుణమే తాండవమాడుచున్నది. ప్రజానీకము తమోగుణమునందు మునిగియున్నది. సన్న్యాసులయందు మాత్రమే సత్త్వ, రజోగుణములు గానబడుచున్నవి. వీరే దేశమునకు వెన్నెముకవంటివారు. యథార్థమగు సన్న్యాసులు, గృహస్థులకు గురువులు. ఈ సన్న్యాసులయొక్క యమూల్యబోధనలవలననే, గృహస్థు లనేకపర్యాయములు తమ జీవితసమస్యలను యుద్ధరంగమున విజయమును బడసిరి. గృహస్థులు



# శ్రీరామకృష్ణ ప్రభ

## ఎనిమిదవ సంపుటము

౧౯౫౧ జూలై ఖర - ఆషాఢము మొదలు ౧౯౫౨ జూన్ నందన - జ్యేష్ఠము వఱకు


సంపాదకులు :

శ్రీ ఋతజానందస్వామి

శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు



శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి

సంవత్సర చందా రూ. ౩] [విడి ప్రతి అణాలు 6

# విషయానుక్రమణిక

వీరి యుపదేశామృతమును గ్రహించి, వీరికి భిక్షనుమాత్ర మొసగుచుండెడివారు. ఈ విధముగా పరస్పర సహాయము భారతదేశమున నుండియుండనిచో, ఈ దేశీయు లీనాటికి అమెరికాదేశమందలి 'ఎఱ్ఱయిండియనుల' వలె నశించియే యుందురు. ఇంకను గృహస్థులు కొద్దియో గొప్పగనో, సాధువుల నాదరించుచుండుటచేతనే, మన పూర్వుల యధ్యాత్మిక ఔన్నత్యమును నిలుపుకొనుచు వచ్చుచున్నారు. సన్న్యాసులు సోమరులుగారు. వారే చైతన్యమునకు మూలపురుషులు. విశాలభావములు సన్న్యాసుల దైనికజీవితములయందనుష్ఠింపబడుచుండుటగాంచి గృహస్థులు, వారి యమూల్యోపదేశములను ఆలకించుటవలననే తమ జీవిత కర్మకలాపములనుండి విముక్తిని బడయగలుగుచున్నారు. సాధువుల జీవితవిధానము, ప్రజలకు నూతనజీవితమునకును, నూతనశక్తికిని ఆదర్శములుగా నున్నవి. మానవసేవకును, మాధవసేవకును తమ సమస్తమును త్యజింపవలయుననెడి ధర్మములను సన్న్యాసులీ గృహస్థుల కాదర్శ ధర్మములుగా ప్రతిష్ఠింపజేసి, వారియొద్ద నుండి కొన్ని కబళములను నాహారముగా గైకొందురు. అట్టి త్యాగమూర్తులగు సన్న్యాసులవలననే, స్వీకరించిన యాహార మట్టి స్వభావమును, శక్తిని తమయం దభివృద్ధి గాంచుచున్నదని మానవుల యభిప్రాయము. సన్న్యాసాశ్రమధర్మములందలి యాంతర్యమును గ్రహింపనేరక, ప్రజ లీ యాశ్రమస్థులను నిందించుచున్నారు. ఇతర దేశీయుల విషయమటుంచి, యీ భారత వర్షమున గృహస్థుల జీవితనౌకయొక్క చుక్కాని సన్న్యాసుల హస్తములయందుండుటచే, ఎన్నడును మునుంగనేరదు.

శిష్యుడు:—అయ్యా! అవును మానవసేవయందు యథార్థమగు నుత్సాహముగల సన్న్యాసు లెందరు గలరు?

స్వామిజి:—హా! వేయిసంవత్సరముల కొకసారి, శ్రీ రామకృష్ణులవంటివా రొక్క రుద్భవించిన జాలును. వారియనంతరము మఱియొక వేయిసంవత్సరములవఱకు, వారు బోధించిన, ఆచరించిన ధర్మములు ప్రజలనునడపింపగలవు. ఈసన్న్యాసధర్మము లీ భారతావనియందుండుటవలననే యట్టి మహనీయు లిచ్చట నుద్భవించుచుండిరి. ప్ర[illegible]జీవితవిధానమునందును కొద్దియో, గొప్పయో, లోపము లేకపోలేదు. ఎన్ని లోపములున్నను, వారియొక్క జీవితవిధానము ప్రపంచములో సర్వత్ర ధ్రువతారవలె ఏల విరాజిల్లుచున్నది! యథార్థమగు సన్న్యాసులు, తమ మోక్షమునుగూడ పరిత్యజించి మానవసేవజేయుటకే జీవించియుందురు. ఇట్టి యుత్కృష్టవిధానమునందు నీకు కృతజ్ఞత లేనిచో, నీకింకను అనేక జన్మపరంపరలు గలవు, వెడలిపొమ్ము.

ఈ విధముగా సంభాషించుచున్నప్పుడు స్వామిజియొక్క ముఖము ఎఱ్ఱబడిపోయెను. ఈ శిష్యుని దృష్టికి వారు సన్న్యాసధర్మముల యొక్క మూర్తిత్వమువలె గనబడిరి.

పిమ్మట ఈ విధానమందలి యౌన్నత్యమును హృదయమునందుభావించి, ఆత్మసంయమస్థుడై మాధుర్యమయమగు లయతో "వేదాంతవాక్యేషు సదా రమన్తః, భిక్షాన్నమాత్రేణచ తుష్టిమన్తః, అశోకమన్తః కరణే చరన్తః,

కౌపీనవన్తః ఖలుభాగ్యవన్తః॥'' ''వేదాంత వాక్యములను మననము జేయుచు, భిక్షామాత్రముననే లభించు ఆహారముతో తృప్తినిబొందుచు, ఏ యితర విచారముతోడను మనో నిర్మలత్వమును పోగొట్టుకొనక, కౌపీనమును మాత్రమే ధరించి, జీవించుచున్న సన్న్యాసి మిక్కిలి సుఖి'' యను శ్లోకమును పఠించి, మఱల సంభాషణమును జేయదొడగిరి.

''బహుజనహితార్థము, బహుజనసుఖార్థము సన్న్యాసి జన్మించియుండెను. ఎవ్వరు సన్న్యాస దీక్షను గ్రహించి, యా యాశ్రమధర్మములను త్యజింతురో, వారిజీవితము వ్యర్థము. సన్న్యాసి యీ ప్రపంచమునందు, మానవశ్రేయస్సుకై తనుజీవితములను ధారపోయుటకును, మానవుల దుఃఖములను అపనయించుటకును, వితంతువుల దుఃఖాశ్రువులనుబాపుటకును, శోకతప్తరాంద్రగు తల్లుల శోకమును బాపుటకును, దైనికజీవితమును ప్రజలు సౌఖ్యముగా గడపుకొనుటకును, అధ్యాత్మవిద్యను బోధించి ప్రజల యార్థిక, ఆధ్యాత్మికాభివృద్ధికి దోహదము చేయుటకును, జ్ఞానభాస్కరుని తేజస్సుతో, నిద్రించుచున్న, బ్రహ్మజ్ఞానమను సింహమును మేల్కొల్పుటకును జన్మించియున్నాడు.'' పిమ్మట సోదర సన్న్యాసుల నుద్దేశించి మనజీవితము ''ఆత్మనే మోక్షార్థ జగద్ధితాయ చ'' ''మన స్వీయ మోక్షమునకును, జగదుద్ధారణమునకును'', మీ రెందులకు సోమరులై గూర్చుంటిరి? ఉత్తిష్ఠుడవు గమ్ము, మేల్కాంచుము. మీయంతట మీరు మేల్కొనుడు. ఇతరులను మేల్కొల్పుడు. చనిపోవుటకు పూర్వమే జీవితాదర్శమును జేరుకొనుడు. ఉత్తిష్ఠులుగ(ా)డు. మేల్కొనుడు. ఆదర్శమును జేరుకొనువఱకు ఆగకుడు'' అని నుడివిరి.



* ఈ సంభాషణయందు, స్వామిజి తనవాదమునకు బలకరముగా నవీన చారిత్రిక పరిశోధనముల నాధారముగా గైకొని యిట్టి నూతన పరిశోధకులకును, విధానమునకును ప్రోత్సాహమును నొసగిరి. పిమ్మట స్వామిజి, స్వరూపానందస్వామికి వ్రాసిన యొకానొక లేఖవలన, ఈ యభిప్రాయమును మార్చుకొని, యీ నవీన పరిశోధకులు హిందూమతము, బుద్ధుని పుట్టుకకు తర్వాతదే యని ఋజువుచేయుటకు యత్నించుచుండగా, స్వామిజి హిందూమతము, బుద్ధునికి పూర్వమే గలదని నిర్ధారణ చేసిరి.

# లక్ష్మీమణిదేవి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

(గతసంచిక తరువాయి)

లక్ష్మి మూడుసంవత్సరములు కామార్పుకుర్‌నందు గడపి పదునాల్గవయేట శారదామాతతో నుండుటకై దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఇచ్చట శారదారామకృష్ణులతో పదమూడు సంవత్సరములు గడిపెను (1872—1885). శ్రీరామకృష్ణులు చెప్పినటుల ఆ నహబత్ నందలి చిన్నిగదియందు, పంజరమునందలి పిట్టలవలె, లక్ష్మియు, శారదామాతయు నివసించుచుండిరి. లక్ష్మీదేవి తమ నహాబత్ నందలి జీవితమునుగూర్చి యిటుల చెప్పెడిది: "నన్ను, మాయత్త శారదామాతను, గురుదేవులు శుక, శారి (చిలుక, గోరువం)క లని పిలిచెడివారు. శ్రీరామకృష్ణులను దర్శించువారిలో గడు గొలదిమందికి మాత్రమే, మేనుచ్చట నుంటిమని తెలియును. అపరాహ్ణమున శ్రీ రామకృష్ణులు శుక, శారికలకు భోజనమిడిరా యని మమ్ములగూర్చి కనుగొనెడివారు. వచనామృతము వ్రాసిన మహేంద్రనాథ్ శ్రీరామకృష్ణులదరిజేరి, వారి నోటవచ్చిన వచనామృతమును బెనిసిలుతో (కోపు) వ్రాయుచుండెడివారు. వారు నాతోనొకసారి గురుదేవు లీపిట్టలను బెంచుచున్నారనియు, వాని యాహారమునుగూర్చి వారుమాటలాడుచున్నారనియు దలచెడివాడననియు జెప్పియుండిరి. నాకు, మాయత్తకు రామాయణ, మహాభారతాది గ్రంథములనుండి కథలను రామకృష్ణులు చెప్పుచుండెడివారు. నలచక్రవర్తినిగూర్చి చెప్పినచో, వారునన్ను తిరిగితిరిగి యాకథను చెప్పుమనియెడివారు. దానిని నాచేత బలికించెడివారు. అంతవారు నాపలుకులాలించి, తృప్తులై యందులకే నన్ను శుక (చిలుక) యని పిలచెడివారమని యనుచుండెడివారు. మొదట మా భోజనము దేవాలయమునుండి వచ్చెడిది. తర్వాత శారదామాతయే మాకు వంటచేయవలసినదిగా సూచింపబడెను. నహాబత్ చిన్నదగుటచే, వంట సౌకర్యముల కిబ్బంది గాన హృదయుడు దీని కొల్లకుండెను. అంత రామకృష్ణులు హృదయునితో నిట్లనిరి: "నీకు తెలియదు. వారు చిన్నవారు. వారికేదియో చేతినిండ బనియుండవలె" ననుచు నాతో నిట్లనిరి. ఆడువారు వంటలుచేయుట యాచారము. పూర్వకాలమునందు రాణీలుగూడ వారిభర్తలకు వంటచేయుచుండెడివారు. ఇట్లు కథలలోనున్నది. ఆ గాథ లసత్యములుగావు. ఒకనాడు ద్వారకయందు శ్రీకృష్ణులు భోజనమునకు కూర్చొనియుండిరి. ప్రక్కన రుక్మిణి కూర్చొనియుండెను. అంతలో శ్రీకృష్ణులకు నింద్రప్రస్థమునుండి ద్రౌపదియొక్క యార్తరావము చెవులబడెను. వెంటనే శ్రీకృష్ణులు విస్తరియొద్దనుండి లేచిరి. రుక్మిణి కన్నీళ్లు

గార్చుచు నిటుల విలపింప నారంభించెను: "హా! యీ దినము నే నెంతయో పాపమును జేసికొంటిని. లేకున్న నేను బచనము జేసిన యాహారమునేల నా వల్లభుడు గ్రహింపడు?" వారి కోటగోడలకు బంగారు ఇటుకలనిప్రతీతి. ఆమె వంటవారిని పెట్టుకొనలేదా? కాని యీనాడు నెలకు ముప్పదిరూపాయిలను సంపాదించువాడు, భార్యను, తలిదండ్రులనుండి తీసికొని వెళ్లి వంటవారిని పెట్టుకొని స్వర్గము ననుభవించుచున్నట్లూహించుకొనుచున్నాడు. మీరు మీ వంట జేసికొనుచుండినచో, మీమనస్సు పరిశుద్ధముగా నిలిచియుండును."

ఒకనాటి రాత్రి శ్రీ రామకృష్ణులు రాధికా భావమును బొందియుండిరి. ఆమెతో వారేకాత్మతం గాంచిరి. శ్రీరామకృష్ణులు శ్రీకృష్ణునితో గవయుటకు బొదరిండ్లకడకు వెళ్లుచుంటిమనుకొనిరి. ఇట్టి స్వాంతమున వారు గదినుండి బయటకువచ్చి గులాబీపుష్పవనమునం ప్రవేశించిరి. వారికి బాహ్యస్మృతి లేదు. ఆ గులాబీ పొదలలో జిక్కుకొని, వారి శరీరమంతట గులాబీ ముళ్లు గీచుకొని యచ్చట నిలచియుండిరి. ఆ రాత్రియందు తోటకాపరి వారినిగాంచి, మమ్ముల లేపెను. నేనువెంటనే దేవాలయ కార్యనిర్వాహకునికడకేగి, వారి నచ్చోటికి తీసికొనివచ్చితిని. అంతట నసేకులు మేల్కాంచి యచ్చట గుమిగూడిరి. అత్తయు నచ్చటికివచ్చి యేడ్వసాగెను. ఆమె బహిరంగముగ నగుపడుట కదియే మొదటిసారి. గురుదేవులను లోనికి దోడ్కొనివెళ్లినప్పుడు వారిట్లు చెప్పిరి: "నేను బొదరెంటికి బోవుచుంటిని. నన్ను మీరేల బాధించుచున్నారు? నన్ను బోనిండు!" మేమంతటినుండి రామకృష్ణులయొక్క గదియందే పరుండుట మొదలుపెట్టితిమి, అత్త పాదాది శిరఃపర్యంతము దుప్పటి కప్పుకొని పరుండెడిది. రెండు మూడు దినము లిట్లు గడచిన పిమ్మట గురుదేవులు, "మీరిటులేల బాధపడుచున్నారు. ఇప్పుడు చాల తాపముగ నుండును. గాన బట్టను కప్పుకొనకుండ, బరుండ వాంఛింతురు. మీరు నహాబతునందు నిద్రించుట మంచిది. ఇట్లు శ్రీవారన, మేము వారిమాట శిరసావహించి, వారికి లోబడినడచుకొనుచుంటిమి."

ఇటుల శ్రీ రామకృష్ణులు వారలకు విద్య గఱపుచు, గృహకృత్యములందు చిన్నివిషయములందును ప్రేమపూర్వకముగ దిద్దుబాట్లు చేయుచు, నధ్యాత్మిక సాధనల ననుసరింపజేయుచుండిరి. శ్రీ శారదామాత వంటజేసెడిది. లక్ష్మి వంటచేయుటయందు, వంట పుడకల జేర్చుటయందు, నీళ్లను తెచ్చిపెట్టుటయందు, కూరలు, పప్పురొట్టె, అన్నము వండుట మొదలగు ప్రతివిషయమునందు శారదామాతకు జేయూతగ నుండెడిది. భక్తు లాలస్యముగ వచ్చినను, వారలకు వంటజేయుడని గురుదేవుల యాజ్ఞ. ఇంత యూపిరి దిరుగని పనిని గల్గియు, వారలచ్చట నానందాబ్ధి నోలలాడుచుండిరి.

శ్రీ రామకృష్ణులకు నిద్రయనునది లేక, సదా మెలకువగ నుండుట తెలిసిన విషయమే. ఆయన యనుష్ఠానములకై రాత్రి మూడు గంటలకు లేచి, బయటకు రాగనే, లక్ష్మీదేవిని నిద్రనుండి లేపుట యలవాటు. వారు లక్ష్మీదేవి నిట్లు పలకరించెడివారట. "సి కె త సేపు నిద్ర! తెల్లవారుసమయమైనది, లెమ్ము. మీ యత్తను లేపి, గంగోదకమున మార్జన చేసికొని జప, ధ్యానములు ప్రారంభింపుడు. ఆత్మలో మనఃపూర్వకముగ, బూర్తిగ నీశ్వరుని ప్రార్థించినచో, నీశ్వరుడు దీవించును. మీ రెచ్చటకు వెళ్లనక్కరలేదు, ఇట్లు మీ రాచరించిన మీ

ప్రకృతి, మీ గుణము పరిణామము జెందును. అవి పరివర్తన జెందినగాని, యేమియు మీకు సాయపడదు.'' ఆధ్యాత్మికసాధనను మరచి, లక్ష్మియు, శారదామాతయు దమస్సున బ్రాహ్మ ముహూర్తమును జారవిడచుటను శ్రీ రామ కృష్ణులు గమనింపగనే, శ్రీవారి కమండలోద కము వారిపై జల్లబడియెడివి.

లక్ష్మీదేవితో గురుదేవు లొకపర్యాయ మిటుల చెప్పిరి: ''మీ కే యితర దేవతయు స్ఫురింపక, ధ్యానము కుదురనిచో నన్ను మనస్సునకు తెచ్చుకొనుడు. అది చాలును.'' ఇందువలననే తమశిష్యులతో లక్ష్మీదేవి యిట్లని యెడిది. ''సాధ్యపడినపుడెల్ల యెన్నిపర్యా యములైనను గురుదేవులను స్మరింపుడు. వారిని ధ్యానింపుడు. వారిని గుర్తుతెచ్చుకొని, వారి దక్షిణేశ్వర దైనికచర్యను మనసునకు దెచ్చు కొనుడు. మీరిది యెంత యాచరించిన నంతయు మీ మనస్సుల శ్రీవారి స్మరణను నిండియుండి, యితర అప్రస్తుతపు ఊహాలు విచ్ఛిన్నము లగును.''

శ్రీ రామకృష్ణులు కాశిపురోద్యానవనమున నుండ శారదామాతతో లక్ష్మీదేవిని దనకు సహవాసముగ నుంచుకొనమనియు, దాము త్వరలో శరీరత్యాగము జేయుచున్నామనియు జెప్పిరి. లక్ష్మి శారదామాతయొద్ద నున్నచో లక్ష్మి భక్తితత్పరురాలు గాన శారదామాతను భక్తిరసముతోగూడిన మధురవాక్యముల నుప శమనవాక్కులను బలుకుననియు, లక్ష్మీదేవిని గనిపెట్టి జూచుచుండుమనియు, లక్ష్మి తన పాటును తాను పడి దనజీవితమును వెళ్లబుచ్చు కొనుననియు, నామె శారదామాతకు భార ముగ నుండదనియు బల్కిరి. ఇట్లు శ్రీ రామ కృష్ణదేవులు లక్ష్మీదేవి కుపదేశము, శిక్షణల నిచ్చియున్నారు. శ్రీ రామకృష్ణులవలన దన కిష్టదైవముగ రాధాకృష్ణయుగళ మంత్రదీక్షను బొందెను. రాధారమణులు లక్ష్మీదేవి ''ఇష్ట దైవములు''గ నుండినను శ్రీ రామకృష్ణుల యందు, వారి యర్థనారీశ్వరి శారదామాత యందును లక్ష్మీదేవికి సమానమైన యాదరము, ప్రేమ, భక్తిభావములు నుండెను. శ్రీవారి యాజ్ఞానుసారము రామకృష్ణుల నిర్యాణానంత రము శారదామాతతో దఱచుగ లక్ష్మీదేవి వసించుచుండెడిది.

లక్ష్మీదేవి యన్న శారదామాతకును బహు ప్రీతి. శారదాదేవి లక్ష్మీమణినిగూర్చి యిట్లు ప్రశంసించెడిది: ''లక్ష్మి భక్తురాలు. ఇతర భక్తులః నామె పాడుచు, నృత్య గానముల జేయును. భక్తులు వారిలో వారు కులభేదముల బాటింప నవసరములేదు. లక్ష్మి ఆహార విహార ముల జాతిభేదము పాటింపదు.

''లక్ష్మీదేవి మాటలాడుటలో చాల చతుర. అభినయమున నేమి, యితరులతో మాట లాడుటలో నేమి, శ్రీ రామకృష్ణుల పోకళ్లను, వారి చర్యలను, వారి మాటలను, సరిగ, వారి వలెనే యతిసహజముగ ననుకరించెడిది. శ్రీ రామకృష్ణుల జీవితఘట్టముల నతిముచ్చటగ భక్తులకు జెప్పి, వారిని దన్మయులుగ జేసెడిది. లక్ష్మి యద్భుతమైన మేధావి. వయసు గడచి నను, అతిజ్ఞాపకముతో నామె భజనకీర్తనలు, భక్తిపారవశ్యముతో గూడిన నృత్యగానములు ప్రయోగించి, భక్తుల మనముల రంజింప జేసెడిది.''

రామ్‌లాల్ దాదా మిద్దెపై దక్షిణేశ్వరమున లక్ష్మీదేవి యుండినను, లక్ష్మీదేవికి శారదా మాత కబురు పంపెడిది. శారదామాత యప్పుడప్పుడు తమ శిష్యులను జప తపముల

క్రమశిక్షణకై లక్ష్మీమణిదేవియొద్దకు బంపు నాచారముకూడ గలదు. శారదామాతకు లక్ష్మీదేవియం దింతటి వాత్సల్యము.

శ్రీ రామకృష్ణుల నిర్యాణానంతరము లక్ష్మీదేవి యిచ్చట, నచ్చట కాలక్షేపముచేసి కామార్పుకుర్ జేరెను. ఇంతలో రామ్‌లాల్ దాదాకు భార్యావియోగము గలుగుటయు, దన సోదరియగు లక్ష్మిని దక్షిణేశ్వరమున దన కుటీరమునకు దోడ్కొనివెళ్లెను. ఇచ్చటనే యామె పదిసంవత్సరములు గడపెను. లోగడ చెప్పిన ట్లామె యంతర్ముఖియై, యెక్కువ జప తపములతో గాలముపుచ్చెడిది. కొందటి భక్తుల కోర్కెపై నామె భక్తుల కుపదేశములు చేయు చుండెడిది. ఆమె భక్తుల యిండ్లకుగూడ వెళ్ల నారంభించెను. ఆమె భక్తితో భజనకీర్తనలు పాడుచు, బరవశయగుచుండ, నామెచెంతజేరి శిష్యులుప్పొంగెడివారు. ఆమె శిష్యబృందము నానాటికి బెరుగుచుండెను. మహాత్ములు రామచంద్ర దత్తుల శిష్యులగు యోగవినోదస్వామి కోరికపై లక్ష్మీదేవి కంకుర్‌గాచియందలి యోగోద్యానమున రెండుమాసములు గడపెను. రామచంద్ర దత్తుల యింటియొద్దగూడ లక్ష్మీదేవి యుండెడిది. ఇట్లే బలరామునింట జగన్నాథస్వామి సేవాసందర్భమున నుండుట తటస్థించెను. తఱచు లక్ష్మీదేవి వ్రజలీలల నతి రమణీయముగ జూపి భక్తుల నాహ్లాదపరచెడిది. ఇందు దూతికవేషమున లక్ష్మీదేవి ప్రసిద్ధి పొందెను.

లక్ష్మీదేవికి దక్షిణేశ్వరమున రామ్‌లాల్ దాదా, జోగీన్ ఠాకూర్, 'ఓవర్‌సీర్' దాస్ మొదలగువారల యాదరాతిశయములతో నెనిమిదివేలు ఖరీదుగల రెండతస్థుల గృహము నిర్మించిరి. ఈ రెండవ అంతస్థునుండి గంగను జూచిన గడునానందముగ నుండెడిది. ఈ గృహప్రవేశమునకు శారదామాత, శరత్ మహారాజు, గోలప్ మా, జోగిన్ మా, బేలూరుమఠసన్యాసులు, కలకత్తాలోని భక్తులు వచ్చిరి. ఇచ్చటి కెందరో యాకర్షింపబడు చుండిరి.

లక్ష్మీదేవి జన్మదినోత్సవ మిచ్చట నెంతయో రమణీయముగను, శోభాయమానముగను జరుగుచుండెడిది. ఆ సమయముల నామె యానంద భావమూర్తియైయుండ, భక్తులు భక్తితో పళ్లు, ఫలములు, ఫలాహారములతో విచ్చేసెడివారు. భక్తులామెకు వారి యిష్టదేవతలను దలంచు కొనుచు, నా కానుకల నామెకు సమర్పించి, యామెచే ఫలాహారములను దినిపించెడివారు. పిమ్మట, లక్ష్మీదేవిభక్తులకు దమతమ యిండ్లకు దీసికొనివెళ్లుటకై ప్రసాదములిచ్చెడిది. ఇట్లామె యిచ్చట బదిసంవత్సరములు గడపెను.

ఈ సమయమున బాగ్‌బజారునందు శారదామాతకొఱకై యుద్బోధన మందిరనిర్మాణమైనది. లక్ష్మీదేవి యప్పుడప్పు డుద్బోధనమందిరమునందుండెడిది.

శ్రీ రామకృష్ణు లున్నంతకాలము దక్షిణేశ్వరమే సర్వతీర్థములునై, యందఱకు నిరంతర మగు నానందాబ్ధిగ భాసిల్లెడిది. శ్రీ రామకృష్ణుల నిర్యాణానంతరము, వారి శిష్యులందరి వలెనే లక్ష్మీదేవియు దీర్ఘయాత్రల సేవింప నారంభించెను.

శారదామాతతో బృందావనమున కేగి యొకటిన్నర సంవత్సరము లచ్చట నుండెను. మరియొకసారి రెండున్నరమాసము లచ్చట నుండెను. యోగవినోదులతో నచ్చట మరి యొక రెండుపక్షములు గడపెను. విపిన్‌తో

కొలదిమాసము లచ్చట నుండెను. ఒకపర్యాయ మీా యాత్రలో కాశీక్షేత్రమును దర్శించి లాటుమహారాజుతో నుండెను. బృందావన మన్న నామె కెంత ప్రీతి, యాకర్షణయన్న, నామె తాను బృందావనవాసి ననియెడిది. గురుదేవులు నామె నట్లులనియెడివారు.

''పాల్'' అను భక్తునితో నవద్వీపమున కేగి యచ్చట మూడుదినములుండెను. బిపిన్‌తో మూడుపర్యాయము లీ తీర్థయాత్ర సేవించి, కొన్నిమాసములుండి మహానందముగ నుండెడిది. ఇచ్చట విష్ణుచరణ బావాజీవలన నిత్యము ''చైతన్యచరితామృతము'' వినుచు ప్రతిదినము గడిపెడిది.

రామ్‌లాల్ దాదా సంతతితో, లక్ష్మీదేవి గంగాసాగరయాత్ర జేసెను. గయ వెళ్లి యచ్చట మూడుదినములు గడపెను. రెండు మూడు పర్యాయములు ప్రయాగ వెళ్లి, త్రివేణీ స్నానము జేసెను. 1887–వ సంవత్సరమున హరిద్వారము, జైపూరు వెళ్లి, బహు ఆనంద పడెను.

శారదామాతతో నొకపర్యాయము, బిపిన్‌తో రెండుపర్యాయములు లక్ష్మీదేవి భువనేశ్వరము వెళ్లి లింగరాజదర్శనము చేసెను. ఇచ్చట నొకసారి రాధారమణులగూర్చి ప్రసంగింప నారంభించెను. ఆ భావావేశములో తన్మయురాలై యుండ దెల్లవారుజామున నాల్గుగంటల నుండి రాత్రి తొమ్మిదిగంటలకైనను నామె ప్రసంగమునకు ఆ భావమునకు విరామము లేకుండెను. అప్పు డామె తన కస్వస్థతగ నున్నదనియు మఱచెను. అంతట భక్తు లామె కేమైన ముప్పు వాటిల్లునని భయపడినందున బిపిన్ ఆమెను మాట్లాడకుండ నోరు నొక్కి-వేసినను ఆమె చాలింపదయ్యె.

1888–వ సంవత్సరమున లక్ష్మీమణిదేవి కలకత్తానుండి యోడపై జోగిన్‌మా, గోలప్‌మా, యోగానందస్వామి, బ్రహ్మానందస్వామి, శారదామాతలతో పూరీకి పయనమాయెను. లక్ష్మీమణిదేవి గోపాలు నారాధించెడిది. ఆమె యారాధనయందా విగ్రహమును చైతన్యశక్తితో గాంచెడిది. ఈ సందర్భమున లక్ష్మీదేవి తిరిగివచ్చునరకును గోపాలుని యారాధన శివరాముని చేయుమనెను. ప్రయాణములో నొకరాత్రి యామె కల గనెను. ఆ కలయందు శివరామ్ గోపాలునికి జందనము విస్తారముగ రాసి, గోపాలుని కండ్లు గనబడనట్లుగ చందనము మెత్తబడుచున్నదని ద్యోతకమయ్యెను. ఆమె తిరిగివచ్చి, జూడబోవ తాను కల కనినటులనే యథార్థముగా జరుగుచున్న విషయములే యైనవి. అంత శివరామునిజూచి, ''ఇది నీవు గోపాలునికి జేయు సేవయా'' యని మందలించుటయేగాక, గోపాలుని భోగమునకై యొక యెకరము భూమియు నిచ్చెను. నేటికిని నాకమార్‌పకూర్‌నం దీ విగ్రహమును, భూదానమును గాననగును. జోగిన్ మా, గోలప్‌మాలతో నొకపర్యాయము, శారదామాతతో తిరిగి యొకపర్యాయము, భక్తులతో మఱి రెండుపర్యాయములు పూరీక్షేత్రమును దర్శించెను. లక్ష్మీదేవి వైష్ణవప్రపత్తి గల్గినదగుటచే నచ్చట హరిదాస్ మఠవాసియగు శ్యామదాస్ బావాజీ యను వృద్ధున కామె యాహారము పెట్టెడిది.

దక్షిణేశ్వరమున నుండ రామ్‌లాల్ దాదా యొక్క యిద్దరి బిడ్డలకు వివాహముజేసి, తన నియమ నిష్ఠలకు, సంసారులతో తానుండుట వారికి మంచిదిగాదని యెంచి, వారల వంశాభివృద్ధికై లక్ష్మీదేవి తన చరమావసయందు

పూరీ జగన్నాథక్షేత్రమును జేరుకొనెను. ఇచ్చట జగన్నాథస్వామి దేవాలయపు పడమటి ద్వారము దగ్గఱనా దేవాలయ ధర్మకర్తయగు 'జగన్నాథమిశ్రా' యింటనుండ జొచ్చెను. ఇచ్చటనుండ సముద్రపు టొడ్డున స్వర్గద్వార మను ప్రదేశమునందు పూరీ పురపాలక సంఘ మువారిచ్చిన స్థలములో లక్ష్మీనికేతనమను భవనమును లక్ష్మీదేవికై నిర్మింపబడెను. ఆ భవనమున, ''జై రామకృష్ణ'' యని చెక్కిన చలువరాయి నుంచిరి (1923-1824). ఈ భవనమున నామె, కృష్ణమయి, జ్ఞాన, నిర్మల యను శిష్యురాండ్రతోను, బిపిను డాదిగాగల భక్తులతోడను నుండెడిది. అచ్చట నొక కూపమునుగూడ నిర్మించి, దానికి ''రామకృష్ణ కుండ'' మని పేరిడి, యా నూతికి పంచామృతాది ఫలసహితముగ నామెయే పూజలు చేసెను.

పూరీ జగన్నాథము వచ్చుటకు పూర్వ మామె బయలుదేరునప్పుడు గంగాస్నానమును జేసికొని, తనగదియందు గురుమహారాజుల నారాధించి, పిమ్మట భవతారణీ దర్శనమున కేగెను. అచ్చట నామెకు ప్రణమిల్లుచు 'నే నెచ్చట సంచారము జేయుచున్నను దేవీ! నీ సన్నిధి నిచ్చటనే నీ దివ్యచరణములందు నా ప్రాణములను వీడజేయుము, దయగను'మని ప్రార్థన జేసికొనెను. పూరీ జగన్నాథమునందు నామెకు జాల సుస్తీచేసెను. ఆమె దక్షిణేశ్వరమున రా సంకల్పించెను. ఒకసారి యవరోధము గల్గెను. తిరిగి ప్రయత్నింప, నామెకు జగన్నాథస్వామి రాత్రి ప్రత్యక్షమై యిట్లామెతో జెప్పెను. ''నీవిచ్చటనేయుండుము. ఇది శ్రీ జగన్నాథము. ఇందు స్వయముగా లక్ష్మీదేవియే నివసించుచు, ఈ క్షేత్రమున ఆమె విరాజిల్లు చున్నది. ప్రపంచములో నిది శ్రేష్ఠతమమైన ధామము. దీనిని శ్రీక్షేత్రమని యందురు. ఇట్టి సముద్రతీరము దేవతలకుగూడ లభించుట దుర్లభము. కాన, నీవిచ్చటనే, నీ శరీరమును చాలింపుము.'' స్వామి మాటలు సరిగ జరిగినవి. ఆమె 1926-వ సంవత్సరమున 62-వ యేట గోవింద ద్వాదశినాడు పరమపదము నొందెను.

శ్రీ రామకృష్ణు లన్నివిషయములతోబాటు, లక్ష్మీదేవి కిష్టసిద్ధికై రాధాకృష్ణ (యుగళ) మంత్రదీక్ష నిచ్చిరి. ఆమె విజ్ఞానమంతయు శ్రీ రామకృష్ణులనుండి గ్రహించినది. శారదా మాతయందుగూడ లక్ష్మీదేవికి విస్తారమగు భక్తి, విశ్వాసము, గౌరవప్రపత్తులు నుండెను. లక్ష్మీదేవి పూరీయందలి నూతనభవనమును జూచుటకై శారదేశ్వరానందస్వామి జగన్నాథము వెళ్లినప్పుడు, శారదా - రామకృష్ణుల ప్రస్తావన వచ్చినప్పుడును లక్ష్మీదేవి పరవశురాలయ్యెడిది. ఆమె గురుదేవులు నిష్పందనము గను, క్షీరరాగశరీరిగను, తేజోమయుడుగను కనబడియుండెనని చెప్పెడిది.

లక్ష్మీదేవి 1891-92 సంవత్సరమున కమార్పకూర్‌నందు మహర్ణవమిదినముల శీతలాంబకు ప్రత్యేక పూజలు, నారాధనలు చేయించెను. అచ్చటి జమీందారగు ''ఉపేక్‌లాహా'', శీతలాంబకు బలియిచ్చుటకై యొక మేకను, యూపస్థంభమును శీతలాంబకడకు దీసికొని వచ్చెను. లక్ష్మీదేవి యీ బలి కూడదని యెంత చెప్పినను, గ్రామములో బలవంతుడు గాన, నామె మాటల నాతడు సరకుజేయకుండెను. అంత లక్ష్మీదేవి వీరావేశపరవశురాలై తన బట్టను నడుమునకు జుట్టుకొని, యతనిచేతనున్న కత్తి నామె యూడబెరుకగ, లాహా భయా

వహుడై యింటిముఖముపట్టి పారిపోవ, లక్ష్మీదేవి యాకత్తిని జేతబూని లాహాను వెన్నంటి పరుగిడెను. అంత లాహా యిలుసేరి, లక్ష్మీదేవి లోనికి ప్రవేశింపకుండ దన యింటితలుపులను వేసికొనెను. ఇట్లు శీతలామ్మవారికి బలియిచ్చుట లక్ష్మీ యాపుజేసెను. ఆమె యమ్మవారికి బలీయ గూడదన్న మతములోనిది.

1904-వ సంవత్సరమున కేదారేశ్వరునికి హారతినిచ్చు సమయమున నుద్బోధనమున గోలప్‌మా, లక్ష్మీదేవిని నగలతో రాధికాసఖ వేషమును ధరింపజేసెను. అంత వారందరి యెదుట నృత్యగానముల జేయుచు, లక్ష్మీదేవి రాధాకృష్ణలీలల బ్రదర్శించెను. మధ్యమధ్య, హాస్యరసమొలికించుచు, రాధాకృష్ణలీలలలో నెన్నియో సన్నివేశముల నామె యభినయించి వారిల హృదయముల నానంద, భక్తిపారవశ్యములుగ జేసెను.

ఒకనాడు సోదరి నివేదిత సరదాపడెను. మామూలుగా జరుగు బృందగానానంతరము, లక్ష్మీదేవి, భక్తులగు రామప్రసాదుల కీర్తనలను రామప్రసాదులవలెనే పాడెను. అంత సోదరి నివేదిత పరవశురాలై బిడ్డవలె నానందించుచు, దాను మృగరాజు (సింహము) పాత్ర నభినయించి, లక్ష్మీదేవిని దనపై నెక్కించుకొని, సింహవాహనను జోల వార లానందమయులైరి.

అప్పుడప్పుడామె భావభరితురాలై యుండునపుడు కూర్మమువలెనే, యవయవములు మునిగియుండెడివి. అంత నామెనుండి యొక తేజస్సును వచ్చెడిది. ఆ సమయముల నామె కరుణామయ; మృదుమధుర కోమలహృదయమై యుండెడిది. ఆమె సేవకుడగు బిపిన్‌తో నొకసారి యిట్లామె చెప్పెను. అట్టి ఉన్నత స్థాయిలో నేనున్న సమయముల నా హృదయకమల మూర్ధ్వముఖమై వికసించి యుండును. ఇతరసమయముల నా కమల మధోముఖమై యుండును. ఆ యూర్ధ్వ ముఖమగు కమలమునుండి జ్యోతి యొకటి ప్రకాశించును. ఆ తేజస్సువలన నేను ప్రపంచమునంతయు జూడగల్గెడిదానను. విషయసుఖములు క్లేశహేతువులు. అంతః సుఖమే యానందము.

జోగీన్ మా మహాసమాధి యనంతర మొక భక్తుడు లక్ష్మీదేవికడకు శ్రీజగన్నాథము వెళ్లెను. అప్పుడు జగన్నాథ రథ యాత్రదినములు. జోగీన్ మాను గూర్చి లక్ష్మీదేవి వినగనే, యామె యెంత దుఃఖపడినదన నంతయు నల్లబడిపోయినది; "నేను పిట్టవలె నామెను జూచుట కెగురగలిగిన బాగుండు" ననెను. స్నానయాత్రదినమున లక్ష్మీదేవి గోపబాలునివలె వేషముధరించి, బట్టను వెనుకకు విరచికట్టుకొని, చేతను కర్రనుబూని, చేతుల పూలమాలల ధరించుకొని, బలరాముల భావములో నిలిచిపోవ, ఆమె యా యపార పారావారమును స్థిరముగ జూచుచు, ఉన్మీలితనేత్రయై నిలిచిపోయెను. తర్వాత దన గదిలోనికి వెళ్లెను. ఉదయమున మామూలు స్థాయిలో జూడ నామె మృదుమధురగాత్రమును, కొలుకులనుండి కన్నీరొలుకుటయు నాతడు జూచెను. ఆమె యా సమయమున గౌరాంగుని స్వాంతమును బొందెనని యా భక్తుడామెను వర్ణించెను.

(సశేషము)

ఓమ్ శ్రీ శ్యామలాంబాయైనమః.

# కర్మ - దాని విధానము

## శ్రీ తెన్నేటి లక్ష్మీనరసింహము

కం॥ కర్మమునఁ బుట్టు జంతువు
కర్మముననె వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడున్
కర్మమె నరులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా.
(భాగవతమునుండి)

కర్మ యనగా మనుష్యుడు మనస్సుచేతను, శరీరముచేతను, వాక్కుచేతను జేయుపని. అట్టి కర్మలన్నియును వానివాని కనుగుణములగు ఫలముల నిచ్చియే తీరును.

ఆ కర్మ మూడు విధములు :- 1. సంచితము; 2. ప్రారబ్ధము; 3. ఆగామి: వాని యందు.

1. సంచితమనగా ననేకజన్మలనుండి యార్జించి నిలువచేసిన శుభాశుభ కర్మరాశి.

2. ప్రారబ్ధమనగా (నిలువజేసిన) ఆ కర్మ రాశి యగు సంచితమునుండి యొకజన్మమున ననుభవించుటకు మాత్రము సరిపోవుటకు దెచ్చుకొనిన కర్మము.

3. ఆ ప్రారబ్ధకర్మము నట్లనుభవించుచు ఈజన్మమున నిహలోకమున జేయు క్రొత్తకర్మ మాగామి యనబడును. ఈ యాగామి కర్మము ఇదివరకు నిలువజేయబడియున్న సంచితకర్మమున జేరుచుండును.

ప్రారబ్ధకర్మ యనబడునది జీవుని భూపతన కాలమునుండియు శుభాశుభఫలముల నందించుచుండును. తా ననుభవించుటకు దెచ్చుకొనిన కర్మము సమాప్తికాగనే మరల జీవుడు శరీరమును విడిచి నూతన శరీరమును ధరించుటకు బోవుచున్నాడు. పుట్టువుతో ప్రారంభింపబడిన కర్మమగుటచేతనే దీనికి ప్రారబ్ధమను నామ మీయబడినది.

ఇట్టి ప్రారబ్ధమును దప్పింప బరమేశ్వరునకుకూడ శక్యముకాదు.

సూ॥ 'ప్రారబ్ధ మవశ్య భోక్తవ్యమ్॥'' అని యున్నది. జీవుడు జన్మించినది మొదలుకొని మరణించువఱకును బొందెడు నిహలోక ఫలములన్నియు నందు వరుసగా కోవ (తావళము) వలె గ్రుచ్చబడియున్నవి.

ఒకదాని వెనుక నొకటి వరుసగా ననుభవింపవలయును. వరుస దప్పించి ముందు ఫలము వెనుకగాని వెనుక ఫలమును ముందుగాని యనుభవించుటకు శక్యముగాదు.

ఉదా:—ఒకడు చెన్నపట్టణమునుండి కలకత్తాకు బోవలయునని టిక్కెటుకొని ధూమశకటము నధిరోహించి ప్రయాణము చేయుచుండును. అతని కిష్టమున్నను లేకున్నను నడుమ దారసిల్లు పురములు, పల్లెలు, అడవులు, నదులు, తటాకములు వరుసగా దాటవలయునే గాని, కృష్ణానది దాటక ముందుగా గోదావరిం దర్శింప గుతూహలుడైనను నాతని కదెన్నటి

కిని శక్యముగాదు. కృష్ణను దర్శించిన పిమ్మట వలదన్నను గోదావరి రాకమానదుకదా? ఇన్నియును దాటి కలకత్తా తన చీటిప్రకారము జేరినపిమ్మట ఒక అడుగైనను ఏలాగు దాటి పోవుటకు వలనుపడదో! ఆలాగుననే జీవుడు ప్రారబ్ధమను చీటిని గైకొని శరీరము నధిరోహించి జీవయాత్ర చేయుచున్నాడు. కాబట్టియే యీ నడుమను దాపురించు ఫలాఫలములన్నియు నాతడు అనుభవించితీరవలయును.

జన్మకాలముననుండు గ్రహము లీ ప్రారబ్ధమునే సూచించుచుండును. జాతక ప్రారంభమున

శ్లో॥ శ్రుతా సతీ సాధుజనానురంజకా।
పిత్రం తరం గోత్పలచారుచంద్రికా,
"భావ్యర్థ సం సూచన సచ్చకుంతికా।"
విలిఖ్యతే సంప్రతి జన్మపత్రికా॥

శ్లో॥ జననీ జన్మ సౌఖ్యానాం।
వర్ధనీ కుల సంపదాః,
పదవీ "పూర్వపుణ్యానాం"
లిఖ్యంతే జన్మ పత్రికా॥

అను శ్లోకములలోని గీతలు గీయబడిన వాక్యములచే గ్రహము లీ జీవునకు పూర్వజన్మకృత కర్మవలన గలుగబోవు భావ్యర్థమును సూచించునని తెలియగలదు.

స్థితిగతు లిట్లుండగా నిహలోకసౌఖ్యములకునై మనుష్యుడు తాను ప్రయత్నమును జేయుచున్నాడనియును, తన ప్రయత్నమువలన గార్యసిద్ధి యగుచున్నదనియును దలంపరాదు. తనకొక ఫలము సమకూడనున్నతరి దాని విషయమున బ్రయత్నించుటకు దనకు బొడమిన బుద్ధియు బూర్వకర్మము ననుసరించియే యుండును.

కం॥ "తన తొంటి కర్మరాశికి
ననుచరమై బహువికారమై మనము వడిన్
జను నింద్రియముల తెరువులఁ
దనువులు పెక్కైనఁ జెడవు తనకర్మంబుల్."

శ్లో॥ "పూర్వజన్మకృతం కర్మ తద్దైవ మితి కథ్యతే॥" అను వాక్యము ప్రకారము పూర్వజన్మకృత కర్మమునకే దైవమనిపేరు.

ఇట్లుండ మఱికొన్ని గ్రంథములయందు
"షభిర్మనుష్య యత్నైశ్చ సప్తమం దైవచింతనమ్॥"
అనియును,
"యథాహ్యేకేనచక్రేణ రథస్యగతిర్భవేత్।"
"తథా పురుష కారేణ వినా దైవం న సిద్ధ్యతి॥"
యనియును జెప్పబడియున్నది.

అనగా ఒకేచక్రముపై బండి (రథము) ఎట్లు నడువదో యట్లే పురుషయత్నమున్నను, దైవయత్నము లేనిచో గార్యము సిద్ధింపనేరదని భావము.

పురుషుడుచేయు ప్రయత్నముపైనే దైవము (కర్మము) ఫలమిచ్చుననుటకు సందేహము లేదు. కాని, రాబోవు ఫలమునకు దాని విషయమున బురుషుడుచేయు ప్రయత్నమునకును దైవమే కారణమని చెప్పుచున్నాను. దైవమునకేల యంత ప్రాముఖ్యత నీయవలసివచ్చెనన జూడుడు:—కొన్ని కార్యములు ప్రయత్నరహితముగా జరుగుటయు గొన్ని కార్యము లెంత యత్నించినను జరుగకపోవుటయు గలదు.

అప్పుడీ పురుషకారమునకిచ్చిన బలమునకాధారమేమియుండును? సకలధర్మవేత్తయగు శ్రీరామచంద్రుడే యొకసారి లక్ష్మణునితో

కం॥ ఎన్నండెంచనిదెటులో
యున్నట్టుగనుండి యగుట యూనినపని వి

చ్చిన్నంబగుటయు నట్టులె
యన్నా ! యివి దైవకృతములగు సత్యముగన్.

(ఆంధ్రవాల్మీకిరామాయణము)

అని చెప్పెను. ఇందుకు మహాభారతమునగూడ నిట్లు వ్రాయబడియున్నది.

వ. అనిన విని, ధర్మజుండు గాంగేయునితో "నప్రయత్నులకు నర్థంబు సిద్ధించుట గలుగు. ధర్మపరులును, నీతివిదులును నైన బలవంతులు బహుమార్గంబులగు సదుపాయంబుల నర్థంబు లాకాంక్షింప సిద్ధింపకుండెడు" గొందఱకు సిద్ధించియు నవి భోగంబుల కుపయోగంబులు గాకుండు. శిశులు పెద్దలు లేక కొన్నిచిత్తంబు లందు విద్య లలవడు. శిక్షితులయ్యును నిర్విద్యులగుట గలుగు దేవుళ్ల మోసియుం బోట్ల బడియును గొందఱు చావరు. పూరి పుడక దాకి బలాధికులు చచ్చుట చూచెదము. ఇట్లుగా గతంబేమి? యెఱింగింపవే యనుటయు న మ్మహీపతికి న మ్మహాత్ముం డిట్లనియె.

కం॥ మొలవంబెట్టని యట్టిది
మొలుచునె తొలుమేనిదానముల నానార్థం
బులు సిద్ధించు బ్రయత్నం
బులు లేకయు, నింత నిజము భూపవరేణ్యా:

గీ॥ అలఘు తపములు తొలిమేనఁ గలిగెనేని
వెదకికొనివచ్చు నన్నరు విపులభోగ
ములు పురాకృత వృద్ధసేవల ఫలించు
బుద్ధి కలిమియు, విద్యల బొలుచుటయును.

కం॥ తొలిమేన నహింసారుచి
గలిగిన దీర్ఘాయువొందఁ గారణభూతం
బులు భూవర యివి యీ గుణ
ములు లేమియ కీడులకును మూలంబరయన్.

కావున

గీ॥ వినుము దానంబుఁ దపమును వృద్ధసేవ
నము నహింసయు నియతకృత్యములు సర్వ
జనుల కీ మహాగుణముల మనమునందు
దృఢముగా నిల్పి నడుపుము ధీరవర్య.

అని భీష్ములవారు సెలవిచ్చిరి.

దీనినిబట్టి చూచినను బూర్వజన్మమున దానంబులుచేసిన ధనము లప్రయత్నముగా సిద్ధించుననియును; బూర్వజన్మంబున దపము చేసినచో భోగము లానరునియొద్దకే వెదకుకొనివచ్చుననియు; తొలిమేన జీవహింస జేయకుండినచో దీర్ఘాయువు కలుగుననియును దెలియబడుచున్నది.

కొందఱు భారతమునందలి

కం॥ విను పురుషుడు గావింపని
పనులకు దైవమది యెట్లు ఫలమొసరించున్
జనములు కార్యము నడుపగ
ననుకూలత నిచ్చుగాక యయ్యె ఫలముల్.

అను పద్యమును జదువుచు, పురుషుడు ప్రయత్నముచేయకున్నచో దైవము ఫలమీయనేరదనియు దైవమిచ్చు ఫలము పురుషుని ప్రయత్నముమీదనే యాధారపడియున్నదనియును చెప్పుచున్నారు. ఈ పద్యమునకు ముందు వెనుకల గల పద్యములగూడ జూచి దీని యర్థము విచారింతము.

దీనికి ముందు పద్యము

కం॥ క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర బీజమరయ దైవము రెండున్
సూత్రపడగూడెనేనియు
బాత్రమగుం గర్మకరుడు ఫలమున కెందున్.

అనగా పురుషకారము భూమివంటిదనియు, దైవమనెడు పురాకృతకర్మము బీజమువంటి

దనియు నీ రెండును సూత్రపడినచో (కూడి నప్పుడె) ఫలించుననియు నర్థము.

రెండవ పద్యము పైని చెప్పబడిన

కం॥ "విను పురుషుడు గావింపని"

అనుపద్య మన్వయముతో ననగా మనుష్యుడు సర్వసాధారణముగా పనిచేయుచునే యుండును గాన నా పని చేయుచున్న కాలమందే దైవము తానియ్యవలసిన ఫలము నిచ్చుచుండుననియు; నేపనియు జేయక శిలాస్తంభమువలె నొకచో గదలక మెదలక యున్న నెట్లు ఫలము నొసంగు ననియు భావము.

అయినను మనుష్యుడొక కర్మఫలము ననుభవించుటకు గాలమువచ్చుచున్నప్పుడు దానిని గురించి తాను (ఆ వ్యక్తి) ప్రయత్నము చేయకుండగలడా? ఎట్లన:—లోపలనుండి వమనము మిక్కిలి బలవంతముగా వచ్చుచున్నదానిని పెదవు లాపగలవా? ఆలాగుననే (జీవుడు) పురుషుడు తా ననుభవించబోవు శుభాశుభ ఫలముల కనుకూలమైన ప్రయత్నము దైవ ప్రేరితుడై (కర్మ) చేయుచునే యుండును.

కావుననే

కం॥ "తన తొంటి కర్మ రాశికి"

అని చెప్పబడినది; మఱియు

గీ॥ పౌరుషము, దైవమ్ము, తోడ్పాటులేక
ఫలముఁ బొందంగనేరదు పార్థివేంద్ర
విత్తు సహకారి గాకున్న రిత్తనేల
వంధ్యమగుఁగాక తా ఫలవంతమగునె.

అనియు శాంతిపర్వమున దుదిసిద్ధాంతవాక్యము లలో

గీ॥ సారమతిఁ బరికింపంగఁ బౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు కార్యసిద్ధి
కెచటనేనియుఁ బౌరుష మెసక మెసఁగె
నేని యది దైవదత్తంబ యింత నిజము.

అని చెప్పబడినది కావున సర్వవిధముల బురుషు డనుభవించు ఫలాఫలములకు బూర్వజన్మకృత కర్మమే కారణము.

గాఢమైన పురుషప్రయత్నమువలన ప్రారబ్ధ కర్మఫలముల గొంతవరకు దగ్గింపవచ్చునని కొందఱనుచున్నారు. అది యెట్లు పొసగును? కొంత తగ్గించుట కెప్పు డవకాశముండునో పూర్ణముగా నశింపజేయుటకు నప్పుడే యవకాశముండును. కావున ప్రారబ్ధకర్మఫలములలో నొక్కదానినైనను దప్పించుటకుగాని తగ్గించుటకుగాని నరున కవకాశములేదు. "పురాతన జన్మ కర్మంబుల దప్పింప న ప్పరమేశ్వరునకైన వశముకాదనిన నితరులం జెప్ప నేల?" యని శ్రీ కృష్ణపరమాత్మయే తండ్రితో జెప్పెను. వేదాంగములలో నొకటియగు జ్యోతిష శాస్త్ర మీ ప్రారబ్ధకర్మమును సూచించుటకే పుట్టినది.

(సశేషము)

❧

# సంఘవార్తలు

## శ్రీ రామకృష్ణ వేదాంత సంఘము, లండన్

ఈ సంఘము కొందఱు ఆంగ్ల మిత్రుల ప్రోత్సాహము వలన 1948 వ సంవత్సరము నవంబరు మాసమున నెలకొల్పబడినది. రాజకీయరంగబాహ్యమయిన వేదాంతప్రచారమే లక్ష్యముననుంచుకొని యితరత్రగల శ్రీరామకృష్ణ వేదాంత సంఘములవలె ధార్మిక వైజ్ఞానిక విషయముల జనబాహుళ్యమున కందజేయుటయే దీని ముఖ్యోద్దేశము.

ఈ సంఘమునకు శ్రీ ఘనానందస్వాములవారు అధ్యక్షులుగా నియమింపబడియున్నారు. ప్రార్థనానుకూలములగు తరగతులను వీరు జరుపుచున్నారు. క్రిందటి 1951 వ సంవత్సరమున శ్రీ స్వాములవారు 345 ధార్మికోపన్యాసముల నొసగిరి. ఆధ్యాత్మికవిషయములం దుత్సాహముకలిగి సదుపదేశములకై యాకాంక్షించు ముముక్షువు లెందఱో శ్రీవారిని కలిసికొని తమ తమ సందేహముల నివారించుకొనగలిగిరి.

లార్డు స్టాండ్‌విచ్ గారిచే బహూకరింపబడిన శ్రీరామకృష్ణులవారి చిత్రపటము ఇచ్చటి పూజామందిరము నలంకరించుచున్నది. శ్రీ రామకృష్ణ గురుదేవుడు, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి—వీరల జన్మదినోత్సవములే కాక బుద్ధజయంతి, క్రిస్టమసు, ఈస్టరు మొదలగు నుత్సవములు మిక్కిలి చక్కగా నిర్వర్తింపబడియున్నవి. ఆయా దినములందు ప్రఖ్యాతోపన్యాసకులగు శ్రీ స్వామివారు, మహాపురుషుల జీవితములు, వారి యుపదేశములనుగూర్చి యుపన్యసించిరి.

అప్పుడప్పుడు ఆహ్వానింపబడి శ్రీ స్వామివారు ఆక్స్‌ఫోర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములలో, టాగూరు విద్యాసంస్థలలో ఇతరప్రదేశములందును వేదాంతము, యోగము మొదలగు ఆధ్యాత్మికవిషయములగూర్చి యెన్నియో యుపన్యాసము లొసంగిరి.

ఈ కేంద్రమునుండి 'The Harmony of Religions—A teaching of Sri Ramakrishna, the Mystic and Teacher of India' అను గ్రంథ మొకటి ప్రచురింపబడినది. మఱియు Vedanta for East and West అను ద్వైమాసిక పత్రికయు ప్రకటింపబడుచున్నది. ఈ కేంద్రమునకు ప్రార్థనమందిరము, ఉపన్యాసానుకూలమగు లోగిలి, పుస్తకభాండాగారము, ఆశ్రమవాసులకు విడిది మొదలగునవి గలవు.



# రాయలసీమ క్షామనివారణయందు శ్రీరామకృష్ణ సేవాసంఘ సహోద్యమము

రాయలసీమ క్షామనివారణయందు శ్రీ రామకృష్ణ సేవాసంఘము గావించుచున్న సహోద్యమము శ్రీ రామకృష్ణప్రభ పాఠకలోకమునకు దెలియనిదికాదు. ఆంధ్రప్రభ పాఠకులు శ్రీ రామకృష్ణ సేవాసంఘ సహోద్యమమును వారు గావించుచున్న సేవాకార్యమును స్పష్టముగా తేదీలవారీగా తెలిసికొనియున్నారు. శ్రీ నిత్యబోధానంద స్వాములవారి శ్రద్ధ యెంతయు కొనియాడదగినది. జనబాహుళ్యము రాయలసీమ క్షామపీడితులకు ధనరూపేణ వస్తురూపేణ ధాన్యరూపేణ పంపుచున్న విరాళములను సక్రమమార్గమున పంచిపెట్టుచున్నారు. వర్షములు కురిసి భూమి చల్లబడినను కరువు కాటకములకు గురియైన రాయలసీమ పరిస్థితులు మారినవి కావు. కావుననే రాజ్యాంగమువారును తమ క్షామనివారణ కార్యక్రమమును సాగించుచునేయున్నారు. అట్లే శ్రీ స్వామివారును తమ కార్యమును కొనసాగించుచునేయున్నారు. మునుపటివలెనే ఆంధ్రప్రజానీకము సోదరాంధ్రులకు సాయము చేయుటయందు శ్రీ రామకృష్ణ సేవాసంఘమువారికి తోడ్పడును గాక!

విరాళములు పంపగోరువారు ఎంతటి స్వల్పవిరాళము లయినను కార్యదర్శి, శ్రీ రామకృష్ణ మిషన్, మైలాపూరు, మద్రాసు అను చిరునామాకుగాని, శ్రీ నిత్యబోధానందస్వామి, శ్రీ రామకృష్ణ సమాజము, కడప అను చిరునామాకుగాని పంపవలసినదిగా ప్రార్థించుచున్నాము.



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు  సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము  వెల రూ. 3-4-

## భగవద్గీత

పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకా తాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

432 పుటలు  పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు  రూ. 3-

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్రణాలంకృత రెండవ కూర్పు వెల రూ. 1-1.

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు  (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము)  వెల రూ. 1-4-0

| | | | |
|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| గురూపదేశములు | ... | | | 0 | 8 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | ... | | | 0 | 6 |
| నా గురుదేవుడు | ... | | | 0 | 6 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | 0 | 1 |
| నవీన భారతదేశము | ... | | | 0 | 4 |
| ముక్తిమార్గము | ... | | | 0 | 3 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | 0 | 3 |
| శ్రీ రామనామ సంకీర్తనము | ... | | | 0 | 1 |
| యతిగీతము (పద్యకావ్యము) | ... | | | 0 | 1 |
| నా మతము | 0 0 6 | | డజను | 0 | 5 |
| సింహ గర్జన | 0 0 6 | | డజను | 0 | 5 |

ఇవియే కాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎన్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-6-52.

# శ్రీ రామకృష్ణ ప్రభ

౧౯౫౧, జూలై—ఖర, ఆషాఢము

సంపుటము ౮ సంచిక ౧






శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు

చెన్నపురి

# వి ష య సూ చి క



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చి పంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ { ౧౯౫౧ – జూలై : : ఖర – ఆషాఢము } సంచిక ౧

## ప్రార్థన

స్వర్గేవా వసతిర్మమాస్తు నిరయ స్తిర్యక్షు కింవాసరే
ప్రేతానాం నగరేఽథవా నరపురే కాప్యన్యతః కర్మణా।
భో సర్వజ్ఞ తత స్త త స్తవగుణాన్ కర్ణామృత స్యన్దినో
నిష్పాపానవలంబతామ్ మమమనోనాన్యాసఖ ప్రార్థనా॥

పితా మాతా భ్రాతా త్వమసి భగినీ త్వంచ విపది
స్థిరమ్ మిత్రమ్ బన్ధుః ప్రభురమృతదీక్షాగురుతమః।
త్వమైశ్వర్యమ్ భోగోత్వమసి ధనధాన్యంచ మహిమా
యశో విద్యా ప్రాణ స్త్వమసి మమసర్వజ్ఞ సకలమ్॥

అనాత్మన్యనిత్యేఽశుభే దుఃఖదుఃఖే, దురన్తేఽత్ర సంసారచక్రే భ్రమ న్తమ్।
త్వమేకోసి మాం త్రాతు మీశో దయాబ్ధే, ప్రభోఽతః ప్రసీద ప్రసీద ప్రసీద॥



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వరాలయమున శ్రీరామకృష్ణుడు

23 సెప్టెంబరు, 1883.

రాఖాలు, 'మ.', హాజ్రా మున్నగువారు శ్రీ గురుదేవునిచుట్టువారి యుండిరి. నిత్య గోపాల్, తారక్—వీరిరువురును రామచంద్ర దత్తుని యింట నుండిరి.

శ్రీరామ:—(ఒకభక్తునితో) నరేంద్రుడు నిన్ను ఎక్కువగా ప్రేమింపడు. ఏదీ అధరుని యింటికి నరేంద్రుడు రాలేదుగా!

నరేంద్రుడు మిక్కిలి గుణవంతుడు. అతడు విద్యయం దభిలాష గలవాడు; పాడగలడు, వాద్యములు వాయింపగలడుగూడ. ఒకరోజు కేప్టన్ బండిలో నరేంద్రుడు బోవుచుండగా కేప్టన్, ఎన్నియో మార్లాతని తనయొద్ద కూర్చొమ్మని యడిగెను. నరేంద్రు డాతని యెదుటనే కూర్చొనెను కాని ఆతని ముఖము వైపుగూడ చూడలేదు.

శుష్కపాండిత్యమువలని ప్రయోజనమేమి? భక్తిసాధనలవలంబింపవలయును. ఇందేష్‌నుండి వచ్చిన గౌరి మిక్కిలి పండితుడు. దానికితోడు సాధకుడు; శక్త్యుపాసకుడు. దేవీనామోచ్చారణము గావించుచు నున్మత్తుడై పోవును. అతడు భావావేశముతో 'హారే రేరే నిరాలంబ లంబోదర జననీ, కం యామి శరణమ్' అని పలుకగా పండితులందరును క్రిమిప్రాయులై పోవువారు. ఆ సమయములందు నే నుండినచో తత్క్షణమే భావావిష్టుడనై పోవువాడను.

ఒకడు కర్తాభజ (వంగదేశమునందలి ఒక వైష్ణవ సంప్రదాయము) సాధకుడు నిరాకారమునుగూర్చి వ్యాఖ్యానించుచు, నిరాకార మనగా నీరముయొక్క ఆకారమని వివరించెను.

అంత శ్రీ గౌరిపండితునకు పట్టరాని కోపము వచ్చెను. ఆతని సాధకజీవితమున ప్రప్రథమమున మిక్కిలి మొండిపట్టుదలగల వీరసాధకుడై యుండెను. ఎక్కడేని తులసీదళము పడి యున్నచో దానిని రెండు పుల్లలతోనే కాని చేతులతో దీయడు—అసలు ముట్టుకొనువాడే కాడు. (అందఱు నవ్విరి.) కొన్నాళ్లకు పిదప తనదేశమునకు దిరిగివచ్చెను. అప్పుడివియన్నియు (ఆతనియందు కనిపింపక) పోయినవి.

గౌరిపండితుడు చక్కగా వ్యాఖ్యానము చేయగలవాడు. రావణాసురుని తలలనుగూర్చి అవియన్నియు దశేంద్రియములనియు, కుంభకర్ణుడే తమోగుణమనియు రావణుడే రజోగుణమనియు విభీషణుడు సత్త్వగుణమనియు వచించువాడు. విభీషణుడు సత్త్వగుణము గలిగి యుండుటవలననే శ్రీరాముని పొందగలిగెనని యు—ఇట్లు వ్యాఖ్యానములు చెప్పెడివాడు.

మధ్యాహ్నము భోజనానంతరము శ్రీరామ

కృష్ణ గురుదేవుడు విశ్రమించెను. ఆ సమయమున తారక్, రామ్ మున్నగు భక్తులు కలకత్తానుండి వచ్చి శ్రీ గురుదేవునకు నమస్కరించి క్రింద కూర్చొనిరి.

రామచంద్రుడు:—(శ్రీ గురుదేవునితో) మేమెల్లరము మృదంగము వాయించుట నేర్చుకొనుచున్నాము.

శ్రీరామ:—నిత్యగోపాలుడుగూడ నేర్చుకొనుచున్నాడా?

రామ:—లేదు. ఏదో కొద్దిగా వాయింపగలడు; అంతే.

శ్రీరామ:—తారక్ ?

రామ:—చాలవఱకు వాయింపగలడు.

శ్రీరామ:—అట్లయినచో తల వంపనే వంపడే. ఒకవైపునకు సూటిగా తలను త్రిప్పినచో అది భగవంతునివైపునకు అంతగా సూటిమైయుండదు.

రామ:—సంకీర్తనలలో పాడుకొను నుద్దేశముతోడనే నేను నేర్చుకొంటిని.

శ్రీరామ:—('మ.' తో) నీవుగూడ సంగీతము నేర్చుకొనుచున్నావటగా ?

'మ.':—లేదండి, అప్పుడప్పుడు ఊఁ, ఊఁ అనడమే.

శ్రీరామ:—నీకీ పాట అభ్యాసమేనా?—'తల్లీ! నాకిక జ్ఞానవిచారముతో పనిలేదు. నీ జ్ఞానమునందే ఉన్మత్తత కలిగింపుము.'

ఇదియే నా భావము.

తరువాత, హాజ్రా ద్వేషమునుగూర్చి వీరు సంభాషింప దొడగిరి.

శ్రీరామ:—చిన్నప్పుడు కమ్మరి పుష్కరమున తఱచుగా ఒకరింటికి వెళ్లుచుండువాడను. ఆ యింటిలోని బాలురందఱు నాకు సమవయస్కులు. కొన్నాళ్ల క్రిందట వారిచటికి వచ్చి రెండు మూడు రోజులుండిరి. వారి తల్లి యితరుల ద్వేషించెడిది. చివరకు ఆ తల్లి కాలియందు దెబ్బ యెముక తొలగి కాలంతయు క్రుళ్లి దుర్వాసన కొట్టుచుండెను. అందుచేత ఎవరును ఆమెదగ్గరకే పోవువారుకారు. ఈ విషయమును జూపి 'ఎవరిని ద్వేషింపరా'దని హాజ్రాను హెచ్చరించితిని.

సుమారు నాలుగుగంటలయినది. శ్రీ గురుదేవుని గదికి ఆగ్నేయదిక్కున గల వసారాయందు ఒక 'జముకానా' పరచబడియుండెను. శ్రీరామకృష్ణులవారు కాలుసేతులు కడుగుకొని అచటికి వచ్చి కూర్చొనిరి. రామ్ మొదలగు భక్తులుగూడ నచట కూర్చొని వివిధ విషయములగూర్చి ఆలోచించుకొనుచుండిరి. శ్రీరామకృష్ణులవారు వారి మాటలయందు పాల్గొనక మిన్నకుండిరి. సంధ్యకాగనే వాయవ్యమూల గల వసారాకు శ్రీరామకృష్ణ గురుదేవుడు వచ్చి నిలుచుకొని వెంటనే సమాధిస్థుడయ్యెను. చాలసేపటివఱకు బాహ్యస్మృతిరహితుడై యుండెను. ఇటీవల ఆయన మనస్సు సాధారణముగా నిట్లే యుండెడిది. స్వల్ప ఉద్దీపనముతోడనే సమాధి కలుగుచుండెను. భక్తులు వచ్చినచో ఒకటి రెండు మాటలు మాట్లాడుటయు లేనిచో సర్వదా అంతర్ముఖభావముతోడనే యుండుటయు సహజముగా జరుగుచుండెడిది. పూజ, జపాది సాధనలన్నియు ఆచరింపజాలకపోయెను. తన సమాధినుండి బాహ్యస్మృతి కలుగగా నట్లే నిలుచుకొని జగన్మాతతో నిట్లు మాట్లాడ నారంభించెను:

''అమ్మా పూజయు పోయినది, జపమును పోయినది. కాని నన్ను జడమును గావింప

వలదు తల్లీ! సేవ్యసేవకభావమును నాయం దుంచుము. తల్లీ మాట్లాడు శక్తిని నిలుపుము. నీ పేరుచ్చరింపగలుగునట్లొనర్పుము. నీ నామ సంకీర్తనము చేయుదును. తల్లీ గానము చేయుదును. ఈ శరీరమునకు కొలదిగా బలమొసంగుము. అందువలన నాయంతట నేనే అందందు వెళ్లగలుగు శక్తి కలిగియుండి ఎందెందు నీ భక్తులు గుమికూడియుందురో ఎచట నీ విషయము కీర్తింపబడుచుండునో అచటికి నాకు పో వీలుకలుగునుగాక!''

నాటి యుదయము శ్రీరామకృష్ణ గురుదేవుడు దేవీఆలయమునకు వెళ్లి పుష్పాంజలి సమర్పించి యిట్లనియెను: ''తల్లీ నేటి యుదయమున నీ పాదపద్మములకు పుష్పముల నర్పించితిని. ఆ సమయమున 'నాకు బాహ్యాచారములయందు మనసు కలదు గదా'యని తలంచితిని. కాని నాకిట్టి భావ మేల కలిగెను? నన్ను జడముగా నేల చేయుచున్నావు?''

ఈనాడు కృష్ణసప్తమి కావున చంద్రోదయము కాలేదు. రజని తమసాచ్ఛన్నమై యుండెను. ఇంకను శ్రీరామకృష్ణ గురుదేవుడు భావావిష్టుడైయుండెను. అట్లే తనగదిలోనికి వచ్చి చిన్నమంచముపై గూర్చొనియుండెను. మఱల జగన్మాతతో మాటాడదొడగెను.

భక్తుల విషయము దేవితో విన్నవించు నేమో! ఈశాను ముఖర్జీనిగూర్చి మాట్లాడు చుండెను. ఈశానుడు గాయత్రీ పురశ్చరణము చేయుదునని పలికియుండెను. 'కలికాలమున వేదమతము నాచరించుట కష్టము. జీవులందరు నన్నగతప్రాణులు. ఆయుస్సు అత్యంతస్వల్పము. దేహబుద్ధియు విషయబుద్ధియు సంపూర్ణముగా నశింపవు. కాన తంత్రశాస్త్రము ననుసరించి దేవ్యుపాసన చేయుము' అని ఈశానునకు శ్రీ గురుదేవు డుపదేశించియుండెను. 'ఏది బ్రహ్మమో అదియే తల్లి, అదియే దేవి, అదియే ఆద్యాశక్తి' యనియు బోధించియుండెను. భావావిష్టుడై శ్రీరామకృష్ణు డిట్లు పలుక నారంభించెను: 'ఇక గాయత్రీ పురశ్చరణ మెందులకు? ఒక కప్పునుండి మఱియొక కప్పునకు దుముకుటయా? ఒకవేళ తనయిష్టాను సారము చేయుచున్నాడేమో? ఇక్లెవరు బోధించిరి? పురశ్చరణము చేయునట! ('మ.' తో) 'సరియే! ఇదియంతయు బాహ్యాచారమూ లేక ఆంతరంగికమా?

'మ.' ఏమియు ప్రత్యుత్తర మొసగలేదు. ఆతడు ఆశ్చర్యమున మునిగిపోయెను. 'భగవంతుడు మనకు ఇంతటి దగ్గరి వాడా? లోపలను వెలుపలనుగూడ నున్నాడు. ఇంతదగ్గర నుండకపోయినచో ఎట్లు శ్రీరామకృష్ణుల వారిట్లు మాట్లాడగలుగుచున్నారు' అని తలచుచుండెను.



శ్రీ శారదేశ్వరీయైనమః

# ధర్మ పరిశీలన

## వైదిక ధర్మాదర్శములు

శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఈ గీతిక యెప్పుడు వ్రాయబడినదో యెవరికిని తెలియదు; నవీనపండితు లేమిచెప్పినను, 8000 యేండ్ల క్రిందటనో, 9000 యేండ్ల క్రిందటనో వ్రాయబడియుండవచ్చును. ఈ ధార్మికభావములలో నేయొకటియును గూడ అధునాతనమైనదికాదు. అయినను నవి వ్రాయబడినప్పుడెంత నవజీవ వికాసముతో నొప్పుచుండెనో, నేటికిని అంత నవజీవ వికాసముతో నలరారుచున్నవి; కాదు, కాదు; అప్పటికంటె నవ్యతరమైన జీవ వికాసమును కలిగియున్నవని చెప్పవచ్చును. ఏలన, ఆ ప్రాచీనకాలమున మానవుడు మనకీనాడు కనుపడునంతటి నాగరకుడుకాడు. కొంచె మభిప్రాయభేదమున్నంత మాత్రమున, అతడు తనసోదరమానవుని గొంతుకోయుట నేర్చికొనియుండలేదు; స్వీయసోదరునిపాలిటి, రాక్షసుడై, ప్రపంచమును రక్తసాగరమున ముంచియుండలేదు. ఆ నాడాడతడు మానవజాతి పేరుచెప్పి లక్షలకొలది సోదరమనుష్యుల ప్రాణములను దీసియుండలేదు. కనుక, "ఏకమ్ సత్ విప్రా బహుధా వదంతి" అను మాటలు, మున్నగునవి వ్రాయబడినప్పటికంటె నెక్కువ జీవవికాసముతో, చైతన్య ప్రదములైన, దివ్యోత్సాహ కరములైన మహావాక్యములవలె మనలను నేడు సత్కార్యాచరణకు బురిగొల్పుచున్నవి. వేరేదియైనను, హిందూ, బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవాది మతములన్నిటికిని పూజనీయుడైన భగవంతు డొకడేయను విషయమును మనమింకను నేర్వవలసి యున్నాము. వీనిలో నే మతమునైన హేళనచేయువాడు తనదైవమునే నిరసించువాడగును.

ఆ ప్రాచీన మహర్షులకు కుదిరిన పరిష్కారమిది. కాని, యీ యేకేశ్వరభావము నేనింతకుమున్ను చెప్పినట్లు హైందవమనస్తత్వమును సంతృప్తిపఱుపజాలక పోయెను. అది ఈ దృశ్యప్రపంచవైఖరికి సహేతుకమైన సమాధానము నొసగలేదు. జగత్ప్రభువు, అందును ముఖ్యముగ జగత్తునకు వెలుపలనుండు ప్రభువు, జగత్స్వభావమును బోధపఱుచు సమాధానమీయజాలడు. అతడొక నైతికనాయకుడు కావచ్చును, విశ్వమహాశక్తి కావచ్చును. కాని, అది విశ్వమును బోధపఱుచు సమాధానము

కాదు. ఇప్పుడు బయలుదేరు మహత్తరమైన ప్రశ్న యీవిశ్వమునకు సంబంధించినది : "అది యెచ్చటినుండి వచ్చినది? ఎట్లు వచ్చినది? దాని యునికి యెట్టిది?" ఈ ప్రశ్నకు సంబంధించి వివిధములైన ఋక్కులుగలవు. కాని, యీ క్రింది ఋక్కులోవలె అది యే యితర ఋక్కులోను చక్కని కవితాధోరణిలో మహాద్భుతముగ వెలువరింపబడి యుండలేదు :

"అప్పుడు వాయువుగాని, ఆకాశముగాని, మతేమియుగాని లేదు. సర్వ మెందులో నుండెను? సర్వము దేనిపై నాధారపడియుండెను? అప్పుడు మృత్యువులేదు, మృత్యురాహిత్యమునులేదు; దివారాత్రముల మార్పులేదు." అను వాదములో కవితాసౌందర్యమెంతో కొలువడియున్నది. "అప్పుడు మృత్యువులేదు, మృత్యురాహిత్యమునులేదు. దివారాత్రముల మార్పులేదు." సంస్కృతభాషోచ్చారణయందే యెంతో గానమాధురియున్నది. "భగవదస్తిత్వమంతర్భూతమైయుండినట్టి అదియే, ఆ ప్రాణమే, యుండెను; కాని అది చలింపనారంభింపలేదు. అది నిశ్చలమై యుండెను అనునట్టి ఈ భావమును జ్ఞప్తియందుంచుకొనుట మంచిది; ఏలన, ఈభావమే తరువాత విశ్వసృష్టి వర్ణనలో యెట్లు పొడచూపునో, హిందూ వేదాంత, తత్త్వశాస్త్రముల ప్రకార మీ సమస్త విశ్వమునెట్లు కంపన లేక చలనము యొక్క సముదాయము మాత్రమో మనకు విశదముకాగలదు కనుక. ఈ చలన సముదాయము సర్వమును అంతరించి, సూక్ష్మాతి సూక్ష్మస్థితిని బడసి, ఆ స్థితిలోనే కొంతకాలము వరకు నుండును. ఈ ఋక్కులో వర్ణింపబడినది ఆ స్థితియే. ఆ ప్రాణమొకటియే ప్రశాంతమై, స్వయంపోషకమై, చలనరహితమై, కంపనారహితమై యుండెను. సృష్టిప్రారంభమందిది ప్రకంపింపదొడగెను. ఈ ప్రకంపనా ఫలితమే సృష్టియంతయును.

"మొట్టమొదటనుండినది అంధకారము," హిందూదేశమందుగాని, మఱియేయుష్ణదేశమందుగాని యుండి, వర్షఋతు ప్రారంభమును జూచియున్న మీలో నెవరికైనను ఈమాటల యందలి గాంభీర్యము బోధపడగలదు. ఈ దృశ్యమును చిత్రించుటకు ముగ్గురు కవులు చేసిన ప్రయత్నములు నాజ్ఞప్తియందున్నవి. "దృశ్యమానమైన అంధకారమేకాని వెలుతురులేదు"అని ఆంగ్లకవీశ్వరుడుమిల్టన్:"సూదితో భేదింపతగిన అంధకారము"అని మహాకవి కాళిదాసు. కాని, యివియేవియును,"అంధకారమందు మరుగువడిన అంధకారము"అను వేద వాక్యమునకు సరికాజాలవు. సర్వమార్పుకొని పోయి, "చుయ్యి!" "చుయ్యి!" అని యుడికిపోవుచున్నది. కొన్ని దినములవరకు విశ్వమంతయు దహించుకొనిపోవు చున్నట్లు కనుపడుచున్నది. ఇట్లుండగా, నొకనాటి మధ్యాహ్నమున నభోంతరాళమున నొకమూల నణుమాత్ర మేఘమారంభమై, అరగంటలోపున భూమండలము నంతయును గప్పివైచి, కుంభవృష్టిగా వర్షముకురియ దొడగును. పిమ్మట, సర్వమును జలమయమగును. సృష్టికారణము సంకల్పముగ వర్ణింపబడెను. మొట్టమొదట నుండినది సంకల్పముగ మారెను. ఈ సంకల్పమిచ్ఛగా బరిణమింప జొచ్చును. ఈ విషయమునుగూడ మనము జ్ఞప్తియందుంచుకొనవలయును. ఎందుచేత ననగా, మనకున్న సర్వమునకును ఈ యిచ్ఛాభావమే కారణమని చెప్ప

బడుచున్నది. ఈ సంకల్పభావము బౌద్ధ వేదాంతమత సాంప్రదాయములు రెండిటికిని మూలాధారమై, పిమ్మటజర్మను తత్త్వశాస్త్రము లోనికి బ్రవేశించి, షోపెనూర్ తత్త్వమునకు మూలకందమై నిల్చినది. తొలుదొల్త దానిని గూర్చి మనము వినున దిచ్చటనే:

"మనస్సుయొక్క ప్రథమ బీజమగు ఇచ్ఛ మొట్టమొదట నుత్పన్నమయ్యెను.

మహర్షులు జ్ఞానద్వారమున తమహృదయ ములను బరిశోధించి,

సత్తునకును, అసత్తునకునుగల అనుబంధ మును కనుగొనిరి."

ఇది బహు చిత్రవర్ణన. "ఈ విషయము బహుశః వానికి (భగవంతునకు) గూడ తెలి యదు." అని కవి తన వర్ణనను ముగించును. దీని కవితాప్రాశస్త్యమునూట యటుండ, ఈ బుక్కులో విశ్వమునుగుఱించిన ఈ ప్రశ్న ప్రధానస్థాన మాక్రమించుచున్నట్లును, మహో న్నతస్థితి నొందిన యీ మహర్షుల మనస్సులకు సాధారణ సమాధానములు నచ్చుటలేనట్లును, తుద కూర్ధ్వలోకవాసియైన యీ జగత్ప్రభు భావముకూడ తృప్తికరముగ లేనట్లును మనకు విశదమగుచున్నది. ఈజగత్తు సర్వమెట్లు వచ్చిన దను విషయమున నిదేభావముగల వివిధము లైన యితర బుక్కులుగలవు. వ్యక్తిరూపుడగు విశ్వనాథుని వెదకుటకు బ్రయత్నించినపుడు మన మింతకుమున్ను చూచినట్లు, వారొక దేవునితరువాత మఱొక దేవుని దీసికొని, వానిని ఆ పదవికి యెత్తినట్లే, యిప్పుడు వేర్వేరు బుక్కు లలో వారొక భావము తరువాత మఱొక భావమును దీసికొని, దానిననంతముగ విస్త రింపజేసి, యీ విశ్వమందలి సమస్తమునకును కారణభూతముగ నొనర్చిరి. ఒకానొక ప్రత్యేక భావమును సర్వమున కాధారభూతమైన ప్రాపుగా దీసికొనిరి. ఆ ప్రాపే యీసమస్తము నైనది. ఇట్లే, వివిధభావముల విషయమునను వా రీమార్గము ననుసరించిరి. ఈ విధముగ జీవపదార్థమగు ప్రాణము నెడల వారిట్లు వ్యవ హరించిరి. ఆ ప్రాణభావము విశ్వవ్యాప్తమగు వరకు, అనంతమగువరకు, దానిని విస్తరింప జేసిరి. మానవశరీరమునకేకాక, ఆ ప్రాణ పదార్థము సర్వమునకును ఆధారమై యొప్పు చున్నది. సూర్యచంద్రుల కాంతి అదియే, సర్వ మును నడుపు విశ్వకారణశక్తి అదియే. ఈ ప్రయత్నములలో కొన్ని మిక్కిలి సొగసుగను, చక్కని కవితాశైలిగోను నుండును. వానిలో కొన్ని, వివిధాంశములకు మనోహర కవితా శైలిలో అత్యద్భుతముగ చిత్రించును. "అతడు రమణీయప్రభాతమును ప్రవేశపెట్టును" అను వాక్యమును మనము దృష్టాంతముగ గ్రహింప వచ్చును. మనమిప్పుడు చదివియున్నట్లు, సృష్టికి ప్రప్రథమబీజమై అంకురించిన యీ యిచ్ఛనే, మహర్షులు సర్వవిశ్వపూజనీయుడైన భగవాను నిగా విస్తరింపజేసిరి. కాని, ఈ భావము లేవి యును వారిని తృప్తిపఱుపలేకపోయినవి.

(సశేషము)

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,

3-5-'16.

ప్రియ నీ...

నీయొక్క తపాలాకార్డును జదివి చాల సంతసించితిని. నీవు కాశికి వచ్చుచున్నావను మాట ఇంతకుముందే నేను వినియుంటిని. నీ మహదుద్దేశము సఫలము గావలయునని భగవంతుని బ్రార్థించితిని. భగవత్సాక్షాత్కారమే మానవజీవిత ముఖ్యోద్దేశము. ఈ మానవ జన్మమే ఉత్తమోత్తమజన్మము. కావుననే ఈ జన్మముననే భగవత్సాక్షాత్కారము కాగలదు. సకల జన్మములందును ఇంద్రియసుఖముల ననుభవింపవచ్చును. కాని భగవత్సాక్షాత్కారము ఇతరజన్మములలో కలుగజాలదు. దార్శనికుల మతానుసారము సకలదుఃఖనివృత్తికరమగు పరమానందము నందుటయే మానవజీవితోద్దేశము. మతాంతరము లెన్నియున్నను వస్తుతత్త్వము మాత్ర మొక్కటియే. భక్తిమార్గమున భగవంతుడని దేనిని వచింతురో దానినే యోగులు పరమాత్మయనియు, తత్త్వజ్ఞులు బ్రహ్మమనియు వ్యవహరింతురు. కావున భగవల్లాభమన్నను, జ్ఞానమన్నను, ము యన్నను ఇవన్నియు నొకటియే. ఇదియే మానవజీవితమునకు వలయు ముఖ్యలక్షణము. సందియములేదు. నీవు చదివినవాడవు, నీవు మిక్కిలి తెలివితేటలు గలవాడవు కావున అట్టి విషయములలో నీకు ఉత్సాహము కలుగుట వింతగాదు. ఎవడు దేనిని కోరునో దానినే పొందుననుట ప్రకృతినియమము. ఆంతరిక ఆగ్రహము మిక్కిలిగా నున్నచో ప్రార్థిత వస్తువు సులభముగా లభించును. అనురాగ మేర్పడినచో—భగవంతుని బడయనిచో నేను జీవింపజాలనను దృఢభావము కలిగినచో—తప్పక ఆయన దర్శనము కలుగునన్నమాట వినియున్నాడను. ఈ జన్మమునందే ఆ కార్యము ఫలించునట్లు చేయగలిగినచో మనకార్యము సమాప్తమగును. తద్గతాంతరాత్మగా మారవలయును. 'భగవంతునియందే నీవు లయింపవలయును' అని శ్రీరామకృష్ణులవారు వచించెడివారు.

శ్లో. మత్కర్మకృన్మత్పరమో
మద్భక్తః సంగవర్జితః,
నిర్వైరః సర్వభూతేషు
యస్సమామేతి పాండవ. *

-భగవద్గీత, 11-55.

జపధ్యానము లావశ్యకములనుటకు సందియములేదు. కాని వీనివలననే భగవల్లాభము

* పాండవా! నాకొఱకు కర్మముల నాచరించువాడును, నన్నే పరమపురుషార్థముగ తలచువాడును, ధన మిత్ర పుత్రాదులయం దాసక్తిలేనివాడును, నన్నే ఆశ్రయించుకొనియుండువాడును, సర్వజీవులయెడ (తన కత్యంతము అపకార మొనర్చువారియెడగూడ) వైరభావము లేనివాడును అగు వ్యక్తి నన్ను పొందును.

గలుగునన్న నిశ్చయములేదు, ఆయన కృపయే ఆయనను బడయుటకు తగిన ఉపాయము. శ్రీ వివేకానందస్వాములవారు ''అదియేమి, కాయగూరలా, డబ్బిచ్చికొనుటకు. ఇంత జపము, ఇంత తపము చేసినచో ఆయనను పొందగలమని భగవంతునకు విలువ యున్నదా'' యని పలుకువారు. ఆయన కృపకలిగినచో ఆయనను బడయగలము. ఆయన శరణుజొచ్చి పడియున్నచో ఆయన కృప కలుగగలదు. నిన్ను నిరుత్సాహిని గావింప నేనిట్లు పలుకుచుంటిననుకొనబోకుము. జపతపములు చక్కగా అనుష్ఠింపుము కాని, మనఃప్రాణములతో నాత్మసమర్పణ చేసిననే ఈ కార్యములన్నియు సఫలములు గాగలవు. దీనిని బోధించుటయే నా యుద్దేశము. సమస్తమును ఆయనకు సమర్పించి శాంతమనస్కుడవై యుండుము. ఎంత వఱకు ఆయన కభిముఖుడవు కాగలవో అంత వఱకును బొమ్ము. పిమ్మట అంతయు ఆయనయే చేయింపగలడు. అప్పుడప్పుడు నీ కుశలసంభాషణములతో నన్నానందింపజేయుము.

శుభాశీర్వచనములు,

ఇట్లు,

శ్రీ తురీయానంద

మఱియు,

ఆయన శరణము నాశ్రయించియున్నచో యథాసమయమున సకలకార్యములును నెఱవేర్పగలడు. కాని కామనరహితుడవైయున్నచో ఆయన నీయందు మిక్కిలి సంతుష్టుడగును.

శ్రీ. తు.

సాధకులు రెండువిధములుగా ఉందురు. ఒక తరగతివారియందు మర్కటకిశోరన్యాయము (అనగా కోతిపిల్లయొక్క రీతి) వర్తించును. మఱియొక తరగతివారియందు మార్జాలకిశోరన్యాయము (అనగా పిల్లికూనయొక్క రీతి) వర్తించును. కోతిపిల్ల తల్లిని గట్టిగ బట్టుకొనును; అంత దానిని తల్లికోతి ఒకచోటినుండి మఱియొక చోటికి తీసికొనిపోవుచుండును. పిల్లికూన తన తల్లిని పట్టుకొనదు. తల్లి దానిని ఎక్కడ విడిచిన అక్కడనే ''మ్యావు'' మని జాలిపుట్టునట్లు కూయుచుండును. అపుడు తల్లిపిల్లి వచ్చి దాని మెడను నోట గఱచుకొని యిచ్చవచ్చినచోటికి తీసికొనిపోవును. ఈ రీతిగనే జ్ఞానయోగమును గాని, (నిష్కామ) కర్మయోగమును గాని అవలంబించు సాధకుడు ముక్తిపొందుటకు స్వప్రయత్నమువిూదనే ఆధారపడును. ఇక భక్తిమార్గము ననుసరించు సాధకుడు సర్వము దైవాధీనమని గ్రహించి భగవదనుగ్రహమును గోరి పూర్ణవిశ్వాసముతో అతని శరణుజొచ్చును.

—శ్రీ రామకృష్ణ పరమహంస

# శ్రీ వాసుదేవ మననము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

ఇట్లు భగవన్నామజపానుష్ఠాన విషయమున పరివర్జనీయములుగ శాస్త్రప్రతిపాదితములైన దశవిధాపరాధములను మనోవాక్శరీరరూప సర్వవిధములచేతను పరిత్యజించి దశవిధాపరాధ విరహితముగ భగవన్నామమును జేసిన పక్షముననే అది యథేష్టఫలసిద్ధి ప్రదముకాగలదు. న్యాయశాస్త్రమునందు ప్రతిబంధకాభావ విశిష్టత్వకారణముచేతనే కార్యోత్పాదనమునందు సామర్థ్యము అంగీకరింపబడుచున్నది. కనుక భగవన్నామ జపయజ్ఞము యొక్క ఫలము సిద్ధించుటకొఱకు ఉపద్యుక్త ప్రతిబంధకరూప దశవిధాపరాధములను ముఖ్యముగ పరిత్యజింపవలయును. అప్పుడే భగవన్నామ యజ్ఞము యథేష్టఫల సంపాదనమందు సమర్థముకాగలదు. మఱియు భగవన్నామ జపయజ్ఞమే దశవిధాపరాధములకును ప్రాయశ్చిత్తముకూడనై యున్నది.

నవవిధ భక్తిమార్గములలో నొక్కొక్క భక్తిమార్గముచేత నొక్కొక్కరు ఆత్మవిజ్ఞానులై అమృతత్త్వమును పొందిరి. అదెట్లన—
''విష్ణోస్తు శ్రవణే పరీక్షి దభవద్వైయాసకిః కీర్తనే। ప్రహ్లాద స్స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీః పృథుః పూజనే। అక్రూర స్త్వభివందనేచ హనుమాన్ దాస్యేచ సఖ్యేఽర్జునః। సర్వస్వాత్మసమర్పణే బలి రభూత్కైవల్యమేషాంసమం॥''
శ్రీమహావిష్ణు కథాశ్రవణముచేత పరీక్షిన్నరేంద్రుండును, శ్రీమన్నారాయణ గుణకర్మ కీర్తనమున శ్రీశుకబ్రహ్మర్షియు శ్రీహరినామ సంతతస్మరణచేత బ్రహ్లాదుండును, శ్రీగోవింద చరణారవింద సేవనమున లక్ష్మీదేవియు, శ్రీవాసుదేవార్చనముచేత బృథుచక్రవర్తియు, శ్రీమాధవ పాదాభివందనముచేత నక్రూరుడును, శ్రీరామదాస్యముచేత ఆంజనేయుడును, శ్రీకృష్ణునితో మైత్రిచేత నర్జునుడును, శ్రీత్రివిక్రమునకు సర్వాత్మసమర్పణము జేసి బలిచక్రవర్తియు నిర్వాణ సుఖమును బడసిరి. వీరందఱకు భక్తిమార్గములు వేర్వేరైనను కైవల్య మందఱకును సమానమే.

''ఏవం మద్భక్తియుక్తానా మాత్మాసమ్యక్ప్రకాశతే''(అధ్యాత్మరామాయణము3-4-47) ఇట్లు శాస్త్రోక్తప్రకారము నిరంతరము నన్ను (శ్రీరాముని) సేవించు నాభక్తులకు లెస్సగ నాత్మవిజ్ఞానము సిద్ధించును. అని శ్రీరామ వచనము, కనుక 'సాకారం భజతావత్త్వం యావత్తత్త్వం ప్రసీదతి। నిరాకారే పరేతత్త్వే తతః స్థితిర కృత్రిమా॥'' (జ్ఞానవాశిష్ఠము 6-45-35) శ్రీ రామతత్త్వమవగతమగునంత పర్యంతము సాకారగుణాత్మకముగనే శ్రీరాముని సేవించుచుండవలయును. ఆసేవా పరిపక్వదశయందు నిరాకార నిర్గుణ స్వతంత్ర శ్రీరామతత్త్వమునం దకృత్రిమావస్థానము అనగా స్వస్వరూపానుభూతి స్వయముగ సిద్ధించు

నని శాస్త్రసిద్ధాంతము. "భక్త్యావినా బ్రహ్మ జ్ఞానం కదాపి నజాయతే" (మహానారాయణ ఉ॥) భగవంతునియందు నిర్దుష్టమైన భక్తివినా బ్రహ్మాపరోక్షజ్ఞాన మెన్నటికిని సిద్ధించదు. భక్తి జ్ఞాన వైరాగ్య త్రయమునకు అభేదా ధ్యవసాయము శాస్త్రసిద్ధాంతము, "భక్తిః పరేశానుభవో విరక్తిరన్యత్ర చైషత్రిక ఏక కాలః। ప్రపద్యమానస్య యథాశ్నతఃస్యుస్తుష్టిః పుష్టిః క్షుదపాయోఽనుఘాసమ్॥" (భాగ॥ 11-2-42) ఆకలిగొని అన్నముతిన్న వానికి తుష్టి (మనస్సంతోషము) పుష్టి (ఉదరపూర్తియు నందువలన దేహేంద్రియ ప్రాణములకు బలము) క్షున్నివృత్తియు నేకకాలమునందెట్లు కలుగునో అట్లే భగవంతుని అనన్యభావమున శరణు బొంది శ్రద్ధతో సేవించు పరిశుద్ధాత్మునకు పరమేశ్వరునియందు భక్తియు పరేశాను భూతియు పరమాత్మ విలక్షణమైన సకల ప్రపంచమునందు విరక్తియునను నీ త్రికము నేకకాలమునందే సిద్ధించును. అని భాగవతవచనము. భగవంతునియందు భక్తి సిద్ధించుటకు బూర్వము అంతఃకరణము పరిశుద్ధము కావలయును. అంతఃకరణ పారిశుద్ధ్యముకొఱకు వేద విహిత స్వవర్ణాశ్రమోచిత కర్మానుష్ఠానము అవశ్య కర్తవ్యము. వేదోక్త కర్మములను విధ్యుక్తముగ నిర్వర్తించుట మూలముననే అంతఃకరణము పరిశుద్ధమగును. అన్యథా కానేరదు. ఆహేతువుచేతనే అంతఃకరణ శోధన సాధనభూత వర్ణాశ్రమయోగ్య నిత్యనైమిత్తికాది కర్మములు ఫలాభిసంధి రహితముగ పరబ్రహ్మ విచారణకంటె బూర్వ మవశ్యాచరణీయములని విధించి వేదములయందు ప్రథమమున కర్మకాండ ప్రతిపాదింపబడినది. ఇట్లు కర్మకాండ బ్రహ్మజ్ఞాన ప్రాప్త్యుపాయమగు కర్మము నుపదేశించుటవలన బ్రహ్మప్రతిపాదకమే యగుచున్నది. అట్లయినను కర్మకాండ జ్ఞానసాధనము మాత్రమే యగుచు ఆత్మజ్ఞాన మపరోక్షముగ సిద్ధించిన యంతట గర్మము నశించును. ఎట్లన—"ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్ప వినాశనం। జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవినాశనం॥" పుష్పము ఫలమునకు కారణము. ఫలకారణమైన పుష్పము ఫలోత్పత్తిచే నశించును. అటులనే కర్మము జ్ఞానమునకు కారణము. జ్ఞానకారణమైన కర్మము జ్ఞాన సిద్ధిచే నశించును. ఆత్మజ్ఞానమె సాక్షాన్మోక్షైకసాధనము. "జ్ఞానాదేవతుకైవల్యం", "జ్ఞానాన్ముక్తిః" (సాంఖ్యసూ॥)అను నిత్యాది శ్రుతులు జ్ఞానమువలననే కైవల్యప్రాప్తిని చెప్పుచున్నవి. "బ్రహ్మోడుపేన ప్రతరేతవిద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని॥" (శ్వేత॥ ఉ॥ 2-8) సకలశాస్త్ర పారంగతుడైన విద్వాంసుడైనను ఆత్మాపరోక్షజ్ఞానమనెడి తరణి సాంగత్యముననే సంసారరూప సకల మహాభయంకర ప్రవాహములను సంపూర్ణముగ తరింపవలయును. "బోధోఽన్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైకసాధనం। పాకస్య వహ్నివత్ జ్ఞానం వినామోక్షో నసిద్ధ్యతి॥" (ఆత్మబోధ 2) బియ్యము జలము పాత్రలు కట్టెలు మున్నగు పరికరములెన్నియున్నను వహ్నివినా వంట సిద్ధము కానివిధమున బ్రహ్మజ్ఞానము వినా మోక్షము సిద్ధించదు. కర్మరూప సాధనములన్నింటికం టెను ఆత్మవిజ్ఞానమే సాక్షాన్మోక్షైకసాధనము. "సర్వేషామేవ జ్ఞానానా మాత్మజ్ఞానం పరం స్మృతం। తద్ధ్యగ్రియం సర్వవిద్యానాం ప్రాప్యతేహ్యమృతంతతః॥" (మనుః 12-85) సర్వవిద్యలకును ప్రధానమగుటవలన వేదాభ్యాసాది సర్వవిద్యలలోను ఉపనిషదుక్త పరమార్థ

జ్ఞానము ప్రకృష్టమని తలంపబడినది. అది సకల విద్యలకు ప్రధానమైన ఆది విద్యయే. అది యవగతమైనయంతట అమృతత్త్వసిద్ధి ధ్రువము.

అందువలన ముముక్షువులు బ్రహ్మాభిన్నమై ఆత్మయందధిష్ఠించిన మాయచే గల్పింపబడిన బంధహేతువగు సర్వద్వైత బంధముయొక్క నిరసనముకొఱకు బ్రహ్మాత్మజ్ఞానమునే సంపాదింపవలయును. ఆజ్ఞానము వేదాంత వాక్యార్థ విచారణాయత్తమగుటవలన శాస్త్రాచార్యోపదేశముచేత తద్విచారణమే కర్తవ్యము, కనుక "తపోభిః క్షీణపాపానాం శాంతానాం వీతరాగిణాం। ముముక్షూణా మపేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే॥" (ఆత్మబోధ). తపోభిః=ఈజన్మమునందుగాని జన్మాంతరమునందుగాని ఫలాభిసంధి రహితముగ సమనుష్ఠిత వేదచోదిత నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠాన రూప తపస్సుచేత క్షీణపాపానాం =నశించిన రాగద్వేషాద్యంతఃకరణ వృత్తులు గలవారును, శాంతానాం = స్వధర్మ నిర్వహణమువలన అంతఃకరణము మాలిన్యమును విడిచి పరిశుద్ధమగుటవలన సంకల్ప వికల్పాది క్షోభలుడిగి ప్రశాంతమైయున్న యంతఃకరణముగల వారును, వీతరాగిణాం = అసత్యత్వ బుద్ధిచే నైహికాముష్మికార్థఫల భోగమునందనురక్తినిబాసి వానియందు సక్తులుగాని పరమ వైరాగ్య సంపన్నులును అగు ముముక్షూణాం = మోక్షకాంక్షగల బుభుత్సువులకు, అపేక్ష్య = వాంఛనీయమగు, అయం ఆత్మబోధః=వక్ష్యమాణ వాసుదేవ మననము, విధీయతే=ఉపదేశింపనగుచున్నది.

'వాసుదేవమననము' అనగా—'వాసుః'= వసత్యస్మిన్ సర్వమితివసుః, సర్వత్ర వసతీతివా వసుః, 'వసురేవవాసుః' = సకల ప్రపంచము ప్రత్యగభిన్నపరమాత్మయం దంతర్భూతమై యుండుటవలనను, సమస్త ప్రపంచమునందు సర్వాత్మకత్వముతో పరమాత్మ పరిపూర్ణముగ ననుస్యూతమై వ్యాపించియుండుటవలనను, పరమాత్మ 'వసుః' అని చెప్పబడును. 'వసుః' అన్నను 'వాసుః' అన్నను ఒకటే అర్థము. దేవః = కాలత్రయేఽపీతరాన పేక్షయాఽఖండ చిదాత్మనా స్వయమేవ దీప్యతే ప్రకాశత ఇతి దేవః=తేజోవస్త్వంతర నిరపేక్షముగ నిత్యమఖండ చిన్మాత్రరూపమున కాలత్రయము నందు స్వయముగనే ప్రకాశించు సదాత్మ 'దేవః' అనబడును. 'వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవ సర్వజగత్కల్పనాధారభూతం బ్రహ్మేత్యర్థః'='వాసుదేవః' అనగా సర్వజగత్కల్పనమునకు ఆధారభూతమైన అద్వితీయాఖండైకరస సచ్చిదానంద ప్రత్యగభిన్నపరమాత్మ యని యర్థము.

ఈ యర్థమునందు ప్రమాణము.—"సర్వత్రాసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః అతస్స వాసుదేవేతి విద్వద్భిః పరికీర్తితః॥" (విష్ణు. పు. 1-2-12) పరమాత్మ సమస్త ప్రపంచమునందు స[illegible]కత్వముతో పరిపూర్ణముగ వ్యాపిం[illegible] సర్వాంతర్యామియై ప్రత్యగాత్మరూపమున నిత్యము ప్రకాశించుచుండుటచేతను, మఱియు సకలప్రపంచము నిశ్శేషముగ, బీజరూపముతో బీజమునం దంతర్భూతమైయుండు వృక్షమువలె పరమాత్మరూపముతో పరమాత్మయం దంతర్భూతమై యుండుటచేతను పరమాత్మ 'వాసుదేవుడ'ని తత్త్వవిదులచేత వర్ణింపబడుచున్నాడు—అని విష్ణుపురాణ వచనము. "తత్త్వం బ్రహ్మణి యాథార్థ్యే"—తత్త్వమన పరబ్రహ్మము— యాథార్థ్యము నని కోశము, "స్వరూపే [illegible]ను

దేవస్య వ్యక్తంచావ్యక్తమేవచ। అవ్యక్తం బ్రహ్మణోరూపం వ్యక్తమేవ చరాచరం॥'' వాసుదేవ పరబ్రహ్మస్వరూపము వ్యక్తావ్యక్తముగ రెండువిధములు. వ్యక్తము సగుణము. అవ్యక్తము నిర్గుణము. వాసుదేవుని వ్యక్తరూపునిగ దెలియునపుడు సర్వదృశ్యప్రపంచమును అతని విభవమే యగుచున్నది. ''సర్వాత్మనా స్థితం బ్రహ్మ సర్వం బ్రహ్మాత్మ నాస్థితం। నకార్యం కారణాద్భిన్నమితి వేదాంతడిండిమః॥'' కారణ కార్యములకు అభేదాధ్యవసాయము కనుక కారణమైన పరబ్రహ్మము అఖిలప్రపంచాత్మకుడును, కార్యమైన సకలప్రపంచము పరబ్రహ్మాత్మకమును అగును. ''క॥ హరిమయము విశ్వమంతయు। హరివిశ్వమయుండు సంశయము పనిలేదా। హరిమయముగాని ద్రవ్యము। పరమాణువులేదు పరమపావన వింటే॥'' (భాగవతము) అనెడి శాస్త్రవచన ప్రకారము పరమేశ్వరుని తేజఃపుంజ ప్రసారము లేని ప్రదేశము అణుమాత్రమైనను లేదు. వాసుదేవుని అవ్యక్తరూపునిగ దెలియునపుడు కేవల సచ్చిదానంద పరబ్రహ్మమే యగును. ఇట్లు వాసుదేవుడన పరబ్రహ్మమని శాస్త్రనిరూఢము. 'మననము' అనగా 'మన జ్ఞానే' అనెడి ధాత్వర్థము ననుసరించి జ్ఞానమని యర్థము. కనుక వాసుదేవమనన మనగా బ్రహ్మవిద్య. అట్టి బ్రహ్మవిద్యను బోధించునది యగుటచేత నీ గ్రంథము సైతము వాసుదేవ మననమని ప్రసిద్ధము.

బ్రహ్మజ్ఞాన సంపాదనమునకు ప్రయోజన మేమి?

''అసంగోహ్యయం పురుషః'' (బృ. 6-3-15.) దేహేంద్రియాది సకలప్రపంచ సంబంధ రాహిత్యమువలన పరమాత్మ కాలత్రయము నందును అసంగుడే. ''మాత్రాఽసంసర్గస్త్వస్య భవతి'' (బృ. 6-5-14) మాత్రలు అనగా 'మీయంతే జ్ఞాయంతే ఆభిః ఇంద్రియైః శబ్దాది విషయాః ఇతిమాత్రాః' శబ్దాదివిషయములు ఇంద్రియములచేత నెఱుంగబడుచున్నవి కనుక నింద్రియములకు మాత్రలని సంజ్ఞ. నశ్వరములగు దేహేంద్రియాది ప్రపంచముతో అసంసర్గః = సంసర్గరాహిత్యము, తు = అందువలన నిత్యత్వమును, అస్యభవతి = ఈ ప్రత్యగభిన్న పరమాత్మకు సిద్ధము. ఆచార్య సాన్నిధ్యమును వేదాంత శ్రవణాదికము మూలముననే ఆ బ్రహ్మజ్ఞానము లభించును. బ్రహ్మజ్ఞానమునకు మోక్షప్రాప్తి అనగా మోక్షరూప పరమపురుషార్థమే ఫలమని సిద్ధము. ''బ్రహ్మవిదాప్నోతిపరమ్॥'' (తై. 2-1) బ్రహ్మజ్ఞాని పరమపదమును బొందుచున్నాడు. బ్రహ్మప్రాప్తి యన బ్రహ్మసాయుజ్యము అనగా బ్రహ్మభావమే. ''సయోహవై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి॥'' (ముం. ఉ. 3-2-9) పరబ్రహ్మవిదుడు పరబ్రహ్మస్వరూపుడే యగుచున్నాడు. ''జ్ఞానం లబ్ధ్వాఽచిరాదేవ మామకం ధామ యాస్యతి॥'' (ముక్తిక. ఉ. 27) ఆత్మజ్ఞానము సిద్ధించుటతోడనే ఆత్మజ్ఞుడు అవ్యవహితముగ స్వారాజ్యము నధిగమించును. స్వారాజ్యమన- ''స్వేనైవరాజత ఇతి స్వరాట్, స్వరాజో భావః స్వారాజ్యం'' అలుప్త స్వయంప్రకాశ చిద్రూపమగుటవలన పరబ్రహ్మము స్వరాట్ అనబడును. స్వరాట్ యొక్క భావము స్వారాజ్యము. స్వభావైక నిష్ఠత్వమని యర్థము. ''అథాఽకామయమానో నిష్కామ ఆప్తకామ ఆత్మకామో। నతస్యప్రాణా ఉత్క్రామ్యంత్యత్రైవ సమవలీయంతే బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి॥'' (బృ. 6-4-6) కోరికలు లేనివాడు,

కోరికలు జీర్ణమైనవాడు, పొందబడిన కోరికలు గలవాడు, ఆత్మకాముడు అనగా బాహ్యాంతరములంతయు పరమ ఆత్మభావమును పొంది యున్న తనకంటె నన్యమైన వస్త్వంతరము ఎవనికి లేదో అట్టి స్వభావైకనిష్ఠుడు నగు బ్రహ్మజ్ఞానియొక్క ప్రాణములు ఉత్క్రమించుటలేదు అనగా స్వర్గాదిలోకాంతరములకు బోవుటలేదు. సర్వాత్మక పరబ్రహ్మమునందు లీనమై ఐక్యమును బొందును. బ్రహ్మజ్ఞాని స్వయంబ్రహ్మమే యగుచు స్వాభిన్నముగ బ్రహ్మమును బొందుచున్నాడు. "అన్యవిద్యాపరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్। బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం స్థితమ్॥" (శుకరహస్య. ఉ. 2-14) బ్రహ్మవిద్యావిలక్షణమైన ప్రాపంచికవిద్యలన్నియు ననిత్యములగుటంజేసి తత్పరిజ్ఞానమున నిత్యమే కనుక నిశ్చయముగ నశించునదే యగును. బ్రహ్మవిద్యాపరిజ్ఞానమన్ననో నిత్యమై పునరావృత్తిరహితమగు పరబ్రహ్మప్రాప్తిని గలుగజేయునదియై యుండును. "తేషాం న పునరావృత్తిః॥" (బృ. 8-2-15) బ్రహ్మజ్ఞానులకు పునరావృత్తి సంభవములేదు. "ఇమం మానవ మావర్తం నావర్తంతే॥" (ఛాం. 4-15-6) 'ఆత్మజ్ఞానులు మనోసృష్టిలక్షణమైన జనన మరణ ప్రబద్ధ సంసారావర్తమందు మఱల ప్రవేశింపరు' అను నిత్యాది శ్రుతులు బ్రహ్మజ్ఞానసిద్ధివలన, అవిద్యా ప్రతిబంధ వినాశపూర్వకముగ పరబ్రహ్మానందావాప్తియు నంతట నాత్యంతికముగ సంసారాభావమును ఫలముగ ప్రతిపాదించుచున్నవి కనుక బ్రహ్మజ్ఞానమునకు బ్రహ్మప్రాప్తి సిద్ధాంతభూతమే.

బ్రహ్మప్రాప్తి యనగా—జీవుడు బ్రహ్మమే కాని తద్భిన్నుడుకాడు. ఇట్లుండ జీవునకు బ్రహ్మప్రాప్త్యయోగము అనగా బ్రహ్మప్రాప్తి కుదరకపోవుటలేదు. యథార్థముగ జీవబ్రహ్మములకు అభేదము ఐక్యము సహజమైయుండగా, జీవునకు బ్రహ్మప్రాప్తి యెటుల గలుగునని శంకింప బనియేమి? అట్లు శంకింప బనిలేదు. ఏలయన జీవునకు గలిగెడి బ్రహ్మప్రాప్తి, ప్రాప్తప్రాప్తియెగదా! అదెట్లన లోకమునందు 'అప్రాప్తప్రాప్తి' యనియు, 'ప్రాప్తప్రాప్తి' యనియు ప్రాప్తి రెండువిధములు. ఇందు 'అప్రాప్తప్రాప్తి' యన ఒకపురుషుడు అమలాపురమను గ్రామమునుంచి బయలుదేరి ముక్తేశ్వరమను గ్రామమును జేరుట 'అప్రా. ప్రాప్తి' యని చెప్పబడును. 'ప్రాప్తప్రాప్తి' యన "జానంతినైవం హృదయేస్థితం వై చామీకరం కంఠగతం యథాజ్ఞాః॥" (అధ్యాత్మరామాయణము, 1-1-20) తనకంఠమునందున్న చామీకరమును నిజకంఠమునందుండుట మఱచి లేదనెడి భ్రాంతిని పొంది యందందు వెదకి యెక్కడను గానకయుండ గొంతవడికి సమీపస్థుడైన ఆప్తుని బోధనమువలన ఆ భ్రాంతి తొలగి యంతట చామీకరమును తనకంఠమునందే యున్నదానినిగ గ్రహించి యది తన కంఠమునందే యుండుటను సాక్షాత్తుగ దెలిసికొనును. భ్రాంతివశమున అప్రాప్తమువలెనున్న తనమెడలోని చామీకరము ఆ భ్రాంతినివృత్తిమాత్రముచేత నూతనప్రాప్తమువలెనుండును. దీనినే 'ప్రాప్తప్రాప్తి' యని వ్యవహరించెదరు. ఇందు భ్రాంతినివృత్తిమాత్రమే ప్రాప్తి వ్యవహారము కాని యంతకంటె వేఱు కాదు.

(సశేషము)

# వినయ పత్రిక

మూలం :
శ్రీ తులసీదాస గోస్వామి

అనువాదం :
క్రాంతికర్

(గతసంచిక తరువాయి)

## ౧౪౧

ఓ ప్రభూ!

నే నెచటి కేగుదును? దుఃఖితులు, దీనులు నగువారి కెచట స్థానముగలదు? అన్ని విధముల యసమర్థులైనవారి కభయమివ్వగల నీ వంటి దయాళు డెవరుగలరు? ధనవంతులు, గుణవంతులునగు వారిని జేరదీయు యజమానులెందఱో గలరు. వారికిని వారిసేవయే మంచిదిగా దోచును. కాని, నిర్ధనులు, గుణహీనులు, సోమరులునగు వారిని బాలించుట రామచంద్రుని కొక్కనికే యలంకారము. ప్రవీణుడవగు నో ప్రభూ! నేను నోటితో ఏమని చెప్పను? నీవు హృదయము నెఱుగుదువు. నావంటి మలిన మనస్సుగల వానికి మూడుకాలములందును, మూడులోకములందును నీ వొక్కడవే యాశ్రయము.

## ౧౪౨

నేనేమి చేయలేదు? ఎచటి కేగలేదు? ఎవరికి నమస్కరింపలేదు? ఓ రామచంద్రా! నీ సేవకుడను గాకముందు ప్రపంచమున జన్మమెత్తి అన్నివైపుల దుఃఖమునే నేననుభవించితిని. నీ ప్రధానసేవకుడనయ్యు ఆశకువశుడనై నీచులగు యజమానులకు నాగోడు వినిపించుచు వచ్చితిని. 'అయ్యో, అయ్యో' యనుచూ నింటింటికి తిరిగితిని. నోరు దెఱచితిని కాని ఇంత దుమ్ముగొట్టినవాడుగూడ లేడు. కూడుగుడ్డ లేక పిచ్చివాడనై ఎక్కడెక్కడో తిరిగితిని. ప్రాణాధిక ప్రియమగు నభిమానమును విడిచి క్షణక్షణము దుష్టులయెదుట కడుపుజూపితిని. లోభము నన్నెంతో యాసపెట్టినది. కాని నాచేతి కందినదేదియు లేదు. నేను నిజము చెప్పుచున్నాను. లజ్జాహీనుడనగు నన్ను తుచ్ఛమగు పేరాస యాడించనియాట యేమిగలదు? చెవులు, కన్నులు, మనస్సు తమతమ పనులయందు నిమగ్నమైయున్నవి. నేనేమో రాజులందఱ బరీక్షించితిని. చివరకు తలబాదుకొని, హృదయమున నోటమి నంగీకరించి నీచరణముల శరణుజొచ్చితిని. ఓ దశరథపుత్రా! నీవే సమర్థుడవు. లోకమున నీకీర్తియే వ్యాపించినది. తులసీదాసు నీయెదుట తలవంచి నిలబడినాడు. వీనివైపు జూడుము. నీ బిరుదావళి నా కభయమొసంగి పిలిచినది.

## ౧౪౩

శ్రీరామచంద్రా!

నీవుగాక నాకు నిజమైన హితు డెవరు? నేను

నీతో జెప్పుచునేయున్నాను. ఇతరులతోగూడ జెప్పుచున్నాను. దీనినివిని, గ్రహించి మరియొక విధమున తెల్పగలుగుచో జూచెదను. దేహమును, జీవుని పురస్కరించుకొని యేర్పడిన బంధుత్వములు క్షణభంగురములు. ఆలోచించిన సారహీనమగు నరటిబోదెవలె నవి నిస్సారములు. మణికాంచన సంయోగమున గాజుపూసయు ప్రకాశించును. ఓ తండ్రీ! నాయీ వినయపత్రికను నీవే స్వయముగ జదువుము. ఈ తులసీదాసు తన హృదయమున జూచి వ్రాసిన దీనిని నీస్వభావము ననుసరించి స్వీకరింపుము. అపుడు నీ యైదుగురు సదస్యుల నడుగుము.

౧౪౪

ఓ హనుమంతా! ఓయి శత్రుఘ్నుడా! ఓయి భరతుడా! ఓయి సౌమిత్రీ! మీమీయవకాశమునుబట్టి ఈ దీనుని గురించి శ్రీరామచంద్రునకు జ్ఞాపకము జేయుడు. అట్లు సేయుటవలన మీ యాంతరంగిక సేవకుడగు నీ తులసీదాసుని మనోరథ మీడేరగలదు. భక్తులు, మహాత్ములు నగు వారి విషయమును రాజదర్బారున నందఱును బాగుగ జెప్పుకొందురు. కాని మీరీ నిరాశ్రయునిపై దయజూపినచో ఈతని కభయము లభ్యమగును. మీకును పుణ్యము, కీర్తిదక్కును. మీ ప్రభువు ప్రసన్నడగును. మీస్వార్థము, పరమార్థముగూడ సమకూడును. సమయముజూచి ఈ పతితుని స్థితిని జక్కపరచుడు. భక్తవత్సలుడు, దయానిధుడునగు శ్రీరామచంద్రునకు పరాధీనుడగు నీ జీవుని ప్రేమపద్ధతి యొక్క పరాకాష్ఠను వివరింపుడు.

౧౪౫

హనుమంతుని, భరతుని యభిరుచిని గుర్తెఱిగి లక్ష్మణుడు శ్రీరామచంద్రునకు విన్నవించెను—"స్వామీ! ఈ కలియుగమున గూడ మీసేవకుడొకడు మీ నామము నెడ ప్రేమ, విశ్వాసముగలిగి జీవించుచున్నాడు". ఇందుమీద సభయంతయు నేకకంఠమున లక్ష్మణునివాక్యముల ననువదించినది—"అవును, మే మాతనిప్రేమ పద్ధతి నెఱుగుదుము. అందఱము జూచుచుండ మీ రా దీనుని స్వీకరించుట దీనబంధువగు మీకే చెల్లినది." అపుడు శ్రీరామచంద్రుడు చిరునవ్వునవ్వి చెప్పెను—"అవును, నిజము. నాకాతనివిషయము దెలిసినది." తులసీదాసు చెప్పునదేమన—వినయపత్రికపై రామచంద్రుడు దన చేవ్రాలుచేయుటచే నీదీనుని కోరిక నెఱవేరినది. అపుడు నేను ప్రసన్నుడనై రామభద్రునకు నమస్కరించితిని.

శ్రీ రామార్పణమస్తు

# అంతర్దృష్టి

శ్రీ అయ్యదేవర వేంకటసుబ్బారావు

(మే సంచిక తరువాయి)

ఆ-వె. దేహస్పర్శగల్గి ఽ దేవునియెరుగను; యత్నముండియుండ ఽ యమమెయగును
మొసలి తెప్పగాగ ఽ మోసంబు నదిలోన; దీని తెలియువాడు ఽ ధీరుడగును 10

ఆ-వె. ఉల్లిపొరలలోన ఽ నున్నట్టియుత్పత్తి; యుల్లిపొరలుపోవ ఽ నున్నయట్లు
మాయ పొరలలోన ఽ మహిమంబుగలదయా; దీని తెలియువాడు ఽ ధీరుడగును 11

ఆ-వె. కర్మచేయశుద్ధి ఽ కలుగును చిత్తంబు, తత్వబుద్ధియెల్ల ఽ తనకుగలుగు
తత్వమెరిగియుండ ఽ తాను దేవుడుగదా; దీని తెలియువాడు ఽ ధీరుడగును 12

ఆ-వె. కర్మవలన తనకు ఽ కలుగును బంధంబు; కర్మపీడగానె ఽ కలుగు ముక్తి
దూరదృష్టి యతులు ఽ దునుమిరి కర్మలు; దీని తెలియువాడు ఽ ధీరుడగును 13

ఆ-వె. జ్ఞాన తృప్తినొంది ఽ జ్ఞానియెయోగాన; వితతసిద్ధిపొంది ఽ వ్రతమునలుపు
చేయతగినదాని ఽ చేయగవలయును; దీని తెలియువాడు ఽ ధీరుడగును 14

ఆ-వె. ఆత్మ మాయచేత ఽ నాచ్ఛాదనంబట్లు; తానుదేహమందు ఽ తగిలియుండ
కామరోషములివి ఽ కారణబంధాలు; దీని తెలియువాడు ఽ ధీరుడగును 15

ఆ-వె. సర్వసంగమువిడి ఽ సంతసించియు లోన; దేహినంచు తాను ఽ తిరిపమెత్త
ఆశగాదె నిదియు ఽ నాలకించినలోన; దీని తెలియువాడు ఽ ధీరుడగును 16

ఆ-వె. సప్తజలధులీద ఽ సాధ్యంబెయగుగాక; పర్వతంబుచేత ఽ బట్టుగాక
మనసులేకయుండు ఽ మార్గంబు కష్టంబు; దీని తెలియువాడు ఽ ధీరుడగును 17

ఆ-వె. సరిగ తెలిసిచేయ ఽ సాధన సులభము; మనసు చక్కబెట్టు ఽ మార్గమునకు
మనసు చక్కబెట్టు ఽ మార్గంబు తెలియుము; దీని తెలియువాడు ఽ ధీరుడగును 18

ఆ-వె. జగతు సత్యమేని ఽ సౌషుప్తియందున; తెలియకుండుటెట్లు ఽ తేటగాను
స్వప్నదృశ్యమాను ఽ స్వయమున చర్చింప; దీని తెలియువాడు ఽ ధీరుడగును 19

ఆ–వె. భోగవిషయమందు ꣻ భోగించు మనసది; బ్రహ్మజేరితాను ꣻ బ్రతుకకుండు
బ్రతికియుండియున్న ꣻ బ్రహ్మకభేదంబు; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 20

ఆ–వె. ఉప్పు కరగి నీట ꣻ నుదకంబ యగురీతి; ఆత్మయందు మనసు ꣻ నడగుచుండు
ఆత్మయందు కలిసి ꣻ యాత్మయె తానగు; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 21

ఆ–వె. ప్రత్యగాత్మయందు ꣻ ప్రబలినభావంబు; జ్ఞానయుక్తమగుచు ఘనతకెక్కి
లోన నీశుగాంచి ꣻ లోకంబు మరచును; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 22

ఆ–వె. కొయ్య యేనుగెక్కి ꣻ కొట్టినా కదలదు; కఱ్ఱయగుటవల్ల ꣻ కరియుగాక
జగతురూపుగాను ꣻ భగవాను డిట్లుండె; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 23

ఆ–వె. ఘటముగాంచ మృత్తు ꣻ గానుపించిననాడు; ఘటముపోవ మార్పు ꣻ గలుగకుండు
జగతు ఉండిలేక ꣻ భగవానుడే యుండె; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 24

ఆ–వె. పాలయందువెన్న ꣻ ప్రాప్తించి యది మరి; పాలయందె యుండి ꣻ కలయకుండు
జగతునందలి హరి ꣻ జగతులో కలియడు; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 25

ఆ–వె. వేదసార మెరిగి ꣻ వేదాంతములకెల్ల; అర్ధమెరుగవలయు ꣻ అసలు తెలిసి
శ్రవణమనగ నిదియె ꣻ శ్రమజేసిమెరుగను; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 26

ఆ–వె. అర్థమెరిగియుండి ꣻ అద్వైతపరమున; శంకలేమి లేక ꣻ సరిగనుండ
మననమగును గాదె ꣻ మాయయే లేకను; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 27

ఆ–వె. విషయవాంఛలేవి ꣻ విస్తరింపకనుండి; నిశ్చయంబుచేత ꣻ నిజము తెలియ
నీకె యగునుగాదె ꣻ నిజము నిధిధ్యాస; దీని తెలియువాడు ꣻ ధీరుడగును 28

ఆ–వె. తనదు ఛాయయందు ꣻ తన ప్రతియందున; స్వప్నమందుతోచు ꣻ స్వగతియందు
స్థూలదేహమందు ꣻ పాలనయొక్కటే; దీని తెలియువాడు ꣻ ధీరుడగును. 29



# అక్క మహాదేవి

శ్రీ టి. లక్ష్మీనరసింహారావు, బి. ఎస్ సి.

పంద్రెండవ శతాబ్దపు చివరి దినములకు ధార్మికేతిహాస జగత్తున దక్షిణదేశ మత్యున్నత స్థాన మందినది. ఉపనిషత్తు లాధ్యాత్మికోన్నతికి తోడ్పడినట్లు నాటి శైవభక్తులును వారి జీవితములును వారి కృతులును ఆధ్యాత్మిక తత్త్వానుస్థాన మహోన్నతిని ప్రకటించినవి. ఆత్మోత్క్రాంతికి మరుభూముల శుష్కవాదములతో వెదుకులాడుటకన్న సమన్వయ యోగమార్గము నన్వేషించి ఆ మార్గముననే తత్సాధనకు జీవనమును వినియోగించుటయే యోగ్యమని నాటి శైవభక్తులు గ్రహించిరి. ఇట్టి సమన్వయ సిద్ధాంతమునకు బసవన్న, అక్కమహాదేవుల వంటివారి జీవితము లాదర్శములు. హైందవ దివ్యయోగుల జీవితసంపుటి నవలోకించిన, స్త్రీల సంఖ్య అత్యల్పముగా కాననగును. మనుశాసన మనేక మన్వంతరములు జూచుచు, 12 వ శతాబ్దమునాటికి కొంచెము విశ్రాంతి నందినది. కాని, నేడా శాసనమును పరీక్షింపవలసిన కాలము వచ్చినది. వేదకాలపు గార్గి, మైత్రేయి మొదలగువారు తిరిగి పుట్టవచ్చు, పుట్టుదురను నిశ్చయమేర్పడినది. వీరశైవ మహోన్నత తత్త్వములకు సార్వత్రిక స్వరూపమును కలుగజేయుటకు "అనుభవమంటపము" స్థాపింపబడినది. ఈ అనుభవమంటపము సంఘమునందలి స్త్రీ, శూద్రుల బంధనములను పరిహరించెడి మహత్తర కార్యమునకు తోడ్పడినది. ఆధ్యాత్మిక ప్రగతిలో, స్త్రీ ఎట్టి ఉన్నత పదవికైనను రాగలదని చెప్పుటకు మహాదేవి అక్క ఆధ్యాత్మికజీవనమే నెలవు. ఐతిహాసిక నాయికాపాత్ర కాదీ యక్క—చారిత్రక సుప్రసిద్ధమగు యోగజీవి, నారీరత్నము. రాజపుత్రస్థానమున 'మీరాబాయి', ద్రావిడదేశమున 'ఆండాళ్' ల వలె ప్రియ-ప్రేయసీభావమున పరమాత్ముని సాధించిన ముగ్ధభక్త—జీవన్ముక్త. ఆత్మకు స్త్రీ పురుష విభేదము లేదని కనుగొని నారీహృదయములందు నూతన ధైర్య చైతన్యబీజములను నాటిన దీ సాధ్వి. ఈమె సాధనయందలి సాహసము—జీవనమందలి ఉచ్చ ఆదర్శము—ఇట్టి యాదర్శ సాధనయం దీమె చూపిన ధైర్య స్థైర్యములే—

ఆధ్యాత్మికేతిహాసమున ఈమెకు ఉచ్చస్థానమాపాదించినవి. మైసూరు దరిదాపుల నుండిన నొక చిన్నరాజ్యమునకు షిమోగా ముఖ్యపట్టణము. షిమోగాకు చేరువనున్నది ఉడుతడి గ్రామము. ఈ కుగ్రామమున సుమతీ-నిర్మలులు బీదకుటుంబమునకు చెందిన శైవ దంపతులు. వీరు సదా శివార్చనలు సలుపుచు ఈశ్వరీ ప్రసాదమున నొక పుత్రికను బడసిరి. ఈమెయే అక్క, లేక లేక కల్గిన పుత్రికారత్నము, శైవశిఖామణి. ఆనాటి కానాడు అక్కకు బాల్యము జారి, యౌవన మంకురించినది. దివ్యకుసుమము లలితసౌందర్య సారళ్యమున యోగవాసనలతో వికసించుచున్నది. పెండ్లీడు ప్రాప్తమైనది. తగిన వరుని జూచి తమ ముద్దుల

పట్టికి పెండ్లిచేయవలయునని సహజాందోళన బయలుదేరి, తల్లిదండ్రుల హృదయములు తల్లడిల్లుచున్నవి. అక్కమహాదేవియు వైరాగ్య భావముతో సాక్షాత్పరమశివుడే తనకు అచ్చు మెచ్చిన భర్త యని యా పరమాత్మునికే తన్ను సమర్పించుకొని తన సర్వస్వమును నర్పించిన మెచ్చులాడి. ఒకనా డా పట్టపురాజు వేడుక వేటకై అడవులకు పోయి తిరిగి వచ్చునప్పుడు దివ్యయోగోద్దీపిత, సకలాంగ సుందరాంగి, యక్కను జూచి వలపుటాసలచే చుట్టబడి శృంగార కారాగార బంధితుడయ్యెను. ఎట్లైనను ఆమెను పెండ్లాడవలయునని నిశ్చయించి తన మనోరథమును అక్క తల్లిదండ్రుల కెఱుక చేసెను. అది ఎట్లు పొసగును? వీరశైవవనిత, అక్కమ్మ, జైనుడు రాజు. ఇట్టిసమయములో అక్కమ్మ తలిదండ్రుల కేమిచేయుటకు తోప కున్నది. వికలమనస్కులై విచారించుచుండిరి. తమకూతురు చెన్నమల్లికార్జునస్వామిని పతిగా వలచినదని వారి కెఱుకయే. అటు రాజుగారి యభీష్టము నెరవేర్పకపోయిన, ఎట్టి ముప్పు వచ్చునో యని తటపటలాడుచుండిరి. ఇంతలో అక్క వారి విషమావస్థను జూచి, తన ఆధ్యాత్మిక ప్రగతికి అనువగు సౌకర్యములు కల్గించి తన ధర్మాగ్వేషణకు అంతరాయములు కల్గింప కున్నచో తప్పక కౌశికరాజును వివాహమాడుదు నని చెప్పినది. రాజును మోహపాశబద్ధుడై అక్క వాగ్దత్తములందలి గుప్తార్థము లు గ్రహింపక—స్త్రీ — అబలక దా? ఆమెను నా యధీన మందుంచు కొనుట ఎంతటి కార్యము అని తలచి, ఆమె యొప్పందములకు సరి యని యొప్పుకొని కళ్యాణమాడెను. కొద్దినాళ్లకే రాజు ముమ్మారు ధర్మపత్ని ధర్మ పరిశీలన కంతరాయములు కల్గించెను. అక్కయు పతిని పరిహరించినది. ఆమె ఆధ్యాత్మికవీధి నిరాటంకమైనది, నిష్కంటకమైనది. ఉత్సాహముతో శ్రీశైలమల్లికార్జునునికై ప్రేమ తప మారంభించినది. ఇంతటితో, మహాదేవి ఐహికావస్థ ముగిసినది.

అక్కమహాదేవి యౌవనప్రాయముననే తన ఆధ్యాత్మికజీవనమునకు పునాదులు గట్టినది. ఆమె పట్టిన చేయి మహారాజు కౌశికునిది. సకల భోగభాగ్యములు ఆమెవి. మెచ్చికోరిన పరిచారకులు. తన గుణ రూపముల కనువగు పతి. తాను నవయౌవనభరిత. జీవితాస్వాదన మును జూచిన రమణి. ఐహికభోగభాగ్యోన్నత శిఖరమునెక్కి దాని అల్పతను, నిమ్నతను గ్రహించినది. ఆకాశమునంటు మధుర మీనాక్షి గోపురమును జూడనివాడు తన గ్రామమందలి వినాయకమంటపమే ఎత్తైన గోపురమని గ్రహించునట్లు, తాను మోసపోతి నని తన మౌఢ్యమును తెలిసికొన్నది. కౌశికుడు శివభక్తుడు కాకపోయినను మహాదేవి ఆతని అనన్యభక్తిప్రేమలకు మెచ్చి వలచి వరించినది. రాజు కేవల కాముకుడు. మహాదేవి ఒప్పంద ముల కొప్పుకొనియె కే గాని ఆ ప్రతినలో కొంచె మైనను శ్రద్ధలేకపోయినది. మహాదేవిని తన లౌకికజీవనసౌఖ్యమునకు లాగును. ఆమె నిశ్చల భక్తికి భంగమొనరించును. ఆమె సంయమ మును తిరస్కరించును. తనయొక్క తన ప్రపంచముయొక్క ఏ పారమార్థికోత్కర్షను సాధింప జేయకోరి ఆమె వివాహమాడినదో, ఆ వివాహము నిష్ఫలమైనది. జీవనమందు జిహాస పుట్టినది. దినదినము తన మాయాబంధన జిజ్ఞాస తీక్షణమౌచున్నది. ఈ కృత్రిమజీవన మందు హితవులేక, తన గురువు ప్రభువుల యన్వేషణ కాయత్తురాలైనది. కన్న తలి

దండ్రులు, కట్టుకొన్న భర్త, బంధువులు ఐశ్వర్యములు పదవులు తుచ్ఛములుగ, నీచములుగ కాన్పించిన వామెకు. ముందున్న పారమార్థిక పదవి తప్ప వేరొక్క తెరువు ఆమెకు కన్పించుట లేదు. దేహమందలి యాసక్తి నానాటికి సన్నగిల్లినది. సకలోపాధులను నిరాకరించి విషయోపభోగములను జయించుటయే పరమార్థసాధనకు మొదటి మెట్టుగా గ్రహించినది.

స్త్రీలకు లజ్జాదిగుణములు సహజములు. మహాదేవి జీవితము ఘనము. లింగరహితము, భోగరహితము, ఉపాధిరహితము. తాను ఘనమై ఘనులలో కలసి మెలగువరకు ఆ ఘన మహత్వ మామెకు తెలియలేదు. మహాదేవి తన లింగజ్ఞానమును మఱచినది. పేరునకు అబలయైనను, వాస్తవ భావప్రపంచమున పురుషసింహము అని చెప్పికొనగలిగినంత పరిపక్వమైన దామె మనస్సు.

''ఉట్టి సీరెయ సెళెదు,
తొట్టి తొడిగెయ హరిదు,
బిట్టినో నాను బిడుముడియయెలే దేవ!
కొట్టినో ఎన్నతనమనవ''

(ఓ దేవా! కట్టిన పుట్టము వదలితిని, తొడిగిన తొడవులు త్రోసివేసితిని, తల విరియబోసికొంటిని, నా తనువు నా హృదయము నీ కర్పించితిని) అని నిర్మమతతో ఉద్ఘాటించినది. విలోభమును కల్గించుచున్న నగరమును వదలి, అడవుల పట్టినది. అంతఃకరణ చతుష్టయము నందలి మొదటి ఉపాధి మనస్సు అక్కడను గూడ ఆమెను వీడదాయెను.

''ఒడల కళవళక్కాగి అడవియహొక్కె,
గిడుగిడు దప్పదె బేడిదెన్నంగక్కెందు,
అవు నీడిదవు తన్నులింగక్కెందు,
ఆనుబీడి భవియాదెను,
అవు నీడి భక్తరాదవు,
ఇన్ను బేడిదె నాదరి చన్నమల్లికార్జునయ్య
నిమ్మాణి''

అని దృఢప్రతిజ్ఞ చేసినది.

ఆత్మప్రవృద్ధికి ప్రపంచము - ప్రాపంచికసుఖములు అపాయకరములని గ్రహించినది. ఆమె ధర్మపథమునుబట్టి ముందుకుబోవుకొలదిని ఆటంకము లెదురొచ్చుచునే యున్నవి. శరీరమునకు నీడవలె, ప్రాణమునకు మనస్సువలె—మనస్సునకు జ్ఞప్తివలె ఈ ఆటంకములు వచ్చుచునే యున్నవి. మాయాప్రభావము సామాన్యులకు తెలిసికొన నలవికాదు. పరమాత్ముడు మాయాచ్ఛాదితమై వెలుగుచున్నాడు.

''యోగికి యోగిణి యాగిత్తు
సవణిగి సవణి యాగిత్తు
యతిగి పరాకి యాగిత్తు''

యోగికి యోగిని మాయ, సవణునకు సవణి మాయ, యతికి అభిస్తుతి మాయ —అనిచెప్పుచు మాయాప్రభావమును క్రోడీకరించినది. సకల మాయలకు మనస్సే ప్రధానమని, అట్టి మనస్సునందలి మాయను పూర్తిగ పోగొట్టుకొని శివ శరణ్యమును పొందువరకు ముక్తిలేదని గ్రహించినది.

'నాకు ఉన్నది ఒకే మనస్సు. అది నీ కర్పించితిని ఓ దేవ! తిరిగి నాకు ఐహికజీవనము నొసగెదవా!' అని భగవంతుని వేడికొని

ఆమె ప్రాపంచికత్యాగమునకు ఎట్లు తహతహ లాడుచున్నదో చూడుడు—

"హావిన హల్లకళిదు హావనాడిసబల్లరె,
హావిన సంగవే వేసుకండయ్యా,
కాయద సంగవే వేసుకండయ్యా"

(కోరలు తీయని పాము నాడించునప్పుడు, పాముతో సహవాసమే సరియైనది. కోరికలను కట్టిపెట్టి, శరీరమును కష్టపెట్టనప్పుడే శరీరమందలి మమత సరియైనది).

మానవశరీరమే పరమాత్ముని కాలయము. జీవముతోనున్న దేవాలయము. మానవుడు తన భౌతిక, అతీంద్రియదృష్టులచే పరమాత్ముని తెలిసికొనగలుగుచున్నాడు అని చెప్పినది. ఈ విధముగ అక్కమహాదేవి ఊరు వదలి అడవిని జేరి పరమశివుని వచనరూపమున సంబోధించి, శివసాక్షాత్కారమును బడసి, శివైక్య మొందినది.

ప్రేమయే ప్రియదర్శనమునకు మార్గమైనది. ప్రేమయే మహాదేవి దైవము. ఆ ప్రేమమార్గమునవే తన చెన్నమల్లికార్జునుని చూచినది, కూడినది. ఆత్మానుభవమును ఘనతవహించి, శివశరణుల శ్రేణిని చేరినది. ఆదర్శజీవితముతో జీవించి ప్రపంచమునకు ఆదర్శమైనది. కర్మకాననమున అంధతతోనున్న లోకమునకు, నూతనధైర్యమునిచ్చి, ఆశ కల్పించి, మార్గమును చూపి తన జన్మసాఫల్యము చేసికొన్నది మహాసాధ్వి,

బరువుగనున్న తక్కెడసిబ్బి క్రిందికి బోవును, తేలికసిబ్బి పైకెగయును. మనుష్యుని మనస్సు ఈ తక్కెడదండివంటిది. దాని కొడుకలపై రెండు భిన్నవిషయములు తమ ప్రాబల్యమును జూపుచుండును: ఏవనగా, (1) సంసారమునందును కీర్తిగౌరవాదులందును ప్రీతియు, (2) వివేక వైరాగ్యములును, భగవద్భక్తియును. మొదటిది బరువయ్యెనా, మనస్సు (తక్కెడదండి వలె) సంసారము వైపునకు మొగ్గును; భగవంతునికి ఎడమై పోవును. రెండవది బరువయ్యెనా, చిత్తము భగవంతుని వైపునకు మొగ్గి సంసారమునకు దూరమగును.

—శ్రీ రామకృష్ణ పరమహంస

# శ్రీ వివేకానంద సంభాషణలు
## (శరత్‌చంద్ర చక్రవర్తి దినచర్యనుండి)

అనువాదకుడు :
శ్రీ పిన్నింటి సుబ్బారావు

[భారతదేశమునకు నేడు ఉపన్యాసములతో పనిలేదు, నిర్మాణాత్మకమగు కృషి యవసరము—భారతదేశముయొక్క అత్యవసర సమస్య ఆహార సమస్య—యువకులకు సన్యాసదీక్ష యిచ్చి, వివిధ సాంకేతికవిద్యల తోబాటు, యాధ్యాత్మికవిద్యయందుగూడ పండితులుగా శిక్షణ యిచ్చి, మానవసేవకులుగా తయారుజేయవలయును. మానవసేవ చేయుమని యువకుల కుద్బోధనము]

శిష్యుడు:—స్వామిజీ, తమరీదేశమునం దుప న్యసించరేమి? అమెరికా, యూరఫ్ ఖండ ములను తమ యుపన్యాసములచే నుఱ్ఱూత లూగించితిరి, కాని యిచటికి తిరిగి వచ్చి మౌనమును వహించితిరి.

స్వామిజి:—ఈ దేశమునందు క్షేత్రము ను మొదట సరిదిద్ది, బీజమును నాటిన, మొక్క నవ్యకాంతులతో వృద్ధిపొందగలదు. పాశ్చాత్య ప్రపంచమున, ఐరోపా, యమె రికాలు, క్షేత్రము సారవంతముగా నుండుటచే, బీజమును నాటుటకు తగి యున్నవి. ఆ ఖండములు, భోగముయొక్క పరమావధిని అధిగమించినవి. భోగము లను పూర్తిగా అనుభవించి, తృప్తిని పొందియు, ఆ భోగానుభవములచే వారు శాంతిని బొందజాలక, శాంతిని బొందు టకై యింకను ఏదియో కావలయునని కోరుచుండిరి. ఈ దేశములో భోగము శూన్యమే, యోగము శూన్యమే. భోగ తృప్తియైనగాని, యోగ ధర్మము లను గ్రహించుటకును, ఆచరించుటకును సమ ర్థుడుగాడు. రోగములకు, దుఃఖములకు, బాధలకు నిలయమై, ప్రజలు తినుటకు తిండిలేక, బలహీనులై యున్న భారతదేశ ములో ఉపన్యాసము లేమి చేయగలవు?

శిష్యుడు:—అది ఏలాగున? మనది మత సంబంధమగు దేశమనియు, అన్నిదేశ ములకంటెను, ఇచ్చటి ప్రజలు మతవిష యములను సులభముగా గ్రహింపగల రనియు తమరు సెలవిచ్చియుంటిరిగదా. తమ గంభీరోపన్యాసములచే, ఆ ఫలితము లనుభవమునకు వచ్చునట్లు దేశమును మఱల చైతన్యవంతముగా ఏల చేయ రాదు?

స్వామిజి:—మత మనగా నేమియో తెలిసి కొనుము. అవతారములకెల్ల ఆది కూర్మావతారమైనట్లు, క్షుద్దేవతను మొదట ఆరాధించవలయును. ప్రజల కీ యాప్సి తము తృప్తిచేసినగాని, నీ మతప్రసంగముల యం దెవ్వరును శ్రద్ధవహింపజాలరు. ఈ క్షుద్దేవతనుగూర్చి భారతదేశ మాందోళన మును పొందుచున్నది. అమూల్యములగు సంపదల నపహరించు పాశ్చాత్యుల దోపిడి విధానము, అంతులేని ఎగుమతి విధానము, పరతంత్రులకు సహజమగు అసూయత, భారతదేశముయొక్క అస్తిమాంసము లను తినుచున్నవి. మొదట నీవెవ్వరికి మతము నుపదేశించదలచితివో, యా ప్రజలు అన్నమో రామచంద్రా యను క్షుద్బాధను అపనయించవలయును. లేనిచో, నీ మతబోధలవలన ఇంచుకేనియు లాభముండదు.

శిష్యుడు:—తమ స్వసుఖమును త్యజించి, యితరులకై ప్రాణమునైనను అర్పించుట యందు వెనుదీయని త్యాగశీలురగు యువ కుల కొందరిని తయారుచేయవలయును. ఈ యుద్దేశముతోనే నొక మతమును స్థాపించితిని. వారిని అచ్చట 'తరిఫీదు' చేసి, యింటింటికిని బంపి, కళ్లకు గట్టినట్లు వారి దుఃస్థితిని వారికి దెలియునట్లు జెప్పి, యా స్థితినుండి ముక్తిగాంచు మార్గముతోబాటు, వాడుక భాషలో, అతిసుగమముగా, ఆధ్యాత్మిక భావములనుగూడ ప్రచారము జేయించ వలయును. భారత ప్రజానీకము నేడు నిద్రించుచున్న మొసలిని బోలియున్నది. ప్రస్తుత కళాశాలవిద్య నూటికి ఇద్దరికి మాత్రమే యందుబాటునందున్నది. వీరు గూడ తమ మాతృదేశమునకు తగు సేవ జేసి ధన్యులు గాలేకుండిరి. కాని యిది పాపము వారి దోషముగాదు. కళాశాల విద్య పూర్తియగుసరికి, వా రనేక బిడ్డలకు దండ్రులై యుండుట తటస్థించుచున్నది. ఏదోవిధముగా, యొక గుమాస్తాగిరియో, లేక తీవ్రయత్నముచే, ఏ డెప్యూటీ మేజస్ట్రేటు పదవియో లభించుచున్నది. ఇది విద్యయొక్క చరమఫలితము: సంసార భారముచే, ఏదైనను ఘనకార్యమును జేయుటకుగాని, దీర్ఘాలోచనయందు నిమగ్నుడగుటకుగాని యదను చిక్కకున్నది. వారి సహజవాంఛల తృప్తికై తగు సాధన సంపత్తిలేక పెక్కు ఇడుమలబడుచున్న వారినుండి, పరోపకార మెట్లు వాంఛింతుము ?

శిష్యుడు:—అయితే మనకీ స్థితినుండి విముక్తి గాంచు తరణోపాయము లేదా ?

స్వామిజి:—తప్పక గలదు. ఇది శాశ్వతము లగు మతధర్మములకు నిలయమగు దేశము. దేశము పతితస్థితియందున్నమాట సత్యము. కాని యది మఱల ఉన్నతస్థితిని బొంద గలదు. ఆ మహోన్నతి ప్రపంచమునకు దిగ్భ్రమ గలిగించగలదు. కెరటము ఎంత లోతుగా బోవునో, యంత తీవ్రముగను, ఉన్నతముగను పునరుత్థితమగుచుండును.

శిష్యుడు:—భారతదేశము మఱల ఎట్లభ్యున్నతిని బడయగలదు ?

స్వామిజి:—నీవు చూడలేదా ? తూర్పు విను వీధిని తెలవారుచున్నది. సూర్యోదయము త్వరలో నగుచున్నది. కాలచక్రము నను సరింపుము. ప్రపంచమునే ముఖ్యముగా

నమ్మి, నా సంసారము, నా సంసారమని తల పోయుటవలని లాభమేమి? భారతదేశము నందొక ప్రాంతమునుండి, మఱియొక ప్రాంతమునకును, ఇంటింటికిని ద్రిమ్మరి, సోమరిగా గూర్చుండుటవలన ఇంకేమి యును లాభము లేదని గ్రహించునట్లు ప్రచారము చేయుము. వారి ప్రస్తుతస్థితిని వారికి దెల్పి, సోదరులారా! మేల్కాంచుడు. ఇంకెంతకాల మీరీతి నిద్రించెదరు? వారీ దుఃస్థితినుండి ఎట్లుద్ధరింపబడుదురో బోధించి, మతసూక్ష్మములను సులభ శైలిలో అవగాహనమగునట్లుద్బోధింపుము. ఇంతవఱకు బ్రాహ్మణులు మత ధర్మములను స్వధర్మముగా గ్రహించిరి. ఇక వారు కాలమున కెదురీత యీదలేదు గాన, భారతీయులందరా సత్యము లను గ్రహించు మార్గముల నరయుము. బ్రాహ్మణులకే గాక, యందరకును మతమునందు హక్కుగలదని నచ్చజెప్పుము. అందరకును, హరిజనులకు సహితము, సమస్త మంత్రము లను ఉపదేశింపుము. అర్థమగు భాషలో వారికి, జీవితావసరములను, వర్తక, వ్యాపార, వ్యవసాయాది విషయములను, మర్మములను దెలియజేయుము. ఈ రీతిగా జేయలేనిచో, నీ విద్యను, విజ్ఞానమును, నీ వేద, వేదాంత పాండిత్యమును త్యజింపుము.

శిష్యుడు:—కాని మనయందా శక్తి ఏది? స్వామిజి, తమకున్న శక్తిలో నాకు శతాంశ మున్నను, నేనెంతో యదృష్టవంతుడనని భావించుకొందును.

స్వామిజి:- ఎంత తెలివి తక్కువ! శక్తి, సామర్థ్యములు తమంతట తామే సమకూరగలవు. కృషి యొనర్పుము. శక్తి తనంతట నదే గల్గి, చివరకు దానిని భరించుటగూడ భారమని గ్రహించగలవు. ఇతరులనుగూర్చి యెంత యల్పముగా కృషియొనర్చినను, నీయందు శక్తి మేల్కాంచుట దెలియ గలవు. ఇతరుల మంచినిగూర్చి యెంత యల్పముగా దలపోసినను, క్రమక్రమముగా నీయందు సింహబల ముత్పన్నము కాగలదు. మిమ్ముల నెల్లరను సర్వదా ప్రేమించు చుందును. మిమ్ములనందరను, మానవసేవ యందనువుల బాయుడని గోరుచున్నాడను. మీరందరీవిధముగా ఆచరించిన చూచి సంతోషించెదను.

శిష్యుడు:—అయితే, నాపై నాధారపడి యున్నవారి గతి యేమి?

స్వామిజి:—నీ వితరులకొఱకై నీ జీవితమును ధారపోయుటకు సిద్ధముగానున్ననాడు, భగవంతుడు విధిగా వారల క్షేమమునకై యేదియో మార్గాంతరమును జూపించక పోడు. శ్రీకృష్ణభగవానుడు గీతయందు "నహి కల్యాణ కృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి" "ఓ నా ప్రేమాస్పద! ధర్మము నాచరించువాని కెన్నటికిని మనోవిచారము గలుగబోదు" అని వినియుండలేదా.

శిష్యుడు:—నిజము, స్వామి.

స్వామిజి:—ముఖ్యమైనది త్యాగము. త్యాగము లేనిచో, మానవుడు హృదయపూర్వకముగా మానవసేవ జేయజాలడు. త్యాగపురుషుడొక్కడే సర్వమానవులను సమముగ జూడగలడు, సేవను జేయగలడు. మన వేదాంతముగూడ అందరి మానవు

లను సమానముగా జూడవలయునని యుప దేశించుటలేదా? అట్లగుచో, ఇతరుల కంటె నీ ఆలు బిడ్డలయం దెక్కువ మమకారము నేల చూపుచున్నావు? నారాయణస్వరూపుడగు దరిద్ర మానవుడు నీ పాదముల ఎదుట ఆకలిబాధచే మృతి నొందుచున్నాడు. వానికేదైన దినుటకు పెట్టక, నీ ఆలు, బిడ్డలను రుచికరము లగు నాహారములతో ఏల తృప్తిపరచుచున్నావు? ఇది పశుధర్మముగాదా!

శిష్యుడు:—మానవసేవ చేయుట కప్పుడప్పుడు కొంత ధనముగూడ గావలసియుండును. అది ఎందుండి వచ్చును?

స్వామిజి:—నీ శక్తిలోపము లేకుండా నీవేల కృషిచేయరాదు? నీవు లేమిచే ధర్మమును జేయజాలనిచో, వారికి కొన్ని మంచి విషయములను, లేదా కొంతవఱకు విద్యనైనను గరపనేరవా? దీనికిని ధనము గావలయునా?

శిష్యుడు:—అయ్యా, యిది నేను జేయగలను.

స్వామిజి:—కాని నేను చేయగలను అనినంతలో ఏమియును లాభములేదు. నీవు చేయగలిగినదేదియో, యాచరణయందు జూపుము. అప్పుడు నీవు నన్ను దర్శించుటకు వచ్చుటవలన గొంత మంచి గలిగినదని గ్రహింతును, నడుముగట్టుము, కాలము ననుసరించి పొమ్ము. ఈ జీవిత మెంతకాలముండును? ఈ ప్రపంచమునందు నీవుద్భవించుటచే, కొంత మంచిని ఇచ్చట జేసి పొమ్ము. లేనిచో నీకును, వృక్షములకును, పాషాణములకును వ్యత్యాసమేమి? అవి గూడ జన్మించి జీర్ణమై నశించిపోవును. నీవు వానివలె జనించి, మరణింపదలచినచో నీ యిష్టమువచ్చినట్లు చరింపుము. మానవ సేవ జేసి, నీ వేదాంతపఠనము సఫలమైనట్లు నీచర్యలద్వారాఋజువు జేయుము, వెళ్లుము. ఎల్లరయందును భగవదంశ గలదని ప్రకటించి, దానినిబహిర్గతమొనర్చుటకుయత్నింపుము. నీవొక్కడవే మోక్షమునుబొంది ఏమిచేయుదువు? అది స్వార్థముకంటె వేరుగాదు. నీ ధ్యానమును, నీ మోక్షమును బహిష్కరింపుము. నేనుపదేశించిన కర్తవ్యమును హృదయపూర్వకముగా నాచరింపుము.

స్వామిజి, యీరీతిగా గంభీరముగా నుపన్యసించుచుండగా, ఆ శిష్యుడు నిశ్చేష్టుడై వినుచుండెను.

స్వామిజి:—మొదట క్షేత్రమును సరిచేయుము. మతోపన్యాసము లిచ్చుటకై కాలవాహిని యందు వేలకొలది వివేకానందు లుద్భవింపగలరు. ఈ విషయములో నీవాదుర్దా నొంద నవసరములేదు. అనాథ శిశు శరణాలయములను, క్షామ నివారణాది కార్యములను నేనెందులకు స్థాపించుచుంటినో, నీవు చూచుచుండుటలేదా? ఆంగ్లేయవనిత యగు సోదర నివేదిత, కడునీచములగు కార్యములనుగూడ, అసహ్యించుకొనక, ఎట్లు చేయుచున్నదో నీవు చూచుచుండుట లేదా? నీవు భారతీయుడవైయుండియు, నీ సోదర భారతీయుల కీరీతి సేవచేయజాలవా? ఎచ్చ టెచ్చట ప్లేగు, కఱవులుగలవో, యెచ్చట ప్రజలు ఇడుమలను బడుచు

న్నారో యచ్చటచ్చటికిబోయి వారి బాధల నపనయింపుడు. బహుశా ఆ పవిత్రకార్యమునందు మీ రసువులను బోగొట్టుకొనవచ్చును. ఐననేమి? నీవలె ఎందరుజనించి, కీటకములవలె మరణించుచున్నారు? చివరకు ప్రపంచమున అందువలనగలుగు వ్యత్యాసమేమి? నీవు మరణింపక తప్పదు. ఒక గొప్ప యాదర్శమునకై మరణింపుము. జీవితమునందు ఒక యాదర్శమునకై చనిపోవుట మహోత్కృష్ట ధర్మము. ఇంటింటికిబోయి, యీ గొప్పఆదర్శమును బోధింపుము. మాతృదేశమునకు సేవజేయుచుండుటచే నీవుగూడ లాభమును పొందగలవు. దేశముయొక్క భావి భాగ్యోదయము నీపై నాధారపడియున్నది. సోమరిగా నీవు జీవించుచుండుట జూచి చాల విచారించుచున్నాను. కృషిచేయుటకు యత్నింపుము. కృషిచేయుట కాలసింపకుము. అహోరాత్రములు మృత్యుదేవత, నీకొఱకై నిరీక్షించుచున్నది, సోమరిగా గూర్చుండకుము. ఈ రీతిగానున్న, ఏదియును నెరవేరదని తెలిసికొనుము.



# సంఘవారలు

## శ్రీ రామకృష్ణమఠ సేవాసంఘ నూతనాధ్యక్షులు

క్రీ. శ. 1949 సంవత్సరము మార్చి 31-వ తారీఖు మొదలు శ్రీరామకృష్ణమఠ సేవా సంఘములకు ఉపాధ్యక్షులుగ నుండిన పూజ్యపాదులు శ్రీమత్ శంకరానందస్వాములవారు కీ. శే. శ్రీ విరజానందస్వాములవారి మహాసమాధ్యనంతరము 1951 జూన్ 19-వ తారీఖున శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములకు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

వీరు 9 మార్చి 1880 వ సంవత్సరమున జననమందిరి. శ్రీమత్ బ్రహ్మానందస్వాముల వారికి ప్రియ శిష్యులై శ్రీవారికి యెంతో శుశ్రూష గావించియున్నారు.



# గ్రంథస్వీకారము

## ప్రపంచ మతములు

రచయిత : శ్రీ నిర్వికల్పానందస్వామి. డబుల్ క్రౌన్ 1/16 సైజు (120 + 8)పుటలు. వెల : రూపాయిన్నర. వలయువారు జాతీయ విజ్ఞానమందిరము 5 ఎ, మాౘ్రేబేన్ రోడ్డు, రాయపేట, మద్రాసు అని వ్రాయవలయును.

## శ్రీ శుకుఁడు

రచయిత : శ్రీదాసశేషుడు. డబుల్ క్రౌన్ (62 + 4) పుటలు. వెల : రూ 0-12-0. వలయువారు సాధన గ్రంథమండలి, తెనాలి అనిగాని శ్రీరామనామ క్షేత్రము, గుంటూరు అనిగాని వ్రాయవలయును.

## యథార్థవిచారము

రచయిత : శ్రీ మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రి. డబుల్ క్రౌన్ 1/16 సైజు(68 + 12) పుటలు. వెల : రూ 0-10-0. వలయువారు, మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రి, బ్రహ్మజ్ఞానమందిరము, ఆళ్లగడ్డ అని వ్రాయవలయును.

## పరమార్థతత్త్వము

రచయిత: శ్రీకుందుర్తి వేంకట నరసయ్య; డబుల్ క్రౌన్ 1/16 సైజు (54-8) పుటలు. వెల : రూ 0-12-0. వలయువారు, శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య, సాధన గ్రంథమండలి, తెనాలి అని వ్రాయవలయును.

## ఇనుప కోట

రచయిత : కవికొండల వేంకటరావు, డబుల్ క్రౌన్ 1/16 సైజు (232 + 4)పుటలు. వెల : రూ 2-8-0. వలయువారు, కవికొండల వేంకటరావు, బి.ఏ.బి.యల్. ఇన్నీసుపేట, రాజమండ్రి, తూర్పుగోదావరిజిల్లా అని వ్రాయవలయును.

## శ్రీ రామానుజదర్శనం

రచయిత : శ్రీ. కె. సచ్చిదానందమూర్తి, ఎం.ఏ. పిహెచ్.డి. డెమ్మి 1/24 సైజు 214 పుటలు. వెల : రూ 0-12-0 వలయువారు, శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల (P.O.) గుంటూరు జిల్లా అని వ్రాయవలయును.

## కబీరు సూక్తులు

రచయిత : శ్రీరామకృష్ణ బ్రహ్మచారి, డెమ్మి 1/24 సైజు 112 పుటలు. వెల : రూ. 0-6-0 వలయువారు, శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల (P.O.) గుంటూరు జిల్లా అని వ్రాయవలయును.

## మానవహిత సందేశము

రచయిత : శ్రీ బాలానందస్వామి.

అనువాదకులు శ్రీసోలస బాపనయ్య,బి.ఏ.,బి.ఎల్.

డబుల్ క్రౌన్ 1/16 సైజు (100 + 8) పుటలు. వెల: రూ 1-0-0. వలయువారు, దారిద్ర్యనివారణ సేవాలయము, రాజమండ్రి అని వ్రాయవలయును.



# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3–4–0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసారప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3–0–0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2–8–0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1–12–0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1–4–0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |
| గురూపదేశములు | ... | 0 | 8 | 0 |
| నాసంస్కరణ యుద్ధవిధానము | ... | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | ... | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | ... | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | ... | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | ... | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | ... | 0 | 1 | 0 |
| నా మతము 0 0 6 | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన 0 0 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంత కేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

## శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ బుతజానందస్వామి; శ్రీ వెములమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానంతస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-7-51.

Vol. VIII—I (July 1951)    Sri Ramakrishna Prabha    Regd. No. M—4635

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు    సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము    వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు  శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు  (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము)  రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు    (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము)    వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు    (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము)    వెల రూ. 1-4-0

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | 2 | 8 | 0 | గురూపదేశములు | 0 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | 2 | 4 | 0 | నాసంస్కరణ యుద్ధవిధానము ... | 0 | 6 | 0 |
| రాజయోగము | 2 | 4 | 0 | నా గురుదేవుడు ... | 0 | 6 | 0 |
| కర్మయోగము | 1 | 8 | 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | 0 | 4 | 0 |
| భక్తియోగము | 1 | 4 | 0 | నవీన భారతదేశము ... | 0 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 | ముక్తిమార్గము | 0 | 3 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | 0 | 3 | 0 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 4 | 0 | శ్రీ రామనామ సంకీర్తనము ... | 0 | 1 | 0 |
| వివేక సూర్యోదయము ... | 1 | 0 | 0 | యతిగీతము (పద్యకావ్యము) ... | 0 | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 | నా మతము 0 0 6 డజను | 0 | 5 | 0 |
| భక్తిమార్గము ... | 0 | 8 | 0 | సింహగర్జన 0 0 6 డజను | 0 | 5 | 0 |
| షికాగో నగరోపన్యాసములు ... | 0 | 8 | 0 | | | | |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

---

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్స్ లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి
శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-7-51.

# శ్రీ రామకృష్ణ ప్రభ

౧౯౫౧, ఆగస్టు—ఖర, శ్రావణము

సంపుటము ౮ సంచిక ౨







శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు
చెన్నపురి

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౧ – ఆగష్టు : : ఖర – శ్రావణము { సంచిక ౨


## ప్రార్థన

మోహన రాగము — ఆది తాళము

పల్లవి

బాల గోపాలకృష్ణ పాహి పాహి

అనుపల్లవి

నీలమేఘశరీర నిత్యానందందేహి

చరణములు

1. కలభ సుందర గమన కస్తూరిశోభితానన
నలినదళాయతనయన నందనందన
మిళిత గోపవధూజన మీనాంకకోటిమోహన
దళిత సంసారబంధన దారుణవైరి నాశన

2. యజ్ఞ యజ్ఞ సంరక్షణ యాదవవంశాభరణ
యజ్ఞఫల వితరణ యతిజనశరణ
అజ్ఞాన ఘనసమీరణ అఖిలలోక కారణ
అజ్ఞానదళితావరణ వేదాంత వాక్యప్రమాణ

3. వ్యత్యస్తపాదారవింద విశ్వవందిత ముకుంద
సత్యాఖండ బోధానంద సద్గుణబృంద
ప్రత్యస్తమితభేద కంద పాలితసంద సునంద
నిత్యద నారాయణతీర్థ నిర్మాలనంద గోవింద.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వర మందిరమున భక్తులతో శ్రీరామకృష్ణుడు

బుధవారము,

26 సెప్టెంబరు, 1883.

బుధవారమున చాలవఱకు అందఱికిని పనులుండుటవలన భక్తులు తక్కువగనే వచ్చుచుందురు. నేడు 'మ.' కు బడియందు ఒంటిగంట తరువాత సెలవు దొరకినందున మూడు గంటలకు దక్షిణేశ్వరమందిరమును జేరెను. కొన్నిదినములనుండియు రాఖాలు, లాటు శ్రీరామకృష్ణునియొద్దనే వసించుచుండిరి. రెండుగంటలకు పూర్వము కిశోరుడుగూడ వచ్చిచేరెను. శ్రీరామకృష్ణ గురుదేవుడు తనగదిలో చిన్నమంచముపై గూర్చొని యుండెను. 'మ.' వచ్చి నమస్కరించి యుపవిష్టుడయ్యెను. ఆతనిగూర్చి కుశలప్రశ్నము గావించిన పిదప శ్రీ గురుదేవుడు నరేంద్రుని విషయమును చర్చింప గడంగెను.

శ్రీరామ:—('మ.' తో) "ఏమోయ్! నరేంద్రుని జూచితివా? (నవ్వుచు) నరేంద్రుడు నన్నుగుఱించి యిట్లుపలికెనట 'ఈయన ఇంకను కాళికాలయమునకుబోయి పూజాదులు గావించుచున్నాడు. సమస్తమును పరిపూర్ణమయినంతనే దేవాలయగమనము నాపివేయును'."

"అపుడపుడు నాకడకువచ్చి తనకుటుంబము వారెల్లరు చెడ్డవారని చెప్పుచుండును. ఒక నాడు బండి గట్టించుకొని యిచటికి వచ్చెను. సురేంద్రనాథు డా బండి బాడుగ నిచ్చెను. అందుమీదట నరేంద్రుని అత్త సురేంద్రుని యింటికి వెళ్లి యాతనితో మిక్కిలిగా పోట్లాడెను."

ఇట్లు పలుకుచు శ్రీరామకృష్ణ గురుదేవుడు తన మంచమునుండి దిగి ఉత్తరపు వసారాకు వచ్చిచేరెను. అచ్చట హాజ్రా, కిశోరుడు, రాఖాల్ మొదలగు భక్తులు కూర్చొని యుండిరి.

శ్రీరామ ('మ.' తో):— ఏమోయ్! ఈరోజు వచ్చితివి. బడిలేదా?

'మ.':— ఈరోజు ఒంటిగంట మొదలు మాకు సెలవు.

శ్రీరామ:—ఎందువలన నింత పెందలకడనే వదలిరి?

'మ.':—విద్యాసాగరుడు బడిని పరీక్షింప (ఇన్స్పెక్టుచేయ) వచ్చెను. ఆ బడి విద్యాసాగరునిది కాబట్టి బాలురకు ఆనందము కలిగించుటకై సెలవీయబడినది.

శ్రీరామ:—విద్యాసాగరుడు సత్యము నేల పాలింపడు?

'సత్యవచన్ పరస్త్రీ మాతృసమాన్ హైయేసే హరి నామిలేతో తులసీ ఝూట్ జవాన్.'

సత్యము లేనిచో భగవద్దర్శనము కలుగ నేరదు. సత్యమే యున్నచో భగవల్లాభము కలుగును. విద్యాసాగరు డా దినము వత్తునని పలికి రాలేదు.

పండితునకును సాధువునకును ఎంతయో తారతమ్యము గలదు. పాండిత్యముమాత్ర మున్నవాని మనస్సు కామినీకాంచనములపై ప్రసరించును. సాధువు మనస్సు హరిపాదపద్మములయందు లయించును. పండితుడు చెప్పున దొకటి చేయునది వేఱొకటి. సాధువు వాక్కును విడువనేరడు. ఎవరి మనస్సు హరి పాదలగ్నమై యున్నదియో వారి పనియు వారి మనస్సును సమసము వేఱు. కాశీయందు నానక్ సంప్రదాయస్థుడగు చిన్నసాధువును ఒకని జూచితిని. అతనికి సుమారు నీయంత వయస్సే. నన్నుజూచి నేనొకానొక ప్రేమీ సాధునని వచించెను. అచట వారికొక మఠము గలదు. ఒకనాడు నన్ను అచటికి దీసికొని పోయెను. వారి పీఠా ఒకానొక గృహిణీ వలె కనిపించెను. నేనిట్లంటిని: 'మన కేయుపాయము గలదు?' అందుల కత డిట్లనియెను: 'కలియుగమున నారదీయభక్తియే యనుసరణీయము.' ఏదియో యొక గ్రంథమును బఠించుచుండెను. పఠనము ముగిసినంత నిట్లు పలికెను: 'జలే విష్ణుః స్థలే విష్ణుః విష్ణుః పర్వతమస్తకే సర్వం విష్ణుమయం జగత్.' చిట్టచివర 'శాంతి శ్శాంతి శ్శాంతి ప్రశాంతిః' అని పలికెను.

''మఱియొకనాడు గీతాపఠనము చేయుచుండెను. కాని అత డత్యంత పూర్వాచార పరాయణుడు కాన విషయాసక్తులయెదుట శాస్త్రపఠనము చేయడు. నాతో మథురబాబు వచ్చియుండెను. అతనియెదుట గీతాపారాయణము గావింపరాదను తలంపున అతనిని వెనుక బెట్టి నాకభిముఖుడై కూర్చొని చదువ దొడగెను. 'కలియుగమున నారదీయభక్తియే తరణోపాయ'మని యీతని నోటివెంబడినే నేను వినియుంటిని.

'మ.' :—ఆ సాధువులు వేదాంతవాదులు కారా?

శ్రీరామ.—ఔను, వారు వేదాంతవాదులే. అయినను భక్తిమార్గమునుగూడ అనుసరింతురు. అదియెట్లన 'కలియుగమున వేదమతమును 'తు, చ' తప్పకుండ నాచరింప జాలము. ఒకడు 'గాయత్రీ పురశ్చరణము చేయు'డని నాతో జెప్పెను. అపుడు నే నిట్లంటిని: 'తాంత్రికశాస్త్రము నేనేల యనుసరింపరాదు. కలియుగమున తాంత్రికసాధనలే శక్తివంతములు.'

''వైదికకర్మలు మిక్కిలి కష్టములు. అటు పిమ్మట మనకు దాసత్వముగూడ. ఎవరిట్లు పన్రెండేండ్లు దాసత్వము చేయుదురో వారు దాసులై పోవుదురని చెప్పబడియున్నది. ఏ యజమానుని సేవింతురో ఆతని రజస్తమోగుణములు జీవహింసావృత్తియు, విలాసజీవనమును తమ్ము జేరును. కేవలము దాసత్వమే కాదు, చివరికి 'పెంషన్' * గూడ పుచ్చుకొందురు.

ఒకప్పు డిచటికి వేదాంతవాదియగు సాధువొకడు వచ్చియుండెను. ఆతడు మేఘమును జూచి

* బ్రిటిష్ ప్రభుత్వమునందలి దాసులు, తమ ఉద్యోగానంతరముగూడ వారి దాసులవలె పరిగణింపబడి పుచ్చుకొను పెంషన్ పద్ధతిని శ్రీరామకృష్ణులవారు వివరించుచున్నట్లున్నది.

నచో నృత్యము చేయును. గాలివాన యున్న అతనికి అత్యంతానందము. ధ్యానసమయమున నెవరేని సమీపించినచో నెంతయో కోపించుకొనువాడు. ఒకప్పుడు నేనాతనియొద్దకు బోయితిని. నా గమనమువలన ఆతడు విసుగుకొనెను. ఎల్లప్పుడు 'బ్రహ్మసత్యము జగన్మిథ్య' యను విచారబుద్ధితో నుండువాడు. మాయవలన ప్రపంచము నానాకారములై కనుపించుచున్నదని వచించువాడు. చేత నెల్లప్పుడు prism వంటి గాజుముక్క (క్రకచాయతము) తో దిరుగుచుండువాడు. ఆ గాజుముక్కలోనుండి జూచిన బయలున నెన్నియో రంగులు కనుపించును. నిజముగా రంగులేమియు లేవు. అట్లే బ్రహ్మము తప్ప మరియేమియు లేదు. కాని మాయవలన, అహంకారమువలన నెన్నియో వస్తువులు గోచరించుచుండును. మాయ లేక ఆసక్తి యెక్కడ తన్నంటునో యన్న భయమువలన దేనినీ రెండుసార్లు చూచువాడు కాడు. స్నానమునకు బోవునపుడు ఏదేని పక్షి యెగురుటను జూచినచో అందుమూలమున విచారము నారంభించువాడు. అతడు వ్యాకరణముగూడ చక్కగా జదివినవాడు. 'దేవాలయమునందలి మేళముల శబ్దము విన్నంతనే యెవనికి బ్రహ్మసాక్షాత్కారము కలిగినదో అతడీ శబ్దము విన్నంతనే సమాధిస్థుడగు' నని చెప్పెడివాడు. అతడిచట మూడుదినములు గడిపెను.''

శ్రీరామకృష్ణ గురుదేవుడు ఈ సాధువులనుగూర్చి చెప్పుచు పరమహంసల యవస్థలను జూప మొదలిడిరి. బాలునివలె నడచిరి. ముఖమున ఆనంద ముప్పొంగుచుండెను. గాత్రము నుండి వస్త్రము జారిపడిపోయెను. నేత్రాంచలముల నానందము తాండవించుచుండెను. ప్రపంచముతో వారికి సంబంధము లేనియట్లుండెను.

శ్రీరామ:—('మ.' తో) నేను తోతాపురి యొద్ద వేదాంతము నేర్చుకొంటిని. బ్రహ్మ సత్యము జగన్మిథ్య. గారడివాడు గారడి చేయుచున్నాడు. మామిడిమొక్క మొలచెను. కాయలుగూడ గాచెను. కాని యిదంతయు గారడివిద్యయే. గారడివాడే సత్యము.

'మ.':—జీవితమే యేదో యొక గొప్ప నిద్దురవలె దోచుచున్నది. నేను చూచుచున్నది సమస్తమును సరిగా లేదని నాకు దోచుచున్నది. ఏ మనస్సుతో ఆకాశమును దెలిసికొనజాలనో అట్టి మనస్సుతోడనేగదా జగత్తును గనుగొనుచున్నాను. కావున నేనెట్లు సమస్తమును జక్కగా జూడగలను?

రామ:—ఇవన్నియు జూచుటకు మరియొక మార్గము గలదు. ఆకసమును మనము చక్కగా కనుగొనుటలేదు. అది వెళ్లి భూమిని అంటుకొనుచున్నట్లు కనిపించుచున్నది. మనుష్యు డెప్పుడు సరిగా చూడగలడు? అతని మనస్సునకు టైఫాయిడు జ్వరము కలిగినవానికి వలె వికారము కలిగినది' అని పలుకుచు 'ఇది యేమి వికారము శాంకరీ! నీకృపయే నాకు ధన్వంతరి' అని శ్రీరామకృష్ణు లొక పాట పాడ నారంభించిరి. పిదప, ఇది మనోవికారము కాక మఱి యేమి? చూచుచున్నావుకదా! సంసారులెట్లు కొట్లాడుచున్నారో! ఈ పోరాటమెందులకో యెవరును జెప్పజాలరు. ఎంతటి శాపవాక్కులు! ఎంతటి గోల? ఎన్ని చీవాట్లు?

'మ.':—నేనొకప్పుడు కిశోరునితో నిట్లంటిని: 'పెట్టె ఖాళిగా నున్నది. లోపల నేమియు లేదు. కాని యిరువురును పెట్టెను తమ తమ

వైపులకు నీడ్చుకొనుచున్నారు ఆ పెట్టెలో డబ్బు గలదని వారి యాశ. శరీరమే సర్వానర్థములకును మూలకారణము. ఇదంతయు దెలిసిన జ్ఞానులు ఈ కప్పను విడిచిన జాలునని తలంతురు.

శ్రీరామకృష్ణ గురుదేవుడు, 'మ.' కాళీ దేవ్యాలయమున కభిముఖులై పోవ నారంభించిరి.

శ్రీరామ:—ఈ సంసారము ఇంద్రజాలము మాత్రమేనా? ఇది ఆనందనికేతనముగూడ! శరీరమున్న నేమి? సంసారము ఆనందనికేతనము కావచ్చునుగదా!

'మ.':—నిరవచ్ఛిన్నానంద మెందున్నది?

శ్రీరామ:—అవును, నిజమే.

శ్రీరామకృష్ణ గురుదేవుడు కాళీ దేవ్యాలయము పురోభాగమును జేరెను; దేవికి సాష్టాంగ నమస్కారము గావించెను. 'మ.' కూడ నమస్కరించెను. శ్రీరామకృష్ణుడు దేవాలయమున కెదుట నున్న వసారాలో గూర్చొనెను. 'మ.' గూడ ఆయన దగ్గరనే కూర్చొనెను.

'మ.':—అట్లే యయినచో ఈ శరీరధారణమువలన ప్రయోజనమేమిగలదు? ఇదంతయు జూడ కొంత కర్మఫలితముల ననుభవించుటకే మనము జన్మించుచున్నట్లు గనుపించుచున్నది. ఏమి జరుగుచున్నదో ఎవరెఱుంగుదురు?|మధ్య మనము పడిచచ్చుచున్నాము.

శ్రీరామ:—పెంటకుప్పలో బడినను చెనగగింజనుండి చెనగమొక్కయే మొలచును.

'మ.':—అట్లయినను అష్ట బంధనము లున్నవిగదా

శ్రీరామ:—"అష్టబంధనములు గావు; అష్టపాశములు! అవియున్న నేమి? భగవత్కృపకలిగినచో అవియన్నియు నొక్కత్రుటిలో తొలగును. వేయిసంవత్సరములనుండియు చీకటితోనిండియున్న గదిలోనికి దీపము దీసికొని వచ్చినంతనే అంధకారము తొలగిపోవునుగదా! అట్టిదియే యిదియును. కొద్దికొద్దిగా పోవునది కాదు. మంత్రవాది విద్యను జూచితివా? ఎన్నియో ముడులు వేయబడిన దారము నొక చివర నేదేని యొకచోట గట్టును. ఇంకొక చివర తనచేత బట్టుకొనును. తరువాత దానిని కొంత అటునిటు నాడించును. ఆ యూపుతో బాటు ముడులన్నియు విడిపోవును. కాని మరి యెవరైనను ఆ ముడుల విప్పవలయునని యెంతగా ప్రయత్నించినను వీలుపడదు. గురుకృప గలిగినచో ముడులన్నియు నొక్క ముహూర్తము మాత్రలో విడిపోవును.

"సరి, కేశవసేను డింతటి మార్పులు చేయుచున్నాడేల? ఇక్కడి కెన్నియోసార్లు వచ్చుచుండెడివాడు. సాధువులకు నమస్కారము చేయు పద్ధతియు నిచటనే నేర్చుకొనెను. మునుపు అతడు తనచేతుల జోడించియే నమస్కరించెడివాడు. నేనొకప్పుడు సాధువుల కట్లు నమస్కరింపరాదని యతనికి చెప్పితిని. ఒక సమయమున కలకత్తాకు ఈశానునితో బండిలో బోవుచుంటిని. అపుడతడు కేశవసేనుని విషయమును విని, 'ఇచ్చట (మీయొద్ద) నుండియే అన్ని 'చెక్కు'లను 'ప్యాస్' చేయించుకోవలయును. లేనిచో 'బ్యాంకు'లో డబ్బీయరు' అని చెప్పి నవ్వెను.

'మ.':—ఇదంతయు నాశ్చర్యముతో వినుచుండెను. గురురూపమున సచ్చిదానందమే

చెక్కను 'ప్యాస్' యించును అని కొనెను.

శ్రీరామ :—విచారింపవలదు. భగవంతుని ఎవరు తెలియగలరు? భగవంతుని యంశమే ఈ బ్రహ్మాండమని శ్రీ తోతాపురియొద్ద విని యున్నాను.

హాజ్రా చాల విచారబుద్ధి గలవాడు. ఎన్నియో లెక్కలు గట్టును. పరబ్రహ్మమున నింతమాత్రమే జగత్తుగా మారినది. ఇంకను ఇంతమాత్రము మిగిలియున్నది. ఈ లెక్కలు వినునంతకు నా తల బ్రద్దలయ్యెడిది. 'నాకేమియు దెలియద'ని నే నెఱుగుదును. ఒకపుడు భగవానుడు చాల మంచివాడనియు మరియొకప్పుడు చాల చెడుగనియును తలంచెడివాడను. ఆయననుగూర్చి నాకేమి తెలియును?

'మ.':—చిత్తము. ఆయన నెవరు గుర్తింప గలరు? బుద్ధిపరిమాణము ననుసరించి ప్రతివారను ఆయనను దెలిసికొనుచుందురు. కాని అదియే సర్వమని తలచుచుందురు. మీరు చెప్పినట్లు చీమ పంచదార కొండదరి జేరి ఒక కణమును దీసికొనిపోవుచు మరలవచ్చి కొండంతయు దనయింటికి దీసికొనిపోవచ్చునని తలచునట్లున్నది వీరి భావన.

శ్రీరామ:—ఆయన నెవరెఱుంగగలరు? ఆయనను గ్రహించుటకే నేను బ్రయత్నింపను. 'అమ్మా! అమ్మా!' యని ప్రార్థించుటయే నా పని. ఆమె కెట్లు తోచునో అట్లే చేయును. ఆమెకు దయ గలిగినచో నాకు సమస్తమును దెలుపవచ్చును. లేనిచో ఏమియు తెలుపక పోవచ్చును. పిల్లికూనవంటిది నా భావము. పిల్లిపిల్ల 'మ్యావు మ్యావు' మని యఱచును. పిమ్మట తన తల్లి యెచట నుంచునో అచటనే యుండును. ఒకప్పుడు గృహస్థుని పడకమీదను మరియొకప్పుడు వంటయింటియందును నుంచును. చిన్నబిడ్డడు 'అమ్మా అమ్మా' యని యేడ్చును. తల్లి యైశ్వర్యమునుగూర్చి వాడెఱుగడు. తెలిసికొనుటకును ప్రయత్నము చేయడు. తన 'తల్లియున్న'దన్న విషయమే అతడెఱుగును. ఇతర విచారమేదియు నాతనికి లేదు. దాసి కుమారునకు సయితము 'తనతల్లి యున్న'దని తెలియును. యజమానుని కుమారులతో పోట్లాట జరిగినను 'మా యమ్మతో జెప్పెదను. నాకును అమ్మ గలదు' అని వాడు పలుకును. నాకును సంతానభావమే కలదు.

హఠాత్తుగా శ్రీరామకృష్ణ గురుదేవుడు లేచి తనఱొమ్మున యిచేర్చి 'ఇందులో నేమయినను గలదా! ఏమందువు'? అని పలికిరి. 'మ.' యేమియు పలుకక మిన్నకుండెను.

శ్రీ శారదేశ్వరీదేవ్యైనమః

# ధర్మ పరిశీలన

## వైదిక ధర్మాదర్శములు

శ్రీ వివేకానందస్వామి

(గతసంచిక తరువాయి)

ఈ భావమిచట సూక్ష్మరూపమున విశదీకరింపబడి, కట్టకడకు వ్యక్తిగతముకావింపబడినది. "ఆది నాతడొకడేయుండెను, ఆతడే సర్వేశ్వరుడు, ఈ విశ్వమున కతడే ఆధారభూతుడు. జీవుల సృష్టికర్త ఆతడే. శక్తికి మూలకంద మాతడే. అతని ఛాయయే జీవము. మరణము నాతని ఛాయయే. ఆతనినే దేవతలెల్ల పూజింతురు. ఆతనినిగాక వేరెవరిని మనమారాధింపగలము? హిమవసనావృత శీత నగ శిఖరములాతని మహిమను జాటుచున్నవి. మహోత్తుంగతరంగ సంకీర్ణ సముద్రములాతని వైభవము నుద్ఘోషించుచున్నవి." వ్యక్తిగత భగవద్భావధోరణి యీ తీరుననడచినది. కాని నే నిప్పుడు మీతో జెప్పినట్లు, వారికిది నచ్చలేదు.

చిట్టచివరకు బహు విచిత్రస్థితి యొకటి మనకు గోచరించును. ఆర్యుల మానసమింతవరకును ఈ ప్రశ్నకు తగిన సమాధానమునకై బహిర్ప్రపంచమున బ్రయత్నించెను. తమకగుపడిన సూర్యచంద్ర నక్షత్రాదులనెల్ల వారు ప్రశ్నించిరి. ఎంతతరచినను, ప్రకృతియంతయు విశ్వ ప్రభువగు వ్యక్తిస్వరూపుని తప్ప వేరేమియును వారికి బోధింపజాలకపోయెను. ఇంతయేల? బాహ్యప్రపంచమున నుండి మనకు విశ్వశిల్పిభావముమాత్రమేలభింపగలదు. దీనినే విశ్వవిధాన సిద్ధాంతమందురు. ఈ వాదమంత సహేతుకమైనదికాదని మనకందరకును తెలియును. ఇదియొక చిన్నతనపుటూహ యనదగియున్నది. అయినను, బాహ్యప్రపంచమునుండి మనము తెలిసికొనగలిగినదీ యినుమంతమాత్రమే, యీవిశ్వమునకొక నిర్మాత యుండవలయునను విషయము మాత్రమే. కాని, యీ జగత్సమస్య కిది యెట్టి సమాధానమునుకాదు. ఈ ప్రపంచమునకు వలయు సామగ్రి అతనియెదుటనే యుండెను. ఈ భగవంతున కీయుపకరణములెల్ల కావలసియుండెను. ఇతడీ యుపకరణములచే పరిమితుడై యుండవలయుననెడిదే దీనికి ప్రబలమైన యాక్షేపణ. ఏయుపకరణములతో గృహనిర్మాత యొక గృహమును నిర్మించునో, ఆయుపకరణములు లేనిచో అతడా గృహమును నిర్మింపగలిగియుండడు. కనుక, అతడా యుపకరణ

ములచే పరిమితుడై యుండెను. వాని సాయముతో నతనికేది చేయసాధ్యమో అంతమాత్రమే అతడు చేయగలిగియుండెను. కనుక, (విశ్వ) విధానసిద్ధాంతమువలన మనకు లభించు భగవంతుడు, మనమెంత అనుకూలముగ నాలోచించినను, ఒక శిల్పి ప్రాయుడుమాత్రమే, అందునను పరిమితుడగు విశ్వశిల్పి. అతనికి స్వాతంత్ర్య మణుమాత్రమును లేదు. భారతదేశ మహర్షు లిదివరకే యీవిషయమును గ్రహించిరి. ఇతరులెందరో దీనితోడనే తృప్తిపడి యుండెడివారు. ఇతర దేశములలో నిట్లే జరిగినది. కాని యింతమాత్రముతో మానవునిమనసు ంతృప్తిపడియుండ జాలదు. ఆలోచనా పరులును విషయగ్రహణ పారీణులును ఈ స్థితితో తృప్తిపడియుండజాలక, ముందునకు పోగోరిరి. కాని, బుద్ధివిషయమున వెనుకబడిన వారి పురోగాములను బలవంతముగ నదిమియుంచి, వారిని ముందునకు సాగనీయరైరి. హిందూమహర్షులు మంత్ర మోటమి నంగీకరించి, మూలబడి కూర్చునియుండు మనుష్యులుకారు. విశ్వసృష్టి సమస్య నెట్లైన సాధింపగోరి, వారిక బాహ్యప్రపంచమునగాక ఆంతరంగిక ప్రపంచమున తమ యన్వేషణ నారంభించిరి. బాహ్యప్రపంచము మనకు వేద్యమై, మతమును గురించి యేమైన తెలియుచున్నదనిన, అది కన్నులు మొదలైన యింద్రియములద్వారమున కాదని వారికి మొట్టమొదట స్ఫురించినది. ఇందుకు కారణమైన తమలోపమేమో తెలిసికొనవలయుననెడిదే వారికిప్పట్టున గల్గిన ప్రథమభావము. ఆ లోపము భౌతికమును, నైతికమునుగూడ నని మనము మున్ముందు గ్రహింపగలము. "నీకీ విశ్వకారణము బోధపడదు. నాకును నీకును మధ్య హాస్తిమశకాంతర భేదమేర్పడినది; ఎందుచేత? ఇంద్రియవిషయములనుగురించి నీవు ప్రసంగించుచు, ఇంద్రియగోచరములగు పదార్థములతోను, మతసంబంధమైన కర్మకలాపముతోను తృప్తిపడియుందువు. నేనన్ననో, వీని కతీతుడగు పురుషుని దెలిసికొనియున్నాను" అని యీ మహర్షులలో నొకడు నుడివెను.

నేను మీకు వ్యక్తీకరింప బ్రయత్నించుచున్న యీ పారమార్థిక భావాభివృద్ధితోపాటు పొడచూపిన వేరొక సన్నివేశమును గురించి స్వల్పముగ దెలుపగోరుచున్నాను. మన ప్రస్తుత ప్రపంచముతో దానికి సంబంధమేమియు లేకపోవుటచే, నే నా విషయమై విపులముగ ప్రస్తావింప నవసరములేదు. ఈ విషయము యజ్ఞాది కర్మల యభివృద్ధికి సంబంధించినది. పారమార్థిక భావపరంపరకంటె వేయిమడుంగు లెక్కువగ, ఈ కర్మకాండ పెరుగ నారంభించెను. పూర్వకాలపు ఛాందసములు నానావిధ కర్మతంత్రముల రూపమున మితిమీఱి పెరిగి, హైందవ జీవితవికాసమునకు మహోపద్రవకరముగ పరిణమించి, నేటికిని మమ్ము ఆజన్మపరాధీనులుగ జేయుచున్నవి. అయినను, బహు ప్రాచీనకాలమునుండియును, ఈ కర్మకలాపాభివృద్ధికి ప్రబల ప్రాతికూల్యము ఘటించుచుండినట్లు మనకు విశదము కాగలదు. కర్మకాండపట్ల గల అభిమానము నిర్ణీతసమయములందాయావస్త్రములను ధరించుట, ఆయావిధమున భుజించుట, యీ మొదలైన బాహ్యమతాడంబరములను తప్ప వేరేమియు సూచింపదనునదియే, దీనికి వ్యతిరేకముగ బయలుదేరిన యాక్షేపణ. మనుష్యు లింద్రియములతో తృప్తిపడి, వానికతీతులైయుండుట కిష్టపడకపోవుటయే యీ స్థితికి కారణము.

మనకెల్లరకును గల గట్టి చిక్కు. పారమార్థిక విషయములను మనము వినగోరునపుడు, మన ప్రమాణ మింద్రియములే. భగవంతునిగురించి, వేదాంతమునుగురించి, పారలౌకికవిషయములనుగురించి యే మనుష్యుడైనను కొన్నాళ్లు వినినతరువాత, మీరెన్ని చెప్పినను, వానివలన నెంతసొమ్ము వచ్చునని, యెంత యింద్రియ సుఖము కలుగునని అతడడుగును. ఇది యెంతయు సహజము. ఎందుచేతననగా, ఇంద్రియములవలన మాత్రమే వానికి భోగము లభించుచున్నది. కాని, ఆ యింద్రియ భోగలాలసతయే మనకును, సత్యమునకును మధ్య అవరోధ మేర్పడుటకు కారణమగుచున్నది. వివిధ కర్మానురక్తివలనను, ఇంద్రియసుఖములతో తృప్తిపడి వివిధ సిద్ధాంతములను ప్రతిపాదించుచుండుటవలనను, మనకును సత్యమునకును నడుమ నవరోధమేర్పడినది. పారమార్థికాభివృద్ధియం దిది యింకొక పెద్ద అంతరము. ఈ యాదర్శపరిణామమును చివరవరకును పరికించి, ముందుముందది యా యద్భుత మాయా వాదముగను, వేదాంతముగను నెట్లు వికసించెనో, యీ తెరమరుగున నెట్లు సత్యమెల్లప్పుడు నుండియేయున్నదో, యీ తెరయే యెట్లు వేదాంత మీయగల నిజసమాధానమో మనము చూడవలసియున్నది.

కనుక, ఈ పురాతనార్య తత్త్వజ్ఞుల మానసము లొక నూతన మార్గము ననుసరింప మొదలిడినట్లు మనకు విశదమగుచున్నది. బాహ్యప్రపంచమం దెట్టి యన్వేషణగాని యెన్ని యుగములకైనను తమ ప్రశ్నకు సమాధాన మీయజాలదని గ్రహించి, వారీ నవీన సాధనపై నాధారపడజొచ్చిరి. ఈ మార్గానుసరణమందు, వారికీ విషయవాంఛలును, వివిధ కర్మకలాప నిరతియు, బాహ్యవస్తు భోగలాలసతయును వైచిన తెర పరమసత్యసాక్షాత్కారమున కడ్డు తగులుచున్నదని, యెట్టి కర్మాచరణముగాని యీ తెరను తొలగింపజాలదని, గోచరించెను. వారు తమస్వీయమానసములపైననే ఆధారపడి, తమలోని సత్యమును గ్రహించుటకు ఆ మనస్సునే తఱచి చూడవలసి వచ్చెను. ఈ విషయమున బాహ్యప్రపంచము నిష్ప్రయోజనమైనందున, ఆంతరంగిక ప్రపంచమువైపు వారు తమదృష్టిని మరలించిరి. అప్పుడది వేదాంతతత్త్వముగ బరిణమించినది. ఇచ్చట నుండి వేదాంతతత్త్వశాస్త్ర మారంభమగును. ఆశాస్త్రమున కిదియే మూలాధారము. దానిని చదువునపుడు, దాని యన్వేషణలనియును ఆ ఆంతరంగికములని మనకు బోధపడగలదు. సత్యముకొఱకె యేమతమునుగాని పరిశీలింపకుడని వారు ప్రప్రథముననే హెచ్చరించునట్లు కనుపడుదురు. అద్భుతములందెల్ల మహాద్భుతమును, అఖండసచ్చిదానందనిలయమునగు మానవాత్మలో ప్రకాశించుచున్న ఆ సత్యము కొఱకు ఇచ్చటనే, మానవాత్మలోనే వెదకుడని వారుద్బోధించుచున్నారు, ఇక్కడలేని దక్కడ నుండజాలదు. బయటనున్నది అంతరంగమందున్న దాని అధమ ప్రతిబింబమని క్రమక్రమముగ వారు కనుగొనిరి. భగవంతుడు విశ్వబాహ్యుడగు విశ్వప్రభువను పురాతన భావము పట్ల వారెట్లు వ్యవహరించిరో చూతము. మొట్టమొదట వారాభగవంతుని బహిర్విశ్వమునుండి తీసి, విశ్వాంతర్భూతునిగ నొనర్చిరి. బయటగాక మనలోననే వాడున్నాడు. వానిని బయటనుండి వారు తమతమ హృదయములలోనికి మరల్చిరి. వాడు మానవుని హృదయములోనే యున్నాడు. మనయాత్మ

లలోనుండు పరమాత్ముడు వాడే. మనలో ప్రకాశించు పరమసత్యము వాడే.

వేదాంతతత్త్వశాస్త్ర ప్రభావమును సముచితరీతిని గ్రహింపవలయుననిన, మనము మహాభావములనెన్నిటినో మున్ముందుగ నవగాహన చేసికొనవలసి యున్నారము. అది కాంటు, హెజెల్ మొదలగు పాశ్చాత్య పండితులతత్త్వశాస్త్రమువంటిదికాదు. అది ఒకే పుస్తకము కాదు; ఒకే మానవుడు రచించిన గ్రంథము కాదు. వేర్వేరు కాలములలో విరచితములైన గ్రంథములు వేదాంతమను పేరిట వ్యవహరింపబడుచున్నవి. ఒక్కొకప్పుడీ పుస్తకములందలి యొకదానితో నేబది చిన్న విషయములు చర్చింపబడియుండును. అవియును సక్రమముగా నేర్పరుపబడియుండవు. ఆయాభావములు బహుక్లిష్టముగ లిఖింపబడియుండును. ఒక్కొకప్పుడు అప్రస్తుతములగు విషయములమధ్య, యేదో యద్భుతభావము మనకు గనుపడును. కాని, యీ సందర్భమున నొక విషయము గమనార్హము. ఉపనిషత్తులలోని యీభావములందెల్లప్పుడును ప్రవర్ధమానస్థితి కానవగును. ఆపూర్వకాలపు మోటుభావములో, ఆ మహర్షులలోని ప్రతి యొకరి మానసమును యథాతథముగ చిత్రింపబడినది. ప్రప్రథమమందు చాల మోటుగనుండినను, భావములు రానురాను సూక్ష్మతరములౌను. ఆ భావముల చరమపరిణామమే వేదాంతశాస్త్రమను పేరిట వ్యవహరింపబడుచున్నది. మొట్టమొదట తేజోరూపులగు దేవతలకొఱకైన యన్వేషణ విశ్వోత్పత్తి విచారణలోనికి దిగి, చిట్టచివరకు వేదాంత పరమావధియనదగిన సర్వచరాచరాంతర్యామియును, ఎవని దెలిసికొనిన తదితరమగు సర్వమును తెలియునో అట్టి అద్వయ పరబ్రహ్మబోధకమునగు తత్త్వశాస్త్ర మనుపేరిట పరిణత నొందినది.

సమాప్తము



# పూర్ణావతారుడు శ్రీకృష్ణుడు

భారతదేశమందు వేనవేల భక్తుల నాకర్షించు నవతారపురుషుడు శ్రీకృష్ణుడు. వాని బాల్యలీలాశ్రవణమననములవలన నెందరో తమ యాధ్యాత్మిక జీవితమున నున్నతస్థానము నధిష్ఠింపగలిగిరి. ఆ చిట్టిముద్దుగోపాలుని రేయింబవళ్లు ధ్యానించుచు భగవదనుగ్రహము వడసిన మహనీయు లెందరో గలరు. గిరిధర గోపాలుడే తన యిష్టదైవమని యెంచుకొనిన మీరాబాయి చరిత్ర నెఱుంగనివా రెవరు గలరు? సర్వలక్షణ లక్షితుడును, అత్యద్భుత దేహకాంతి సమన్వితుడును నగు నాతని దర్శనమాత్రమున తమ జన్మసాఫల్యమగునని యతని కాలమున నెందరో తలచెడివారు. ఆ శ్యామసుందర శరీరముచే, పీతాంబరముచే, వనపుష్పమాలలచే శోభించు మన్మథ విగ్రహమును తాము చిత్రింపగలిగిన తమ కళానైపుణ్యము వన్నెకెక్కునని శ్రీకృష్ణుని చిత్రించిన కళోపాసకు లెందరో గలరు. అవతారములందెల్ల అపూర్వమైన కమనీయాకారము శ్రీకృష్ణునిదియే యనుటకు సందియము కలదా? ఇట్టి సందర్భమున, సగుణోపాసకులు, సౌందర్యమే మూర్తిభవించివచ్చినట్లున్న శ్రీకృష్ణమూర్తిని ధ్యానించుట ఎంత శ్రేయస్కరము! రూపసౌందర్యములకన్నను, వాని వేణుగానము పెక్కురెట్లు ఆకర్షణీయముగా నుండును. సామాన్యముగా గోపబాలురెందరో పిల్లనగ్రోవి నూదుచుందురు. కాని ఆ కృష్ణుని మురళీగానము శక్తి వర్ణనాతీతము. జీవకోటులనెల్ల తన్మయత్వము నొందింపచేయు శక్తి దానికి గలదు. వేయేల అది కఠినశిలలను సైతము కరగింపగలదు. ఆవులు దూడలు మేతలుమాని వానియొద్ద జేరి మురళీనాదము నాలకించుచుండినవన, స్త్రీలమాట వేరుగా చెప్పనేల? ఎవరు ఏ పనియందుండినను శ్రీకృష్ణుని వేణునాదము చెవినంటగనే, పరుగెత్తుకొనివచ్చినట్లు భాగవత పురాణమందు చెప్పబడియున్నది. అత్యంతాద్భుతమగు నా మురళీరవము ఐహిక జీవనమును సంపూర్ణముగా మఱపించుచుండెను.

మానవు డింద్రియములకు లోబడినవాడు. మనలను లోబరచుకొను శక్తి వానికి అపారముగా గలదు. వానిని జయించుటకు రెండు మార్గములు గలవు. ఒకటి వీరభావముతో ఎదుర్కొని పోరాడుట, రెండవది వాని (ఆయా యింద్రియము లర్థించు) విషయములనే వానివానికి సమకూర్చి వానిని జయించుట. ఇదియే విగ్రహారాధనకు మూలకారణము. రూప, రస, గంధ, శ్రవణ, స్పర్శనవిషయములన్నియు విగ్రహారాధనయందు కలవు. ఈ విషయములన్నిటితో సంబంధము కల్పించి శ్రీకృష్ణుని మన మారాధింపవచ్చును. శాంత, దాస్య, వాత్సల్య, సఖ్య, మధురభావములతో పూజింపబడినవాడు శ్రీకృష్ణుడే.

బాలకృష్ణుని లీలలు ఎందరో భక్తుల మనస్సులకు ఏకాగ్రతను కల్గించి, వారి యుల్లములను బృందావన మురళీధరుని గానమును వినునట్లు చేయును. కాని యిట్టి శ్రీకృష్ణుడు జగత్కళ్యాణమునకు తనజీవితమంతయు ధారపోసిన

వీరేశ్వరుడు, మహాపండితుడు. అతని జీవితమున రెండు దశలను మనము బాగుగా కూడ వచ్చును. ఒకటి అత్యద్భుత లీలలను గావించిన బాల్యదశ. మరియొకటి ఎందరో దుఃఖితులైయుండిన రాజులకు వారి రాజ్యములను సంపాదించి యిచ్చిన యౌవనదశ. అతని చరిత్రమంతయు చాల వింతగా కనబడును. కొందరకు ధర్మవిరోధమనిగూడ తోచును. పరీక్షిత్తునకే యట్టి సందేహము కలిగి, శ్రీ శుకమహాఋషిని, "సకథం వక్తా కర్తాభి రక్షితా ప్రతీపమాచరేత్ బ్రహ్మన్, పరదారాభిమర్శనమ్॥" అని అడిగెనుగదా! ఇట్టి ప్రశ్నలకు శ్రీ శుకమహర్షి పరమేశ్వరుని యోగశక్తిని వివరించి బదులు చెప్పెను. భగవల్లీలలు మానవమాత్రుల మానవపాత్రలచే కొలువజాలము. అవతారపురుషులెల్లరు వారావిర్భవించిన కాలస్వభావము ననుసరించి ఆదర్శ ధర్మమార్గమును చూపుచుందురు. శ్రీకృష్ణుని దినచర్య, పరులతోను తనకుటుంబముతోను నడచుకొనిన విధము ఇవన్నియు గమనింపతగినవి. శాస్త్రములలో మానవుడు ఏ విధముగా ఉండవలెనని చెప్పబడియున్నదో ఆ విధమును సంపూర్ణముగా శ్రీకృష్ణుడు అనుసరించినట్లు భాగవతమునందు వివరింపబడియున్నది. అన్నిపనులందును పాల్గొనుచున్నప్పటికి, తన యిష్టము వచ్చినప్పుడే తన మనస్సును ఇతరవిషయములనుండి త్రిప్పుకొనెడివాడు.

యుధిష్ఠిరు డొకనాడు త్వరితముగా శ్రీకృష్ణుడుండిన చోటికేగి అత్యవసరమైన తన ముఖ్య సంభాషణను ప్రారంభించెను. శ్రీకృష్ణుడు అతని యెదుటనే యాసీనుడై యుండినప్పటికిని, ధర్మరాజు చెప్పిన మాటలలో నొక్కటియైనను శ్రీకృష్ణుని చెవిని చొరలేదు. కొంచెమైనను అటునిటు కదలక కూర్చొనియుండి తనమాటల నాలకింపక స్థిరాసనస్థుడైయుండిన భగవానుని చూచి యాశ్చర్యపడి ధర్మరాజిట్లు పలుక నారంభించెను: "ఏమి యాశ్చర్యమిది! అనంతశక్తిశాలివైన నీవిట్లు ధ్యానమగ్నుడవయియున్నావు. జగచ్ఛరణ్యా! ముల్లోకములు సరిగా నున్నవా? నీవంటివాడు ఇంద్రియప్రాబల్యమునుండి విడిపించుకొని, తురీయావస్థ నుండుట నాకెంతయు వింతగ కన్పట్టుచున్నది." అంతట శ్రీకృష్ణుని శరీరము మెల్లగా కదల నారంభించెను. అతడు కండ్లు తెరచి, వివిధేంద్రియములను వాని స్థానముల నింపి, "శరతల్పమందు పరుండి ధ్యానావస్థలో నివురుగప్పిన నిప్పువలె నుండిన భీష్మునిపై నా మనస్సు పోయినదని" చెప్పెను. వీరిద్దరు తదుపరి భీష్మునియొద్దకు పోవుటను, శాంతిపర్వారంభమున నందరును చదివినదియే.

మరియు శ్రీకృష్ణున కెందరో భార్యలుండిరని మనము వినియున్నాము. వారందరు నతనిపై నెట్టిభావము గలిగియున్నారో కనుగొనుటకు ఒకప్పుడు ద్రౌపది వారలను జూచి యిట్లు ప్రశ్నించెను: "ఓ నారీమణులారా! మీరందరు ఎల్లప్పుడు శ్రీకృష్ణునితోనే యున్నవారు. ఎట్లు ఆ భగవానుడు, తన మాయచేత లోకము ననుసరించి సాధారణ మానవునివలె నడచుకొనుచున్నాడో నాకు తెలుపుడు." పై ప్రశ్నకు వారొసగిన సమాధానములు శ్రీకృష్ణుని దివ్యస్వభావమునే సూచించుచున్నవి. వారందరుకూడ శ్రీకృష్ణుని తమభర్తగానే ప్రేమించినప్పటికిని, వారి ముఖ్యలక్ష్య మదికాదు. అతని సేవచేసి యాతని మహత్వమును తెలిసికొనుటయే వారి యాదర్శలక్ష్యము. అదియునుగాక వారి సమాధానములనుబట్టి వారి మనస్సులలో నావగింజ

పరిమాణముగూడ కామదృష్టి లేదనుట స్వచ్ఛముగా తెలియవచ్చును. భగవానుడు ఆదర్శమానవుడై యవతరించినప్పుడు గృహస్థుల జీవితము, వారి యన్యోన్యభావము లెట్లుండవలెనో తెలుపుచున్నాడు.

ద్రౌపది యడిగిన ప్రశ్నకు భద్ర యిట్లు ప్రత్యుత్తరమిచ్చినది:—

"ఎవడు నన్ను స్వయంవర సమయమున తన్నెదిరించిన భూపతులను, మత్సహోదరులను జయించి, ఫేరవసమూహమును లెక్కసేయక కొంపోవు మృగరాజు కరణి, నన్ను తీసికొని పోయెనో, ఆ శ్రీపతియే నాకు జన్మజన్మములయందును భర్తయగుగాక."

సత్య యిట్లు సమాధానమిచ్చినది:—

"నానాభూపతుల బలశౌర్యంబులను పరీక్షసేయు నిమిత్తము నా తండ్రి యనన్యసాధారణ విక్రమంబులగు ఏడెడ్లను పెట్టుకొనియుండెను. నానాథుడు వాటినన్నిటిని యవలీలగా కట్టివైచెను. అట్టివాని సేవచేయుటయే నా జీవిత లక్ష్యము."

మరియొకభార్య కాళింది యిట్లు పలికెను:—

"ఆయన పాదసేవ చేయు భాగ్యము లభించుటకై నేను తపమొనరించుచుండగా, కనికరించి తన స్నేహితుని మూలమున నన్ను పాణిగ్రహణము చేసికొనెను. నేను ఆయనయింట దాసిగా నున్నాను."

బంధింపబడియుండి, శ్రీకృష్ణునిచే విడిపింపబడిన స్త్రీలిట్లు పలికిరి:—

"ఆప్తకాముడగు శ్రీకృష్ణభగవానుడు, ఎల్లప్పుడు తన్నామస్మరణముసేయు మమ్ములను వివాహమాడెను. హే సాధ్వీ! మేము సామ్రాజ్యమునుగాని లేక స్వారాజ్యమునుగాని కోరుట లేదు. మర్త్యలోక, స్వర్గలోకసౌఖ్యముల కాశపడుటలేదు. విరాట్స్థితిగాని, అనంతకాల వైకుంఠనివాసమునుగాని మేము అభిలషించుట లేదు. మాకు కావలసినది, శ్రీదేవీ కుచకుంకుమాంకితమైన తచ్చరణరజమును మా శిరముల దాల్చుటయే మా వాంఛ."

ఇట్టి సంభాషణలనుబట్టిచూడ శ్రీకృష్ణుడు ఏ విధముగా వారి మనముల నాకర్షించెనో స్పష్టమగుచున్నది. అతని భగవదంశమే యందరిని వశపరచుకొనెను. ఎన్నియోశతాబ్దములు గడచిపోయినప్పటికిని, అతనిని భారతదేశమందంతటను ప్రజలు పూజించుచున్నారు. ఎవడేవిధముగా భగవదారాధన చేయగోరునో అట్టి ఆరాధన శ్రీకృష్ణునకే చేయవచ్చును. భగవద్గీతయందు చెప్పినట్లు "ఏ యథా మాం ప్రపద్యంతే": ఆ కృష్ణావతారమొక్కటియే అందరికి తగినట్లున్నది. కావున అతడు పూర్ణావతారుడనుటలో అత్యుక్తి లేశమాత్రమును లేదని ఘంటాపథముగా చెప్పవచ్చును.

శ్రీ కృష్ణాయనమః

# కమ్మారపుష్కరిణియందు శ్రీ రామకృష్ణమందిర ప్రతిష్ఠాపనోత్సవము

శ్రీ వీతశోకానంద స్వాములవారు

[ఈ సంవత్సరము మేనెల 11-వ తేదీని సోమనాథపుర దేవాలయ ప్రతిష్ఠాపనము జరుగుచుండ దానికి తూర్పుదిక్కునగల కమ్మారపుష్కరిణి యను గ్రామమున సర్వధర్మస్వరూపుడయిన శ్రీ రామకృష్ణమందిరము ప్రతిష్ఠింపబడెను. పవిత్ర కర్మభూమియగు భారతదేశము వేనవేల సంవత్సరములనుండియు తన లక్ష్యముగా పరిగణించుచుండిన ధర్మమునకు ఆ నాడు పునరుద్ధారణము జరిగెను. ఆ యుత్సవమున నాల్గొనిన శ్రీ స్వామివారిట్లుపన్యాసరూపమున ఆ విషయమును వివరించియున్నారు.
—సంపాదకులు]

పశ్చిమ వంగదేశమున గల యితర సామాన్య గ్రామములబోలినదియే యీ కమ్మారపుష్కరిణియును. ఆహా! ఆనాడు యాత్రికులు ఆ పెద్ద బయలున గుంపులు గుంపులుగా— తండోపతండములుగా సాగిపోవుచుండిరి. ఆ సమయమున ఆ ప్రదేశమంతయు శుష్కమును తృణవిహీనమును నై యుండెను. కాని అది స్వాభావసిద్ధముగా నూషరక్షేత్రముగాదు. ఒక వర్షము కురిసినచో వెంటనే స్నిగ్ధ శ్యామలరూపధారిణియై యా క్షేత్రము చూపరులకు కన్నులపండువు గొలిపెడిది. అపుడు భూదేవి యనుగ్రహ విశేషము నంజేసి యెందఱో కర్షకులు ఆహారధాన్యముల సమకూర్చుకొనుచుండువారు. అది మధుమాసారంభము! ఇక పంట సాగుబడియైనది. ధాన్య మిలుసేరెను. అది అందఱకును ఆహ్లాదకరమయిన సమయము. ఆమాసమున నొకానొకనాటి సంభవము! అజ్ఞాత కమ్మారపుష్కరిణి వసుంధరాధ్యాత్మిక మానచిత్రమున నొక విశిష్టస్థానమును బడసినది.

ప్రస్తుతకాల పరిస్థితి నటుంచి గత శతాబ్దము పరిస్థితిని పరిశీలింతము. ఆ నాడు మన కన్నులకు గోచరింపదగినవి ఈ పెద్దగ్రామమును, ఇందుగల హాలధార పుష్కరిణి, యుగీధుల శివమందిరమును, భూతముల కాలువయు, బుధుల్ మొగలు శ్మశానమును, ధనీకామారిణీ మాతాచంద్రమణి, పితాక్షుదిరామ్ మాణిక్యరాజుల మామిడితోటయు, విశాలాక్షీ దేవాలయమును, లాహాబాబువారి గృహమును.—ఇట్టి పరిసరములును పాత్రలును ఒక మహాజ్జీవనమును లక్ష్యముగా నుంచుకొని

ఆమానచిత్రము నలంకరించి శోభాయమానము గావించిమించెడిది.

తీర్థయాత్రికు లెల్లరును నేడు కమ్మర పుష్కరిణికే వచ్చుచున్నారు. అది మండువేసవి. క్లాంతినందిన శరీరమును స్నిగ్ధమొనర్చుకొనుటకై స్నానమాడవలయును! అందుకొఱకే వారందఱును హాలధారపుష్కరిణికడ నిలుచుకొనియున్నారు. అందెవ్వరికేని పూర్వపు గ్రామీణులు, క్షుదిరామ్—ఈపుష్కరిణియందే దైనందినము జలమాడువారా యన్న విషయము మనస్సున దట్టెనా? దేవాలయ ప్రతిష్ఠాపనార్థము గొప్పయుత్సవము ప్రారంభింపబడినది. ఎందుజూచినను వివిధాపణములు! ఎందుజూచినను అసంఖ్యాకములగు మిఠాయీ కొట్లు! ఆహా! ఈ గ్రామీణపూర్వపురుషుల యందు—క్షుధిరామునకు, ధర్మసత్యత్యాగములకు ఆదర్శప్రాయుడయిన ఆ మహనీయునకు – అంజలి సమర్పణార్థము అందఱును లేచి నిలుచుకొని మోడ్పుకేలున నమస్కరించెడి వారన్న విషయము కలనైన స్ఫురించెనా? ఎదురుగానున్న యుగీధుల శివాలయములోని శివలింగమునుండి యొకనా ఁడొకానొక జ్యోతి యావిర్భవించి, యెదుట నిలుచుకొనియున్న చంద్రాదేవిలో ప్రవేశించుటయు తత్ఫలసూచకముగా యుగావతారపురుషుడు ప్రభవింపగలడని యామెకు దోచిన విషయము కొందఱకు స్ఫురించెనా?

పూర్వము శ్రీరామకృష్ణులవారి పైతృక స్థలము శాంతినికేతనము. కాని యిపుడా శాంతిని, ఆ స్థలమును గుర్తించుట యసంభవము. ఆ స్థలమున నేడు మనోరంజకమగు దేవాలయము ప్రతిష్ఠింపబడినది. పూర్వ మెందు లూఖలముండెడిదో, ఎందు శ్రీరామకృష్ణులు జన్మించిరో ఆ పవిత్ర స్థలమున నేడు శ్రీవారి పాలరాతి విగ్రహము స్థాపింపబడియున్నది. ఈ మందిర నిర్మాణార్థము సుమారు లక్షరూపాయలు వెచ్చింపబడెను. ఇదంతయు భక్తుల (విరాళరూపకమగు) అర్ఘ్యస్వరూపమే. ప్రఖ్యాతశిల్పి డాక్టర్ నందలాల్ వసువు దేవాలయమును చుట్టును వివిధచిత్రములతో నలంకరించెను.

ఔరా! కమ్మరపుష్కరిణియందు శ్రీ రామకృష్ణమందిర ప్రతిష్ఠాపనోత్సవము! ఆహా దీనికొఱ కెన్నాళ్లనుండి వేచియుండిరో కదా! నేటికది వాస్తవికముగా పరిణమించెను. ఈ విషయమున నీ ప్రణాళికను కార్యరూపమునకు దెచ్చిన మహనీయులయం దెవ్వరినేని మఱవవచ్చునే? వారి కఠోర పరిశ్రమయే కదా ఈ దేవాలయమునకును ఆశ్రమమునకును ఆధారము! ఉత్సవమునకు లక్షలకొలది జనులు మూగిరి. అసంఖ్యాకులగు నరనారీమణులు వర్ణనాతీతములగు నద్భుతాకర్షణముల వలన నిచటికే తెంచిరి. శ్రీరామకృష్ణ గురుదేవునకు భక్తిపూర్వకమగు స్వీయ శ్రద్ధాంజలి సమర్పణాభిలాషయే వారి యాగమనమున కేకైక కారణము. ఏమి వారిభక్తి! దుర్భరాతపము! ప్రయాణ సౌకర్యములా నహి. ఆశ్రయస్థానమా సున్న! ఇట్టి పరిస్థితిని లెక్కింపక భక్త ప్రపంచమెల్ల తంతోపతండములుగా కమ్మరపుష్కరిణికి నడువసాగెను. వార్తాపత్రికలలో నీక్లిష్టపరిస్థితుల మాటిమాటికి వివరించి ప్రకటించుచున్నను వారిలో నెవరును ఆ కష్టముల లక్ష్యించినవారు కారు! సుఖసౌకర్యముల కాలవాలములగు తమ గృహముల వీడి యెండలో గృహస్థులు ఆ ఆనంద సాగరమునబడి ఈ యుత్సవమున జరిగిన శోభ

యాత్రయందు పాల్గొని కీర్తనలు సలుపుచున్నారు. బస్తీలయందు సకల సౌకర్యముల కలవడిన యొకానొక భక్తునిజూచి, 'అయ్యా! మీరు నిట్లేల యీ కర్కశస్థలముల కేతెంచితి' రని ప్రశ్నింప, ఆయన గంభీరస్వరమున నిట్లనియెను: 'అదేమి అట్లు ప్రశ్నించుచున్నారు? ఇట్టి యవకాశము నరుల కింకెన్ని శతాబ్దముల కావల లభించునో? ఆ విషయము నెవరెఱుగుదురు? యుగావతార పురుషుడు మఱల ప్రభవించుటయును ఇట్టి యుత్సవము జరుగుటయు అందు పాల్గొనునవకాశము మాకు లభించుటయు సంభవమా?' ఇట్లు పలికి ఆ భక్తుడు, 'ఓరీ మూర్ఖా! అంతయు మిగిలిపోయినపిదప 'ఆహా' యని యేడ్చెద' వను పాటను ప్రారంభించెను

నేడందఱుగూడ ఆనందమున నుప్పొంగుచున్నారు. సన్న్యాసి, గృహస్థుడు, ధనికుడు, దరిద్రుడు, విజ్ఞాని, అజ్ఞాని, వృద్ధుడు, యువకుడు, శిశువు—అందఱును ఈ యానందమును సమముగా భాగస్వాములై యనుభవించుచున్నారు. ప్రథమదివస సాయంతనముననే మరునాడు దేవాలయము 'కనుదెరువబడు' నని నిర్ణీతకాలము ప్రకటింపబడెను. కాన అందఱును ఆ సుముహూర్తమును నిరీక్షించుచు దేవాలయముచుట్టును మూగిరి. దేవాలయ ప్రదక్షిణపూర్వకముగ శోభయాత్ర ప్రారంభింపబడియెను. మొదట సన్న్యాసులు పిదప ఇతరభక్తులు అందఱును కలిసి 'నేడపూర్వమానవు డావిర్భవించెను, చూడరండి' యను పాట బాడుకొనుచు బోయిరి. ఆ యపూర్వమానవుని పాలరాతివిగ్రహమే దేవాలయమున నున్నది. ప్రదక్షిణ ప్రారంభింపబడినది. పూజ్యపాద శ్రీశంకరానంద స్వాములవారు 'ఆత్మారాం' భరణి దీసికొనిరి. శ్రీ విశుద్ధానందస్వాములవారి శిరస్సున శ్రీరామకృష్ణుల ఛాయాపటము విరాజిల్లుచుండెను. శ్రీ యతీశ్వరానంద స్వాములవారు శ్రీ వివేకానంద స్వాములవారి ఛాయాపటమును ధరించిరి. పిదప శ్రీ ఆత్మప్రకాశానందస్వాములవారు శారదామణిదేవి ఛాయాపటము ధరించిరి. వీరందఱును మందిరమునకు ముమ్మారు ప్రదక్షిణము గావించి సంకీర్తనముచేసిరి. తదుపరి 'జయ శ్రీగురుమహారాజునకు జయ' యను జయధ్వానములతో దేవాలయము ప్రతిష్ఠింపబడెను. ఇట్టి యుత్సవమున అందఱును మైమఱచి యానందసాగరమున నీదులాడుచుండిరి.

ఉత్సవమునకు విపులములగు నేర్పాట్లు గావింపబడెను. ఈ మహదుత్సవమునకు జరిగిన నియమములన్నియును శ్రీ రామకృష్ణమఠ సన్న్యాసులును బ్రహ్మచారులును జరిపిరి. వారి సహాయార్థము వివిధాశ్రమములనుండియు పిల్లలు, యువకులు, యువకదళములు—వచ్చిరి. శోభయాత్రయందలి ప్రథమభాగము ముగిసినది. అందఱును తమ్ము తాము మఱచి యాత్రాలగ్నమనస్కులై యున్నచో యాత్రికుల గతి యేమెయ్యుండెడిది? కాన కొంతసేపటికి అచటికి వచ్చిన సన్న్యాసులు బ్రహ్మచారులు అందఱును కలిసి, వచ్చినవారికి వసతిస్థలము- స్త్రీపురుషులకును, సాధువులకును వేరువేరు గుడారులు ఏర్పాటుచేసిరి. వారికి వలసిన సౌకర్యములు చక్కగా సమకూర్చబడినవి. ఇందఱు యాత్రికులకు భోజనసదుపాయములను సమయానుకూలముగ ఆహారపదార్థములను సమకూర్చిన కార్యకర్తల నైపుణి వర్ణనాతీతము. లక్షలకొలది యాత్రికులు వచ్చినను యథా

సమయమున అందఱకును ప్రాతఃకాలభోజనము, తేనీరు మొదలు రాత్రిభోజనమువఱకు అన్నియు అందజేయుట ప్రశంసనీయముగదా! మఱునాటి యాహారముకొఱకు పూర్వదినము రాత్రియే వలయు నేర్పాట్లు ప్రారంభింపబడుచుండెను. 'జేకా'లతోడి యన్నము, పప్పు, కూర— ఈ వంటకము ఉదయముననే ప్రారంభింపబడు చుండెను. ఇవియన్నియును శ్రీరామకృష్ణునకు నివేదన కావింపబడుటవలన నిందపవిత్రత లేక యుండ జాగరూకత వహింపబడుచుండెను. రేయింబవళ్లు నిద్రనుగూడ లెక్కింపక యెందఱో భక్తులు భక్తురాండ్రు కూర్చొని కూరగాయలు తఱుగుచుండువారు. ఇట్టి చక్కని యుత్సవమునకు గావింపబడిన యనుకూలపరిస్థితుల నెవరును నెన్నటికి మఱువజాలరు.

కమ్మరపుష్కరిణియం దిట్లు జరుగుచుండ, జయరాంబటినుండి మరియొక శోభయాత్ర దళము బయలుదేరి వచ్చుచుండెను. అందు ప్రథమమున అచటి ఆదిమవాసుల సాము, గరిడీలు, ఢోలువాయిద్యము, పిదప మృదంగ కరతాళములతో శ్రీరామకృష్ణ సంకీర్తనము. వారి స్వాగతార్థము కమ్మరపుష్కరిణియందలి మాణిక్యరాజు స్వామిజీతోటయందు కొందఱు ఉత్సవదారులు వేచియుండిరి. జయరాంబటి నుండి వచ్చిన శోభయాత్రను కలిసి వీరును గొప్పగా సంకీర్తనమును గావించిరి. కాని మానవుని కంఠస్వర మెంతదూరము వినిపింప గలదు? లక్షలాదిజనులు గలిసియున్నారుగదా! ఆ సమయమున నధునాతన విజ్ఞానశాస్త్రము దీనికి మిక్కిలిగా తోడ్పడెను. 'మైక్రోఫోన్' వంటి శబ్దగ్రాహకయంత్రములచేత ఈ పాటలు, సంకీర్తనలు అన్నియు నూరుమూలలనున్న భక్తులందఱకుగూడ వినిపించు ప్రయత్నము గావించిరి. దేవాలయ ప్రతిష్ఠాపనమునందలి ముఖ్యాంగములు పూజార్చనలు. వీనికి గొప్ప గొప్ప యేర్పాట్లు గావింపబడినవి. ఈ పూజార్చనలు మూన్నాళ్లు జరుపబడినవి. అంతిమ దివసమున యాగయజ్ఞములు—రుద్రయాగము, సప్తశతీహోమము, శ్రీకాళీపూజ మున్నగునవి రాత్రింబవళ్లు పూజావరణమునకు సంపూర్ణ జీవనము గలిగించెను. ఆ మండపము! చక్కగా నలంకరింపబడి యలరారుచుండెను. మంగళ ఘటములు, హోమకుండము, మీది వివిధ పతాకలు—ఇవన్నియు గలిసి యా మందిరమునకు అనన్యమును నపూర్వమునగు శోభను గలిగించెను. శ్రీరామకృష్ణ మందిరమున పూజార్చనలు గావించు ననుభవముగల భక్తులెందఱో పూజయందు పాల్గొను నిమిత్తమచటి కత్యంత శ్రద్ధాభక్తులరై యరుదెంచిరి. కాశీపురినుండి దక్షపురోహితు లేతెంచిరి. వారి సుస్పష్ట సంస్కృతోచ్చారణముతోడి గానము వేదకాలపు సామగానమును యాత్రికుల హృదయాంబురుహంబుల స్ఫురియింపజేయుచుండెను. పూజలు గావించుచున్నవారలకు విసుగు విరామములన్న భావ మేమాత్రము లేదు. బయటి యుత్సవమున నేమి జరుగుచున్నదియో కనుంగొనుటకు సైతము వారి కవకాశ మావంతయు లభించినదికాదు. అయిననేమి? ఇట్టి పవిత్ర ప్రతిష్ఠాపన కార్యమున బాల్గొను నవకాశము లభించెగదా యని వారు హృదయపూర్వకముగ మురిసిపోవుచుండిరి. ఇది యేటి వింత యని గ్రామస్థులు ఆశ్చర్యమగ్నమనస్కులయిరి. చీకటిపడినంతనే అంధకారబంధురమై భయంకరమై దుర్గమమైయుండు నా పల్లె యంతయు విద్యుద్దీప సహస్రంబులతో నిండి యిది హఠాత్తుగా నొక పట్టణమయ్యెనా యని

పించెను. ఇది నిజమా స్వాప్నికమా యని గ్రామస్థులకు సందియము జనించెను. అసలు రాకపోకలకే యలవికాని యీ కుగ్రామమున కీ విద్యుద్దీపము లేమి? చూచుచుండగనే దుర్గ మారణ్యములన్నియు దృటిలో నదృశ్యములై యీ మహామంటపములు సద్యోద్భిన్నములగుట లేమి? ఈ విచిత్రముం గని వారెల్లరు నాశ్చర్య పరవశులగుచుండిరి.

సాధారణముగా బేలూరుమఠమున శ్రీరామకృష్ణ జన్మోత్సవ సమయములందు విసుగు విరామములనునవి లేక ఉదయాదిగ శాస్త్ర పఠనము, భజన, సంకీర్తనము, ఉపన్యాసములు జరుగుట పరిపాటి యని ఆసేతుహిమాచలము అందఱకును సుబోధమే. ఆ యుత్సవముల మున్ను గనుగొనినవారు ఈ కుగ్రామమున నయితము అది ఎట్లు సంభవించెనా యని ఆశ్చర్యపడుచుండిరి. మఱియొకవింత. ఎక్కడి కోయంబత్తూరు? ఎక్కడి కమ్మరపుష్కరిణి? కోయంబత్తూరునందలి శ్రీరామకృష్ణ విద్యాలయ విద్యార్థులు తమిళభాషయందు సుమధురములగు గేయముల నాలాపించి ఏతదుత్సవాగతుల నెల్లర విస్మితుల గావించిరి.

మన దేశమున నేదేని యుత్సవము జరిగినచో దానితోబాటు రాత్రిపూట వీధినాటకముల నేర్పఱచుట యాచారము. నేటి ఈ మహోత్సవమున నయితము అట్టి నిర్ణయము గావింపబడినది. ప్రథమదినమున పేరుగాంచిన హారా సమాజమువారు 'శ్రీచైతన్య నదియానగర లీలయు' ద్వితీయ దివసమున 'శ్రీచైతన్యుల జగన్నాథక్షేత్రలీలయు' నటించి మించిరి. సమస్తము ఆమూలాంతము భక్తిమయ కాలక్షేపమే. కాని ఎందఱో గ్రామస్థులు వీనికి అలవాటుపడినవారు కారు. వారు చూచు నాటకములన్నియు రాజులు, మంత్రులు, సైన్యములు, పోరాటములు- ఇట్టి పరికరములతో పాత్రలతో గూడుకొనియుండెడివి. కాన మన హారా సమాజీయుల నాటకములు వారి కేమాత్రము నచ్చినవికావు. ఒడిలోనున్న బిడ్డ నిదురించుటయో లేక తనంతట ఆ శిశువు నగుచుండుటయో జరుగుచుండెను. అందఱును అలవాటు ననుసరించి రాత్రి యాహారము కొఱకు బొరుగులును బెల్లమును దెచ్చుకొనియుండిరి. రాత్రి రెండున్నర ఘంటలకు నాటకము ముగిసినది. నాటకము వారి కాకర్షణీయముగాగాని తృప్తికరముగాగాని లేకపోయినది. కాన వారు తమలో తామిట్లు మాట్లాడుకొనుచుండిరి. 'ఇదియేమి నాటకము, రాజును లేడు, మంత్రియును లేడు, డాలు లేదు కత్తియును లేదు. యుద్ధ మంతకంటెను సున్న. ఇది యే దేశపు నాటకము? దీనినిగూడ నాటక మందురా?'

ఉత్సవము జయప్రదముగా ముగిసినది. ఇట్టి మహాసమావేశ మెట్టి యాపదలును లేక చక్కగా సాగిపోయినది. ఎట్టి పల్లెయందయినను నిట్టి మహదుత్సవము జరిగినచో దాని వెనువెంట నేదే నొక సాంక్రామికవ్యాధి సంభవించుట పరిపాటి. అయినను శ్రీరామకృష్ణులవారి యశేష కృపావిశేషమున నట్టి యుపద్రవ మెయ్యదియు సంక్రమించినదికాదు. రోగగ్రస్తుల నిమిత్తము వైద్యశాలయు నేర్పఱచిరి. కాని లక్షలాది జనులలో, యాత్రికులలో, నొకరయినను జబ్బుచేసినదని యందు ప్రవేశించినవారు కారు. వరుణదేవు డేమాత్ర మాగ్రహించియుండినను ఈ మహదుత్సవమునకు అపారాటంకము సంభవించియుండెడిది. కాని యింద్రుని దయవలన నట్టి యభ్యంతర

మావంతయు నావహిల్లినదికాదు. అందులకు మేమందఱము నెంతయో కృతజ్ఞులము.

ఇక నెల్లరును తిరిగి గృహాభిముఖులయిరి. 'బస్సులు' ఒకదానివెంట నొకటిగా నిలుచుకొనియుండెను. చూచుచుండగనే యవి ప్రయాణీకులతో క్రిక్కిరిసిపోయెను. డ్రైవరును 'స్టార్ట్' అని యాజ్ఞాపింపగనే 'జయ శ్రీరామకృష్ణ గురుమహారాజ్‌కీ జై' యను జయజయ నినాదములతో బండ్లు బయలుదేరుచుండెను. అంతకుమున్నే ప్రయాణీకులెల్లరు శ్రీరామకృష్ణాలయమునకు వెళ్లి కడసారి దర్శనము గావించుకొని పిమ్మట రఘువీరమందిరము * నకు వెళ్లి దర్శించి వచ్చుచుండిరి. బస్సులు తీవ్రవేగమున పయనించుచుండెను. మందిరము కొంచెకొంచెముగా నదృశ్యము కాజొచ్చెను. శిఖరము మాత్రము చాలదూరము వఱకు కనిపించుచుండెను. అది శివలింగాకారమున నొప్పుచుండెను. శ్రీరామకృష్ణులవారి ప్రియశిష్యులయిన శ్రీ శివానందస్వామివారు 'శ్రీ గురుదేవుడు త్యాగమూర్తి' యని వచించెడివారు. ఉమాపతియు సర్వత్యాగియు నగు శంకరుని ప్రతీకముగదా యీ శివలింగము. ఈ త్యాగమునే యుగయుగాంతములనుండి భారతదేశము అనుసరించుచున్నది. దేవాలయమున త్యాగీశ్వరుడు, పైనగూడ ఈ త్యాగచిహ్నము! ఈ ప్రాచీనాదర్శము నవీనభారతదేశమునకు సముచితము ఆదర్శమైయున్నదని ఈ కన్యాకుమారి పుష్కరిణియందలి పవిత్రదేవాలయము చాటుచున్నది. కొంచెము కొంచెముగా మందిర శిఖరాగ్రముగూడ నదృశ్యమయినది. ఉత్సవ పవిత్రస్మృతియే (యాత్రికుల హృత్కమలములయందు) మిగిలియుండెను.

* శ్రీరామకృష్ణ దేవాలయముతోబాటు వారి యిష్టదైవమగు శ్రీ రఘువీరునకును చిన్ని దేవళము నిర్మింపబడియెను.



# ని ష ద కా ళి

విద్వాన్ శ్రీ సూరాబత్తుల సుబ్రహ్మణ్యము, ఎం. ఏ., ఎల్. టి.

[ఇతఃపూర్వ శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులగు శ్రీ నిరజానందస్వాముల వారి పూర్వాశ్రమ నామము కాళీకృష్ణులు, తండ్రి డాక్టరు త్రైలోక్య నాథవసువు. తల్లి నిషదకాళి. శ్రీవారు 17–వ యేట మఠములో చేరి 78–వ యేట పరబ్రహ్మమున జేరిరి.]

"చదువునెడ నేడునీ శ్రద్ధ సన్నగిల్లె; ఆటలకునేని బోవు సాయంతనముల
తెలియరాదు నీమదిని నుద్దేశమేమొ; చదువు వీడి సన్న్యాసివై బ్రదుకబోదొ ?" 1

అనుచు త్రైలోక్యనాథుండు తనయునడుగ; సహజ భీరుడయ్యు సుతుండు సాహసించి
పల్కె, "ఔను, నామది విద్య పట్లబోక, ఆత్మ సాధన దెస మళ్లె నవశమగుచు" 2

ఇంతయును విని తండ్రి కోపింపబోక; సుతునకును హితబోధకై, "చూడు, బిడ్డ!
ఐహికార్థివై తేని విద్యల గ్రహింపు; పరము గాంక్షింతువేని సద్భక్తి నెరపు. 3

కాని రెండును నొకమారు గలుగబోవు; నిశ్చయము చేసికొని నీదు నిర్ణయంబు
వచ్చి తెలుపుము మూన్నాళ్ల వ్యవధిలోన"; అనుచు సెలవిచ్చె త్రైలోక్యుడాత్మజునకు. 4

వ్యవధి యవసర మెరుగని యువకుడెట్లొ; గడపి మూన్నాళ్లు, "ఆముష్మికంబె కోరి
మఠములో సాధులంగూడి మనుదు" ననుచు; పలికె, తండ్రియు సంతోషభరితుడగుచు,

"కలరు నల్గురుబిడ్డ లోకండు జ్ఞాన; పథము ద్రొక్కి తా పరమాత్ము బడయునేని
అమిత సంతోషకారణం బగునునాకె"; టంచు శ్లాఘించి పుత్రు దీవించె వసువు. 6

సుత చతుష్క మున్నను రాము యతినృపాలు; వెనుక మూన్నాళ్లు పంపగా వెతలగుందె
దశరథుండు, త్రైలోక్యనాథవసువు సుతు; శాశ్వతంబుగ స్వేచ్ఛ చేజారవిడచె 7

"అడిగిరమ్మ మీయమ్మ యేమనునొ" యనుచు; పంపె తనయుని త్రైలోక్యవసువు, నిషద
కాళిదెసకు, కాళీకృష్ణు కాంక్ష నెఱిగి; పలికె నా తల్లి నిసుమంత కలక లేక. 8

''అడ్డు తగులు దాననోకో నీ ఽ యాశయమున, కింట మూన్నాళ్లు నిలిచి నీ ఽ వేగవచ్చు
నాశ్రమము'' కంచు నాత్మజు ఽ నభిమతంబు; శైశవంబాది గుర్తించు ఽ జనని వల్కె. 9

గౌర చంద్రుసన్న్యాస కాంఽక్ష గనినంత; భూమిపైనోరగ శచీ సఽతీమతల్లి;
తల్లి మదినొప్పి తప్పింపఽదలచి పరమ; హంస సన్న్యాస మొందె రఽహస్య భంగి. 10

తన్ను విడచి తనూజుండు ఽ తరలు టెరిగి; జగతి నిలువునం గూలె కౌఽసల్య మున్ను
ఎంద రందురు తల్లులి ఽ ట్లెరిగి యెరిగి, కొడుకులన్ సాధు వృత్తికి - విడిచి పుచ్చ?11

నిషదకాళిక కొడుకుకై ఽ నిజకరముల; పసుపు రంగు పట్టించిన ఽ వసన మిచ్చె
''తొడిగి సన్న్యాసి జీవముఽగడుపు'' మనుచు; అహాహా! ధన్యులాయమ్మ, యాఽయాత్మజుండు.

ఇల్లువీడి మఠంబున ఽ కేగుదినము; వచ్చె, నిషదకాళి స్వహస్త ఽ పాకమైన
మధుర భక్ష్యంబులందించి ఽ మఠములోని; దేవు కర్పింపుమనుచు సంఽదేశ మిచ్చె. 13

కన్నతల్లిదంశ్రుల పదఽకంజ దళము; లద్దుకొని కన్నులం గృష్ణు ఽ డరసె తల్లి
నేత్రముల జాలువారు కఽన్నీటి ధార; దిగులువడె కృష్ణు మది, మోము ఽ దీనమయ్యె. 14

కూర్మి తనయుని చెదరిన ఽ గుండె జూచి; నిషద పయ్యెట దుడిచి కఽన్నీటి ధార
పలికె జ్ఞానధైర్యము లుట్టిఽపడగ ప్రీతి; తనయుశీర్షంబుపైన హఽస్తంబునిలిపి. 15

''పదియు నేడేండ్లు పెంచిన ఽ పశువు పైన; గాని పుట్టదే, పుత్ర, అఽజ్ఞాన సంయు
తాంధ మోహబంధ మిదియు ఽ నంతెగాని; చిర విచార సూచకమగు ఽ చింతవలదు.'' 16

చింత లేకుండుటే గాదు ఽ చిత్తమందు; పొంగి పొరలు నానంద తఽరంగరాశి,
పుత్రు డాత్మజయార్థియై బోవుచుంట; కంటదొరగిన వానంద ఽ కణము లంతె! 17

''పోయిరమ్ము, కుమార, సంఽపూర్ణసిద్ధి; బడయుగావుత నీ మనోఽవాంఛితంబు''
అనుచు దీవించి తన తల్లి ఽ యంప, కృష్ణు; డాశ్రమము జేరుకొనె నొక్కఽయంగలోన. 18

స్వాగతంబిచ్చి రతనికి ఽ స్వాములెల్ల; ఏడు పదులపై నెనిమిది ఽ యేండ్ల వరకు
తేజరిలె విరజానంద ఽ దేశికుండు; రామకృష్ణ మఠంబునన్ ఽ బ్రహ్మనిష్ఠ. 19

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

రామకృష్ణకుటీరము,
ఆల్మోరా,
14-8-'16.

ప్రియ...

మొన్నటి నీ తపాలాకార్డు చేరినది. అంతకు కొంతపూర్వము నీయుత్తరమునుగూడ జూచితిని. దానికి ప్రత్యుత్తరము వ్రాయలేదు కాబోలు. మరియొక వ్యక్తికి ఉత్తరము వ్రాయుచు నీయుత్తరమందినట్లు మాత్రము గుర్తించితిని. ఆ యుత్తరము వ్రాయ మఱచితి నని దుఃఖింపకుము. ఉత్తరము వ్రాసినను వ్రాయకపోయినను ఎల్లప్పుడును నీ శ్రేయస్సు కొఱకు భగవంతుని ప్రార్థింతునను మాట నిశ్చయము. భగవానుని శరణుజొచ్చువారెల్లరు మాకు అత్యంతమాప్తులు. 'చైతన్యుని భజించువారెల్లరు మా ప్రాణములకు ప్రాణ'మని కృష్ణచైతన్యులు వచించువారు.

అద్వైతాశ్రమముననుండి భగవద్ధ్యానమును భజనమును జేయుచున్నావని అపుడపుడు 'ప్రా—' వలన విని యెంతయో యానందించువాడను. మనస్సును సంపూర్ణముగా భగవంతుని శ్రీపాదపద్మముల కర్పింపగలిగినచో మనము శాంతియుతులమై యుండగలము. అర్పింపజాలము—అర్పింప ప్రయత్నము చేసినచో భగవానుడు దరిజేర్చుకొనును. శ్రీరామకృష్ణులవారిట్లు వచించువారు. ఎవరు భగవంతున కభిముఖులై పదియడుగులు ముందిడుదురో వారికి భగవంతుడు అభిముఖుడై నూరడుగులు నడచివచ్చును.' అట్లు కానిచో ఎవరు ఆయనను దర్శింపగలరు? పురుష ప్రయత్నమాత్రమున నది అసంభవము. శ్రీ వివేకానందస్వాములవారొకానొక సమయమున నాతో నిట్లు పలికియున్నారు. "భగవానుడు కాయగూరలవంటివాడా? ఇంత జపము ఇంత తపముచేసి పడయుటకు. ఆయనను బడయవలయునన్నచో ఆయన కృపయే అందులకు తగిన సాధనము—యమే వైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్. ఈ యాత్మ ఎవని వరించునో ఆతడే దానిని పొందగలడు. అతని యొద్దనే ఆత్మ స్వీయస్వరూపమును ప్రకటించును." (కఠోపనిషత్తు. 1-2-23. ముండకోపనిషత్తు. 3-2-3.)

అట్లయినచో జపతపము లనావశ్యకములా యని నీవు ప్రశ్నింపవచ్చును. అవి తప్పక అనుసరణీయములే. నీ శక్తికొలది వానిని సాధింపవలయును. కాని నేనింతటి జపము నింతటి తపము చేయుచున్నాను. భగవంతుడు నాకు నిజముగా దర్శనమొసంగుననుకొనుట పొరపాటు. ఇదిమాత్రము మఱువక జ్ఞాపకముంచుకొనవలయును. భగవంతుడు కృపామయుడు. ఆయన మనపై తన కృపను వర్షించి మనల ననుగ్రహింపగలడు. మనము జపతపము లాచరింపక యుండనేరము కావుననే వానిని అను

ష్ఠించుచున్నాము. ఈ జపతపములు మన ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె స్వాభావికములు గావలయును. ఇవి మనకు నీశ్వరసంబంధము గల్పింపగల సాధనమాత్రములే. భగవద్దర్శనము ఆయన కృపామయమే కాని జపతపాదిక సాధకము కాదన్న భావము బద్ధమూలము కావలయును. ఇట్టి నమ్మకము హృదయమున నాటుకొనుట యెంతయో ఆవశ్యకము. భక్తి సాధనలన్నియు తెక్కలాడించుటకొఱకే. తదుపరి తెక్కలాడి యలసినపు డొకచో కూర్చొన ప్రపత్తి కలుగును. అపుడు పక్షి గత్యంతరములేక ఇతర ఆశ్రయము లభింపక పోవుటవలన వ్రేలుగొమ్మపైన వచ్చి కూర్చొనును. అనంతాకాశమున ఎగిరి ఎగిరి విశ్రమస్థాన మెందునులేదు అన్నభావము దృఢమైనపుడే అనన్యశరణ్యులమగుదుము. ఇందుకొఱకే జపతపములను, ధ్యానము, భజనము— ఇవి చేయగలయంతవఱకు యథాశక్తిగ చేయవలయును. ఇవన్నియు చేసి చేసి చివరకు వీని వలన ప్రయోజన మేమంతయు లేదన్న స్థితి సంభవించును. 'నా జపమాల, సంచి, మడిబట్ట— ఇవన్నియు నా గదియందు వ్రేలాడుచున్నవి' యను పాటను నీవు వినియుండవచ్చును. అప్పుడు సాధకుడు 'నీ స్వీయగుణమగు కృపను జూపినచో జూపుము. అట్లు కానిచో కమలాకాంతుని* జూడుము. లేనిచో జపతపములవలన నిన్ను బడయుట యంతయు పిశాచవివాహతుల్యాలాపము? పిశాచవివాహ మెన్నడును జరిగియుండలేదు, జరుగదుకూడ. సాధనవలన నెవరును నిన్ను బడయజాలరు. భగవత్కృప కలిగిననే కాని, లేక కమలాకాంతునివలె భగవదైకశరణ్యులమై యున్ననే కాని యది సంభవము. అటు గానిచో రామప్రసాదేల యిట్లు పలికియుండును? 'ఏల ఊరక అమ్మా, అమ్మా యని ఏడ్చెదవు? మాతృదర్శనము నీకు కలుగనే కలుగదు. ఆమె యుండియున్నచో నీ కీపాటికి తప్పక దర్శనమిచ్చియేయుండును. ఆమె ప్రాణములతో లేదు.' కాని ఈ భాషణము నిరాశాఫలితముకాదు. * * * *

భగవానుడు ప్రాణమునకు ప్రాణము, ఆత్మకు ఆత్మ. ఆయనను బడయనిచో మనకు ఆశ్రయము కలదా? కాని మనమెట్లయినను ఆయనను పడయవలసినదే. కాని ఆయన ఏ భావమునకు విషయమై యుండునో అది (ఆ యవస్థ) విషయభావాతీతము. అట్టి స్థితిని ఆయనయే కలిగింపవలయును. ఆయనను మనఃప్రాణములతో బిలిచినచో హృదయాంతర్యామియై ఆయన సమస్తమును చక్కజేయును. అప్పుడే బ్రహ్మసాక్షాత్కారము.

అచిరకాలమునందే నీకు అట్టి స్థితిని భగవానుడు కలిగింపవలయునని నా హృదయపూర్వక ప్రార్థన. మీరందఱు సుఖముగా నున్నారని విని సంతుష్టుడనైతిని.

ఇట్లు,
శుభాశీర్వచనములతో
శ్రీ తురీయానంద

* ఒకానొక దేవీభక్తుడు.

ఓమ్ తత్సత్.

# దేవీసవము

శ్రీ ఆత్మానందస్వామి

శ్రీకరుఁడు, కొత్తలంకన్ బ్ర | సిద్ధిఁజేసి; చనిన యవధూత గురుదేవు | చరణములకు
మ్రొక్కి గీతముల రచింతు | మోదమలర; యాదవి దయను తెరదీయు | మమ్మ వేగ. 1

ఏకరూపున వెల్వడి | యిరువదైదు; తత్వములఁ దాల్చి నీవనంతంబవగుచు
బరగుచుంటివి పరమాత్మ | భావమందు; మరుగెఱుగలేను తెరవవే | తెరను కాళి. 2

నిన్నెఱుంగ నాశింపను | నిన్నెఱుంగ; నేరిశక్యమా, లేరు ని | న్నెఱిఁగినట్టి
వారు నేఁటికి, ముందుండ | బోరు, నీదు; తెరను దొలఁగించు పార్వతి | కరుణతోడ. 3

అజుఁడు మొదలుగ స్తంభప | ర్యంతమీవె; కాళి, భీతికలుఁగుచుండె | కారణంబు
మఱుఁగు వడఁగను తెరవవే | తెరను తల్లి!; యణఁగు మీవు జన్మస్థాన | మందు తిరిగి. 4

ముంచుకొనకమ్మ నీమాయ | ముసుఁగులోన; నాదరముఁ జూపుమీ బిడ్డ | యందు నుంత
నీ చరణకమలములందు | నిశ్చలంపు; భక్తిఁ గలుగంగఁ జేయుము | ముక్తికొఱకు. 5

యుగము లాదిగ హాయిగ | నులుకుచెంద; కణఁగినావు మూలాధార | మందు, నిదుర
బోవుచును, రేయిఁబవలన | కీవు, వేగ; దయను మేల్కాంచి తెరదింపు | తల్లి నేడు. 6

బురదలోఁ బొర్లు పందులు | పుట్టుటకును; చక్రవర్తిగఁ బాలించు | జనవరునకుఁ
గారణంబీవె యని తెల్వి | గాంచినాడఁ; దెరఁ దెరువుము కాత్యాయని | మరుగిఁకేల. 7

కామినీకాంచనంబుల | గలుగఁజేసి; దాన మరగించి మఱపించు | దాన వీవె
మిసిమి విసముల ద్రాగించు | మేటి వీవె; తెలిసికొంటి నేఁటికి తెర | దీయుమమ్మ. 8

వేదములు నాల్గు వల్లించి | విఱ్ఱవీగు; వారు, ఒ న మా లనఁగరాని | వారు, దేవి
నీదు కుక్షిలో మునిఁగిరి | నిజమెఱుంగ; లేక, నీ మరుగు దెలియ | లేరు జడులు. 9

ఇంద్రియంబులై, వెనువెంట | నిమిడియుండి; వాంఛల రగులఁజేసి, య | వాంతరములఁ
గల్పనలఁ జేయుదమ్మ నీ | కరుణలేమి; దిక్కుగొనరమ్మ, తెరను | దీయుమమ్మ. 10

(సశేషము)



# శ్రీ వాసుదేవ మననము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

ప్రకృతమున జీవునకు గలిగెడి బ్రహ్మప్రాప్తి 'అప్రాప్త ప్రాప్తి'యా లేక 'ప్రాప్త ప్రాప్తి'యా యనెడి విషయము (సందేహము) నందు "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి" (బృ. 4-4-6) జీవుడు స్వయముగ బ్రహ్మమే యగుచు స్వాభిన్నముగ బ్రహ్మమును బొందుచున్నాడు. "విముక్తశ్చ విముచ్యతే" (కఠ. 2-5-1) నిత్యముక్తుడైన పరమాత్మ సదా నిస్సంగుడు. సంసారబద్ధుడెన్నడునుగాడు. అను నిత్యాది శృతులవలన జీవబ్రహ్మైకత్వము సిద్ధాంతభూతమే యగుటంజేసి జీవునకు బ్రహ్మప్రాప్తి "ప్రాప్త ప్రాప్తి" రూపమైనదేయని నిరూఢమైనది. ఇందుకు ప్రమాణము- "నిత్యప్రాప్తస్యచా ప్రాప్తిః విభ్రమః ఖలు దేహినాం। విభ్రమస్య నివృత్త్యాసా ప్రాప్తేతి వ్యపదిశ్యతే" (సూత సంహిత) నిత్యప్రాప్తమైన బ్రహ్మముయొక్క అప్రాప్తియనెడి భ్రాంతి దేహులకు గలుగుచున్నదిగదా. ఆ విభ్రమము యొక్క నివృత్తిచేత సిద్ధించు బ్రహ్మప్రాప్తియే 'ప్రాప్త ప్రాప్తి' యని ప్రసిద్ధమగుచున్నది అని సూత సంహితయందు జెప్పబడినది. "ఆత్మాతు సతతంప్రాప్తో ఽప్యప్రాప వదవిద్యయా। తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా" (ఆత్మబోధ. 44.) ఆత్మ సంతత ప్రాప్తమేయైనను అవిద్యా ప్రతిబంధముచేత అప్రాప్తమువలె నుండును. అవిద్యా నాశమందు, భ్రాంతి నాశమందు స్వకంఠాభరణము కైవడిని, నూతన ప్రాప్తమువలె ప్రకాశించును. అట్లగుట జీవుడు సదా బ్రహ్మస్వరూపుడేయగుచు సర్వదా బ్రహ్మీభావమును బొందియే యుండును. ఇపుడు నవీనముగ బొందవలసినది, పొందినది ఏమియు లేదు. నిత్యప్రాప్త బ్రహ్మభావుడైన జీవుడు అవిద్యావశము వలన బ్రహ్మముకంటె నన్యముగ గ్రహింపబడుచున్నాడు. ఈ యవిద్య యెపుడు నశించునో అనగా ఆత్మజ్ఞానముచేత అజ్ఞానము బాధింపబడినపుడు స్వకంఠాభరణమువలె సత్యముపలబ్ధమగును; అనుభూతమగును. కనుక జీవునకు బ్రహ్మప్రాప్తి అజ్ఞాననివృత్తిమాత్ర రూపమని చెప్పుట యుచితము. "సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి" (గీ.5-24) జ్ఞానయోగముచేత అసంప్రజ్ఞాత సమాధినిష్ఠాప్రవృత్తుడైన బ్రహ్మవిత్తముడు స్వయముగనే నిరంతర బ్రహ్మనిష్ఠచేత బ్రహ్మభూతుడై అనగా నిశ్శేషముగ దేహాత్మభావమును పరిత్యజించి బ్రహ్మమునందే ఆత్మభావమును పొందినవాడగుచు బ్రహ్మనిర్వాణము—విదేహకైవల్య సుఖమును అధిగమించునని భగవద్వాక్యము. అందువలన బ్రహ్మాంశమై బ్రహ్మమేయైయున్న జీవునకు బ్రహ్మప్రాప్తికలుగుననుట విరుద్ధముకాదు.

జీవునకు బ్రహ్మాంశత్వమనగా-మహాకాశము నందు ఘటాకాశమనునది ఘటావరణమూలమున బరిచ్ఛిన్నమగుటంజేసి మహాకాశమునందలి అంశమని యెటుల చెప్పబడుచున్నదో అటులనే జీవుడును అవిద్యావరణ మూలమున బరిచ్ఛిన్నుడగుటంజేసి యపరిచ్ఛిన్నము, నిరంశము, నగు అద్వితీయాఖండైకరస పరబ్రహ్మమునందు వాస్తవముగ నంశము (భాగము) మిథ్యయేయైనను, జీవుని అవిద్యా పరిచ్ఛిన్నత్వమువలన జీవుడు బ్రహ్మమునందంశమని యజ్ఞానులు భావించుచున్నారు. జీవునకు బ్రహ్మాంశత్వము యథార్థముకాదు. జీవాత్మ పరమాత్మలు వస్త్వజ్ఞానమువలన పరస్పర భిన్నముగ భావింపబడుచున్నవనియు ఆత్మ విజ్ఞానముచేత అజ్ఞానము బాధితముకాగా జీవాత్మ పరమాత్మలు ఏకమగు అద్వితీయాఖండైకరస పరబ్రహ్మచైతన్యమనెడి విషయము స్వానుభవసిద్ధమగుననియు గ్రహించవలయును.

బ్రహ్మజ్ఞానమువలన పునరావృత్తి రహితమైన పరబ్రహ్మప్రాప్తిఫలమని ప్రతిపాదింపబడినది. అయితే బ్రహ్మజ్ఞానులైన వశిష్ఠాదుల యుత్పత్తికి గారణమేమి?

''అథయ ఆత్మాససేతుర్విధృతి రేషాం లోకానామ సంభేదాయ॥'' (ఛాం. 8-4-1.) సత్తాస్ఫూర్తి సంతోషస్వభావముగల పరమాత్మ లోకములయొక్క అసాంకర్యము కొఱకు అనగా లోకములు వర్ణసంకరము గాకుండ నష్టపడి సంరక్షించుటకొఱకు సేతువు రీతిని నిలిచినవాడై ధారకుడుగ నున్నాడు. ''యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥'' (గీ. 4-7.) ఎప్పుడెప్పుడు వర్ణాశ్రమ వ్యవస్థారూపమైన ధర్మమునకు హానియు, అధర్మమునకు ఔన్నత్యమును గలుగుచుండునో ఆయాయవసరములయందు నేను నన్ను స్వేచ్ఛచేత సృజించుకొనుచున్నాను. అనగా వేదోక్త ధర్మముయొక్కయు, అధర్మముయొక్కయు అను గ్రహ నిగ్రహయోగ్యమైన నామరూపములతో సర్వాంతర్యామియైన ఈశ్వరుడు అవతరించునని యర్థము. ''పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥'' (గీ. 4-8.) స్వధర్మము నెన్నడును విడువక స్వ శరణ్యులైన సాధువులను వారికి శరణ్యమైన వైదిక ధర్మమును పరిపాలించుట కొఱకును, శాస్త్రవిధుల నుల్లంఘించి సర్వవిధముల అనగా త్రికరణములచేతను శాస్త్రనిషిద్ధములనే ఆచరించుచు వేదనిందకులైన దుష్కర్ములయొక్క వినాశముకొఱకును, అధర్మనిరసన పూర్వకముగ నిశ్శ్రేయస సాధనమైన వైదికధర్మ సంస్థాపనముకొఱకును ప్రతియుగమునందు నేను స్వయముగనే స్వమాయచేత విశేషముగ నవతరించుచున్నాను. ధర్మానుష్ఠానాధికారులందఱచేత నియమముతో విధ్యుక్తధర్మానుష్ఠాపనమే ధర్మసంస్థాపనము. ఇందువలన సాధుపరిపాలనము, అసాధువినాశనము, ధర్మసంస్థాపనమునను నీ త్రితయమే భగవదవతారమునకు ప్రయోజనమని సూచితమగుచున్నది అను నిత్యాదిశ్రుతిస్మృతులు ప్రమాణముగ బ్రహ్మజ్ఞానులైన వశిష్ఠాదులు లోకోద్ధరణార్థము అధికారరూప శరీరులైరి. ''యావదధికార మవస్థితిరాధికారికాణాం'' (బ్ర. సూ. 3-3-19-32) బ్రహ్మజ్ఞానులైన వ్యాస వశిష్ఠాదులు పరమేశ్వర నియోగమువలన వేద ప్రవర్తనాద్యధికారములయందు నియమింపబడుటచేత వారికి మఱల జన్మము కలిగినది

కాని బ్రహ్మవిద్య మోక్షహేతువు కాదన రాదు. విష్ణునివలన నియోగింపబడుటకూడా ప్రారబ్ధములో చేరినదే గనుక నది యనుభవింపవలయును. ఇది జ్ఞానులకందఱకు సమానమే. ఆత్మవిదులైన వశిష్ఠాదులు పునర్భవులైనను, అధికారమున్నంతవఱకు మాత్రము సదేహులయ్యును, జీవన్ముక్తులును విదేహముక్తులును అనుటయందు విరోధములేదు. మఱియు వారు, స్వాతంత్ర్యముచేత నొకగృహమునుండి మఱియొక గృహమునకు బోవునట్లే, దేహమును నిర్మించుకొనినవారుగాని జాత్యాది స్మరులుగారు. వర్తమాన శరీరముకంటె భావి శరీరమునకు గారణమగు కర్మము కలుగునెడల నది తప్తముకాని బీజమువంటిదగునని శంకింపదగదు. "స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః" (ఛాం. 7-26-2) బ్రహ్మజ్ఞానము వలన అవిద్యాకృతానర్థ పాశరూపహృదయ గ్రంథులన్నింటికిని నిశ్శేషముగ సమూల విమోచనమని శ్రుతి ప్రమాణముగ నటువంటి కర్మము దగ్ధబీజమువలె నిర్వీర్యమై ఫల జనన శక్తిని గోలుపోవుటచేత పునర్జన్మారంభకము కానేరదు.

శరీరము లభించినదగుచుండగా నిక బ్రహ్మజ్ఞానముయొక్క ప్రయోజనమేమి? కనుక జ్ఞానులయొక్క అధికారరూప పునరుత్పత్తిని మే మంగీకరింపమనిన— చిదాత్మ నిరావరణుడు, స్వతంత్రుడు, పూర్ణానందస్వరూపుడు. యథార్థముగ నానృతుడుగాడు, మాయావచ్ఛేదముచేత క్రియలకు గర్తయు బద్ధుడు నగుచున్నాడు. అట్లు కానియెడల సృష్టికార్యమే కానేరదు. "సూర్యా చంద్ర మసౌధాతా యథాపూర్వ మకల్పయత్। దివంచ పృథివీంచ అంతరిక్ష మథోసువః॥" (ఋ. వే. 10-190-3) పరమేశ్వరుడు పంచభూతములను, పదునాలుగు భువనములను, సూర్యచంద్రాదులను, తత్తల్లోకానుగుణమైన భోగ్యజాతమును తద్రూపమగు సృష్టిని సర్వమును, పూర్వకల్పముల యందెటుల కల్పించెనో ఆయా ప్రకారములుగ నీ కల్పమునందును కల్పించెనని సృష్టివిషయమున శ్రుతిమానము. ఆత్మజ్ఞానముచేత నజ్ఞానము నశించుచుండగా ప్రారబ్ధవశము వలన శరీరము ప్రారబ్ధక్షయ పర్యంతము ప్రవర్తించుచున్నను అజ్ఞానము మాత్రము మఱల పుట్టనేరదు. "బీజాన్యగ్ని ప్రదగ్ధాని నరోహంతి యథాపునః। జ్ఞానదగ్ధై స్తథాక్లేశై ర్నాత్మా సంపద్యతేపునః॥" (సర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహము. 840) అగ్నితప్త బీజముల నుండి యంకురోత్పత్తి కలుగనిభంగి, తత్త్వజ్ఞానాగ్నిదగ్ధమైన అజ్ఞానము మఱల అంకురింపదు. "ఇయంజ్ఞానకలారామ సకృజ్జాతాపి వర్ధతే। తూలాగ్నివద్విద్యోతి।" ఆత్మజ్ఞానమొకసారి యంకురించిన, దూదిముం దగ్నిచందమున పెంపొందుచునే యుండును' అని శ్రీ రాముని గూర్చి వశిష్ఠుడు చెప్పెను. కనుక ప్రారబ్ధవశమున శరీర పరిగ్రహము కలిగినను, బ్రహ్మజ్ఞానప్రాప్తి సమకాలమునందే అజ్ఞానము బ్రహ్మజ్ఞానముచే బాధితమగుటంజేసి జ్ఞానులకు నేనెవరనెడి భ్రాంతియుండదు. "యస్మిన్సర్వాణి భూతా న్యాత్మైవాభూద్విజానతః। తత్రకో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః॥" (ఈశావాస్య. ఉ. 7.) ఆత్మవివర్తరూపమేయగు చేతనాచేతనరూప భూతములు సర్వము. పరమార్థాత్మదర్శనమువలన నాత్మయేయగును. పరమార్థ వస్తువిజ్ఞాన సిద్ధుడైన జ్ఞానికి స్వానుభవజ్ఞానదశయందు సర్వము ఆత్మస్వరూపమే యగుటంజేసి ఆవరణశక్తికార్యమైన

మోహమును విక్షేపశక్తికార్యమగు శోకమును ఎక్కడివి? శోకమోహములు కామబీజమైన అజ్ఞానమువలన గలుగును. నిత్యశుద్ధ బ్రహ్మాత్మైకత్వమును జూచుచున్న బ్రహ్మవిదునకు గలుగనేరవని యీ మంత్ర ముపదేశించుచున్నది.

జడమైన సకల ప్రపంచము నశించుచున్నను ఆత్మకు నాశములేదు. "అవినాశీవా౽రే౽య మాత్మా౽నుచ్ఛిత్తిధర్మా॥" (బృ.ఉ. 6-5-14) అబాధిత స్వభావముగల యీ ప్రత్యగభిన్న పరమాత్మ అవినాశి. "జీవాపేతంవావకి వేదం మ్రియతే। నజీవోమ్రియత ఇతి సయఏషో౽ణిమా॥" (ఛాం. 6-11-3.) జీవునిచేత విడువబడిన శరీరముమాత్రమే నశించుచున్నది. జీవుడు నశించుటలేదు. ఇది బహు సూక్ష్మ విషయము. స్వప్రకాశుడు సర్వప్రకాశకుడు, అజుడునగు చిన్మాత్రాత్మకు (జనసంపర్కము లేని ఆత్మకు) లోపమెన్నడును లేదు. దృశ్య ప్రపంచ మఖిలము ద్రష్టయగు ప్రత్యగభిన్న పరమాత్మాధీనమే. "నహిద్రష్టుర్ద్రష్టే ర్విపరిలోపో విద్యతే। అవినాశిత్వాత్॥" (బృ. ఉ. 6-2-3) అవినాశ స్వభావ చిన్మాత్ర సాక్షి రూపాత్మకు అభావమెన్నడును లేదు. ప్రత్యగాత్మ లక్షణ చైతన్యము అలుప్త స్వయం ప్రకాశము. "ఆత్మైవాధస్తాత్॥ ఆత్మోపరిష్టాత్। ఆత్మాపశ్చాత్। ఆత్మాపురస్తాత్। ఆత్మాదక్షిణతః। ఆత్మోత్తరతః। ఆత్మైవేదం సర్వం॥" (ఛాం. 7-25-2.) దశదిశలయందును పరిపూర్ణముగ వ్యాపించి సకల ప్రపంచ స్వరూపముతో ప్రకాశించుచున్నది. ఆ కేవల సచ్చిదానంద అద్వితీయాఖండైకరస పరబ్రహ్మ వస్తుమాత్రమేయని సర్వవేదాంతసిద్ధాంతము.

ఈప్రకారము జడాజడ విభాగ విచారణము వలన ఆత్మ నిరావరణమని చక్కగా స్ఫురించును. అంతట సంవిదభిన్న ఆత్మానందము అవ్యవహితముగ ననుభూతమగును. అనగా విధి విధానమైన స్వధర్మ నిర్వహణరూప తపస్సు వలన నిర్మల స్వాంతుడై యంతట నీశ్వరానుగ్రహమువలన సమాసాదిత సాధన చతుష్టయ సంపన్నుడై అంతట సద్గురూపదిష్ట వేదాన్త శ్రవణ మనన నిదిధ్యాసనాభ్యాస పాటవ సంజనిత ఆత్మవిజ్ఞానముచేత నిరస్త జగద్భ్రాంతుడై, ఆత్మేతరవృత్తి శూన్యముగ అఖండైకరసాత్మాకారాకారిత వృత్తి నప్రశాంతము పొంది యుండు బ్రహ్మవిద్వరిష్ఠుడు స్వాభావికముగ - (అప్రయత్నముగనే) అద్వితీయాఖండైక రస పరిపూర్ణ పరబ్రహ్మమే తానై విరాజిల్లును. అతడే జీవన్ముక్తుడు. అతడే విదేహముక్తుడు.

(సశేషము)



సురభ్‌మల్స్




313, ఎస్ప్లనేడ్, మద్రాసు.

8—(S—2)

---

లాల్‌జి గోధు & కంపెనీవారి




మార్కు గమనించి
కొనుడు
మోసపోకుడు

లాల్‌జి గోధు అండ్ కో
సౌకార్‌పేట, మదరాస్

(L G 8-2)

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| షికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | |
|---|---|---|---|---|
| గురూపదేశములు | ... | 0 | 8 | 0 |
| నాసంస్కరణ యుద్ధవిధానము | ... | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | ... | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | ... | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | ... | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | ... | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | ... | 0 | 1 | 0 |
| నా మతము 0 0 6 | డజను | 0 | 5 | 0 |
| సింహగర్జన 0 0 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెనురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎమ్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానంద స్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-8-51.

# శ్రీ రామకృష్ణ ప్రభ

47

౧౯౫౧, సెప్టంబరు—ఖర, భాద్రపదము

సంపుటము ౮ సంచిక ౩







శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు

చెన్నపురి

# విషయ సూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు దాఁటి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 – మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలఁచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదమ్‌వారి స్టాలులలోఁ గాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్యను దాఁపరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ } ౧౯౬౧ – సెప్టెంబరు :: ఖర – భాద్రపదము { సంచిక ౩

## ప్రార్థన

### శ్రీ దేవీ శరణమ్

తామగ్నివర్ణాం తపసా జ్వలన్తీం
వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్ ।
దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే
సుతరసి తరసే నమః ॥

దేవి యోగుల హృదయములందు అగ్నిశిఖవలె అరుణవర్ణముతో ప్రకాశించునది; జ్ఞానప్రభతో వెలుంగునది. ఆమెయే యీ బ్రహ్మాండమందంతయు చైతన్యస్వరూపమున ప్రతిబింబించుచున్నది. దేవతలు, మానవులు—అందఱును కర్మఫలాపేక్షకులై ఆమెనే సేవించుచున్నారు. మేము ఆ దుర్గాదేవిని శరణుజొచ్చుచున్నాము. సుఖతారణీ స్వరూపిణియైన తారిణికి నమస్కారము.

దేవీం వాచమ జనయంతదేవాస్తాం
విశ్వరూపాః పశవోవదంతి ।
సానో మంద్రేష్ట మూర్జం దుహానా
ధేను ర్వాగ స్మానుపసుష్టుతైతు ॥

ప్రాణాది వాయుపంచకము సహాయముతో ఏ భావమును వెల్లడించుటకై వాక్యము లుచ్చరింపబడునో, దానిని భాష యని వ్యవహరింతురు. ఆ భాషయే మాకు కామధేనువు వంటిది. కాని దేవియే ఆ భాషాస్వరూపము. కావున ఆమె సంతుష్టురాలై మా కోరికలను నెఱవేర్చుగాక!



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ వచనామృతము — 'మ.'

26 సెప్టెంబరు, 1883.

శ్రీరామకృష్ణ గురుదేవుడు జగన్మాతృ దేవాలయ మంటపమున గూర్చొనియుండెను. ఆయన సన్నిధానమునందు 'మ.' మున్నగు భక్తులు గూర్చొనియుండిరి. ఇంతకుపూర్వము శ్రీరామకృష్ణులవారు, "భగవత్సంబంధమును ఎవరును పరిమాణరూపమున దెలుపజాలరు. ఆయన అనంతైశ్వర్యస్వరూపుడు. మానవుడేమాత్రము వచింపగలడు? ఒకచీమ పంచదార కొండనుజేరి అందలి యొక కణమును దీసికొన్నంత దానితోడనే దాని కడుపు నిండిపోయెను. అది ఆ కొండనంతటిని తన పుట్టలోనికి దీసికొనిపోవలయునని తలంచెను. భగవానునిగూర్చి చక్కగా దెలియగలవాడెవడు? కావుననే నా భావము పిల్లికూనవంటిది. తల్లి పిల్లి యెందుంచునో అచటనే అది పడియుండును. నాకేమియు దెలియదు. పసిబాలునకు తన తల్లి యైశ్వర్యమునుగూర్చి యేమయినను దెలియునా?" అని పలికియుండిరి.

కొంతసేపటికి దేవీవిగ్రహాభిముఖులై ప్రార్థనను బ్రారంభించిరి. 'జననీ! ఓంకారరూపిణీ! [illegible]ల్ల! వీరందఱు నెన్నియో విధములుగా వచించుచున్నారమ్మా! నాకేమియు బోధపడలేదు. నాకేమియు దెలియదు. నీకు శరణాగతుడను. నీ పాదపద్మములందు శుద్ధభ_ కలుగునట్లు మాత్రము నీవు కావింపవలయును. నీ భువనమోహిని మాయకు ముగ్ధుని గాకుండ రక్షింపుము. శరణాగతుడను.'

దేవాలయమునందు దీపారాధన ముగిసినది. శ్రీరామకృష్ణులు తిరిగివచ్చి తమగదిలో చిన్న మంచముపై గూర్చొనిరి. 'మ.' యు వారి తోడనే గదికివచ్చి క్రింద గూర్చొనెను.

'మ.' ఇంతకుపూర్వము సర్వదా కేశవసేనుని బ్రహ్మసమాజమునకు బోవుచుండెడివాడు. కాని శ్రీరామకృష్ణుల దర్శనము గావించినప్పటినుండియు నచటికి బోవుట మానివైచెను. శ్రీరామకృష్ణులు సర్వదా జగన్మాతతో సంభాషణము చేయుచుండెను. ఇది చూచి 'మ.' ముగ్ధుడయ్యెను. వారి సర్వధర్మసమన్వయ సిద్ధాంతమును వినియు భగవల్లాభమునందు వారియెడ గోచరించిన వ్యాకులమును గాంచియు నాశ్చర్యమగ్నుడయ్యెను.

'మ.' దాదాపు రెండేండ్లనుండియు శ్రీరామకృష్ణులవారికడకు వచ్చుచు బోవుచు నుండెను. వారి యనుగ్రహమునుగూడ బడసెను. ఆయనకును ఇతర భక్తులకును శ్రీరామకృష్ణులు 'భగవానుడు నిరాకారుడు, సాకారుడుగూడ. భక్తులకొఱకు రూపధారియగును' అని బోధించెను. నిరాకారవాదులతో 'మీకు ఎందు విశ్వాసము గలదో దానినే యనుసరింప

వచ్చును కాని మీరీ విషయమును మాత్రము గమనింపవలయును. భగవంతుడు సమస్తమును గావింపగలడు. ఆయన సాకారుడు నిరాకారుడు గూడ. ఇంకను ఎన్నియోవిధములుగగూడ కాగలడన్న విషయము మఱువవలదు' అని పలికిరి. 'మ.' తో, 'నీవొకదానిని బట్టుకొంటివి. నిరాకారభావము, అదియేనా ?'

'మ.':—చిత్తము, కాని మీరు చెప్పినట్లు సమస్తమును సంభవనీయమే. సాకారముగూడ సంభవనీయమే.

శ్రీరామ:—భేష్. నీవు తెలిసికొనవలసినది మఱియొకటి. అది 'ఆయనయే చైతన్యస్వరూపమున చరాచర విశ్వమునందంతయు వ్యాపించియున్నా'డనుట యే.

'మ.':—ఆయన చేతనమునకుగూడ చేతయితయని నేను తలంచుచున్నాను.

శ్రీరామ:—ఆ భావమునందే నిలిచియుండుము. దీనిని విడిచి మరియొకదానిని గ్రహింపనవసరము లేదు. ఈ ప్రపంచమునందు వెలయుచున్న చైతన్యము సమస్తమును ఆయనదేయని నీవు మెల్లమెల్లగా (క్రమక్రమముగా) తెలిసికొనవలయును. భగవానుడు చైతన్యస్వరూపుడు.

సరి, నీకు ధనైశ్వర్యములందభిలాష గలదా ?

'మ.':—లేదండీ, అయినను, ఆతృత లేకయుండుటకై కొంత ధనము సంపాదింపవలయునని నాకు దోచుచున్నది. అప్పుడే శాంతముగు మనస్సుతో భగవానుని భజింపగలము.

శ్రీరామ:—అది యట్లే యగును.

'మ.':—కాని యది లోభముకాదు.

శ్రీరామ:—నిజమే, అట్లుకానిచో నీ ఆలుబిడ్డల నెవరు పోషింతురు ? 'నే నకర్తను' అను భావమును నీవు కలిగియున్నచో నీ బిడ్డల గతి యేమగును ?

'మ.':—కర్తవ్యబుద్ధి యున్నంతవఱకు జ్ఞానము లభింపదని వినియుంటిని. కర్తవ్యము మార్తాండునివంటిది.

శ్రీరామ:—ఇపుడా భావముతోడనే యుండుము. ఈ భావము తనంతట తానే యెపుడు విడివడునో అపుడు వేరుభావము కలుగును.

అందఱును కొంతకాలము నిశ్శబ్దముగనుండిరి.

'మ.': జ్ఞానము కలిగిన పిదప కొందఱు సంసారమున నుందురు. అది సజ్జానమరణము వలె—కలరాపీడితులై మరణించువారివలె—నాకు స్ఫురించుచున్నది.

శ్రీరామ:—రామ, రామ !

మరణించునపుడు స్పృహయున్నచో చాల కష్టపడవలసివచ్చును. కలరావ్యాధి వచ్చిననట్లే జరుగును, కావున జ్ఞానము కలిగి సంసారమున నున్నవారట్లే బాధపడుదురని 'మ.' భావము. అవిద్యాపూరితసంసారము దావానలమువంటిదేమో. అందువలననే శ్రీరామకృష్ణులవారు 'రామరామ' యని పలికిరి.

'మ.':—ఇతరులు, అనగా, ఇతర వ్యాధి పీడితులై మరణించువారికి స్పృహతప్పిపోవును. కాన వారు మరణవేదన జెందరు.

శ్రీరామ:—చూచితివా ! ధనమెంతయున్న నేమి ? జయగోపాల్ సేనునకు కావలసినంత

ధనమున్నది. కాని తనకుమారుడు తనమాట వినుటలేదని యాయన చాల దుఃఖించు చుండును.

'మ.':—సంసారమున దుఃఖదాయకము దారిద్ర్య మొక్కటియేనా? ఒకవైపున అరిషడ్వర్గము, మఱియొకవైపున శోకతాపములును.

శ్రీరామ:—వీనితోబాటు గౌరవాభిలాష. అందఱిచే తాను గౌరవింపబడవలయునన్న వాంఛ.

సరి, నా భావమెట్టిది?

'మ.':—మీది నిద్రనుండి మేల్కొన్న వాని భావము. అప్పుడే అతడు తన్ను తాను తెలిసికొనగలుగును. మీరెల్లప్పుడు భగవానుని తోడిసంబంధమును గలిగియున్నారు.

శ్రీరామ:—నన్నెప్పుడయినను స్వప్నమున జూచియున్నావా?

'మ.':—అవునండి, ఎన్నియో పర్యాయములు చూచియున్నాను.

శ్రీరామ:—ఎట్లు? ఏదయిన నుపదేశ మిచ్చునట్లా?

'మ.' ఏమియు ప్రత్యుత్తర మీయ లేదు.

శ్రీరామ:—ఎప్పుడయినను నీవట్టి స్వప్నమును గాంచినచో, నీకా యుపదేశమును సచ్చిదానందస్వరూపుడగు భగవానుడే యొసగు చున్నట్లు తెలిసికొనుము.

'మ.' తనకు కలిగిన స్వప్నములన్నియు శ్రీ గురుదేవునకు వినిపించెను. శ్రీరామ కృష్ణులవారు అంతయు నెమ్మదిగా వినిరి. తుదకు,

శ్రీరామ:—ఇవన్నియు అత్యంత శ్రేయోదాయకములు. నీవిక విచారబుద్ధిని వదలి పెట్టుము. నీవు శక్త్యుపాసకుడవు.



## అధరసేనునియింట నవరాత్రిపూజ

10 అక్టోబరు, 1883.

అధరసేనునియింట జరిగిన నవరాత్రిపూజకు శ్రీరామకృష్ణులవారు భక్తులతోగూడి వచ్చియుండిరి. అది సంధ్యాకాలము. దీపారాధన జరుగుచుండెను. అధరసేనుడు తనయింట శ్రీ దేవీ పూజోత్సవము జరుపుచుండెను కాన శ్రీరామకృష్ణులవారి నాహ్వానించియుండెను. వారితోబాటు బలరాముని తండ్రి, అధరుని బంధువులు ఎందఱో భక్తులు వచ్చియుండిరి. దీపారాధనను జూచి భావావిష్టులై శ్రీరామ కృష్ణులవారు కొంతసేపటికి దేవీకీర్తనలను విని పింప దొడంగిరి. పాట భావము,

ఓ తారిణీ! ఇక త్వరితముగా నన్ను తరింపజేయుము. యమునిచే భయపెట్టబడినవాడను నేను. నీవు నన్ను వదలిన నా ప్రాణము పోవును,

ఓ జగదంబా! ఓ జనపాలినీ! జనమోహినీ, జగత్పాలినీ!

యశోదా జఠరమున జన్మించి నీవు హరిలీలకు సాయముచేసితివి.

బృందావనమున రాధావినోదినివి నీవు. వ్రజవల్లభ విహారకారిణివి.

రాసరంజనీ! రసమయివయి రాసక్రీడయందు నీ లీలను ప్రకాశింపజేసితివి.

గిరిజవు, గోపజవు, గోవిందమోహినివి. నీవే మా తల్లియగు గంగవు. సద్గతిదాయినివి.

గంధర్వ గౌరవర్ణముగలదానవు. గోలోకమునగూడ నిన్ను గీర్తింతురు.

శివుని సనాతనివి, శర్వాణివి ఈశానివి నీవే. సదా ఆనందమయీ సర్వస్వరూపిణీ!

సదాశివప్రియా! సగుణా, నిర్గుణా! నీ మహిమ నెవరెఱుంగగలరు?

పిదప శ్రీరామకృష్ణులవారు అధరసేనుని మేడమీది గదిలో గూర్చొనిరి. భక్తులు గూడ వారిచుట్టును కూర్చొనిరి. అందునుగూడ శ్రీరామకృష్ణులవారు భావావిష్టులే యైయుండిరి. ఆ స్థితియందు చుట్టుపట్లనున్నవారి జూచి, 'మహాశయులారా, నా భోజనమయినది. మీరు వెళ్లి విందారగింపుడు' అని పలికిరి.

శ్రీదేవి అధరసేనుని పూజానైవేద్యములను గ్రహించినట్లు శ్రీరామకృష్ణులవారి నోటివెంబడి వినిపించుచున్నదా యేమి? దేవితో తన్నైక్యము గావించుకొని నా భోజనమయినది అని వచించుచున్నారా?

పిదప భావావేశముతోడనే శ్రీరామకృష్ణులవారు దేవితో నిట్లు పలుక నారంభించిరి: ''తల్లీ, నన్ను భుజింపమందువా లేక నీవే భుజింతువా? నీవు కారణానందస్వరూపిణివి.''

శ్రీరామకృష్ణులు తాను దేవియు నొకటిగనే భావించుచున్నారా? లేక జగన్మాతయగు దేవి లోకశిక్షణార్థము ఈ సంతానరూపమున నవతరించినదా? అందులకేనా 'నా భోజనమైన'దని వచించిరి?

ఈ భావావేశమునందు శ్రీరామకృష్ణులవారు షట్చక్రములను అందలి దేవిని గాంచి దివ్యభావలీనులై పాట పాడ నారంభించిరి. పాట భావము:

ఓ హరమోహినీ! నీవు నన్నీ భువనమంతయు మఱపించితివి.

నీవు మూలాధారమున మహోత్పలమున వీణావాద్య వినోదినివి.

ఆధారమున భైరవిరాగము,

షడ్దళమున స్వాధిష్ఠానము శ్రీరాగము.

మణిపూరమున మహ్లోదిని.

అనాహతము చక్రమున వసంతరాగము.

విశుద్ధ చక్రమున హిందోళరాగము.

ఆజ్ఞాపూరమున కర్ణాటకరాగము.

ఈ రాగరాశములతో త్రిసప్తస్వరములను పలికించి ఓ మహామాయీ! అందఱను అనాయాసముగ మోహపాశమున బంధించుచున్నావు. ఓ సౌదామినీ! తత్త్వాకాశమున నీవుమాత్రము స్థిరముగ నున్నావు.

మఱల నింకొక పాట:

ఏమి ఈ యాశ్చర్యము! ఈ యాశ్చర్యముతో నా ప్రాణమే పోవుచున్నది! ఎవరి నామోచ్చారణము మాత్రమున యముడు పరుగిడునో, ఎవరి పాదసన్నిధానమున మహాకాలుడు పడిగాపులు గాయుచున్నాడో అట్టి దేవికి ఏల యీ కాల (నల్లని) వర్ణము. నల్లని వస్తువులెన్నియో గలవు కాని ఆమె నలు పత్యంతాశ్చర్యకరమయినది. అట్టి రూపసియగు నామెను హృదయారవిందమున ధ్యానించిన హృదయమంతయు ప్రభాపూర్ణమగును.

ఆమె రూపమా కాళి! (నల్లనిది) పేరా కాళి. నలుపును మించిన నలుపురంగు ఆమెది. కాని ఎట్టి యాశ్చర్యము! ఈ రూపము నెవరేని జూచినచో మరి యే యితర రూపమునందును వాని మనస్సు నిలువదు. రామప్రసాదు చకితుడై యిట్లు పలుకుచున్నాడు: 'ఇట్టి యాశ్చర్యకరమయిన స్త్రీ యెందున్నది? ఆమెను జూడకమునుపే—నామాకర్ణనము మాత్రమున, మనస్సు పైకురికి ఆమెతో లయించెను.

అభయప్రదాయినియగు అంబికను స్తుతించిన సర్వభయములు తొలగునని దెలుపుటకే కాబోలు శ్రీరామకృష్ణులవారు భక్తుల కభయమిచ్చుచు మఱియొక పాటను బాడ నారంభించిరి. పాట భావము :

అభయప్రదాయిని పాదములందు నా ప్రాణముల నర్పించితిని. యమునిగూర్చి నాకిక నాపంతయినను భయముగలదా? కాళీనామ మహామంత్రమును ఆత్మశిరస్సు శిఖయందు గట్టిపెట్టితిని. నా శరీరమును సంసారమనెడి సంతయందు విక్రయించి దుర్గానామమును కొని తెచ్చితిని. కాళీనామ కల్పతరువును హృదయక్షేత్రమున నాటిపెట్టితిని. ఇక యముడేతెంచిన నా హృదయమును విచ్చి చూపెదనని కాచుకొనియుంటిని. నా శరీరమందలి దుష్టులార్గురను (అరిషడ్వర్గమును) పాఱద్రోలితిని. నేను (రామప్రసాదు) దుర్గానామోచ్చారణము గావించుచు సంసారసాగరమును దరింప సిద్ధమయితిని.

# ఓ మా న స మా !

శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ.

శ్రీరామచంద్రుఁ గొలుచుట, శ్రీరామార్పణముగాఁగఁ ॥ జేయుట క్రియ ల
వ్వారిగ మొదలిడు మింక నీ, వూరక చెడిపోవఁబోకు ॥ మో మానసమా! ౧
గోముఖములు గల వ్యాఘ్రము, లీ మహితేంద్రియము లనుచు ॥ నెఱిఁగి యణఁచియే
క్షేమంబుఁ గనుము కానీ, యేమఱి చెడిపోవఁ బోకు ॥ మింక మానసమా! ౨
మేడిఫలము సంసారము, మూఢను కీ డందు లవము ॥ మోహంబున్నన్
పీడాకరమగుఁ గావున, వీడుము సంసారతృష్ణ ॥ వే మానసమా! ౩
రోగి కపథ్యం బెటులో, యా గతి దుర్మార్గవృత్తి ॥ యది రుచికరమా
వేగంబె చంపు నది నీ, వేగకు తత్పథముఁ బట్టి ॥ యింక మానసమా! ౪
కాంతా కనకంబులు దు, ర్భ్రాంతిన్ విడనాడి చూడ ॥ గసుమాలము తా
ఇంత యెఱిఁగి వానికి నా, వంతయు భ్రమపడఁగఁబోకు ॥ మా మానసమా! ౫
ఎన్నాళ్లీ యిహసుఖములు?, కొన్నాళ్లే కాదె యింత ॥ కున్; నిత్యముగాఁ
గన్నారా యెవరైనను?, విన్నారా యట్టివారి ॥ విధి మానసమా! ౬
మలమూత్రంబుల రక్తం, బులఁ జీములఁ బుట్టి పెరిఁగి ॥ పొంగుదురు నరుల్
లలితాంగులు సుందరు లని, తలపోయరు లోని మలిన ॥ తల్ మానసమా! ౭
బాల్యమున మాత స్తన్యపు, లౌల్యంబును బిదపఁ గేళి ॥ లౌల్యంబును బై
లౌల్యంబు కాంతలన్ సా, కల్య మ్మిటు జీవితమ్ము ॥ కా మానసమా! ౮
వనితా సంగమ కాంక్షన్, ధనధాన్యాదికమునందుఁ ॥ దనరెడి తృష్ణన్
గనవు సహస్రాంశము త్వ, దనుపమ దైవంబునం ద ॥ హా! మానసమా! ౯
తను మ్రింగుచుండ సర్పము, తను మ్రింగఁగఁబోవుఁ గప్ప ॥ తరుణక్రిమి నీ
యనువునఁ బనుపడు నాశయుఁ, గని చంపుము దానిఁ దొలుత ॥ గన్ మానసమా!

# దేవీ మాహాత్మ్యము

భారతదేశమున నెన్నియో సంప్రదాయములు గలవు. దాక్షిణాత్తులందు ముఖ్యములు శైవము, వైష్ణవములే. ఈ దక్షిణాపథమున శాక్తేయులు అరుదు. హరిహరభక్తులెందఱో ప్రభవించి ఆయాభక్తి సంప్రదాయములను వెల్లడింపగల గ్రంథముల నెన్నేని మనకు ప్రసాదించియున్నారు. శైవభక్తియు, విష్ణుభక్తియు నెన్నెన్నివిధములుగ ప్రకటింపవచ్చునో (లేక యనుసరింపవచ్చునో) వారి జీవితముల వలన మనము చాలవఱకు గ్రహింపగలుగుచున్నాము. ఈ భక్తులందఱును ఐహిక విషయముల సంబంధముకంటె తమతమ యిష్ట దైవముల సాన్నిధ్యాపేక్షకులై యందులకనేక సాధనలు గావించిరని తెలియుచున్నది. కాని శక్త్యుపాసకులనుగూర్చియు, ఆ సాంప్రదాయమునుగూర్చియు, వారి జీవితములగూర్చియు మన కించుకయు తెలియదనియే వాకొనవలయును. శ్రీ త్యాగరాజులవారి కొన్ని తెనుగు కీర్తనలలో, లేక మఱికొందఱి సంస్కృత కీర్తనలలో—వారు దేవినిగూడ ఆరాధించెడివారని తెలుపుచున్నవి. గాని వారు కేవలము శక్తినే యుపాసించెడివారు మాత్రము కారు. మఱియు నీ భాగమున సాధారణముగ ఐహిక కామన సిద్ధులకొఱకే అనేకులు దేవిని ఉపాసించుచున్నారనిగూడ తెలియుచున్నది. ఇట్టి సందర్భములలో శక్త్యుపాసనయందలి మాధుర్యము, మహత్త్వము, తెలియదలచిన వంగదేశీయుల ఆధ్యాత్మిక జీవనమును పరిచయముచేసికొనవలసి యున్నాము. అచ్చటనే శాక్తేయమతము నేటికిని సవిస్తారముగా గనబడుచున్నది.

వంగదేశమున నున్నవి రెండు సంప్రదాయములే. కావున మేము వైష్ణవులము కామని చెప్పినంతనే యెదుటివారు వారిని శాక్తేయులని నిర్ధారణచేయుదురు. ఏలనన వారికి రెండు సంప్రదాయములుగాక తదన్యము లేవియు తెలియవు. వారి ధార్మికజీవనమునందు శక్త్యుపాసన అత్యంత సన్నిహితమై యుండుటవలననే యచటి పంచాంగములందు సహితము ప్రతి నెలయందును ఏదేని ఒక దేవీపూజయయినను జేర్కొనబడుచుండును. వంగరాజధానియందు యాత్రసలిపినచో అచట మనకు అధికముగా గానవచ్చునవి దేవీక్షేత్రములే. భక్తులయందు శ్రీకృష్ణ చైతన్యుల యనుచరులు దప్ప తదితరులెల్ల శక్త్యుపాసకులే. గ్రంథములా, శక్త్యుపాసనను విశదీకరించు తాంత్రిక శాస్త్రములు! సాధారణముగా వారు పాడుకొను పాటలలో అనేకములు శక్త్యుపాసకులచే రచియింపబడినవియే. ఈ యుపాసన మానవుని మనస్సు నాకర్షించుచు నచట నెన్నియో సంవత్సరములనుండియు ననుష్ఠింపబడుచున్నది. అది యింతటి ప్రాబల్యమునకు వచ్చుటయందు ఏదో అనిర్వాచ్యమగు కారణ ముండితీరును. దీనిని బట్టి మానవు డీయుపాసనవలన నెన్నియో లాభముల బడయుచున్నాడనుటకు సందియ మావంతయు లేదు.

ఈ శక్త్యారాధన మనదేశమున వేదకాలమునుండియు గలదు. కాని అది తాంత్రిక గ్రంథముల నాటినుండియే విశిష్టతను బడయ గలిగినది. వేదోపనిషత్తులు జ్ఞానమార్గమునే ప్రశంసించుచున్నవి. కాని తాంత్రికశాస్త్రములు, అద్వైతమార్గ పరమావధికి భక్తిమార్గమున సహిత మెట్లు నడువగలమో దెలుపుచున్నవి. కావుననే శక్త్యుపాసన భక్తి జ్ఞానముల రెండింటి సమన్వయమై యలరారుచున్నదని వచించుటయం దతిశయోక్తి లేదు. తీవ్ర అద్వైతవాదులు బ్రహ్మముతప్ప తక్కిన సమస్తమును మాయ. ఈ మాయయే శక్తి. మాయ మిథ్యయైనపుడు దానికిని ముక్తికిని ఏమి సంబంధము గలదు? అందుచేత శక్త్యుపాసన నిరర్థకము; అశ్రద్ధేయము అని వచింతురు. కాని శాక్తేయ గ్రంథానుసారిణి శక్తియు బ్రహ్మయు నభేదము. దీనినిఎల్లరకును దెలుపుటకే శ్రీరామకృష్ణుల వారు 'అగ్నికిని, దాని దాహకశక్తికిని ఎట్టి అన్యోన్యసంబంధము గలదో అట్టిదియే బ్రహ్మకును శక్తికిని గల'దని వచించువారు. దేవ్యుపాసకులందఱునుగూడ ఆమె సగుణయు నిర్గుణయు మాత్రమే కాక ఈ రెండింటికిని అతీతము ఐనది అని పలుకుదురు. రామప్రసాదు, కమలాకాంతాదులగు దేవీభక్తుల గేయముల ననుసరించి చూడ వారు 'బ్రహ్మమును కాళిని' ఒకటిగనే నిర్ణయించుచుండిరని తెలియుచున్నది.

శివచంద్రుడను నొకానొక భక్తుడు తన గేయమున దేవినిగూర్చి యిట్లు వివరించుచున్నాడు:

"దేవీ, దీనతారిణీ! దురితహారిణీ! సత్త్వ రజస్తమ త్రిగుణధారిణీ!

సృజన-పాలన-నిధనకారిణీ! సగుణా నిర్గుణా సర్వస్వరూపిణీ!

నీవు కాళివి, తారవు. పరమప్రకృతివి. మీన కూర్మ వరాహాద్యవతారములును నీవే. నీవే పంచభూతములును. దర్శనసాంఖ్య, పాతంజల మీమాంసాది శాస్త్రములు 'నేతి, నేతి' యను జ్ఞానమార్గానుసారిణి ఎంత విచారించినను నిన్ను కనుగొనజాలకున్నవి. నీవు ఉపాధిరహితవు. ఆద్యంతవిహీనవు. సాధకుల శ్రేయార్థము గణేశాది పంచరూపములను ధరింతువు. భవభయనాశనముచేయు త్రికాలవర్తినివి నీవు. ఎట్లు సాకారోపాసకులకు సాకారరూపిణివో అట్లే నిరాకారవాదులకు నిరాకారవు. బ్రహ్మము జ్యోతిర్మయమని కొందఱు వచింతురు. కోరికయున్నంతవఱకు భక్తుడు నిన్ను పరబ్రహ్మమని వచించును. పిదప తురీయము అనిర్వచనీయము, అంతయు త్రిలోకవ్యాపినివగు నీవే.

తాంత్రిక గ్రంథములందును దేవీభాగవతమునందును గూడ 'బ్రహ్మము—దేవి' అభేదము అన్నవిషయము ఎన్నియోసార్లు ప్రకటింపబడియున్నది. గంధర్వతంత్రమున నిట్లు నిర్వచింపబడి యున్నది.

శ్లో. ఏక మాసీ పరం బ్రహ్మ
నిత్య సూక్ష్మ మతీంద్రియమ్
నిత్యానంద మయం ధామం
తేజోరూపం సనాతనం.

శ్లో. తదేవ ప్రకృతిః సా తు
తేజోరూపా సనాతనీ
నిత్యానందవపు ర్దేవీ
తద్రూపా తత్ప్రకాశినీ.

దేవీభాగవతమునందు 'దేవీగీత' యను నంశమొందు గలదు. అందు దేవికిని హిమాలయమునకును జరిగిన సంభాషణ వివరింపబడియున్నది. దేవి యిట్లు పలికెను:

శ్లో. "అహమే వాఽస పూర్వంతు
నాఽన్యత్ కించిత్ నగాధిప
తదాత్మరూపం చిత్ సంవిత్
పరబ్రహ్మైక నామకం.
అప్ర తర్క్య మనిర్దేశ్య
మనౌపమ్య మనామయం
తస్య కాచిత్ స్వత స్సిద్ధ
శ క్తిర్మాయేతి విశ్రుతః,
నసతీ సా నాసతీ సా
నోభయాత్మా ఽవిరోధతః
ఏతద్ విలక్షణా కాచిత్
వ స్తు భూతా స్తి సర్వదా.
పావకస్యోష్ణ తవేయం
ఉష్ణాంశోరివ దీధితిః
చంద్రస్య చంద్రికేవేయ
మమేయం సహజా ధ్రువా."

దేవీభాగవతం, స ప్తమస్కంధం,
32-వ అధ్యాయం, 2-5.

అనగా సృష్టికిపూర్వము నేనొక్క_ర్తనే యుంటిని. ఇతరమేదియు లేదు. నాయాత్మ స్వరూపమునకే ''చిత్ సంవి త్తి''యు పర బ్రహ్మమనియు, నిర్దేశింపబడుచుండెను. నా యాత్మ ఊహాతీతము, లక్ష్యాతీతము. ఉపమాన ములతో సహితము వివరింపరానిది. జనన మరణాది వికారములకును అతీతము. నా ఆత్మకే స్వతస్సిద్ధమయిన శక్తికలదు. ఆ శ క్తియే 'మాయ'యని పిలువబడుచున్నది. బ్రహ్మ జ్ఞానమువలన మాయ నశించును. కావున ఈమాయ నిత్యవస్తువు (సతి) కాదు. కాని మాయలేనిచో వ్యావహారిక సత్తు ఉండ జాలదు. కావున అసతి (అనిత్యము) గూడ కాదు. అది ఉభయాత్మకమా అట్లయినచో సదసత్తులు రెండును విపరీత గుణావహములు గాన నివి రెండును నొకచో నుండజాలవు. కావున ఉభయాత్మక మనియు దీనిని జెప్ప జాలము. ఇట్టి అనిర్వచనీయ స్వరూపముగల మాయ మోక్షకాలపర్యంతమును నిలుచును. నాయీ మాయాశక్తి అగ్నియొక్క ఉష్ణము వలెను సూర్యుని వెలుగువలెను చంద్రుని వెన్నెలవలెను తనంతట తానే యుత్పన్న మగును.

"మహాలక్ష్మైచ విద్మహే, సర్వశ క్త్యైచ ధీమహి,
తన్నో దేవీ ప్రచోదయాత్"

అని దేవీగాయత్రి పలుకుచున్నది. 'మేము నిన్ను మహాలక్ష్మిగా నెఱుంగుదుము. సర్వ శక్తి స్వరూపిణిగా ధ్యానము చేయుచున్నాము. నీవు మమ్ము నీ శ్రవణ మనన నిధిధ్యాసన లందు ప్రవ ర్తింపజేయుదువుగాక!' అని దీని భావము. నృసింహతాపనీయ శ్రుతియందు 'మహామాయయే' సమ స్త విశ్వజగత్తును సృష్టి పాలన సంహారములు గావించుచు విరాజిల్లునది. కావున సాధకుడు ఈ మాయాశక్తిని తెలియుట త్యావశ్యకము. దీని నెవరు తెలియగలరో వారు మృత్యువును జయించెదరు. సమ స్తపాప సముద్రములను దాటి యిహమున మహత్సంపదను పరమున నమృతత్వమును బొందుదు'రని వచింపబడి యున్నది. అథర్వశిరో శ్రుతియం దిట్లు వివ రింపబడియున్నది. ఒకానొకప్పుడు సమ స్త దేవతలును దేవీ ఉపాసన గావించిరి. అంతట దేవి ప్రసన్నకాగా దేవత లామెనుజూచి 'ఓ దేవి! నీ వెవరవు?' అని యడిగిరి. అంతట

దేవి 'నేను పరబ్రహ్మరూపిణిని. నాయందుండియే ప్రకృతి పూరుషమయమగు విశ్వమంతయు నుత్పన్నమగుచున్నది.' అని చెప్పెను. మఱియు భువనేశ్వరీ యుపనిషత్తున దేవి యిట్లు పలుకుచున్నది : 'ఓ మునిపుంగవులారా! మీరు జ్ఞానమునకు సంపూర్ణాధికారులు కావున మీకు తప్పక శ్రేష్ఠమును సగుణ నిర్గుణాత్మక బ్రహ్మ విషయ పూరితమునగు నుపనిషత్తును వివరించుచున్నాను. అది సమస్తభువనములకు నియంత. ఆ విశ్వమోహిని తురీయాతీతమయిన చైతన్యస్వరూపముగలది. కావున ఆ బ్రహ్మరూపిణి మీ శరీరములందే విరాజిల్లుచున్నది. అందువలన శరీరమందలి బ్రహ్మరంధ్రాన్వేషణము వలననే మీరు ఆమెను బడయగలరు.'

ఇట్లు శక్తి బ్రహ్మల సమైక్యతను జాటు శ్రుతి శాస్త్రము లెన్నియో గలవు. ఇట్లే సూత సంహితవంటి స్మృతులు సయితము దేవీ మాహాత్మ్యమును వర్ణించుచో 'ఈ సంసార నాశన నిమిత్తము ఆ సాక్షిమాత్రురాలును, ప్రపంచోల్లాసాధిక పరివర్జితయు, ఆత్మస్వరూపిణియునగు పరాశక్తి నారాధనము జేయుము.' అని బోధించుచున్నవి. కూర్మపురాణమున "ఓ విప్రులారా! దేవీమాహాత్మ్యము బ్రహ్మవిదులగు ఋషులచే నిశ్చయింపబడి యిట్లు వివరింపబడియున్నది. 'ఆమె ఒకటియే అద్వితీయ సర్వత్రగామిని. నిత్యకూటస్థ చైతన్యస్వరూపిణి. కేవలము యోగులు మాత్రమే ఉపాధిరహితయగు ఆమెను దర్శింపగలరు. ప్రకృతి పరిలీన అనంతమంగళస్వరూపిణి యగు దేవిని పరాత్పరతత్త్వపరమపదయోగులే తమ హృదయకమలములందు సాక్షాత్కారము చేసికొనగలరు. ఈ దేవి అత్యంతనిర్మలయయినది. ఎల్లప్పుడు విశుద్ధమయినది. దోషరహితమయినది. కేవలము ఆత్మోపలబ్ధివిషయము. యోగీశ్వరులగు పురుషులే ఆమెను దర్శించి కృతార్థులగుదురు" ఇట్లెన్నియో విధముల నెన్నియో గ్రంథములందు వివరింపబడియున్నది.

ఈ ప్రాపంచిక విషయ మగ్నులమైయున్న మన మెల్లరము ఈ విశ్వము సర్వము మహత్త్వముగల దేవీ ప్రభావమేయని గ్రహింపవలయును. ఇందంతయును మహామాయాస్వరూపము. ఈ సంసారసాగరమును తరించుటకు శక్త్యనుగ్రహ మత్యంతావశ్యకమని శ్రీ రామకృష్ణులవారు పలికెడివారు. మాయయనెడి సంకెలలచే బంధింపబడియున్న మనము ఆమహామాయ కృపవలననే ఆబంధములను ఛేదింపవలయును. ఆ జగన్మాత మనపై తన కృపామృతమును వర్షించి యనుగ్రహించుగాక.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశ్శరణమ్

కాశీ,
19-2-'15.

శ్రీమాన్ దే...

శరీరారోగ్యము సరిపడియుండకపోయినచో మనస్సును స్వస్థతనందదని తలంచెదను. ఈ యుభయమునకును సన్నిహితసంబంధము కలదు కదా! ఎట్లయినను ఎల్లప్పుడును నిరాటంకముగ భగవత్స్మరణము గావించుటకే మీరు ప్రయత్నింపవలయును. మన శ్రేయస్సును మనమే సమకూర్చుకొనవలయును. ఇతరులద్వారా ఆ కార్యము నెఱవేఱజాలదు.

శ్లో. ఉద్ధరేదాత్మ నాత్మానం
నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు
రాత్మైవ రిపురాత్మనః *

జన్మమృత్యు జరావ్యాధి
దుఃఖదోషానుదర్శనమ్
అసక్తిరనభిష్వంగః
పుత్రదార గృహాదిషు † —గీ. ౧౩-౮,౯.

వీనినన్నింటిని అభ్యసింపవలయును. శుష్కవిచార మనవసరము. భగవత్కృపకై ప్రార్థింపవలయును. అప్పుడే యేమాత్రమయినను కార్యసిద్ధి కాగలదు. ఆ ప్రార్థన సహితము సంపూర్ణమనఃప్రాణములతో గావింపవలయును. అంతఃప్రార్థనయే ప్రార్థన. భగవానుడు సర్వాంతర్యామిగదా, అంతర్యముల సమస్తమును దెలిసికొనగలడు. సరళభావములతో వాని శరణు జొరుము. నీవును సమస్తమును నెఱుంగుదువు. నీకీ విషయములగూర్చి నే నెన్నియో పర్యాయములు వివరించియే యున్నాడను. ఇక వ్రాయవలసిన దేమి? సమస్తవిషయములును సమయానుకూలములై యుండును. అయినను భగవానుడు పరమకరుణాళువు. వాని ద్వార దేశమున బడియున్నచో కార్యసిద్ధి కాగలదు. ఇప్పుడో లేక మరియెప్పుడో జరుగగలదు. అందులకు సందేహములేదు. జరుగుట నిశ్చయము. సర్వకాల సర్వావస్థలయందును ఆయనయందు భక్తి కుదురునట్లు ప్రార్థింపుము. ఆయనను ప్రేమించుటను అభ్యసించినచో ఇతర విషయాసక్తులు తమంతట తామే తొలగిపోవును. ఆయన ప్రేమమాధుర్యమును నొకసారి రుచిచూచినచో అన్యములగు రుచులేవియు నిక నచ్చవు. ఏ విధమున నీ భక్తి

* మనుష్యుడు వివేకముతో గూడిన మనస్సువలన తన్ను సంసారమునుండి ఉద్ధరించుకొనవలయును. (యోగారూఢుడు గావలయును.) ఎన్నడును విషయాసక్తిని బొందరాదు. ఏలయన శుద్ధమగు మనస్సే మనుష్యునకు యథార్థమగు హితమునుగూర్చు మిత్రము. (ముక్తికి కారణము.) విషయాసక్తమగు మనస్సే మనుష్యునకు పరమశత్రువు (బంధకారణము).

† జన్మ మృత్యు జరా వ్యాధుల నెడి దుఃఖములనుండు దోషమును మాటిమాటికి చూచుచుండుట, పుత్రదారగృహాదుల అసక్తి మమత్వములు లేకుండుట—

లభింపగలదో దాని (ఆ మార్గము) కొఱకై నిండు మనస్సుతో ప్రయత్నింపుము. అట్లు గానిచో ఫలితమేదియేనియు కలుగగలదా? ఇంతకుమున్ను జెప్పినట్లు మన సౌకర్యములను మనమే చేసికొనకపోయినచో నితరు లెవరును జేయజాలరు.

నా శుభాశీర్వచనములు,
ఇట్లు,
శ్రీ తురీయానంద



శ్రీహరిశరణమ్

7-3-'15.

శ్రీమాన్...

శ్రీ శివానందస్వాములవారు మఠమునుండి యిచ్చటికి రాలేదు. వారు 'రాంచి' లో శ్రీరామకృష్ణ జన్మోత్సవమును జూచి బేలూరి మఠమునకే మరలిపోయిరట. రాంచిలోని భక్తులే యీ యుత్సవమునకు దగిన వసతుల గల్పించి ఎంతో చక్కగ జరిపిరి. దానినిజూచి శ్రీ స్వాములవారు చాల సంతోషించిరి.

క్రమక్రమముగా వారి సద్భావము ప్రవర్ధిల్లు చున్నది. వారిని దృష్టాంతముగా గొని యింకను నెందఱో ఉన్నతినందుచున్నారు. ఏల సంభ వింపరాదు? భగవంతునియెడ భక్తి కలిగిన నిట్లే జరుగుచుండును. భగవద్గీతయందు భగ వానుడు—

శ్లో. మాంహి పార్థ వ్యపాశ్రిత్య
యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా
స్తేఽపి యాంతి పరాంగతిమ్.
—గీత. ౯-౩౨.

(ఆచారభ్రష్టుడగువానిని నా భక్తి పవిత్ర మొనర్చుటలో విచిత్రమేమి? అసత్కులజాతు లును, అనధికారులును అగువారిని గూడ ముక్తుల నొనర్పగలదు:) "పార్థా! నికృష్టజన్ము లగు అంత్యజులును, స్త్రీ శూద్రులునుగూడ నన్ను సేవించి తప్పక మోక్షమును పొందు చున్నారు" అని చెప్పియున్నాడుగదా. ఇట్లు పలికి తుదకు ఇట్లు నొక్కి వక్కాణించు చున్నాడు. 'శ్లో. అనిత్య మసుఖం లోకం, ఇమం ప్రాప్య భజస్వమాం.'—అనిత్యమును దుఃఖమయమును నగు నీలోకమున జనించి కేవలము నా భజన మొనర్పుము. ఏలనన ఇట్టి స్థితినుండి నిన్ను రక్షించుకొనుటకు ఈ నా భజ నము తప్ప ఉపాయాంతర మేదియు లేదు.

నీ యుత్తరమునందు నీవు వెల్లడించిన నీ సిద్ధాంతము నాకు స్పష్టముకాలేదు. నీవు గీతయందు 'క్రియతే బహుళాయాసం తద్రాజ సముదాహృతమ్—అనగా ఎక్కువ ఆయాస ముతో గూడిన కర్మ రాజసిక కర్మ. దానివలని ఫలము దుఃఖదాయకము' అని వ్రాసియున్నావు. అంతటితో నిలిపి 'నా సిద్ధాంతము సరియైనదా' యని యడుగుచున్నావు. దీని ననుసరించి 'విశ్వ నాథ దర్శనమునందు బహుళాయాసము కలు గుటవలన ఆ దర్శనము అనవసరము. అది రాజ సికము. దాని ఫలితము దుఃఖమే యని' యర్థము చేసికొనమందువా? ఇదియే నా నీ సిద్ధాంతము? గీతనుండి నీవుదహరించిన యీ శ్లోకము అష్టాదశాధ్యాయమునందున్నది. అచ్చట శ్రీ భగవానుడు అర్జునునకు 'గుణ భేదముల ననుసరించి జ్ఞానము, కర్మ, కర్త— ఇవి మూడురకములైయున్నవి' అని తెలుపుచు వానిని నిరూపించుటకై పై లక్షణమును వివరిం చెను. నీవు సగము శ్లోకమును మాత్రమే వ్రాసి

యున్నావు. అట్లు చేసినచో అర్థావగాహనము చాల కష్టము. సాత్త్వికకర్మలను నిరూపించి పిదప రాజసికకర్మను బోధించుటకై యిట్లు పలికెను.

శ్లో. యత్తుకామేప్సునా కర్మ,
సాహంకారేణవాపునః।
క్రియతే బహులాయాసం
తద్రాజస ముదాహృతమ్.
-గీత. ౧౮-౨౪.

అనగా, ఏ కర్మము సకామభావముతోడనో లేక అహంకారముతోడనో అత్యంత కష్టముతో చేయబడినదో అది రాజసిక కర్మము. బహులాయాసమనగా ఎన్నో ప్రయత్నములుచేసి ఏర్పాట్లు గావించి జరుపబడునది అని యర్థము. అట్టి కర్మయే రాజసికకర్మ. ఇట్లుగాక 'భగవన్నామస్మరణమునందుగూడ ఆయాసముకలదు. కావున అది రాజసికము వర్జ్యము' అనునదియే నీ సిద్ధాంతమయినచో నింక నేనేమి చెప్పగలను...

'ఇన్నాళ్ళ నుండియు నెంతయో చూచితిని. వినియు నున్నాడను. అయినను ఆ సద్వస్తువు నందు నా మనస్సు అభిముఖము కావుటలేదు. ఇది చాల దుఃఖింపదగిన విషయ'మని వ్రాసియున్నావు. అంత యెక్కువగా నీవేమి చూచితివి? ఏమి వినియున్నావు? యయాతి మహారాజు పదివేల సంవత్సరములు పుత్రుని యౌవనమును పొంది విషయముల ననుభవించినను తృప్తిజెందక,

శ్లో. న జాతు కామః కామానా
ముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ
భూయయేవాభివర్ధతే'

అని పలికియున్నాడు. అనగా అగ్నిపై ఘృతాహుతి వలె కామ్యవస్తూపభోగమువలన కామము శాంతింపకపోవుటయే కాక మరి మరి అభివృద్ధి జెందును. కావున 'తస్మాత్ తృష్ణాం పరిత్యజేత్' అనగా కోరికలను పరిత్యజించుటయే శ్రేయస్కరము, శుభదాయకము. ఇదియే శాస్త్రానుసారమయిన సిద్ధాంతము.

నా శుభాశీర్వచనములు,
ఇట్లు,
శ్రీ తురీయానంద



దాహముచే నోరారుచున్నపుడు ఎవ్వడైనను గంగాజలము కలగియున్నదని తాగక మానివైచి, అప్పటికప్పుడు మంచినీటికై చెఱువు త్రవ్వబోవునా? పరమార్థపిపాస లేనివాడు సర్వమతములను ఖండించుచు, వానినిగూర్చి అనంతములైన వాగ్వాదములు చేయుచు తిరుగుచుండును. నిజమైన పిపాస (దాహము) గలవానికి అంతటి మీమాంసచేయుటకు వ్యవధి యుండదు.

—శ్రీ రామకృష్ణ పరమహంస



# యోగీన్ మా

శ్రీ ఉప్పూరి రామకృష్ణారావు

శ్రీరామకృష్ణ పరమహంస దేవులు 1836–వ సంవత్సరములో వంగదేశమున దేశ, కాల, పరిస్థితులనుబట్టి లోకసంగ్రహార్థమై యవతరించిరి. వీరి ప్రబోధమునందలి యేక మూలసూత్రము సమస్తమతములు లేక సకల సాంప్రదాయములు సమన్వయము బొందగలవని. పై సత్యము శ్రీవారియొక్కయు, వారి శిష్యులయొక్కయు నిత్యచారిత్రమునందు మన సనాతనధర్మములు నవీన దృక్పథమున స్పష్టపడుచున్నవి. వేదకాలమునాటి సనాతనధర్మములన్నియు హిందూదేశమున కిటీవల గల విదేశీయుల, యనగా తురుష్కుల, పాశ్చాత్యుల, యాంగ్లేయుల పరిపాలనలవలన సంఘముయొక్క కట్టుబాట్లు; ఆచారవ్యవహారములు; మర్యాదలు; హిందూమతధర్మములు చాల మార్పుచెందినవి. అధర్మము, ఛాందసము, ప్రబలములై, యజ్ఞానమున బడియుంటిమి. సహగమనమను ధర్మమునకును, నాధ్యాత్మికవృత్తికిని గల మూలసూత్రము మరుగువడి, యజ్ఞానముచే భర్త పోగనే, భార్య శరీరమును భర్త శరీరముతో మనము బలవంతముగ దహనము చేయుచుంటిమి. మతకలహములు మెండైనవి. మానవుని వృత్తినిబట్టి యేర్పాటుకావలసిన వర్ణమునకు బదులు, వాని జన్మనుబట్టి చాతుర్వర్ణ్యములు నియమింపబడిన దురవస్థలో బడితిమి. ఇట్టి తమసావృతమగు నంధకారమున మనకు జ్యోతి వలె శ్రీరామకృష్ణదేవులవతారము నెత్తిరి. రాజ్యాంగచట్టములలోను, యుపన్యాసములలోను, ప్రబోధములలోను దగులుకోనక, వీరి యొక్కయు, వీరి శిష్యులయొక్కయు ఆచరణయందు వారివారి దైనికచర్యలచే నాధునికకాలమున సనాతనధర్మములను ప్రతిష్ఠచేసిరి.

అతిబాల్యవివాహము, "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" యని చాటుచుండు సమయమున వీరి శిష్యురాండ్రగు యోగీన్ మా, గోలప్ మా మొదలగువారి జీవితములు స్త్రీలకు వైధవ్యము, వివాహము నిమిత్తమాత్రములనియు, నాధ్యాత్మికమునకు స్త్రీ, పురుష విభేదము లేదనియు, స్త్రీలును బ్రహ్మచర్య, సన్న్యాసాశ్రమములు తీసికొని జీవన్ముక్తిని, విదేహముక్తిని బడయుట యీ కాలమునగూడ గలదని నిరూపించుచు, నుపనిషత్ కాలమునాటి గార్గి, మైత్రేయి, భరద్వాజ ఋషిపుత్రియు, నైష్ఠిక బ్రహ్మచారిణియు నగు సృతవసి, సులభ, కౌశికి, శంకరా మొదలగు పరివ్రాజక సన్న్యాసినుల, బ్రహ్మవాదినుల, భిక్షువుల, బ్రహ్మచారిణుల జీవితములను మనస్సులకు తెచ్చుచు, సనాతనధర్మములను ప్రబోధించుచున్నవి. స్త్రీలకు సన్న్యాసధర్మముగూడ నాశ్రేయమని యర్థమును సూచించుచు పఠనము చేయబడు నాబ్దికమంత్రమును వినుచున్నారము. "అసంస్కృత ప్రమీతాయే, త్యాగినోయాః కులస్త్రియః" యని మంత్రపఠనముతో వికి

రాన్ను పిండదానము జేయుట యందరకు తెలిసిన విషయమే. అనగా, కులమునందలి సన్న్యాసినులకుగూడ బిండదానము గలదని యర్థము. ఈ పై విషయములు భారత, భాగవత, రామాయణాది గ్రంథముల, ధర్మశాస్త్రముల, గృహ్యసూత్రముల శాస్త్రపరిశీలనచేత స్త్రీలకు విద్య, కర్మకాండ, బ్రహ్మచర్య, సన్న్యాసములు విధివిహితములే యని తేలుచున్నది. ఈ మరుగుపడిన ఆర్షసాంప్రదాయమును నిషిద్ధమనుకొనునట్టి యజ్ఞానసమయమున, శ్రీరామకృష్ణుల, వీరిశిష్యుల జీవితములు మనకు గొప్పయాదర్శములై నిలిచినవి. శ్రీరామకృష్ణులు తన తాంత్రికసాధనమును త్యాగినియగు భైరవీ బ్రాహ్మణియొద్ద నభ్యసించెను.

శ్రీరామకృష్ణుల శిష్యురాండ్రలో పరమహంసవారిచే 'జ్ఞాని' యని పేరువడసినది 'యోగీన్ మా' యను నారీరత్నము. ఈమె పేరు జోగీంద్రమోహిని. ఈమె 1851-వ సం॥రమున కలకత్తా నగరమున సుప్రసిద్ధ వైద్యులగు ప్రసన్నకుమారమిత్రుని పుత్రికారత్నమై జన్మించెను. ఈమె చాల సౌఖ్యపడునని తండ్రి యామెకు బాల్యముననే, కలకత్తా దరినున్న ఖర్దా గ్రామమునందలి యొక జమీందారి కుటుంబమునకుజెందిన యంబికాచరణవిశ్వాసుడను నతనికిచ్చి వివాహముజేసెను. కాని, అంబికాచరణుడు దురభ్యాసములకు లోనై త్రాగుడు మొదలిడి, ధనహీనుడై నగరవీధుల దిరుగ నారంభించెను. ఇట్లామెకు గల్గిన దుర్గతిచే, దనయాశలన్నియు భగ్నములై గృహస్థాశ్రమసుఖ మనునదిలేక చిన్ననాటనే యామెకు గాఢవైరాగ్యము గల్గెను. ఆమె తన పుట్టింటనే కాలక్షేపము చేయుచుండెను. ఈ దీనావస్థయందుండ, నామె బంధువుడును శ్రీరామకృష్ణుల ప్రియశిష్యుండును నగు బలరాం బోసు, ఆమెను శ్రీరామకృష్ణుల సన్నిధికి దోడ్కొనివెళ్లెను. హరిదర్శనము కాగనే, యామె శ్రీ గురుదేవుల పాదముల శరణుచొచ్చెను. వెంటనే యామె బాధలు, దుఃఖములు సడలిపోయెను. ఆమె యాధ్యాత్మికోపలబ్ధి దినదినప్రవృద్ధమయ్యెను.

దక్షిణేశ్వరమునకు వెళ్ల నారంభించినపిదప, నచిరకాలముననే, యోగీన్ మా కు శ్రీ శారదాదేవితో బరిచయమైనది. సమవయస్కులగుటచే, వీరుభయుల యనుబంధము గాఢమై, శారదామాత యోగీన్ మా ను నమ్మి యామెతో దన రహస్యపు సంప్రదింపులను జేయుచు, నామె సలహాలను పొందుచుండెడిది. ప్రతివారము నామె శారదాదేవిని కలసికొనుచు, నొక్కొకసమయమున రాత్రులామెచే నింటికి వెళ్లకుండ నాపుచేయబడుటయు, నహబత్ నందే శారదామాత ప్రక్కన యోగీన్ మా నిద్రించుటయు జరుగుచుండెను.

ఇంతలో శారదాదేవి స్వగ్రామమునకు వెళ్లుట తటస్థించెను. శారదాదేవి పడవలో గంగను దాటుచుండ యోగీన్ మా యామె కనబడుచుండునంతవఱకు గట్టుననుండి, చూచుచు, మాత తనచూపులు మీరగనే నహబత్ చేరి తల్లిని వదలలేని బాధతో, కంట తడిపెట్టుచుండెను. ఆ సమయమున శ్రీరామకృష్ణులు పంచవటికి పోవుచు యోగీన్ మా ను జూచి, యామెకు కబురుపెట్టి, "నీవు శారదాదేవిని వదలలేని బాధలో నుంటివా ?" యని సంబోధించి, రామకృష్ణులు దన తాంత్రికసాధనానుభవముల యోగీన్ మా కు జెప్పుచు నామె నోదార్చెను. తిరిగి శారదామాత యొక సంవత్సరమున్నరకు దక్షిణేశ్వర

మునకు వచ్చెను. అప్పుడు రామకృష్ణులు మాతాజీతో, "నీతో అప్పుడప్పుడు వచ్చు నా చక్కని, పెద్దకండ్లుగల పిల్ల నిన్ను బాగుగ ప్రేమించును. నీవు నీ గ్రామమునకు వెళ్లినప్పుడు నీ వామెను విడచి వెళ్లినందున కామె నీకై యెంతయో విలపించిన"దని చెప్పెను. వెంటనే శారదామాత తా నామెను బాగుగ నెఱుగుదుననియు, నామె పేరు యోగీన్ మా యనియు రామకృష్ణులతో జెప్పెను.

యోగీన్ భక్తికి మెచ్చి శ్రీరామకృష్ణులు ఆమె యింటికి వెళ్లి, యామె గృహము పావనముచేసి, యామెచే నాతిథ్యమును గూడ నంగీకరించి యామెను ధన్యురాలిజేసెను. ఇంతేకాక, యామె శ్రీరామకృష్ణుల బోధామృతమునుగూడ గ్రోలు మహాభాగ్యము గనెను. అందువలననే, శ్రీ శారదానందులకు శ్రీరామకృష్ణుల లీలాప్రసంగములనెడి గ్రంథమును రచించునప్పుడు యోగీన్ రామకృష్ణుల విషయముల నెన్నియో తెలియజెప్పెను. ఒకప్పుడు, రామకృష్ణులు యోగీన్ మా తో తనను జూపించుచు ఇటుల ముచ్చటించిరి: "ఇంక, నీకు బొందవలసినదేమి మిగిలినది? ఈ శరీరమును జూచుటయు, నాహారమిచ్చుటయు, సేవజేయుటయు నయినది."

గురుదేవుల నిర్యాణకాలమున యోగీన్ మా బృందావనమున తపస్వినియై కాలము బుచ్చుచుండెను. శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరము, శారదామాత బృందావనమునకు వెళ్లెను. అచ్చట శారదాదేవి యోగీన్ మాను జూడగనే యుభయులకు పట్టరాని దుఃఖము వచ్చి శారదామాత యామెను కౌగలించుకొని యశ్రుధారల గార్చెను. దినమంతయు నిర్వురు విచారముతోను, నేడ్పుతోను గడపిరి. ఇట్లుండ నొకనాడు గురుదేవులు వారలకు దర్శనమిచ్చి, "ఎందుల కిటు లంతగ దుఃఖపడుచున్నారు. నే నిచ్చటనే యుంటినే! ఎక్కడకు వెళ్లగలను! ఈ గదినుండి యా గదికి వెళ్లుటవంటిదే జరిగిన"దని వారిని సముదాయించెను.

బృందావనమున యోగీన్ మా ధ్యానము చేయుతరి గొప్ప యేకాగ్రతను బొందుచుండెడిది. ఒకనాడు లాల్‌బాబా దేవళమున ధ్యానముసేయుతరి, నామె గొప్ప సమాధి నిమగ్నురాలయ్యెను. సంధ్యాపూజలు పూర్తియై, దేవాలయ ద్వారములు మూయుటకై పరిచారకు లాయత్తపడుచున్నను, యోగీన్ మా నా స్థితినుండి లేపజాలరైరి. ఇలుచేరుట కాలస్యమగుటచే, శారదాదేవి లాంతరునిచ్చి యోగీన్ మాను వెదకుటకు మనిషిని బంపెను. అతడు నామెను లేపజాలడాయె. ఆమెకప్పుడు ప్రాపంచిక స్మృతియే లేదాయె. ఇంతలో నామెయే సమాధినుండి లేచి, యింటికి వచ్చెను. ఈ యాధ్యాత్మిక భావదీప్తి నలరారు దినముల గూర్చి యోగీన్ మా తన కా దినములలో ప్రాపంచికస్మృతిని మరచి, ప్రపంచమున్నదియు లేనిదియు తెలియని స్థితిలో దానున్నట్లు చెప్పెడిది.

కలకత్తాలో తన నివాసమందు, నొకపర్యాయ మిట్టి ఆనంద సమాధిని యోగీన్ మా యనుభవించెను. ఈ విషయమై యోగీన్ స్వామిజీతో ముచ్చటింప, వా రామెతో నిట్లనిరి: "యోగీన్‌మాయీ! నీవు సమాధిలో పరమపదించెదవు. జన్మలో నొక్కపర్యాయము సమాధిస్థితిని జవిచూచినచో ప్రాణోత్క్రమణ

సమయమున నా సమాధిని గనగలవు.''

ఇట్టుల మంచి యాధ్యాత్మికోన్నతిలోనుండ, నొకపర్యాయ మామెకు గండ్ల కెట్టుజూచినను దన యిష్టదైవము సాక్షాత్కారమగుచుండె నట. ఈ చెప్పఁబోవు స్థితిలో నామె మూడు దినములు గడిపెను. యోగిన్ మా బాల గోపాలుని ప్రతిమలను రెంటి నతిశ్రద్ధాభక్తు లతో నారాధనచేసెడిది. ఆ యారాధన సమ యమున నామె పారవశ్యము బొందినచో, నా బాలగోపాలుర దర్శనమయ్యెడిదట. అట్టి ధ్యాననిష్ఠయందొకతరి, సద్వితీయ మగు సుందరగాత్రు లిద్దరు ద్యోతకులైరి. వారిద్దరు ముసిముసి నవ్వులతో నచ్చి యోగిన్ మా ను కౌగలించుకొని, యామె వీపును దట్టుచు, "మే మెవ్వర మో తెలియునా?" యని సంబో ధించిరి. అంత యోగిన్, 'నాకు బాగుగ తెలి యును, నీవు పీరుడవగు బలరాముడవు. మరి నీవు శ్రీకృష్ణుడ'వని జవాబు చెప్పెను. చిన్న వాడగు శ్రీకృష్ణు డంతట యోగిన్ మా కు తమగుర్తు లేదనియె. ఎందువలనని జోగిన్ ప్రశ్నించెను. జోగిన్ మనుమలను జూపించుచు, 'వీరివలన' నని శ్రీకృష్ణు డనియె. నిజముగ యోగిన్ మా ఏకపుత్రికావియోగము కల్గి, తనకు గల మనుమలతో జాల లంపట ములో నుండెను. అందువలన నామెకు గల యున్న తాధ్యాత్మికభావన కుంటువడి, క్రమేణ ఆమె మామూలు స్థాయిలో బడెను.

యోగిన్ మా గృహస్థాశ్రమమున నున్నట్లు కనబడుచుండినను నామె తాంత్రికవిహితమగు పూర్ణాభిషేకాది కర్మలచేతను, వేదవిహితమగు విరజాహోమాది కర్మలచేతను, శాస్త్రోను సారమగు సన్యాసాశ్రమమును స్వీకరించిన విరాగిని, త్యాగిని. ఆమె కొంతకాలము పాలు, ఫలములనే పుచ్చుకొనియెడిది. ఎట్టి భక్తులు గూడ చేయజాలని వ్రతములను, ఆరాధనలను ఏకాగ్రతగల బుద్ధితో ప్రత్యేక నియమ నిష్ఠ లతో నాచరించెడిది. ఆమె పంచాతపవ్రత మును (అనగా నాలుగువైపుల నామె కగ్నియు, నెత్తిపై తీక్ష్ణమగు సూర్యుని వేడిమియు గల) బహుకష్టమగు వ్రతమును జేసెను. ఆమె జీవితమంతయు నుపవాసములు, జాగరణ ములు.

ఆమె కాలమును వృథాపుచ్చెడిదిగాదు. ఊరకనుండువేళల నామె గీత, భాగవతము, పురాణేతిహాసములు, చైతన్యచరితామృతము, శ్రీరామకృష్ణుల భక్తిప్రబోధక గ్రంథపఠనము లతో సదా సత్కథా కాలక్షేపము జేసెడిది. ఆమె బుద్ధిసూక్ష్మత యెట్టిదన దాను పారాయ ణముచేయు చైతన్య చరితామృతము మొద లగు గ్రంథములందలి ముఖ్యఘట్టము లెన్నియో కంఠస్థములు. ఆమె పురాణగాథలను జక్కగ చెప్పెడిది. సోదరి నివేదిత హిందూమతము నందలి కథల గ్రంథమునకు (Cradle Tales of Hinduism) మున్నుడియందు, తా ననేక విషయములు యోగిన్ మా నుండి గ్రహిం చితినని యామెను ప్రశంసించెను.

యోగిన్ మా, గోలప్ మా యెంత యాధ్యాత్మిక సాధన చేసిరో మీలో మీరు ముచ్చటించుకొనుట శ్రేయోదాయకమని శారదామాత భక్తురాండ్రతో చెప్పుచుండె డిది. జనసామాన్యము విశ్రాంతి యను పేరున బద్ధకమునకు దావిచ్చెదరు. కాని యోగిన్ మా వృద్ధాప్యమునగూడ నెన్నిపనులు, నిబ్బందులు నున్నను, దన నిత్య కార్యక్రమమునందలి జప, తప, ధ్యానాదికములగు నాధ్యాత్మిక సాధన లామె నాకర్షించుచునే యుండెను.

గంగాస్నానానంతరము, ప్రతిదినము రెండు గంటలకు తక్కువగాకుండ ధ్యాననిష్ఠ నిమగ్నురాలైయుండెడిది. ఆమె ధ్యానములోనుండ, నీగ లామె కండ్లలో దూరినను నామెకు గుర్తు తెలిసెడిదిగాదు. ఎంత యీదరగాలియున్నను, నామె గంగాస్నానము, జపతపములకు నభ్యంతరము గల్గింపజాలకుండెను.

ఆమె మనస్సు గొప్ప ధర్మచింతలో నున్నప్పటికి, నామెకు గృహకృత్యములయెడ నిర్లక్ష్యభావము గానము. స్నానము, జపము చేసికొని, యామె ప్రతినిత్యము శారదాదేవి యాశ్రమమగు ఉద్బోధనకు బోయి, యచ్చట శారదామాతయొక్క జుట్టు సవరించుట, కూరగాయలను బాగుజేయుట మొదలగు పనులు జేసెడిది. మధ్యాహ్న మింటికి జేరి తనకు దన తల్లికి వంటచేసికొని, తిరిగి మధ్యాహ్నము శారదాదేవికడకేగి ఆమె సేవజేసి, సాయంకాలమున నాలయమున నారాత్రికానంతరమున తిరిగి తన యిలుసేరెడిది.

చరమావస్థయందు మంచము
సమయమున నితరుల సాహాయ్యముతో మంచముపై గూర్చొనియుండి, మతగ్రంథముల నితరులు చదువగా వినుచు, మామూలుగ తన తపోనిష్ఠ నియమముల నాచరించెడిది. ఆమె యెవ్వరిని నొప్పించుటగాని, యసంతుష్టిపరచుటగాని యెఱుగదు. ఏ దివ్యక్షేత్రమునకు వెళ్లినను, అల కేదియో ధర్మమును జేయుట జోగిన్ మా సుగుణములలో నొకటి. ఆమె చాల దేశాటనము చేసినది. ఉత్తరమున కేదారము, బదరీనారాయణము; దక్షిణమున కన్యాకుమారి; కథియవార్ నందలి ద్వారక ధామము మొదలు, అస్సామ్ నందలి కామాఖ్య వరకును గల దివ్యక్షేత్రముల నామె దర్శించి మించినది.

శ్రీ గురుదేవుల శిష్యులలో నగ్రగణ్యులు నయితము యోగిన్ మా కు గొప్ప గౌరవము నొసగెడివారు. వివేకానందులకు యోగిన్ మా యన్న గొప్ప ప్రేమ. బేలూరుమఠమునుండి పడవలో కలకత్తా చేరునప్పుడు నీలాటరేవున స్వామీజీ జోగిన్ మా ను చూచినచో "జోగిన్ మా! యీ దినమున మీ యింట నా భిక్ష. నాకిష్టమగు కూరగాయలను చేయు" మనియెడివారు. ఇంతియగాక, ఆమె వంటయన్న స్వామీజీ కెంత ప్రీతియో గనుడు! "ఈ దినము నా జన్మదినము. నాకు మంచి భక్ష్యముల నారగింపజేయు"మనెడివారు.

జోగిన్ మా యం దన్యమతద్వేషమును గాని, సంకుచితభావములనుగాని, ఛాందసమును గాని గానము. ఏ దేవతను జూచినను ప్రీతియే. ఆమెయందు విపరీతమగు భక్తి, విజ్ఞానములను గాంతుము. సగుణోపాసనయందే గాక, నిర్గుణోపాసనయందుగూడ ఆమె కాసక్తి గలదు. అందువలననే శ్రీరామకృష్ణులు యోగిన్ మా ను జూచినప్పటనే, ఆమెనుగూర్చి యిట్లు చెప్పియుండిరి: "యోగిన్ మా కు గల యాధ్యాత్మికసిద్ధులు భక్తులలో నపూర్వము. కాలము గడచిన కొలది ఆమె సిద్ధులను జూచి ప్రజ లాశ్చర్యము నొందెదరు. ఈమె తొందరలో వికసించు పుష్పముగాక, సహస్రదళములుగల పద్మము గావున క్రమక్రమముగ, నెమ్మదినెమ్మదిగ వికసించును. భక్తురాండ్రలో యోగిన్ మా యందు జ్ఞాని లక్షణములు గలవు."

యోగిన్ మా డెబ్బదిమూడేండ్ల ముదు

సలిగ (1924 లో) తన భౌతిక దేహమును చాలించినది. శ్రీరామకృష్ణుల వాక్యానుసార నామె అంతిమక్షణములందును యోగప్రవృత్తిని కలిగియుండెను. సదా ధర్మచింత దప్ప, యితరవిషయములందు మనసు జొరనీక, ప్రాపంచికవిషయములయెడ, సంభాషణలయెడ వైముఖ్యముగ నుండెడిది. ఆమె జీవితము నందలి ఘనమైన ఘట్టములను మనసునకు తెచ్చుకొన్నచో సాధువులకు, భక్తులకు నుత్సాహము, బలము కలుగును. ప్రాణోత్క్రమణ సమయమున, స్మృతితప్పినట్లుగ జూపరులకు గోచరించినను, ఆమె నా యంతిమ క్షణమున జూచిన వైద్యులు సయితము నామెస్థితిని యోగప్రవృత్తిని సూచించు జ్ఞానలక్షణముగనే కొనియాడిరి. ఈ స్థితి వివేకానందులు చెప్పిన సమాధియే!

# శ్రీ వివేకానంద సంభాషణలు

## (శ్రీ సురేంద్రనాధసేన్ స్వంత దినచర్యనుండి)

అనువాదకుడు: శ్రీ పిన్నింటి సుబ్బారావు

[భారతదేశమందలి శ్రద్ధారాహిత్యము, దాని పునరుద్ధారణావసరము—మనకు గావలసినది మానవులు—యథార్థమగు సంఘ సంస్కార ప్రియులు.]

శనివారము, 22-1-1898.

కలకత్తాయందలి రమాకాంతబోసు వీధి యందున్న నెం 57 ఉ గల బలరాంబాబు గృహమందు స్వామిజీ యుండగా ఒకనాడు ప్రాతఃకాలమున శ్రీవారిని దర్శించుటకు నేను వెళ్లియుంటిని. గదియంతయు ప్రేక్షకులతో నిండియుండెను. స్వామిజి, "మనకు శ్రద్ధగావలయును. ఆత్మవిశ్వాసముగావలయును. శక్తియే ప్రాణము. దౌర్బల్యమే మరణము. మనము ఆత్మరూపులము. మరణ మనునది లేదు. స్వతంత్రులము. స్వభావసిద్ధముగా పవిత్రులము. పాపమనునది అసలు మనము చేయగలమా? అసంభవము" ఇట్టి ధృడవిశ్వాసము గావలయును అని యుపన్యసించుచుండిరి. అట్టి దృఢనమ్మకమే మనలను మానవులుగను, దేవతలుగను జేయగలదు. ఇట్టి విశ్వాసము లేకపోవుటచేతనే నేడు భారతదేశము నాశనమైనది.

ప్రశ్న:—మనము ఇట్టి శ్రద్ధను ఎట్లు పోగొట్టుకొంటిమి?

స్వామిజి:—మనము బాల్యమునుండియు, విజాతీయమగు విద్యను నేర్చియుంటిమి. మనము

ఎందుకు పనికిరానివారలమని బోధింపబడి మన దేశమునందు మహాపురుషు లుద్భవించిరను విషయము మనము నేర్చు కొనుట కవకాశ మీయబడి యుండలేదు. నిర్మాణాత్మకమగు విషయ మేదియును మనకు బోధింపబడియుండలేదు. మనకు కాలుసేతు లెట్లుపయోగించుకొనవలెనో యదియైనను బోధింపబడలేదు. ఆంగ్లేయుల పూర్వీకులగూర్చిన విషయజ్ఞానమంతయును మనము గ్రహించితిమి గాని, మనము మన పూర్వీకులనుగూర్చి యించుకంతైనను గ్రహించుట కుద్యమించుటలేదు. దౌర్బ ల్యమే మనము నేర్చుకొంటిమి. అస్వతం త్రులమగుటచే, మనము బలహీనుల మనియు, స్వాతంత్ర్య మనునది మన కెచ్చ టను మృగ్యమనియు మనము నమ్మునట్లు బోధింపసాగిరి. శ్రద్ధ నశించిపోవక ఎట్లు నిల్చియుండగలదు? యథార్థమగు శ్రద్ధ మఱల మనయందు ప్రతిష్ఠింపబడవలసి యున్నది. మనయందు మఱల ఆత్మ విశ్వాసము పునరుద్ధరింపబడవలసియున్నది. అప్పుడు మన దేశ సమస్యలన్నియు క్రమ క్రమముగా, మనంత మనమే పరిష్కరించు కొనగలము.

ప్రశ్న:—అదెట్లు సంభవము? మనసంఘమునం దున్న సమస్త దోషములును ఒక్క శ్రద్ధ వలననే ఎట్లు పరిష్కరింపబడగలవు? ఇవి గాక మన దేశములో కొన్ని అతిజరూరు విషయములు గలవు. ఆ లోపములను సవ రించుటకై జాతీయ కాంగ్రెసువారు, అట్టి మఱికొన్ని దేశసేవకసంఘములు బ్రిటీషు దొరతనమువారిని మహజర్ల ద్వారా ప్రార్థించుచుండిరి. ఇంతకంటె మన యాప్సి తములను దెలియజేయుటెట్లు? శ్రద్ధ యీ సందర్భములలో ఏమిచేయగలదు?

స్వామిజి:—నాకీ విషయము దెలుపుడు, ఇవి పరి పాలకుల యాప్సితములా, పరిపాలితుల వాంఛలా? మీవైనచో పరిపాలకులు మీ యభీష్టములు నెరవేర్చెదరా? లేక మీ యంతట మీరే వానిని సఫలమొనర్చుకొన వలయునా?

ప్రశ్న:—ప్రభువులు, ప్రజల కోర్కెలను గమ నించి, యీ రీతిగా పాలించవలెనుగదా. ప్రతి విషయమునకు రాజును గాక మరెవ్వ రిని ఆశ్రయించవలయును?

స్వామిజి:—యాచకుని యాప్సితము లెన్నడును సఫలము గానేరవు. మీరు కోరిన సమస్త విషయములు దొరతనమువారు మీకు సమకూర్చిరని భావించుకొందము. వానిని సక్రమముగా నడపించుకొనగల్గు ప్రజలేరి? అందుచే మొదట మానవులను, ధీరపురుషు లుగ తయారుచేయవలయును. పురుషులు మనకు గావలయును. శ్రద్ధ లేనిదే ఎట్లు పురుషులు గాగలరు?

ప్రశ్న:—అయ్యా! కాని ప్రజాబాహుళ్యము నభిప్రాయ మిదిగాదు.

స్వామిజి:—నీవు చెప్పు జనబాహుళ్యము మూర్ఖు లయొక్కయు, సామాన్యమగు తెలివితేటలు గలవారలయొక్కయు సముదాయమై యుండును. ప్రతిచోటను, బుద్ధిబలముచే స్వయముగా ఆలోచింపగల శక్తి గలవారలు చాల తక్కువగా నుందురు. ఇట్టివారలే నిజమైన నాయకులు. జనబాహుళ్యము, హారమందలి సూత్రమువలె యీ నాయకు

లను సంఘశ్రేయమునకై యనుసరించుచుండును. ఇతరులకు తలలొగ్గి, వారి ననుసరించుట తలవంపని తలచి, తమకు తోచిన రీతిగా ఆచరించువారు మూర్ఖులు. మీరు సంఘసంస్కరణమునుగూర్చి మాట్లాడుచున్నారు. కాని మీరేమి చేయుచున్నారు? వితంతూద్వాహములు, స్త్రీజనాభ్యుదయము—ఇట్టివేగదా మీరు కోరుచున్న సంఘసంస్కరణములు. ఇవైనను దేశవ్యాప్తముగా గాక, కొన్ని పరిమిత సంఘములయందు గదా కోరుచుండుట. ఇట్టి సంస్కరణలచే ఏ కొద్దిమందికో లాభము చేకూరగలదు కాని, దేశము మొత్తముపై అట్టివిధానమువలన లాభమేమికలుగగలదు? ఇది సంఘసంస్కరణమా, లేక స్వార్థపిశాచమా? మీ యింటిని మాత్రము పరిశుభ్రముగను, అందముగను నుంచుకొనుటకు యత్నించుచు, పరులగృహము లెంత అపరిశుద్ధముగనున్నను నూరకొనుటవంటిది గాదా మీరు గోరు సంస్కరణవిధానము.

ప్రశ్న:—అయితే సంఘసంస్కరణమునకై యత్నించవలసిన యవసరము లేదనియా మీ యభిప్రాయము?

స్వామిజి:—అట్లనియెదవేల? సంఘసంస్కరణవిధానమున కవకాశము గలదు. మీరు గోరు సంస్కరణవిధానము దరిద్రనారాయణులకు వర్తించదు. వారియందదివఱకే వితంతు వివాహములు, స్త్రీ జనాభ్యుదయము గలవు. అందుచే మీరు గోరు మార్పులు వారి దృష్టిలో సంస్కరణములు గానేరవు. "శ్రద్ధలేకపోవుటచేతనే మనకీ బాధలు గలుగుచున్నవనియు, ఇంకను గలుగగలవనియు నే చెప్పుచున్నాను. రోగమునకు మూలకారణమేదియో దానిని అణగద్రొక్కక, సమూలముగా దానిని పైకి పెకలించివేయుటయే నా చికిత్సావిధానము. అనేకవిధములగు మార్పులు కావలసినవే. 'అవసరము లేదు' అనునట్టి మూర్ఖుడుండబోడు. ఉదాహరణగా అంతర్వివాహములను పరిశీలింతము. ఈ యాచారము నేడు లేకపోవుటచేతనే భారతదేశము శారీరకముగా, క్రమక్రమముగా బలహీనమగుచున్నది.

ఆ రోజున సూర్యగ్రహణమగుటచే, ఈ సంభాషించుచున్న మహాశయులు, స్వామిజీకి నమస్కరించి, "గంగానదికి స్నానార్థమై పోవలయుననియును, మఱియొక రోజున వచ్చి దర్శనముచేసికొందుననియు నుడివి" వెడలెను.

ఓమ్ తత్సత్.

# దేవీ స్తవము

శ్రీ ఆత్మానందస్వామి

(గతసంచిక తరువాయి)

మీనమున కెరఁ జూపఁగ । మ్రింగి చచ్చు; భంగి, నీయల్పరుచులకు । భ్రమసి జనులు
జనన మరణము లొందుట । గనుచునుంటి; జాగుసేయక తెరఁదీయ । రాగదమ్మ. 11

రాలి, నీకల్పితాంధకా । రమున జనులు; దరిని గానలే కొకరి కొ । కరు బిరబిర
డీకొనుచు మ్రగ్గుచున్నారు । లోకమాత; తెరను తొలఁగించు నాయందు । కరుణతోడ. 12

ఈ చరాచరరూప ప్ర । పంచమంత; నీ విజృంభణమేయగు । నిజముఁగంటి
అవలనున్నాఁడు నా తండ్రి । యతనిజూపఁ; దెరను తొలఁగించు మాయమ్మ । కరుణతోడ. 13

నిజ మబద్ధ మబద్ధము । నిజములాగు; నిర్వహింతువు కార్యమై । సర్వసాక్షి
నావరించి నీ మహిమచే । నంబ, దయను; చూపుమాతని, దెరదీసి । యోపఁజాల. 14

పడయు సుఖదుఃఖములు నీ ప్ర । భావ జాల; మందు జడులు శాశ్వతమని । కుందు చుంద్రు
పండితులఁ జలింప వలను । పడదు గాన; దారి విడువుము నాతండ్రి । దరికిఁబోవ. 15

వరలుచుంటివి స్వేచ్ఛగ । ద్వంద్వ సృష్టి; చేసి, మరులుగొల్పు; జడులు । సేమమరయ
లేక, మఱిమఱి జనియించు । లోకమందె; త్రోయకమ్మ నన్నందులో । దుర్గ దేవి. 16

జప తప ధ్యానకర్మలఁ । జాలకాల; మాచరించి మాత యనుగ్ర । హంబు గాంచ
లేమి నిష్ప్రయోజనమె, నీ । లీలగంటి; తెరఁదెరువుము ప్రభువుదరి । కరుగనిమ్మ. 17

కలవు మిట్టపల్లములెన్నొ । గడవదొక్క; నిముసము సుఖముగ భువిని । నీవు శీఘ్ర
మందె నా కరమాతని । కందఁజేయఁ; దెరను తొలఁగింపుమాయమ్మ । కరుణతోడ, 18

ద్వైతమును విశిష్టాద్వైత । వరమతంబు; మఱియు, నద్వైతమతమును । వరలు నీదు
జృంభణమునఁగాదె; నదులు । చేరునిధిని; నేనెఱుంగుదుఁ దెరవిమ్మ । నేఁడె తల్లి! 19

క్రమము వెనుకను మఱియొక । క్రమము చనును ; ఒక్కతీరుననే క్రమ । ముండఁబోదు
నీవు నైసర్గికంబిద్ది । నాదు మార్గ, మధ్యమందున నిలువక । మరలుమమ్మ. 20

భ్రాంతి దూషణ భూషణ । భాషణములు ; సంకటములు రాగద్వేష । చయము, జనన
మొందు నిత్యము నీ గర్భమందు కాళి ; కాంబ నీదయలేక మోక్షంబులేదు. 21

ఈషణత్రయ పాశముల । మీల్గఁజేయ ; సర్వసంగ పరిత్యాగ । సాధనమున
బెనఁగులాడుచుంటి, గిరిక । ప్రీతితోడఁ ; దెరను దొలఁగించి కావవే । తెల్వి నొసఁగి. 22

త్రిగుణ కలితాత్మవగుచు, నతీతవగుచుఁ ; బడుగు పేకలఁ జేసి నీ । కడుపులోనఁ
బదియు నాలుగు భువనముల్ । పరచినావు ; కరుణ నా తెర దొలఁగించి । కావుమమ్మ. 23

ఆత్మ దర్శనమొందకే । యాత్మబోధఁ ; గలుప నిరువురుఁ బెడదారి । నరుగుచుంద్రు
అంధు డంధున కేరీతి । నొందఁ జేయుఁ ; దెరవు ? నీ తెర దీయకే । ధేనుకాంబ. 24

నీగృహ కవాటములు మూసి । నేఁటి కెన్నో ; యుగములాయెను. బిగిసెను । పగులునేమొ
బలిమిఁ బెకలింప, భీతిని । బడయుచుంటి ; నీవె విడళించు, భార్గవి । నిమ్మళముగ. 25

శక్తిసర్వాధికార మీశ్వరునివలన ; సంగ్రహించితివంచు నీశరణి నన్ను
బొమ్మగాఁ దెరపైఁద్రిప్పఁ । బుణ్యమౌనె ; తెరనుదొలఁగించు మాతృక । కరుణతోడ. 26

మేరుగిరి శిఖాగ్రమునందు । గూరుచుండి ; ఘోరతపముఁ జేయగలము । నూరువేల
వత్సరములు, నిన్నెఱుఁగంగ । వలనుపడదు ; తల్లి తెరదీసి చూపవే । తండ్రి రూపు. 27

కారణము వాక్కు నీరూపుఁ । గలుగుటకును ; భావమాది వాక్కునకును । భావమునకు
భర్త భగవంతుఁడరయ నా । భయముతీరెఁ ; దెరను దొలఁగింపు మంగళ । కరుణతోడ. 28

ఊఱడించును పాలిచ్చి । యువిద, బిడ్డఁ ; డేడ్వనాలించి, నీ ధర్మ । మిద్ది తల్లి !
తల్లడిల్లుచున్నాఁడను । తండ్రిఁ జూడఁ ; దెరను తెరువుము కర్బరి । కరుణ తోడ. 29

క్షితిని పురుష నపుంసక । స్త్రీల రూపు ; దాల్చి విహరించుచుంటివి । తారతమ్య
మరయలేకుంటి తల్లివై । యవతరించి ; రమ్ము నాకు స్వారాజ్యమ్ము । నిమ్ము కాళి. 30

నీవు సృష్టిస్థితిలయాప । నింద కీర్త ; నముల నాదిగ నిందాఁక । నడపి చక్ర
గతినివరలుచున్నావు గం । గాభవాని ; కరుణ రక్షించి యావలి । కరుగ నిమ్ము. 31

(సశేషము)

# శ్రీ వాసుదేవ మననము

## ప్రథమవర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

శ్లో. "బ్రహ్మానందం పరమసుఖదం
కేవలం జ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం
తత్త్వమస్యాది లక్ష్యం।
ఏకం నిత్యం విమలమచలం
సర్వధీ సాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం
సద్గురుం తం నమామి॥

శ్లో. అచింత్యా వ్యక్తరూపాయ
నిర్గుణాయ గుణాత్మనే।
సమస్త జగదాధార
మూర్తయే బ్రహ్మణేనమః॥

శ్లో. యో విశ్వాత్మావిధిజ విషయా
న్ప్రాశ్య భోగాన్ స్థవిష్ఠాన్।
పశ్చాచ్చాన్యాన్ స్వమతివిభవాన్
జ్యోతిషాస్వేన సూక్ష్మాన్॥

శ్లో. సర్వానేతాన్పునరపిశనై
స్స్వాత్మనిస్థాపయిత్వా।
హిత్వా సర్వాన్విశేషాన్విగత
గుణగణః పాత్వసౌనస్తురీయః॥"

ఇహాముత్ర పురుషార్థములు ధర్మార్థ కామ మోక్షములని నాలుగువిధములు. పురుషార్థములన—"పురుషేణ ముముక్షుణా అర్థ్యంతే అభిలష్యంతే ఇతి పురుషార్థాః ధర్మార్థ కామ మోక్షాః" = ముముక్షువైన పురుషునిచేత గోరబడు ధర్మార్థకామమోక్షములు పురుషార్థములు. ఈ చతుర్వర్గమునందు ధర్మమనగా.—"వేదప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః। వేదో నారాయణ స్సాక్షాత్స్వయంభూరితి చ శ్రుతిః॥)' (భాగ 6-1-40) వేదవిహితమైనది ధర్మము. వేదప్రమాణకమని యర్థము. దీనిచే నేది వేదప్రమాణకమో అది ధర్మము, ఏది ధర్మమో అది వేదప్రమాణకమునని ధర్మముయొక్క స్వరూపలక్షణము ప్రతిపాదింపబడినది. "చోదనాలక్షణోర్థోధర్మః" ఇతిజైమిని॥ చోదనమె (ప్రేరణమె) లక్షణము (స్వభావము) గాగల యర్థము ధర్మమని జైమిని సూత్రము. ధర్మమునకు విపర్యయమై ఏది వేదనిషిద్ధమో అది యధర్మము. నిషేధముకూడ వేదమునందు ప్రమాణమని యర్థము. వేదముయొక్క ప్రామాణ్యమునందు హేతువు.—"వేదోనారాయణ స్సాక్షాత్స్వయంభూరితి చ శ్రుతిః" అనగా 'వేదోనారాయణాదు

ద్భూతః స ఏవసాక్షాదితి' = వేదము నారాయణునివలన నుత్పన్నమైనది, ఆ నారాయణుడే సాక్షాత్తుగ వేదము. అనగా వేదము నారాయణునియొక్క ప్రత్యక్షస్వరూపము. మఱియు వేదము స్వయంభువు, "నిశ్శ్వాస మాత్రేణ స్వయ మేవ భవతీతి స్వయంభూః"= నిశ్శ్వాసమాత్రముగ స్వయముగనైనది. "అస్యమహతో భూతస్య నిశ్శ్వసితమేతదృగ్వేదాది ఇతి॥" (బృ 2-4-10) పరమేశ్వరుని యొక్క నిశ్శ్వసితమే ఈ ఋగ్వేదాది మహాచ్ఛాస్త్రము, అనగా ఋగ్వేదాదులు అవ్యాకృతపరబ్రహ్మమువలననుండి, పురుషుని నిశ్శ్వాసముభంగి అప్రయత్నముగ నుద్గతమైనవని యర్థము" అనెడి శ్రుతి యీ యర్థమునందు ప్రమాణము. ఇట్లు భగవదాజ్ఞలైన వేదశాస్త్ర విధుల నుల్లంఘింపక యథావిధిగ ననుసరించి ప్రవర్తించుట ధర్మము. ఈ ధర్మనిర్వహణము నందు సాధనములను మూడువిధములుగ శ్రుతులు విధించుచున్నవి. "త్రయోధర్మస్కంధాయజ్ఞోఽధ్యయనం దానమితి ప్రథమ స్తపఏవ ద్వితీయో బ్రహ్మచార్యాచార్యకులవాసీ తృతీయోఽత్యంత మాత్మాన మాచార్యకులేఽవసాదయన్। సర్వఏతే పుణ్యలోకా భవంతి బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి॥" (ఛాం 2-23-1.) ధర్మస్కంధాత్రయః = ధర్మసాధక మార్గములు మూడు విధములు. యజ్ఞః - అధ్యయనం - దానం - ఇతి ప్రథమః=యజ్ఞము, అధ్యయనము, దానమునను వీని నాచరించుటకు యోగ్యమైన గృహస్థాశ్రమము మొదటి స్కంధము. తపఏవ ద్వితీయః=తపస్సే రెండవ స్కంధము. తపస్సు ప్రధానముగాగలవి వానప్రస్థాశ్రమము, సన్యాసాశ్రమమును అగుటం జేసి యీ రెండు ఆశ్రమములును ఇక్కడి తపశ్శబ్దముచేత జెప్పబడుచున్నవి. బ్రహ్మచారీ ఆచార్యకులవాసీ అత్యంతం ఆత్మానం ఆచార్యకులే అవసాదయన్ తృతీయః = బ్రహ్మచారి గురుకులమున వసియించి నియమములచే నిజ శరీరమును శోషింపజేయుచు నప్రమత్తుడై సద్గురు శుశ్రూషలను సమర్థించుచుండవలయును. ఈ నైష్ఠిక బ్రహ్మచర్యాశ్రమమే మూడవస్కంధము. ఏతే సర్వే పుణ్యలోకాః భవన్తి = ఈ మూడు ధర్మస్కంధములచేత నాలుగు ఆశ్రమములను పరిపాలించు బ్రహ్మనిష్ఠావికలులైన కేవలాశ్రమపరిపాలకులందఱును నిజయోగ్యతానురూపమైన పుణ్యలోకములను పొందుచున్నారు. బ్రహ్మసంస్థః అమృతత్త్వం ఏతి = బ్రహ్మనిష్ఠుడైన నెందేయాశ్రమవాసియైనను ఆత్మవిజ్ఞానియై, అవిద్యా ప్రతిబంధ వినాశరూపమైన అమృతత్త్వమును (కైవల్యమును) పొందుచున్నాడు.

"ధర్మఏవ హతోహంతి ధర్మోరక్షతిరక్షితః।
తస్మాద్ధర్మోనహంతవ్యో మానోధర్మోహతోఽవధీత్॥" (మనుః 8-15) కం॥ 'ధర్మంబు జెఱుప జెఱుచును। ధర్మము రక్షించువాని దారక్షించున్। ధర్మంబు జెడకయుండను। నిర్మలమతి నడుపవలయు నిశ్చలనియతిన్॥' ధర్మ మతిక్రమింపబడినదై హతమొనరించుచున్నది. ధర్మము సంరక్షింపబడినదై సంరక్షించుచున్నది. కావున ధర్మము నుల్లంఘింపకూడదు. ధర్మము ఉల్లంఘింపబడనిదియై మనలను హతమొనరింపకుండునుగాక. అనగా ధర్మమును చెఱచినవానిని ధర్మమే చెఱుచును. ధర్మమును పరిపాలించినవానిని ధర్మమే పరిపాలించును. కనుక నిర్మలచిత్తముతో ధర్మమును నిశ్చల నియమముచే నిర్వర్తింపవలయునని వేద శాసనము.

2. అర్థమనగా.—ఆ ధర్మానుష్ఠానఫలమైన పరబ్రహ్మ విషయక పరోక్ష జ్ఞాన ప్రాప్తి.

3. కామమనగా.—అట్టి పరోక్ష జ్ఞాన దార్ఢ్యముచేత పరబ్రహ్మమును తా నపరోక్షముగ సాక్షాత్కరించుకొనవలయునని కలిగెడి విశేషాభిలాషయె కామము. ఇదియె ముముక్షుత్వము. "సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామంతే నృణాం మోక్షేచ్ఛాజాయతే॥ "(పైంగల ఉ. 2 అ.) అనేక జన్మములయందత్యంత నియమనిష్ఠలతో నిర్వర్తింపబడిన స్వధర్మకర్మ పరిపాకవశమువలన అనేక జన్మములైనతరువాత మనుష్యులకు మోక్షమునందపేక్ష యంకురించుచున్నది.

4. మోక్షమనగా.— మాయావినిర్ముక్త స్వస్వరూపైకావస్థానము. దానివలన సమూలముగ సంసారముయొక్క సంపూర్ణవిచ్ఛిత్తియు మోక్షము. అనగా పరబ్రహ్మము సచ్చిదానంద పరతత్త్వమేకాని ఆత్మాశ్రిత స్వాధీన మాయా ప్రభావముచేత గల్పితమై జీవనిలయమైన ఈ అసద్రూప జగత్తునంతను జీవసంజ్ఞతో అహంతా మమతాభిమానమునుపొంది యనుభవించుచుండును. తాను తన యథార్థస్వరూపమైన సుఖాభిన్న చిద్రూపమును, స్వమాయా మూలమున తానుపొందిన జీవరూప చైతన్య రూపమును వాస్తవముగ నొకే అద్వితీయాఖండైక రసమని ("భగ్నావరణాచిదేవరసః"= నిరావరణ చిత్తేరసమని 'రసప్రకరణము', "రససార ఆనంద ఇత్యర్థః"=రసము-సారము అనిన స్వానందమని శాంకరభాష్యము.) యనుభవముగ దెలిసికొనుటవలన నా యవిద్య నశింపగా తాను తన యథార్థరూపమైన అద్వితీయాఖండైకరసస్వరూపమునే పొందును. ఇదియే సకలామ్నాయ సమ్మతమైన మోక్షస్వరూపము.

చతుర్వర్గమునందు మోక్షమే నిత్యత్వమువలన పరమపురుషార్థము. "నసపునరావర్తతే"॥ (ఛాం. ఉ. 8-25-1) మోక్షమును పొందిన బ్రహ్మవిదుడు పునర్జన్మమును పొందడు అని శ్రుతిమానము. శేషించిన ధర్మార్థకామములు మూడును అనిత్యత్వమువలన మోక్షసదృశములుగావు. "తద్యథేహకర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే॥" (ఛాం. ఉ. 8-1-6) కృషివాణిజ్యాది కర్మములచేత సంపాదింపబడిన ధనధాన్యాదికము ఉపభుక్తమగుచు క్షీణించుచున్నట్లే, మిశ్ర కర్మోపార్జితమైన ఇహలోకమును, జ్యోతిష్టోమాతిరాత్ర పౌండరీకాది పుణ్యకర్మోపార్జితమైన పరలోకమును గూడనుపభుక్తమగుచు క్షీణించునవియే అనునిత్యాది శ్రుతులవలన త్రివర్గముయొక్క అనిత్యత్వము రూఢమగుచున్నది. ఆ మోక్షము బ్రహ్మజ్ఞానమువలననే సిద్ధించును. "నాస్తిజ్ఞానాత్పరం కించిత్పవిత్రం పాపనాశనం। తపభ్యాసా దృతే నాస్తి సంసారోచ్ఛేదకారణం॥" పరమపవిత్రమైనది, సకలదురిత సంహర్తమునగునదియు బ్రహ్మజ్ఞానముకంటె పరమైనదిలేదు. ఆ జ్ఞాన ప్రాప్తియె సమూల సంసార వినాశకారణమైనది. "నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే॥" (గీ. 4-38.) బ్రహ్మజ్ఞానముతో సమానమైన మఱియొక పవిత్రవస్తు వేదియు నీ లోకమున లేదు' అని భగవద్వచనము. "జ్ఞానాదేవతు కైవల్యం ప్రాప్యతే యేన ముచ్యతే॥" ఆత్మజ్ఞానమువలననే కైవల్యాగమమును, సకారణ సంసార నిర్గమమును సిద్ధించును. "తమేవ విదిత్వాతి మృత్యు

మేతి। నాన్యః పంథా విద్యతే ఽయనాయ'' (శ్వే. ఉ. 3-8.) తం విదిత్వై వమృత్యుం అత్యేతి = ఆ పరబ్రహ్మ సాక్షాత్కారమును పొందియే మృత్యురూప సంసరణము న మించును. అయనాయ అన్యఃపంథానవిద్యతే= మోక్షముకొఱకు మఱియొకమార్గములేదు. ''తమేవం విద్వానమృత ఇహ భవతి। నాన్యః పంథావిద్యతేఽయనాయ॥'' (తై.ఉ.4-1-12). ఆ బ్రహ్మజ్ఞానమును అపరోక్షముగ నెఱింగిన బ్రహ్మవిజ్ఞాన సంపన్నుడే, ఇచటనే జీవన్ముక్తుడగుచున్నాడు. మోక్షమునకు ఇంతకంటె వేఱొకమార్గములేదు. ''తద్బ్రహ్మహమితి జ్ఞాత్వాబ్రహ్మసంపద్యతే ధ్రువం॥'' (త్రిపుర తాపిని. ఉ. 5) బ్రహ్మైవాహమనిస్వస్వరూపోపలంభ (అనుభవ) సిద్ధింగనిన బ్రహ్మజ్ఞానిచే బ్రహ్మము ధ్రువముగ పొందబడుచున్నాడు. ''బ్రహ్మవిదాప్నోతిపరం॥'' (తై. ఉ. 2-1) బ్రహ్మజ్ఞాని మోక్షమును పొందుచున్నాడు అని శ్రుతులు ప్రమాణము.

ఆ బ్రహ్మమును అధ్యారోపాపవాద క్రమముచేత దెలిసికొనవలయును. ఏలయన ఆరోపిత నివృత్తిచేతనే అధిష్ఠాన జ్ఞానోదయమగును. అనగా ఆరోపితమంతయు, సద్గురుముఖమున వేదాంత శ్రవణాదికమువలన మిథ్యయై నశించుట మూలమున నధిష్ఠానజ్ఞాన మధిగతమగును. ''అధ్యారోపాపవాదాభ్యాంజ్ఞాతవ్యస్తత్త్వనిర్ణయః'', ''నకర్మణా నప్రజయా ధనే న త్యాగేనై కేఽమృతత్త్వమానశుః॥'' (కై. ఉ. 3.) అధ్యారోపాపవాద క్రమమును (సృష్టిలయక్రమమును) తెలిసికొనుటచేత దత్త్వనిర్ణయమును తెలిసికొనవలయును. 'తత్త్వం బ్రహ్మణి యాథార్థ్యే', తత్త్వమన పరబ్రహ్మము-యాథార్థ్యమునని కోశము.' అగ్నిహోత్రము (నిత్యోపాసనము) మొదలుకొని సహస్రసంవత్సర సత్రాంతముదనుకగల ఏయే వేదోక్తకర్మలు గలవో వాని నాచరించుటచేత ముక్తిలభింపదు. సత్సంతానముచేత మోక్షము లభింపదు. ధనముచేత కైవల్యము లభింపదు. కొందఱు అంతర్ముఖులు అనగా సద్గురూపదిష్ట లక్ష్యదృష్టిగలవారు త్యాగముచేతనే నిర్వాణ సుఖమును బడసిరి. ''సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥'' (గీ. 18-2) వేదోక్తములైన స్వధర్మకర్మములను యథావిధిగ నాచరించుచు ''యథాపుష్కరపలాశ ఆపోనశ్లిష్యంత'' (ఛాం.ఉ. 4-14-3) తామరాకు నీటిని అంటని చందమున గర్మఫలముల నపేక్షింపక, సమనుష్ఠిత సర్వకర్మఫలములను పరమేశ్వరార్పణముగ బరిత్యజించుట త్యాగమని పండితోక్తి. ''వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాస్సన్యాసయోగాద్యతయ శ్శుద్ధసత్త్వాః। తే బ్రహ్మలోకేతు పరాంతకాలే పరామృతాత్పరిముచ్యంతి సర్వేః'' (తై. ఉ. 4-12-13) వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః=ఆచార్యసన్నిధిని ఉపనిషద్వాక్య శ్రవణాదికముచేత నుత్పన్నమైన బ్రహ్మాత్మవిజ్ఞానముచేత నిశ్చయింపబడిన జీవబ్రహ్మైక్యలక్షణవిషయముగల వారలయి, సన్యాసయోగాత్ = త్యాగయోగములవలన శుద్ధ సత్త్వాః=పరిశుద్ధమైన చిత్తముగలవారలునయి, యతయః = నిర్జితేంద్రియులు, నియమ (ఉపరమ) శీలురునగు, తేసర్వే = వారందఱు, పరాంతకాలే = అజ్ఞానము నశించినతరువాత కలిగెడి దేహపాతకాలమునందు, బ్రహ్మలోకేతు=బ్రహ్మసాక్షాత్కారము గలిగియున్నవారగుటంజేసి, పరామృతాత్ = అవ్యక్తము వలననుండియు, పరిముచ్యంతి = విముక్తులగుచున్నారు. తా॥ వేదాంతములనగా ఉపనిష

ద్వాక్యములు. 'ఉపనిషత్' అనగా.—'ఉపనిషత్' శబ్దము 'ఉ-ప-ని' అను ఉపసర్గలతో గూడిన 'షదీల్' ధాతువువలన నుండి పుట్టినది. 'షదీల్' ధాతువునకు 'షదీల్ – విశరణ గత్యవసాదనేషు' విశరణ = శిథిలమగుట, గతి = పొందుట, అవసాదన = నాశము అని మూడర్థములు. ఉపనిన్యేమ మాత్మానం బ్రహ్మాపాస్తద్వయంయతః। నిహంత్యవిద్యాం తజ్జంచ తస్మాదుపనిషద్భవేత్॥'' యతః ఇమం ఆత్మానం జీవిం, అపాస్తద్వయంబ్రహ్మ ఉపనిన్యే సమీపంనీత్వా అవిద్యాం తజ్జంచ తత్కల్పితం జగత్ చ నిహంతి వినాశయతి తస్మాత్ ఉపనిషద్భవేత్॥'' = అంతఃకరణా వచ్ఛిన్నమగు చైతన్యమును-జీవుని-అద్వితీయమైన పరబ్రహ్మ చైతన్యముతో ఘటాకాశమును మహాకాశముతోవలె నైక్యమునొందించి, జీవుని ఆవరించు అనాదియగు అవిద్యను నాశమొనరించి, దానివలన జనించు (అవిద్యా కల్పితమగు) సంసారమును, శ్రద్ధతో బ్రహ్మవిద్యా విచారణవలన మిథ్యయని నిశ్చయించుట మూలముగా శిథిలముజేసి యిట్లు జీవునకు బ్రహ్మప్రాప్తిని గలుగజేయునది కావున 'బ్రహ్మవిద్య' ఉపనిషత్తనబడును. అట్టి విషయమును గలిగియుండుటచేత గ్రంథము సైతము ఉపనిషత్తనబడును.'' అట్టి ఉపనిషద్వాక్యములను ఆచార్యసమీపమున పఠించుటచేత సంసార నివర్తకమగు నాత్మజ్ఞానము కలుగుచున్నది. అట్టి జ్ఞానముచేత జీవబ్రహ్మైక్య లక్షణము పురుషులచేత ప్రాప్తమగుచున్నది. ఇట్టి సునిశ్చితమైన బుద్ధిగలవారలు ప్రజాది త్యాగపూర్వక సన్న్యాసమువలనను, చిత్తవృత్తి నిరోధ పూర్వకయోగమువలనను విషయభోగ పరాఙ్ముఖులగుచున్నారు. కావుననే నియమశీలురగుచున్నారు. బ్రహ్మసాక్షాత్కారము కలిగినపిదప సంసార విలక్షణభూతులగు వారందఱు పరాంతకాలమునందు సంసారబంధము వలన నుండి విముక్తులగుచున్నారు. అయితే అజ్ఞానులు సైతము ప్రళయకాలమునందు స్థూల సూక్ష్మ శరీరద్వయ బంధనమువలన నుండి విముక్తులగుచున్నారు గదా! ఇక జ్ఞానులకును అజ్ఞానులకును భేదమేమియనగా, జ్ఞానులు పరామృతమగు అవ్యక్తమువలన నుండియు విముక్తులగుచున్నారు. అజ్ఞానులగు వారికి స్థూల సూక్ష్మశరీరబంధ విముక్తి యున్నది కాని అవ్యక్తము-కారణ శరీరము - యొక్క బంధమునుండి అజ్ఞానులు విముక్తులు కాజాలరు. జ్ఞానులు మాత్రము దేహపాతావసరమునందు అట్టి అవ్యక్త (కారణశరీర) బంధమునుండియు విముక్తులగుచున్నారు. (ఈ మంత్రమునందు 'పరామృత' శబ్దముచేత అవ్యక్తము అనగా అజ్ఞానము చెప్పబడినది. దాని అర్థమిది.— జగత్కారణముగ శ్రేష్ఠమగుటచేత పరమనబడును. తత్త్వజ్ఞానముకంటె నితరములగు నుపాయములచేత వినాశమును పొందజాలదు కావున అమృతమనబడును) అని శ్రుతులు బోధించుచున్నవి.

(సశేషము)



సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెలుగురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-9-51.

# శ్రీ రామకృష్ణ ప్రభ

48

౧౯౫౧, అక్టోబరు—ఖర, ఆశ్వయుజము

సంపుటము ౮ సంచిక ౪







శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు
చెన్నపురి

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము ౨౦-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు గాంచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులలోఁ గాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య సూచింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ


సంపుటము ౨ } ౧౯౫౧ – అక్టోబరు : : ఖర – ఆశ్వయుజము { సంచిక ౮


## ప్రార్థన

### శ్రీ రామకృష్ణ షట్కమ్


శ్రీ ప్రమదాదాస మిత్ర


శ్లో. విశుద్ధ విజ్ఞాన మగాధ సౌఖ్యమ్, విశ్వస్య బీజం కరుణాపయోధిః,
అనాద్యనంతం ప్రకృతేః పరస్తాత్, తత్త్వమేకం భువి రామకృష్ణః ! 1

శ్లో. న నేతి భీత్యా శ్రుతయో వదంతి, వదంతి సాక్షాన్న చయన్ కదాచిత్,
చిదేకరూపః శివ ఈశ్వరాణామ్, మహేశ్వరోసౌ భువి రామకృష్ణః ! 2

శ్లో. యమ్ నిత్యమానంద మనంతమేకం, శివేతి నామ్నా శ్రుతయో గృణంతి,
తస్యావతారో నరరూపధారీ, కృపాసుధాబ్ధిః భువి రామకృష్ణః ! 3

శ్లో. విజ్ఞాన పీయూష నిమగ్నమూర్తిః, స స్పర్శయాన్ యాన్ దయయాకరేణ,
తే కామినీకాంచన రిక్తచిత్తాః, సద్యో బభూవు ర్భువి రామకృష్ణః ! 4

శ్లో. ప్రేమాబ్ధి గంభీర తరంగ భంగైః, రాందోళితోయో భగవద్విలీనః,
భక్తి ర్విశుద్ధా స్వయమావిరాశీ, పుం విగ్రహోఽహో భువి రామకృష్ణః ! 5

శ్లో. తమచ్యుతం కంచి దచింత్య శక్తిమ్, వందే ప్రశాంతమ్ పరిపూర్ణ బోధమ్,
జ్ఞానస్య భక్తశ్చ విశుద్ధమూర్తిమ్, ద్విమూర్తి మేకం భువి రామకృష్ణః ! 6



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## అధర సేనునియింట నవరాత్రి పూజ

(గతసంచిక తరువాయి)

అధరసేనునియింట నవరాత్రి పూజ జరుగుచుండెను. ఆ సమయమున శ్రీరామకృష్ణుల వారు భక్తులతో కలిసి భజనచేయుచుండిరి. అధరుడు తన చెలికాడగు శ్రీశారదాప్రసన్నుడు పుత్రశోకమువలన కృశించుచుండ నాతని రామకృష్ణులవారియొద్దకు దీసికొనివచ్చెను. శారదాప్రసన్నుడు గౌరాంగభక్తుడు. ఆతనిని జూడగనే శ్రీరామకృష్ణులవారికి శ్రీగౌరాంగోద్దీపనముగలిగెను. అంతట ఒకపాటపాడ నారంభించిరి. పాటభావము :

ఓహో నా శరీరమేల గౌరవర్ణము నందెను? ఇది సకాలము గాదుగదా! ఈ యకాలమున నీ వర్ణము నేల గలిగించితివి? నేను గౌరాంగుడనై యవతరింప నింకను నెంతయో వ్యవధి యున్నదిగదా! ఇప్పుడు జరుగుచున్నది ద్వాపర యుగలీల. ఇది యింకను ముగియలేదే! ఎంతటి యాశ్చర్యము? కోకిలము, మయూరము—వీని నన్నింటికిని గౌరవర్ణమేనా? ఎటువైపు కనుచూపు పరపినను గౌరవర్ణమే కానిపించుచున్నది. ఇదేమి? ఇదేమి యాశ్చర్యము. ఓహో రాధ కోసలకు వచ్చినది కాబోలును. అందువలననే నా యంగము గౌరవర్ణమయమయినది. [illegible] భ్రమరమువంటిది. కావుననే [illegible]కు తనరంగును కల్పించెను. ఇంతకుమునుపే కదా నా యంగము నీలమేఘశ్యామవర్ణవిభూషితమై యొప్పనది! చూచుచుండగనే గౌరవర్ణమును బడసితిని. రాధను తలంచుచునే ఆమె వర్ణమును బడసితినా! రాధా మంత్రమును జపించువారికెల్ల రాధ తనవర్ణమునే కలిగించునా యేమి? నే నెందుంటిని? మధురా పురముననా? నవద్వీపమునందా? ఏమియు గోచరించుటలేదే. ఇంకను మహాదేవుడు అద్వైతాచార్యుడుగా జన్మింపలేదు. నాకేల యీ గౌరవర్ణము. ఇంకను అగ్రజుడు బలరాముడుగూడ నితాయి కాలేదు. విశాఖా రామానందుడు కాలేదు. బ్రహ్మ హరిదాసుగా జన్మింపలేదు. నారదుడు శ్రీవాసుడుగా ప్రభవింపలేదు. యశోద సయితము శచిగా అవతరింపనియప్పుడు నాకుమాత్ర మేల యీ గౌరవర్ణము. ఇంకను పితయగు నందుడు జగన్నాథుడు కాలేదు. శ్రీ రాధిక గదాధరుడుగా జన్మింపలేదు. నాకుమాత్ర మేల యీ గౌరవర్ణము. *

గౌరాంగభావము శ్రీరామకృష్ణులవారిని చక్కగా ఆవేశించినది. మరల నింకొకపాట బాడ నారంభించిరి. పాటభావము :

---

* గౌరాంగుడగు శ్రీకృష్ణచైతన్యులవారు శ్రీకృష్ణపరమాత్మ నవతారముగను వారితో జన్మించిన వారెల్ల శ్రీకృష్ణావతారమునాటి బంధువులుగను ఈ పాట వివరించుచున్నది.

భావనిధియయిన గౌరాంగునకు భావము కలుగకపోవునా? పరవశుడై యతడు నవ్వును, ఏడ్చును, ఆడును, పాడును. వనమును గాంచి బృంద దలంచును. అతనికి గంగ కనిపెంచును. గౌరాంగుడు క్కి వెక్కి యేడ్చును. ఆతని యంతరమున శ్రీకృష్ణుడు, బయట శ్రీహరి. వనచరణముల నే పట్టుకొనును.

కొంతసేపటికి శ్రీరామకృష్ణులవారు గౌరాంగునియందలి ప్రేమచే నుద్యుక్తురాలైన యొకానొక స్త్రీభావమును వెలిబుచ్చుచు నిట్లుపాడిరి. (భావము)

తల్లీ ఊరివారి యపనిందలకు పాలైతిని. నను గంకలంకినినట. ఇది యేమి చెప్పదగిన విషయమా? నే నెవరితో చెప్పుకొనగలను? సిగ్గుచే చనిపోవుచున్నాను. ఒకనాడు శ్రీవాసుని యింట గొప్పగా సంకీర్తనము జరుగుచుండెను. గౌరాంగుడా యింటి లోగిలియందు భావావేశమున దొరలుచుండెను. నే నొకమూల నిలిచియుంటిని. ఒకచోట దాగియుంటిని. హఠాత్తుగా అచేతననై నేను పడిపోయితిని. శ్రీవాసుని భార్య చేతనము గలిగించెను. మరియొకనాడు భరద్వాంవమున గౌరచంద్రుడు సంకీర్తనము గావించుచుండెను. చండాలాది యవనుల సహితము ఆతడు పావనుల గావించెను. 'హరిబోల్' 'హరిబోల్' అని పలుకుచు నదియా సంతకు చేరెను. నే నచటికి బోయి ఆతని చరణయుగళమును జూచుచుంటిని.

ఒకప్పుడు గౌరాంగుడు జాహ్నవీతీరమున నిలిచియుండెను. సూర్యచంద్రకాంతుల మించిన ఆతని శరీరకాంతి దశదిశలందును ప్రసరింపజొచ్చెను. నీరు తీసికొనిపోవుటకై నే నచటికి బోయియుంటిని. అచ్చట ఈ (గౌరాంగుని) చిత్రము జూచుచుండగ హఠాత్తుగా నా కడవ జారి పడిపోయెను. (ఆ సంఘటనమును) నిష్ఠురాలు అడుబిడ్డయే చూచినది. ఇంక దుష్టమైనదనకు రాజ్యము విచారించవలయునా

అధరుని యింట గుమిగూడినవారిలో నొకడు బలరాముని తండ్రి. ఆతడు పరమవైష్ణవుడు. అందువలన కాబోలు శ్రీరామకృష్ణులు శ్రీకృష్ణునియెడ గోపికలకుకలిగిన ఉద్భ్రాంతప్రేమగీతిక నొకదానిని బాడిరి. పాటభావము:

హే సఖీ! నా శ్యాముని జాడ కనుగొనజాలకున్నాను. నాయింట నాకింక నేమి సుఖమున్నది? ఆహా! శ్యాముడు నదీయుడె నచో నా తల దువ్వి దనపైచి పొగడపూలతో నలంకరించుకొందును.

శ్యాముడు నా కంకణమైనచో, నా బాహువుపై సంతతము నివసించును, నేను కంకణము నాడించుచు సగర్వముగా రాజబాటయందు నడచుచుందును.

శ్యాముడు తన మురళిని వాయించినచో నేను సెపపట్టుటకై యమునాతీరమును చేరుదును. నాగరి దావానలహారివైపు దారి తెలియకుండ చేసినది.

బలరాముని తండ్రికి ఒరిస్సాలో భద్రక్ మున్నగు ప్రదేశములందు జమీందారీలుకలవు. అతడు బృందావనము, పూరి, భద్రక్ మున్నగు స్థలములలో దేవాలయములు అతిథిశాలలు (సత్రములు)నిర్మించెను. అతడు తన 'అంత్యదినములందు శ్రీబృందావనమున శ్యామసుందరుని కుంజమున భగవదారాధనచేయుచు కాలము గడుపుచుండెను. ఆతడు పూర్వకాలపు వైష్ణవుడు. ఎందఱో వైష్ణవభక్తులు, శాక్తేయులు, శైవులు, వేదాంతవాదులు—వీరితో సాను భూతి జూపరు. కొందఱు వారియెడ విద్వేషమును సహితము జూపుదురు. శ్రీరామకృష్ణుల వారికి ఇట్టి సంకుచితభావము నచ్చనేనచ్చదు.

భగవద్దర్శన వ్యాకులము తీవ్రముగా నున్నచో అన్నియు మంచి మార్గములే. ఏమతము ననుసరించినను చివరికి భగవానుని బడయగలము. కొందఱు చేతితో జపమాలలు త్రిప్పుచు భాగవతము మున్నగు గ్రంథముల జదివినను భగవద్వ్యాకులము కొంచమయినను లేనివారై యుందురు. అందువలన శ్రీరామకృష్ణులవారు బలరాముని తండ్రికి ఉపదేశముచేయ దలంచి యిట్లు 'మ.' తో పలుకదొడంగిరి.

'నేనేల ఒక్కమార్గమునే యనుసరింప వలయును' అని తలంచితిని. బృందావనమునకు బోయినపుడు విరాగులయెడ దీక్షనంది వైష్ణవుడ నయితిని. అట్లే మూన్నాళ్లు ఆభావముతో గడపితిని. పిదప దక్షిణేశ్వరమున రామమంత్రము ను పరిగ్రహించితిని. దాని ననుసరించి నొసట చందనపుబొట్టును బెట్టుకొని మెడయందు తులసిమాలను ధరించి కొన్నిదినములు గడపితిని. తుద కన్నియు తీసి పారవైచితిని.

ఒక యూరియందు ఒకానొకనియొద్ద పెద్ద 'డేక్షా' యొకటి యుండెను. ఊరివారందఱు తమబట్టలకు రంగువేయించుకొనుటకై యితని యొద్దకు దెచ్చెడివారు. 'డేక్షా'లో రంగుకలుపబడియుండెను. కాని ఆబట్టలను డేక్షాలో నుంచి బయటికి దీయునంతలో ఎవరే వర్ణము ను గోరిరో ఆరంగే ఆయాబట్టల కంటెడిది. ఈ వింతను జూచి యాశ్చర్యపడి యొకడు 'నీ వాతొట్టిలో కలిపియున్న రంగే నాబట్టకు వేసియి'మ్మని యడిగెనట.

శ్రీరామకృష్ణులవారు వివిధ సంప్రదాయముల ననుసరించువారందరు గూడ తనయొద్దకు వచ్చి వారుకోరు దర్శనమును బడయుదురను విషయమును సూచించుచున్నారా యేమి? మఱల నిట్లు చెప్పదొడంగిరి :

ఒకచెట్టుమీద ఊసరవల్లి యొకటి యుండెను. అదియు ఒకరి కంటికి పచ్చరంగు, మరియొకరి కంటికి నీలిరంగు, ఇంకొకరి కంటికి పసుపుపచ్చనిరంగు—ఇట్లు ఎందఱికో ఎన్నియో రంగులుగా కనిపించినది. వారిలో వారు ఈ రంగుల విషయమున వివాదపడజొచ్చిరి. చివరికి చెట్టుక్రిందనున్నవానిదగ్గరకు వచ్చిరి. అతడు మీరు చూచినది బహువర్ణములుగల ఊసరవల్లి. అది క్షణక్షణమునకు రంగులు మార్చుచుండునని చెప్పెను.

శ్రీరామకృష్ణులవా రీ రీతిగ భగవంతుడు సగుణుడై నానారూపములు ధరించును. నిర్గుణుడైనపుడు మనోవాక్కుల కతీతుడై యుండునని సూచించుచున్నారా యేమి? వారు భక్తి మార్గము, జ్ఞానమార్గము— ఈ రెండింటి వలనను భగవానుని మాధుర్యరసపానముగా వింతురా?

శ్రీరామ:—(బలరాముని తండ్రితో) ఇక గ్రంథము లెక్కువగా జదువవలదు. కాని భక్తి శాస్త్రములు శ్రీచైతన్య చరితామృతము వంటివి చదువవచ్చును. భగవంతుని ప్రేమించుటయు ఆ మాధుర్యము ననుభవించుటయునే నా యుద్దేశము. భగవంతుడే రసము; భక్తులు రసికులు. ఆయన పద్మము, భక్తులు అలిసమూహము. భక్తులనెడి యలులు భగవత్పద్మ మాధుర్యము నాశ్వాదించును.

భక్తులు భగవానుని విడిచియుండజాలని యట్లే భగవంతుడు సైతము భక్తుల విడిచి యుండజాలడు. అందు భక్తుడు రసము, భగవానుడు రసికుడు. భక్తుడు పద్మము, భగవానుడు తుమ్మెద. స్వీయమాధుర్యమును తానే యనుభవించుటకై రెండును తానేయయ్యెను. అదియే రాధాకృష్ణలీల!

తీర్థయాత్రలు, ఆచారవ్యవహారములు, కంఠమున తులసీమాలాధారణము ఇవన్నియు సాధకజీవనమున ప్రప్రథమమున నావశ్యకములే. భగవద్దర్శనానంతరము బహిరాడంబరములన్నియు తమంతట తామే క్రమక్రమముగా తగ్గిపోవును. అప్పుడు భగవన్నామస్మరణ మననములే మిగిలియుండును.† పదునారు రూపాయల కాణులు గొప్పరాశియగును. కాని పదునారు రూపాయలనే ప్రోగుగా పెట్టినచో రాశి యంత పెద్దదిగా గనుపింపదు. దానినొక మొహరీగా జేసినచో (రాశి) ఇంకను చిన్నదియగును. కాని దానిని రవగా మార్చినచో జనుల దృష్టికి గోచరము గానే కాదు.

కంఠమునందలి తులసిమాలయు నియమ నిష్ఠలు లేనిచో సనాతన వైష్ణవులు మిక్కిలి నిందింతురు. అందువలననేకాబోలు (శ్రీరామకృష్ణ) భగవానుడు భగవద్దర్శనానంతరము భక్తులకు ఈ బాహ్యాచారములపై నంతగా పట్టుదల యుండదని తెలుపుచున్నారు? వస్తులాభమయినపిదప బహిర్కర్మలు క్షీణించును.

శ్రీరామ:—(బలరాముని తండ్రితో) కర్తాభజులు‡ ప్రవర్తకుడు, సాధకుడు, సిద్ధుడు, సిద్ధాతిసిద్ధులు అని నాలుగు విధములుగ విభజింతురు. ప్రవర్తకుడు నొసట తిలకము ధరించి కంఠమున మాలను ధరించును. అత్యంతాచారపరాయణుడై యుండును. సాధకులు బహిరాడంబరములను అంతగా జూపరు. సిద్ధులు భగవానుని యస్తిత్వమున నిశ్చల విశ్వాసము కలవారు. ఇక సిద్ధాతిసిద్ధులు శ్రీకృష్ణచైతన్యులవంటివారు. వారందఱును భగవద్దర్శనమును బడసినవారు. ఎల్లప్పుడు భగవద్విషయాలాపనమే వారి కృత్యము. ఇట్టి వారిని కర్తాభజులు 'సాయి' అని వచింతురు. ఇదియే మానవజీవితమున పొందదగిన ఉచ్చస్థితి. దానియనంతరము ఏమియులేదు. సాధనలందు ఎన్నియోరకములు గలవు. సాత్త్వికసాధనలన్నియు మిక్కిలి గోప్యముగా జరుగును. సాధకుడు సాధనను భగవద్భజనమును ఎంతయో రహస్యముగా గావించును. ఆతని జూచినచో అందఱును నతడు సాధారణ మానవునివలెనే కనుపించును. అతడు జపము చేయుచున్నాడా యన్న సందేహముగూడ కలుగును. అతడెవరికిని దెలియకుండగ తన దోమతెఱలో గూర్చొని ధ్యానము చేయును. రాజసికభక్తు డట్టివాడుగాడు. ఆతడు బహిరాడంబరములు గలవాడు. మెడలో జపమాల, నొసట తిలకము, కొన్నివేళలలో కాషాయాంబరము, లేనిచో, పట్టుబట్టయు, నాతని జపమాలయందందందు బంగరుపూసలు— కలిగియుండును. ఆతని వ్యవహారమంతయు 'సైన్‌బోర్డు పెట్టుకొన్న దుకాణాదారు' వంటిది.

మానవుడెట్టి ధర్మము నవలంబించినను భగవానుని బిలుచుటకే. కావున ఏ మతమునైనను చులకనగా జూచుటయో ద్వేషించుటయో కావింపరాదు. వేదమునందు భగవంతుని సచ్చిదానంద బ్రహ్మమని చెప్పబడియున్నది.

---

† శ్లో. పరే బ్రహ్మణి విజ్ఞాతే సమస్తైః నియమైః గలం
తాలవృంతే నకిమ్ ప్రయోజనం ప్రాప్తే మలయమారుతే.

‡ వంగదేశమునందలి యొకానొక వైష్ణవ సంప్రదాయస్థులు. వీరు భగవానుడే శ్రీకృష్ణుడుగను రాధగను అవతరించి వారి యన్యోన్యప్రేమ ననుభవించిరని వచింతురు. ఇది వారి సంప్రదాయము.

భాగవతాది పురాణములలో ఆయననే సచ్చిదానంద కృష్ణుడనియును, తాంత్రిక శాస్త్రము లందు సచ్చిదానందశివమనియు నుల్లేఖింపబడి యున్నది. ఇవన్నియు నొకే సచ్చిదానందమునే తెలుపుచున్నవి. వైష్ణవులు ఎన్నియో శాఖలు కలవారు. వేదమునందు ఏది బ్రహ్మమని చెప్ప బడియున్నదో దాని నొక తెగవారు 'అలేక నిరంజనము' అని వచింతురు. ఎది నిర్దేశింప వీలుగానిదో, ఇంద్రియములకు గోచరము కాని దియో అదియే అలేకము. ఈ మతానుసారము రాధాకృష్ణు లిరువురునుగూడ రెండు బుడగలు

వేదాంతమతానుసారిణి అవతారములు లేవు. రాముడును కృష్ణుడును సచ్చిదానంద సాగరమునందలి రెండు కెరటములని వేదాంత వాదులు వచింతురు.

వస్తువొక్కటియే. రెండుగా నుండజాలదు. ఏ పేరునుబట్టి పిలిచినను తప్పక భగవంతుని సన్నిధి జేరును. అన్నింటికి ముఖ్యమయినది భగవద్వ్యాకులము. అదియున్నచో జాలును.

శ్రీరామకృష్ణులవారు భావావేశమున భక్తులతో నీవిధముగ బలుకుచుండిరి. భావము కొంత తగ్గిన పిదప బలరాముని తండ్రిని జూచి 'నీవేనా బలరాముని తండ్రివి' యని యడిగిరి. అందుల కాయన ఏమియు ప్రత్యుత్తరమీయక చేత మాలను బట్టుకొని కూర్చుండెను.

శ్రీరామకృష్ణులు : 'మ.' ను జూచి ఇది యేమి వీరందఱు నిన్నిజపములు చేసి ఇన్ని తీర్థముల క్రుంకులిడినను ఇట్లున్నారేమి ? ఏమో వీరి సంవత్సరమునకు పదునెనిమిది మాసములు వలె కనిపించుచున్నది.

నే నొకప్పుడు హరీషున కిట్లు చెప్పితిని. 'నీకు భగవద్వ్యాకులమున్నచో కాశీయాత్రావసర మేమి? వ్యాకులమున్నచో నిదియే కాశి.'

ఇంత జపమును నిన్ని తీర్థయాత్రలు గావించియు నేమియు గనిపించుటలేదు. ఎందువలన? వ్యాకులము లేదు. వ్యాకులముతో ఆయనను బిలిచినచో తప్పక దర్శనమిచ్చును. నాటక ప్రారంభము చేయుటకు పూర్వ మెంతయో గడబిడ జరుగును. అప్పుడు శ్రీకృష్ణుడు కని పింపడు. పిదప నారదమహర్షి బృందావనమును జేరి మిక్కిలి వ్యాకులముతో తన వీణను ప్రయోగించి 'ఓగోవిందా, నా జీవనాధారా!' యని పిలిచినప్పుడు ఇంక ఆలస్యము చేయజాలక గోపబాలురతో వచ్చి శ్రీకృష్ణుడు దర్శన మిచ్చును.



సంసారమున నుండియు బ్రహ్మజ్ఞానమును బొందవచ్చునని జనకు నెల్లప్పుడు ఉదాహరణముగా జెప్పుచుందురు. కాని, మానవచరిత్రయందంతటను అతడొక్కడే యిందులకు ఉదాహరణము. సర్వసాధారణముగా నిట్లెన్నడును జరుగదు, జనకునిసంగతి వేఱు. కామినీ కాంచనత్యాగము చేయనిదే ఎవ్వడును బ్రహ్మజ్ఞానము పొందజాలడు ; ఇదియే సర్వసాధారణ నియమము. నీవును 'జనకుడ' నని తలపకుము. ఎన్నియో శతాబ్దములు గడచినవి కాని ప్రపంచములో ఇంతవఱకు మఱియొక జనకుడు పుట్టలేదు.

—శ్రీ రామకృష్ణ పరమహంస

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

కాశీ,

22-3-'15.

శ్రీమాన్ ....

ఈ మారు నీవేమి వ్రాసియుంటివో యది నాకు చదువగా అవగాహన కావుట లేదు. నేను గ్రహించిన విధము ననుసరించియే జవాబు వ్రాయుచున్నాను. కాన నీ వేమాత్రము నతృప్తి చెందబోకుము. సత్త్వగుణము అనామయము అనగా నిరుపద్రవము శాంతము మున్నగు గుణములగలిగియుండునన్న విషయము నిజమే. కాని అందఱును సత్త్వగుణ సంపన్నులు కాజాలరు, కారు. తమోగుణములోనున్నవారు రజోగుణాంతర్భూతులై పిదప సత్త్వగుణమును బడయవలయును. రజోగుణము గలవారు దాని నతిక్రమించి సత్త్వగుణమును బొందవలయును. సత్త్వగుణము అనామయము, రజోగుణము శ్రమాత్మకము, తమోగుణము మోహాత్మకము, అని ఈమాత్ర మెఱింగిన జాలదు. మనలో సత్త్వగుణమును ప్రతిష్ఠింపవలయునుగదా! అపరిమితముగా జపతపముల నాచరించినచో నుపకారమునకు బదులుగా నపకారమే జరుగునన్న విషయము నిజమే. అందువలననే గీతాశాస్త్రమునందు, 'శనైః శనైరుపరమేత్'* యుక్తాహారవిహారస్యయుక్త చేష్టస్య కర్మసు † అని యుపదేశములు గనంబడుచున్నయవి. మఱియు అత్యంతపరిశ్రమము అనుసరణీయముగాదు అని తలంచి జపతపములను ఇష్టానుసారము అవలంబించుటయు సరిగాదు. అందులకుమారు ఈ శరీరముతోడనే నేను మోక్షమును బడయవలయును అను పట్టుదలగలిగియుండవలయుననియే శ్రీరామకృష్ణుల వారి యుపదేశము. శ్రీరామకృష్ణులవారు ఎవరో బక్క-చిక్కినవ్యక్తికి ఒకానొకవిధముగా ఉపదేశమిచ్చిరన్నచో అదియే ఎల్లరును అనుసరింపవలసిన విధమని తలంపరాదు. నిష్ఠతో జపము, భగవద్భజనము చేయవలయు ననుటయే శ్రీవివేకానందులవారి భావము. అదియే ఎల్లరి యభిప్రాయమును. బుద్ధదేవుని విషయ మేమనగలము? 'ఇహాసనే శుష్యతుమే శరీరం త్వగస్థిమాంసం ప్రలయంచయాతు ‡ ఇట్టి పలుకులను శ్రీబుద్ధదేవుడు ప్రవచించియున్నాడు!

* మెల్ల మెల్లగా మనోవృత్తుల నిరోధించునది.

† పరిమితములగు ఆహార విహారములుగలిగి జప తపములగు కర్మములందు పరిమితమగు ప్రయత్నము [గలిగి నియమితములగు నిద్రా జాగరణములు గలిగియుండువాని ధ్యానము సంసారదుఃఖమును బోగొట్టుచున్నది.]

‡ శ్లో. ఇహాసనే శుష్యతు మేశరీరం త్వగస్థిమాంసం ప్రలయంచయాతు
అప్రాప్యబోధం బహుకల్ప దుర్లభాం నైవాసనాత్ కాయమతశ్చలిష్యతే. —లలితవిస్తరము.

ఈ యాసనమునందే యీ శరీరము కృశించిపోవునుగాక. చర్మము, ఎముకలు, మాంసము లయించిపోవునుగాక. బహుకల్ప దుర్లభమయిన బోధ లాభమును బడయక ఈ యాసనమునందుండి నేను చలింపను.

బుద్ధదేవుని కఠోర తపస్సునుగూర్చి ఎంతని వచింపగలము! అట్లే ఎందఱో మహానుభావులు, ఏమహాత్ముడైన కొంతవఱకు ఆధ్యాత్మిక జీవనమున నున్నతి నందినచో అది ఆయన కఠోరసాధనమూలముననే యని గుర్తింప వలయును. శ్రీకృష్ణచైతన్యులవారు 'ఓ సనాతనా! శ్రీకృష్ణధనము అంత సులభముగా లభింపగలదా?' యని ప్రవచించియున్నారు. హరిదాసాది భక్తులు ఎట్లు నామజపము జేసిరో నీవెఱుంగుదువా? దైనం దినము రేయింబవళ్లెట్లు గడచెడివో వారికి గుర్తుండెడిది కాదు. సనాతన గోస్వాములవారు భగవల్లాభముకొఱకు ఎంతటి కఠోరసాధనల జేసియున్నారో చదివి చూడుము. శరీరము చిరసాయికాదు. ఒకనాడు తప్పక నశించును. ఈశ్వరభజనము చేయుచు శరీరమును విడువగలిగినచో అదియే మహాభాగ్యము. కాని అట్లుచేయుటకు వీలుగానిచో నీ మాట 'సర్వమత్యంతగర్హితం'-* నేను జేయజాలను గదా యని యిష్టానుసారము పలుకుట సరిపడదు. భగవద్భజనమునం దీ శరీరమును విడువగలిగినచో అంతకు మిక్కిలి యేదియును లేదు. ఈ పలుకు నీకు బాగుగా నొక్కి చెప్పుచున్నాను.

'వ్యాధిస్థాన సంశయ ప్రమాద ఆలస్యనిరతి భ్రాంతి దర్శనాలబ్ధి భూమికత్వా నవస్థితత్వాని చిత్త విక్షేపాఽస్తేఽంతరాయా' అని పతంజలి యోగసూత్రమునందలి సమాధిపాదమున గలదు. మఱియు 'స్యాత్ కృష్ణనామచరితాది సితాపవిద్యా, పిత్తోపదుష్టరసనస్య న రోచకైవ కింత్వా ధరాదనుదినం కలుసేవయైవ, స్వాధీపునర్భవతి తద్గత మూలహంత్రి'. ఎవరి జిహ్వలు అజ్ఞానరూపమయిన పిత్తదోషముచే చెడియున్నవో వారలకు శ్రీకృష్ణనామ చరితాదులనెడి చక్కెర రుచింపకపోవచ్చును. కాని ఆదరముతో ప్రతిదినము దానిని సేవించినచో దాని మాధుర్యము దెలియును. మఱియు పిత్తరోగముగూడ హరింపబడును.

ఇచ్చట నెల్లరును క్షేమముగానున్నారు. మీకుశలము దెలియగోరుచున్నారు. భగవత్కృపవలన ఆయన కార్యములయం దుత్సాహపూరితుడవై మనఃప్రాణము లర్పించి నీ జీవితమును ధన్యముగావించుకొనవలయునని నా ప్రార్థన.

నీవేల అంతగా యోచించుచున్నావు. గురుదేవుడే అన్నియు చక్కబెట్టగలడు.

ఇట్లు,
శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద

* ఏదయినను మితి మీరినచో అనిష్టమగును.

శ్లో. అతిదర్పే హతాలంకా, అతిమానేచ కౌరవాః
అతి దానే బలిర్బద్ధ, సర్వమత్యంతగర్హితం.—చాణక్య శ్లోకము 48.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

# శ్రీ బ్రహ్మానందస్వామి పారమార్థిక ప్రతిభాతిశయము

౧

శ్రీ చిరంతనానందస్వామి

ఆనందమునుండియే సమస్తభూతములును జనించుచు, ఆనందమువలననే జీవించుచు, తిరిగి యానందముననే లయముగాంచుచున్నవి. * యువకుఁడు, సాధుశీలుఁడు, వేదాధ్యయన పరుఁడు, మహానిపుణుఁడు, దృఢతముఁడు, బలవత్తముఁడునగువానికి సకలసంపత్సమృద్ధమగు వసుంధర వశీభూతమై యొప్పుచుండ, అట్టివాని యానందమే మానుషానంద పరిమాణమగుచో, దానికి నూఱుమడుంగులు గంధర్వానందము, అంత కెన్నెన్నియో వందల రెట్లు దేవానందము, దానికిఁ జెప్పఁజాలనన్ని వందల యింతలు బృహస్పత్యానందము, అందులకు సహస్రగుణాధికము ప్రజాపత్యానందము నగునన్నచో, నిజముగా బ్రహ్మానంద మపరిమితమై వెలయుచున్నదని యుపనిషత్తు లెలుఁగెత్తి చాటుచున్నవి. † ఇట్టి బ్రహ్మానంద సామ్రాజ్యమున సార్వభౌముఁడై వెల్గొందిన మహనీయుఁడు శ్రీ బ్రహ్మానందస్వామి.

పూవు పుట్టఁగనే పరిమళము తెలియునన్నట్లు బాల్యముననే స్వామి పారమార్థిక ప్రతిభ వెల్లడికాసాగెను. నాఁడు రాఖాల్ చంద్ర ఘోష్ అనఁబరఁగిన యీతఁడు శ్రీరామకృష్ణ చరణసాన్నిధ్యమును బడయుటకు ముందు గురుదేవుఁడు తనప్రియశిష్యుని రాకనుగూర్చి యెట్టి బంగారుకలలను గనియుండెనో, కాళీదేవినిఁ బ్రార్థించి యెట్టి దివ్యదర్శనములను గాంచియుండెనో ఆతని (శ్రీరామకృష్ణుని) వాక్కులే మనకు అత్యద్భుతముగాఁ జాటుచున్నవి. జగజ్జనని నాతఁ డిట్లు ప్రార్థించి యున్నాఁడు : "అమ్మా! సదా నా కొకఁడు తోడునీడయై యుండఁగోరెదను. నిర్మలహృదయుఁడు, సర్వదా నీపాదపద్మములనే నమ్ముకొని

* "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభిసంవిశంతీతి."

—తైత్తిరీయోపనిషత్తు, భృగువల్లి.

† "యువాస్యాత్సాధుయువాధ్యాయకః, ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః, తస్యేయం పృథివీ విత్తస్యపూర్ణాస్యాత్, స ఏకో మానుష ఆనందః... తే యేశతం ప్రజాపతే రానందాః, స ఏకో బ్రహ్మణ ఆనందః..."

—తైత్తిరీయోపనిషత్తు, ఆనందవల్లి.

యుండువాఁడు నగు నొక బాలుని నొకడకుఁ గొనిరమ్ము.'' కొన్నిదినము లైనంతనే ఆలయావరణమందలి మఱ్ఱిచెట్టునీడ నొక బాలుఁడు నిలుచుండియుండినటు లాతఁడు దివ్యదర్శనమును గాంచెను. మఱియొకసమయమున నీ బాలుఁడే వేఱొకరీతిని గోచరింపఁ దన దివ్యానుభవమునుగూర్చి యాతఁ డిట్లు తెలిపియున్నాఁడు: ''రాఖాల్ నావద్దకు వచ్చుటకుఁ గొన్నిదినములకు ముందు అమ్మ నాయొడిలో నొక చిన్నిబాలునిఁ గూర్చుండఁబెట్టి, 'ఇడిగో, నీ పుత్రుఁడు' అనియెను. మొదట నే నాశ్చర్యపడితిని. 'నా పుత్రుఁడా?' అమ్మ యంతటఁ జిఱునవ్వు నవ్వి, సాధరణార్థమున నేను బుత్రునిఁ బడయఁబోవుటలేదనియు, ఈ బిడ్డఁడు నా మానసపుత్రుఁడనియు, మహోత్తమత్యాగవైరాగ్యముల నవలంబించుననియు నాకు బోధపఱిచెను.''

ఆ సుముహూర్తమునుండియు శ్రీరామకృష్ణుఁడు తన మానసపుత్రునిరాకకై మహోత్కంఠతో వేచియుండెను. సరిగా నింకఁ గొన్నినిముసములకు రాఖాల్‌చంద్రుఁడు తన్ను సందర్శించుననఁగా నాతఁడు మఱియొక దివ్యదర్శనమును గాంచెను. గంగానదియురమున నూఱురేకుల తామరపూవు వికసించియున్నటు లాతని కకస్మాత్తుగా గోచరించెను. అందలి ప్రతిదళమును ముద్దులొలుకుచు దివ్యకాంతుల నీనుచుండెను. పాదములఁ జిఱుగజ్జియలు మ్రోయఁ జెల్వొందు నిరువురు బాలు రాదివ్యకమలముపై నృత్యముసల్పుచుండిరి. అం దొకఁడు స్వయముగా శ్రీకృష్ణుఁడే; రెండవ వాఁడు తా నీవఱకు దివ్యదర్శనమునఁ గాంచియుండిన బాలకుఁడు, వారల ప్రతిపదవిన్యాసమును మాధుర్యానందసాగరమునందుండి నురుగులను వెలువరించుచున్నదాయనురీతిని భాసింప, వర్ణనాతీతమగు వారల నృత్యమును గాంచి శ్రీరామకృష్ణుఁడు సమాధిస్థితుఁడయ్యెను.

జపధ్యానాదుల కాటపందిరియై అప్రయత్నముగా వాని నవలంబింపఁజేయు శ్రీరామకృష్ణసన్నిధిని రాఖాల్ మనుచుండ నాతని పారమార్థిక సంపదనుగూర్చి శ్రీరామకృష్ణుఁ డిట్లు పలికియున్నాఁడు: ''రాఖాల్ ఇపుడు చక్కని శీలమును బెంపొందించుకొనియున్నాఁడు. నిరంతర మాతఁడు జపించుచుండును.—అందుచేతనే మీ కొక్కొక్కప్పు డాతని పెదవులు గదలుచుండుట గోచరించును. ఆతనిఁ దిలకించి వానిమనఃస్థితిని గమనించి తఱచు దివ్యావేశపరవశుఁడనగుచుందును; సమాధిస్థితి నందుచుందును.

''నరేన్ (కాలాంతరమున నీతఁడే శ్రీవివేకానందస్వామి), రాఖాల్, మఱికొలఁదిమందియు నిత్యసిద్ధులు—ఆజన్మబ్రహ్మజ్ఞానులు. యౌవనోదయముననే వీరు సాంసారిక సుఖములు నిస్సారములని గ్రహింతురు. హోమపక్షియను నొకానొక పిట్టనుగూర్చి వేదములలోఁ జెప్పఁబడియున్నట్లు విందుము. ఆకసమున నది మహోన్నతస్థానమున నివసించును. ఎన్నఁడును గ్రిందికి రాదు, భూమిమీఁదికి రాదు. అది యాకాశగర్భమునఁ దన గ్రుడ్లను విడవ నవి క్రిందఁబడుచు, మార్గమధ్యముననే పిల్లలగును. అట్టిచిన్నపిల్ల వెలువడి, మహావేగమునఁ గ్రిందఁబడిపోవుచుంటినని గ్రహించి ఱివ్వునఁ బైకెగిరి యాకసమున నున్న తన తల్లినిఁ గలిసికొనును.

''రాఖాల్‌వంటి బాలు రీపక్షివంటివారు. అతి బాల్యమునుండియు వీరు సంసార సారహీనతను గ్రహింప, భగవత్ప్రాప్తిని బడయు టెట్లనునదియే వీరిపరితాపము.

"చక్కఁగాఁ బండి తీయనిరసముతో నిండి యున్నను, బైకి ఆకుపచ్చఁగనే కాన్పించు నొక జాతి మామిడిపండువంటివాఁడు రాఖాల్."

మఱియొకప్పుడు శ్రీరామకృష్ణుఁడు రాఖాల్ ధీవైభవమును గొనియాడుచుఁ దలఁచినచో నాతఁడొక సామ్రాజ్యమును బరిపాలింపసమర్థుఁడని వచించియున్నాఁడు. శ్రీరామకృష్ణుని వాక్యము లమోఘములుగదా! రాఖాల్ కాలాంతరమున బ్రహ్మానందస్వామియై, శాఖోపశాఖలతో స్వదేశముననేగాక, యావత్ప్రపంచమునను వ్యాప్తిగాంచియున్న శ్రీరామకృష్ణ నాధ్యాత్మిక సామ్రాజ్యమునకు సర్వాధిపతియై జీవితాంతపర్యంత మఖండ విజయోపేతుఁడై పరిపాలన మొనర్చుచు మహారాజని సార్థకనామధేయుఁడై ప్రకాశించియున్నాఁడు.

మహారాజురూపము గంభీరమై యొప్పు నాతని నడత మహారాజఠీవితో విరాజిల్లుచుండెడిది. పొడవైన యాతని శరీరము తగిన లావు గలిగి దీపింప నాతని వదనము ప్రశాంతమై యానందమయమై దివ్యవర్చసమును వెలార్చుచుండెడిది. ఒకించుక లోఁతైన యాతనికన్నులు సదా యనంతత్వమును దేఱి చూచుచున్నట్లు కన్పట్టెడివి. ఆతఁ డెవ్వని నైనను దిలకించుచో, వాని కాతఁడు తన హృదయాంతరాళమునఁ జొచ్చి తన దోషములను లోపములను సర్వము గ్రహించినట్లు తోఁచెడిది. కానియట్లు కూలంకషముగా గ్రహింపఁబడు టావ్యక్తికి భయమో, కోపమో కల్గించెడిదా? కాదు. ఆనేత్రములు ప్రేమానుగ్రహ నిలయములుగదా! "మా దోషములును లోపములును మహారాజు కన్నులకుఁ గట్టినటు లుండినందులకు మే మెన్నఁడును భయపడినవారము కా"మని శిష్యులు దెల్పియున్నారు. ఇఁక నాతని కన్నులు పూర్తిగాఁ దెఱచుకొనియున్నను, ప్రపంచ మాతని కదృశ్యమైపోయినచందమున, కేవల మాతఁడు మఱియొకలోకములో నున్నట్లు కాన్పించిన సమయము లనేకములు కలవు.

రైలుబండి పోవు మార్గమున జనులతోఁ గిటకిట లాడుచుండిన యొక స్టేషనున నొకప్పుడు మహారాజును తదేకదృష్టితోఁ దిలకించుచుండిన యొకవ్యక్తి తన మిత్రునిఁ గేకవైచి యబ్బురపాటున నిట్లు పలుకుచుండుట వినియున్నానని శ్రీప్రభవానందస్వామి వ్రాసియున్నాఁడు: "'అదిగో, ఆ పురుషుని జూడుము! ఆతఁడే ప్రాంతీయుఁడో? మద్రాసురాష్ట్రీయునివలెఁ గాని, పారసీకునివలెఁగాని, వంగదేశీయునివలెఁ గాని, పంజాబుదేశీయునివలెఁగాని కాన్పింపఁడే! ఆతని జాతిని నీ వూహింపఁగలవా?'" రెండవ వ్యక్తి యిట్లు సమాధానించెనఁట: "ఊహింపఁజాలకున్నాను. కాని యాతఁడు భగవదంశసంభూతుఁడని నీవు చక్కఁగా గ్రహింపవచ్చును."



మొదట పూవును తరువాత పిందెయు పుట్టుట ప్రకృతియొక్క సర్వసాధారణధర్మము. కాని కొన్నిజాతుల చెట్లందును పాదులందును మొదట పిందెలును తరువాత పూవులును గాన్పించును. అటులనే బ్రహ్మసాక్షాత్కారము పొందుటకు ముందు సామాన్యమానవు లనేకసాధనలను జేయవలసియుండ, మొదట సాక్షాత్కారమును బడసి తరువాత సాధనలను జేయువారు కలరు. —శ్రీ రామకృష్ణ పరమహంస

ఓమ్ తత్సత్.

# దేవీసవము

శ్రీ ఆత్మానందస్వామి

(గతసంచిక తరువాయి)

నీదు లీల లసత్తని ఽ నిగ్రహింప ; హరిహర హిరణ్యగర్భుల ఽ కైన దెలియ
దమ్మ కన్నతండ్రి కరుణ ఽ యబ్బకున్న ; గిరిజ తెరఁదీసి యాతని ఽ దరికిఁ జేర్చు. 32

మంత్రరాజముఁ త్రైలోక్య ఽ మాత దినముఁ ; బఠనజేయుచునుంటి నాఽప్రతిఫలంబు
నరయ నే నిరీక్షించియుఽన్నాఁడ నమ్మ ; తెరను తొలఁగించు జాగేల ఽ కరుణతోడ. 33

నీకు, నాకుఁ, బరాపర – లోకములకు ; నీశ్వరుండగు రాజరాఽజేశ్వరుండు
బలముగలదానవని చాటు ఽ పరపఁదగునె ; తెరను తొలఁగించు కాళిక ఽ కరుణతోడ 34

అనుదినంబును బ్రహ్మలో ఽ కంబుఁజేరి ; యతని దర్శింపలేకుంటి ఽ నమ్మ నేను ;
ఇరువురకు మధ్యమందుండి ఽ యింత సేయ ; ధర్మమా, తెరదీయుము ఽ తల్లి నేఁడె. 35

విద్యలకు రాణివీవె పఽవిత్రవాణి ; సర్వవిద్య లీయుదరపోఽషణము కొఱకె
శాశ్వతము పరవిద్య విఽశ్వాసముంచి ; తెరను తెరువుము గౌతమి ఽ కరుణతోడ. 36

వేదమాత కాద్యంతిమ ఽ విధులు లేవు ; పూర్ణపాండిత్య మొందుటల్ ఽ పొల్లుమాట
వంగి పాదాబ్జములకడ ఽ వ్రాలువాఁడ ; తెరను తొలఁగింపు శర్వాణి ఽ కరుణతోడ. 37

వేద శాస్త్ర పురాణముల్ ఽ వేనవేలు ; చదివినఁ బరవిద్యఁ బడయఁ–జాలరవనిఁ
జిత్తశుద్ధిగ నీప్రాపుఁ ఽ జేరినాడఁ, దెరను తొలఁగింపు యాదవి ఽ కరుణతోడ. 38

నాకు బంధము నీపొందు ఽ నాకు ముక్తి ; తత్త్వభావానుభవమునఁ ఽ దరలినపుడు
బంధమోక్షములేల, యఽబద్ధమేల ; తెరను తొలఁగించు రుద్రాణి ఽ కరుణతోడ. 39

శ్రమలఁబడి వేదసూత్రముల్ ఽ చదువనేల ; వేదవేదాంత సారముల్ ఽ విపులముగను
వరలుచున్నవి నాయందె ఽ తెరనువిప్పి ; కాలకంఠుని జూపవే ఽ కాళికాంబ. 40

నీకు నీవె జన్మింతువు । నిన్ను నీవె ; చంపుకొందువు నీలోన । సంతసింతు
వేడ్చుచుందువు, భళిరె నీ।యెక్క సకెము ; గట్టి పెట్టుము, తెరవిమ్ము । కాళికాంబ. 41

నీతి, యవినీతి, జాతి, వి।జాతి, పాప ; పుణ్యములును ధర్మాధర్మ।ములును నగుట
నీ ప్రభావంబుచేగాదె । నిజము డెలుపఁ, దెరను తొలఁగింపు చణ్డిక । కరుణతోడ. 42

లక్షు కధిపతి యొకనాఁడు । భిక్షుమెత్తు ; హరిజనుం డధిష్టించు సిం।హాసనంబుఁ
దారుమారగు సృష్టి నీ । తనువునందు ; దయనుభవభంగ మీయవే । దక్షకన్య 43

గారవింతువు కూర్తువు । మారణముల ; సిరుల నిత్తువు శనిగాని । శిరముమీఁదఁ
దాండవం బాడఁజేయుదు । తాళుమమ్మ ; తెరను తొలఁగించి మాతంగ్రి । దరికిఁజేర్చు. 44

మాయగప్ప దరిద్ర నా।రాయణుండు ; సార్వభౌముఁడై మురియును । స్వప్నమందు
జాగ్రతనుగాంచి ఖిన్నుఁడౌ, । జన్మదుఃఖ ; దాయకమె గంగనాతంగ్రి, దరికిఁ జేర్చు. 45

యోగులెందరో ఘనరాజ । యోగులౌచు ; చెలఁగి పడసిరి యణిమాది । సిద్ధు, లంతఁ
గీర్తికాంతకు వశ్యులై । గిట్టినారు ; తరమె హరిజేర యాదవి । కరుణలేక. 46

సిరులు గలవారుఁ గాంతురు । చిన్నజేసి ; యెంత పండితునైన త।నంత వారు
లేరనుచు విఱ్ఱవీగి ; నీ । లీల లివ్వి ; యని తెలిసికొంటిని, తెరదీ।యవె జయంతి. 47

ఆడ మగ వేషములఁ దాల్చి । యంతులేని ; వింత లెన్నెన్నొ చేయుదు । విసుగులేక
చేసినదె చేయుచున్నారు । సిగ్గుచేటు ; తెరనుతొలఁగించు శర్వాణి । కరుణతోడ. 48

నేను చక్రవర్తిని, చాల । నిపుణుఁడేను ; శాస్త్రములలోన, పనిలోన । సర్వమందు
నేను విజయుఁడ । ధీరుఁడ, నేర్పువాఁడ, ననుట వినఁజాల తెరదీయ । వమ్మ మారి. 49

పుట్టితి నరుండనై నీదు । పుణ్యమునను ; వరుస దారాసుత కనక । వాంఛలుడిగ
మరుఁగెరింగితి సద్గురు । కరుణవల్లఁ ; దెరను తొలఁగించు దరిఁజేర్చు । ధేనుకాంబ. 50

మెచ్చి బహువిధ దర్శనా । లిచ్చినావు ; శాంతి లభ్యమాయెఁ, దురీయ । సౌఖ్యమరసి
వేచియున్నాఁడ నాధార । వీధిఁ దెఱచి ; లోనికనుపుము దయతోడ । లోకమాత. 51

వెండి కొండమీఁదను, నడు । వీధిలోన ; సంతశాలలందునను, గు।హాంతరంబు
నందుఁ గూర్చున్ననేమి? యా।నంద మొసఁగి ; తెరను తొలఁగించు, శివదూతి । కరుణతోడ. 52

(సశేషము)



# శ్రీ వివేకానంద సంభాషణలు

## (ఒక భక్తుని దినచర్యనుండి)

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[కామినీ కాంచనముల త్యాగము—ఆత్మజ్ఞానమునకై యత్నించు వారలకు భగవంతునిదయ లభించును—నిర్హేతుకకృప—భగవానుడు, తదాత్మరూపములు].

శిష్యుడు :— స్వామిజీ! శ్రీరామకృష్ణులు, మానవుడు కామినీకాంచనములను పూర్తిగా త్యజింపనిదే,యాధ్యాత్మికాభివృద్ధిని బడయ నేరడని చెప్పుచుండెడివారు. ఇది నిజమైనచో గృహస్థుల మనస్సెల్లప్పుడు వానియందే తగుల్కొనియుండునుగాన, వారెట్లు అభ్యుదయమును గాంచగలరు ?

స్వామిజి:—గృహస్థుగాని, సన్న్యాసిగాని, ఎవని మనస్సు, కామినీకాంచనములయందలి యనురక్తిని విడిచిపెట్టదో, యంతవఱకాతడు ముముక్షుత్వమునుగాని, యథార్థమగు భక్తినిగాని, పట్టుదలనుగాని, శ్రద్ధనుగాని బడయజాలడు. ఇది యథార్థము.

శిష్యుడు :—అయినచో గృహస్థులగతి ఏమి ? వారేమార్గమును అనుసరింపవలయును ?

స్వామిజి :—జీవితాధారమునకు వలయు నీప్సితములను బడయుచు, తీవ్రమగు వాంఛలను యుక్తాయుక్త విచక్షణా జ్ఞానముచే నిగ్రహించుటయే దీనికి మార్గము, త్యాగము చేయనిచో దైవదర్శనము అసంభవము. ''యహి బ్రహ్మాస్వయంవదేత్'' సృష్టికర్త స్వయముగా మఱియొకరీతిగా శాసించినను సరే.

శిష్యుడు :—సన్న్యసించినంతలో మానవుడు త్యాగమునందు సిద్ధిని బడయగలడా ?

స్వామిజి :—త్యాగమునందు సంసిద్ధిని బడయుటకై సన్న్యాసులు కొంతవఱకైనను యత్నము చేయుచుండిరి. లంగరువేసిననావను, తమ తెడ్లచే తెడ్డువేయుటకు యత్నించు నావికులవలె నీ విషయమునందు గృహస్థులుండిరి. భోగవాంఛ ఎన్నటికైనను తీరునా? ''భూయ ఏవాభివర్ధతే''— అది యంతకంతకు వృద్ధిగాంచును.

శిష్యుడు :— ఎందుచేత ? విషయవాంఛలను దీర్ఘకాలమువఱకు ననుభవింపగా ననుభవింపగా, ప్రాపంచిక భోగములయందు విరకి గలుగదా ?

స్వామిజి :— ఎంతమందికి అట్లుగలుగును? విషయేంద్రియ సంయోగముచే, శీతోష్ణాది ధర్మములు మానసమునందు శాశ్వతములగు వాసనలను గలుగజేసి, ప్రత్యేకరూపమును గల్గించుచున్నవి. ఆత్మానాత్మ వివేకమునకు, త్యాగ మొక్కటియే మూలమంత్రము. రహస్యమార్గము.

శిష్యుడు :—“గృహేషు పంచేంద్రియ నిగ్రహస్తపః” భార్యాబిడ్డలతో నివసించుచు, పంచేంద్రియములను నిగ్రహించుట తపస్సనియు, “నిర్వృత్తరాగస్యగృహం తపోవనం” ఎవరు సంసార మధ్యమందున్నను నిష్కాములై యుందురో వారికి, తపస్సునకై యరణ్యమునకు బోయినవాని కెంత లాభముగలుగునో, యంత లాభముగలుగుననియు ఋషులు తమ శాస్త్రములయందు వ్రాసియున్నారు గదా?

స్వామిజి :— ఏ గృహస్థులు సాంసారికజీవనమును గడుపుచు, కామినీ కాంచనములను జయింతురో వారు ధన్యులు. కాని ఎందరట్లు చేయగలరు?

శిష్యుడు :—అయితే సన్న్యాసుల విషయమేమి? వీరందరు కామినీ కాంచనములను పూర్తిగా విసర్జించిరా?

స్వామిజి :—నేనిదివఱలో చెప్పినట్లు, సన్న్యాసులు త్యాగపథముననుండి, గమ్యస్థానమును చేరుటకై కృషి చేయుచుండిరి. గృహస్థులు, కామినీ కాంచనములవలన నిడుమలను గ్రహించియు వానివలన తాము బాధపడుచుండియు నిసుమంతైనను వానినుండి విముక్తిని పొందవలెననెడి ప్రయత్నము చేయక మిన్నకుండిరి.

శిష్యుడు :— కాని అనేకులు యత్నమును చేయుచుండిరి.

స్వామిజి :—అవును, ఆరీతిగా యత్నించుచున్నవారు, కొద్దికొద్దిగా, త్యాగసిద్ధియం దభ్యుదయమును పొందగలరు. వారియందున్న కామినీ కాంచన వాసనలు, క్రమక్రమముగా సమసిపోగలవు. ఎవరు “ఇంత త్వరలో నేమి; సమయమువచ్చినపుడు నేను చేయుదును” అని కాలవిలంబన చేయుచుందురో వారికి ఆత్మజ్ఞానము కడు దుర్లభము. ధీరుడు “ఈ జీవితమునందే, యీ క్షణమునందే సత్యమును గ్రహించెదను” అని నుడువును. అట్టివారలే మరు క్షణముననే ఎట్టి త్యాగమునైనను జేయగలరు. అట్టివారలనుగూర్చియే శాస్త్రము యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవజేత్” “ఏక్షణమునందు నీకు ఐహిక విషయములందు రోతగలుగునో, యా మరుక్షణముననే వాటినన్నింటిని త్యజించి సన్న్యసింపుము” అని యాదేశించుచున్నది.

శిష్యుడు :—భగవంతుని ప్రార్థించినచో, ఆతని కృపావిశేషముచే సమస్తమైన బంధనములు తొలగిపోవునని శ్రీరామకృష్ణులు చెప్పియున్నారుగదా?

స్వామిజి :—అవును. అది నిజమే, సందేహము లేదు. భగవానుని కృపారసముచే సమస్తమును సమకూరును. కాని త్రికరణ శుద్ధిగా పవిత్రులైనవారికే యాదయామయుని కృప లభింపగలదు. కాన భగవంతుని దయ, పవిత్రాత్మునకే సిద్ధించును.

శిష్యుడు :— స్వయంకృషిచే త్రికరణముల యందు పవిత్రతను సంపాదించిన వానికి భగవంతునితో నిమిత్తమేమి ?

స్వామిజి :— ఎవరు హృదయపూర్వకముగా ఆత్మజ్ఞానమునకై కృషిచేయుదురో, వారి యందు భగవంతుడు దయజూపుచుండును. ఎట్టి యత్నమును చేయక, సోమరిగా కూర్చున్నవాని కెన్నడును దైవకృప లభ్యముగాదు.

శిష్యుడు :— ప్రతి మానవుడును మంచిగా నుండుటకై కోరుచుండును, కాని ఏవో కొన్ని యనూహ్యములగు కారణములచే మనస్సు దురాలోచనలను జేయుచుండును. ప్రతి మానవుడును మంచివా డనిపించు కొనుటకును, పరిపూర్ణత గాంచుటకును, భగవంతుని గ్రహించుటకును కోరుచుండుట లేదా ?

స్వామిజి :— ఇట్లు కోరువారు త్యాగపథమున నుండి యిదివఱకే యత్నించుచున్నవారలని తెలిసికొనుము. ఈ యత్నమందు పురో గమించుచున్న భగవంతుని దయ లభించు చుండగలదు.

శిష్యుడు :— అవతారపురుషుల దివ్య చారిత్ర ములలో, అనేకులు, చంచలజీవితమును గడపుచు, ఎట్టి భక్తినిగాని, సాధనగాని లేకయే భగవంతుని గ్రహించుట చూచి యున్నాము. దీనినిగూర్చి తమ యభి ప్రాయ మేమి ?

స్వామిజి :— అవును, వారు తీవ్రమగు ముము క్షువులై యుండవలయును. ఇంద్రియ భోగ ములను చిరకాల మనుభవించుటచే, వీరియందు దసహిష్ణుత వొడమియుండగలదు. వారల హృదయములు నా శాంతినే కోరుచుండును. ఈ ప్రపంచమంతయు మిథ్యయని హృదయమునందు దలంచి, శాంతిరహితమగు జీవిత మొక క్షణమైనను భరింప శక్యముగాదని యావేదన నందు చుందురు. భగవంతునిదయ, వారిపై నారీతిగా వర్షించగలదు. ఈ యభివృద్ధి తమోగుణమునుండి సత్త్వగుణమునకు క్రమక్రమముగా పరిణమించగలదు.

శిష్యుడు :— అప్పుడు మార్గమేదైనను, వార లామార్గముననే దైవమును గ్రహించిరని చెప్పవలయును గదా ?

స్వామిజి :— అవును. ఏల చెప్పరాదు? సింహద్వారమునుండి కోటయందు ప్రవేశిం చుటకంటె దొడ్డిగుమ్మముద్వారా ప్రవేశిం చుట అగౌరవము గదా ?

శిష్యుడు :— సందేహములేదు. అది నిజమే 'భగవంతుని దయవలననే ఆత్మజ్ఞానము బడయగలము' అనునది పరమసత్యము.

స్వామిజి :— అవును. బహు కొద్దిమందియే యీ రీతిగా నుద్యమింపగలరు.

శిష్యుడు :— ఇంద్రియములను జయించి, కామినీ కాంచనములను త్యజించినవారలు, స్వప్రయ త్నము, స్వయంకృషిని బోధించు స్వేచ్ఛా భావవర్గమునకు, భగవంతునినామమును, నూతగాగొని యాతనినే నమ్మినవారలును ఆతని కృపామహిమచే నైహికవాంఛల నుండి మరలి, ఆత్మజ్ఞానమును బడసినవార లునియు నేను గ్రహించుచున్నాను.

స్వామిజి :— సత్యము. ఈ రెండును వేరువేరు మార్గములు. మొదటిది జ్ఞానులమార్గము.

రెండవది భక్తులమార్గము. కాని యీ రెంటికిని త్యాగధర్మము ముఖ్యము.

శిష్యుడు :—అందుకు ఎంతమాత్రమును సందేహములేదు. కాని శ్రీయుత గిరీశచంద్ర ఘోషు నాతో భగవంతునిదయ నిర్హేతుకమనియు, అవ్యాజానురాగముగాని కృప, కృపయేగాదనియు, భగవానుని దయా విశేషము నిర్హేతుకమనియు చెప్పియుండెను.

స్వామిజి :—శ్రీయుత గిరీశచంద్రఘోషు నుడివిన విషయమందేదో నిగూఢమగు పరమసత్యము నిబిడీకృతమై యుండవలయును. దేశ, కాల నిమిత్తముల కతీతమగు స్థితియందుదహరింపవలసిన సత్యమిది. సమస్త హేతువులను అధిగమించిన యాయుత్కృష్ట స్థితియందు దయను చూపించువారలెవ్వరు? ఎవరిపైన చూపించుట? ఆస్థితియందు, పూజించువాడు, పూజింపబడునది, ధ్యానించువాడు, ధ్యానింపబడునది, జ్ఞాత, జ్ఞేయము అన్నియును బ్రహ్మస్వరూపమే. సమస్తమును ఆ దయాస్వరూపమే. అదంతయును ఒక సక్రమాభివృద్ధితో గూడిన పరిపూర్ణత్వమే.

శిష్యుడు :— స్వామిజి! నే నింతకుపూర్వము గ్రహించినది అర్థశూన్యమగు పదాడంబరము మాత్రమేననియు, తమతో సంభాషించినపిదప వేదాంతము, మతము అన నేమియో నిశ్చయముగా తెలిసికొంటి ననియు, గ్రహించుచున్నాను.

ఏవో దోషములనియు మూఢాచారములనియు బలుకుచు గొందఱు తమ పాండిత్యమునుగుఱించి గర్వపడుచుందురు. కాని నిజమైన భక్తుడు తన కెప్పుడును దయామయుడగు భగవానుడే చేయూత నొసగ సిద్ధముగా నున్నాడని తెలిసికొనును. కొంతకాలము ఆతడు తప్పుత్రోవను బోవుచుండినను బోవుగాక, మఱేమియు బాధలేదు. వానికేది ఆవశ్యకమో భగవాను డెఱుగును. భగవానుడే భక్తుని యభీష్టమును సిద్ధింపజేయును.

—శ్రీ రామకృష్ణ పరమహంస

# శ్రీ మధ్వాచార్యులు

శ్రీ టి. లక్ష్మీనృసింహారావు, బి. ఎస్‌సి.

భగవదవతారములు, రాజులు, రాజశాసనములు, మతములు వానివాని వ్యవస్థలును కలకాలము నొకేతీరుననుండవు. ఇవి దేశకాలములనుబట్టి మార్పులు చెందుచుండును. ఇతిహాసకాలమునకు పూర్వము వేదకాలమున హిందూమతము వేదవిహిత కర్మలకే లోబడియున్నది.

ఇక చారిత్రకయుగమున దేశ మొక్కని పాలనలోలేక వేరువేరు రాష్ట్రములను వేరువేరు రాజులు పరిపాలింపుచుండిరి. ఈ రాజులలో పరస్పర వైరములు వైషమ్యములు బయలుదేరి రాజనీతులు, ఆచారములు, మతములు మార్పు నొందుచుండెను. రాజాస్థానములందలి పండితులు బ్రహ్మసూత్రములకు వివిధములుగ నర్థములుచెప్పి వ్యాఖ్యానములు చేయసాగిరి. సుమారు క్రీస్తుకు 500 సంవత్సరములకుముందు బుద్ధుడవతరించి నిరీశ్వరవాదమును ప్రతిపాదించి అనేకులను బౌద్ధభిక్షుకులుగ చేసెను. తరువాత తైత్తరీయశాఖ బ్రాహ్మణులలో శంకరులును కాణ్వశాఖ బ్రాహ్మణులలో శ్రీ సురేశ్వరాచార్యులును అవతరించి దశోపనిషత్తులకు, భగవద్గీతలకు బ్రహ్మసూత్రములకు భాష్యాది వార్తికములు రచించి ఆ ప్రస్తానత్రయమందును అద్వైత సిద్ధాంతమును నిరూపించి ప్రతిపాదించిరి. ఇంతియకాక భరతఖండము నాల్గుమూలలను నాల్గు మఠములు స్థాపించిరి. ఆ మఠములయందును నాది జగద్గురువుల నధిపతులుగాజేసి భరతఖండమునందంతటను నద్వైతమును ప్రసారించినారు. దక్షిణాదిని శృంగేరీమఠమున శ్రీ సురేశ్వరాచార్యులను, ఉత్తరాదిని బదరికాశ్రమమున శ్రీతోటకాచార్యులను, తూర్పున జగన్నాథపుర మఠమున హస్తామలకాచార్యులను, పశ్చిమమున ద్వారకామఠమున శ్రీపద్మపాదాచార్యులను నియమించి అఖండముగా నద్వైత ప్రచారమును కావించిరి. ఇట్టిసమయమున శ్రీ రామానుజాచార్య లవతరించి అతి బాల్యముననే పూర్ణవిద్యావంతులై బ్రహ్మసూత్ర, భగవద్గీతాదులకు భాష్యములు రచించి వీనియందలి విశిష్టాద్వైతమును నిరూపించిరి. వీరు భరతఖండ సంచారముచేసి విశిష్టాద్వైతమును ప్రచారముగావించిరి. కర్ణాటకదేశ పాలకుడు హొయ్యసాళవంశమునకు జెందిన బిట్టి దేవుడు తన జైనమతమును త్యజించి శ్రీరామానుజుల వలన విశిష్టాద్వైతమత దీక్షనుబడసి విష్ణుభక్తుడై విష్ణువర్ధనుడని పేరు మార్చికొని లక్ష్మీదేవియను వైష్ణవాంగనను వివాహమాడెను. ఈ విధముగ పరమతముల తల్లువలన, ఉపనిషత్ప్రోక్తమును అత్యంత ప్రాచీన భారతీయ మతమునగు ద్వైతసిద్ధాంతము అంతరింపనుండెను. దేశమునందేప్రక్క చూచినను అద్వైతులే. ఏమూలచూచినను విశిష్టాద్వైతకూటములే. ఇట్టి సమయమున, క్రీ. శ. 12-వ శతాబ్దమున మధ్వాచార్య

లవతరించి ద్వైతమతమును, విష్ణుభక్తిని పునరుజ్జీవింపజేసిరి. శ్రీహరి సర్వోత్తముడైన ఈశ్వరుడనియు, జగత్తు, జీవులు, ఈశ్వరుడు మూడు భిన్న భిన్న పదార్థములనియు, ఆత్మల స్వాతంత్ర్యములనియు, ఆత్మలకు నిర్మలభక్తియే మోక్షోపాయమనియు, హరి సర్వోత్తముడు, వాయువు జీవోత్తముడనియు వీరు ప్రతిపాదించిరి.

## జననము

క్రీ. శ. 12-వ శతాబ్దారంభమున దక్షిణ కర్ణాటకమును హొయసళ యాదవులు పాలించిరి. ఈ వంశపు మొదటి నరసింహరాజు క్రీ. శ. 1141 లో సింహాసనమెక్కెను. ఈ రాజునకు కాణ్వశాఖ బ్రాహ్మణుడైన లక్ష్మయ్య ముఖ్యమంత్రిగ నుండెను. మధ్యగేహ భట్టు అను బ్రాహ్మణోత్తము డొకడీ సచివ సహాయమున రాజాశ్రయమునువడసి బేళూరు రాజధానిలో శివరూప్య క్షేత్రమునకు చేరువనున్న పాజక గ్రామమున కుటుంబముతో నివసించుచుండెను. తపోనిష్ఠుడగు మధ్యగేహభట్టు వేదశాస్త్ర పారంగతుడై యజ్ఞయాగాది కర్మలజేయుచు నతిథ్యభ్యాగతుల నాదరించుచు సదా సత్కాలక్షేపముచేయుచుండెను. మధ్యగేహభట్టుని ధర్మపత్ని వేదవతి సదాచార సంపన్నురాలు, పతివ్రతాశిరోమణి. ఈ పుణ్య దంపతుల కిద్దరు కుమారులును నొక్క కుమార్తెయును కల్గిరి. ప్రారబ్ధకర్మముచే పుత్రు లిరువురును గతించిరి. ఇక మధ్యగేహభట్టు విచారమునకు మేరలేదు. అపుత్రకున కుత్తమగతులు లేవనియు, పున్నామనరకము ప్రాప్తించుననియు, మిక్కిలి చింతించుచు, పుత్రుని పడయుటకు పలుపాట్లు పడుచు పుణ్యతీర్థము లెన్నిటినో సేవించి భార్యచే నోము లెన్నిటినో నోమించెను. తుదకు శివరూప్య క్షేత్రముననున్న అనంతేశ్వరుని శరణుపొంది పరమభక్తిభావముతో భార్యాసమేతముగ నొక్క పుష్కర మెడతెరపిలేక సేవించెను. వీరు పుత్రునికై యొనర్చిన తపము ఫలించినది. అనంతుని యనుగ్రహమువలన వేదవతియు గర్భముధరించినది. నవమాసములునిండి యొక సుదినమున పరమ లక్షణ సంపన్నుడును పరమ సుందరమూర్తియునగు సుపుత్రుని ప్రసవించినది. ఈ సువార్తవిని బంధుజనులందరును మిగుల సంతసిల్లిరి.

మధ్యగేహభట్టీసమయమున శివరూప్య క్షేత్రమున అనంతేశ్వర సేవానిరతుండై యుండెను. ఇంటికి తరలి వచ్చునంతలో శుభవార్త విని అత్యుల్లాసముతో ననంతేశ్వర వరప్రసాదమని జెప్పి యా యనంతుననన్యభావముతో స్తుతినుతులుచేయుచు నింటికి చేరుకొనెను. జననాశౌచము తీరినతరువాత మంగళస్నాన పుణ్యాహవచనములచే శుచిర్భూతులై సుముహూర్తమున తమపుత్రునకు వాసుదేవుడను నామకరణముజేసిరి. అనంతేశ్వర పూజానిరతుండగు మధ్యగేహభట్టు కుటుంబముతో శివరూప్యక్షేత్రమునకుబోయి అనంతేశ్వరుని దర్శించి ధూపదీపనైవేద్యములతో దేవతారాధనను జేసి తమ ముద్దులపట్టి భావి సౌఖ్యాభివృద్ధులగోరి యా పుత్రరత్నము నాదేవసన్నిధికి కానుకగాసమర్పించెను. ఇట్లా పరమేశ్వరు నర్చించి నడురాత్రి సపరివారముగా పాజక గ్రామమునకు వచ్చెను.

## బాల్యము

పరమసుందరమూర్తియగు వాసుదేవుడు శుక్లపక్ష చంద్రునివలె దినదినప్రవర్ధమాను

డగుచుండెను. దివ్యవిలాసకాంతితో శోభించు చున్న యీ బాలకు నెత్తి ముద్దాడి మధ్యగేహ భట్టుని భాగ్యమును కొండాడుచుండిరా యూరి వారెల్లరు. భావి దివ్యమహిమను ప్రకాశింప జేయునట్టి యద్భుతలీల లనేకములను బాల్యమునందే వాసుదేవుడు ప్రకటించుచు తలిదండ్రులకు బంధుమిత్రులకు నాశ్చర్యమును సంతోష మునుగూడ కలుగజేసెను. నానాటికి తలిదండ్రులకు తమ వరపుత్రునిపై ప్రేమ అతిశయ మందుచున్నది. కాని వాసుదేవుడు కేవలము వారి సద్గతికి పుట్టిన మహానుభావుడు కాడు. సంసారకారాగారబంధితులైన లోకులకు మోక్ష మార్గమును జూపుట కవతరించి యా మహత్కార్యమునకు పూనుకొనిన యవతార పురుషుడు. పట్టున పదిమాసములైన లేవు. అట్టి బాలుడైన వాసుదేవుని ఒకదినము తల్లి తనకుమార్తెకిచ్చి యాడించమనిచెప్పి స్నేహితు లింటికి పోయెను. వాసుదేవుడు అక్కచేతిలో నుండడయ్యె. వెంకిపట్టుతో నేడ్వసాగెను. ఎన్నెన్నివిధముల సమాధానపరచినను ఏడ్పు మానడాయె. చివర కేమిచేయుటకు తోపక యాపిల్ల కొన్ని గుఱ్ఱపు గుగ్గిళ్ల నా బాలునిచే తినిపించెను. బాలు డా కొంచెముతో నూరు కొనక ఉడికించిన గుగ్గిళ్ల నన్నిటిని తిని యేడుపు మాని యాడుకొనుచుండెను. తల్లీ వార్త తెలిసికొని బాలునకేమి యాపద వచ్చునో యని భయముతో తల్లడిల్లుచుండెను. కాని పసిబిడ్డ గుఱ్ఱములుతిను గుగ్గిళ్లను దిని వాటి నతిసులభముగ జీర్ణించుకొని సుఖముగా నాడుకొను చుండెను. మఱికొన్నిదినములకు ప్రాకుచుపోయి పోయి యొక యెద్దుతోక బట్టికొని దానితో నడవులకు బోయెను. తలిదండ్రులు ఇంటింట వెతకి వెతకి బాలుడు కన్పించక వేసారియుండిరి. సాయంకాలమగునప్పటి కా యెద్దు తోకను వ్రేలాడుచు నింటికి వచ్చెను. ఒకనాడొక ధనికుడైన సాహుకారు మధ్యగేహభట్టువద్దకు వచ్చి తానిచ్చిన యప్పు సొమ్మును తెమ్మని యొత్తిడిచేయుచుండెను. మధ్యగేహుడు సొమ్ము నీయలేక మనోవ్యథతో బాధపడుచుండెను. అట్టిసమయమున వాసుదేవుడు బుట్టెడు చింతగింజలనిచ్చి యా యప్పిచ్చినవానిని సమాధానపరచెను. ఆ ధనికున కా చింతగింజలే పురుషార్థప్రదముగా కన్పించెను! ఇట్లు వాసుదేవుడు తన ముద్దుమాటలచే—సొబగుచే, ఆటలచే మందహాసముతో సర్వజనమనోరంజకుడై విరాజిల్లుచుండెను. ఇట్టి లీలలన్నియు మహాపురుష లక్షణములుగాక మఱియేమి? కారణజన్ములగు నవతారపురుషుల కిట్టివి స్వాభావికములు.

శ్లో. "అభయం సత్త్వ శుద్ధి
ర్జ్ఞానయోగ వ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ
స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥
అహింసా సత్యమ క్రోధ
స్త్యాగః శాంతిర పైశునమ్,
దయా భూతేష్వ లోలు త్త్వం
మార్దవం హ్రీరచాపలమ్॥
తేజః క్షమా ధృతిః శౌచ
మద్రోహో నాతి మానితా,
భవంతి సంపదం దైవీ
మభిజాతస్య భారత॥"

భయరహితత్వము, భావశుద్ధి, జ్ఞాననిష్ఠ, యోగనిష్ఠ, దానము, బాహ్యేంద్రియ సంయమము, యజ్ఞము, బ్రహ్మయజ్ఞము, తపము, ఋజుప్రవర్తనము, అహింస, అప్రియమును అనృతమును విడిచి సత్యమును వచించుట,

కోపము నణచుకొనుట, సన్న్యాసము, మృదుత్వము, కుకార్యములు కుచింతలనిన సిగ్గు, వ్యర్థ కార్యముల నొనర్చకుండుట, ప్రతిభ, పరాభవము కలిగినను కోపము రాకుండుట, దుఃఖ సమయముల ధైర్యమును చెందియుండుట, బాహ్యాభ్యంతరశుద్ధి కలిగియుండుట, వైరభావము లేకుండుట, అనుగుణములు సాత్త్విక స్థితిని బొందెడి యోగ్యతతో జన్మించినవారికి కలుగుచున్నవని శ్రీకృష్ణుడు దైవీసంపదను వర్ణించినాడు. ఇట్టి దివ్యలక్షణములన్నియు నీ బాలకునియందు వ్యక్తమగుచున్నవి. అందులకే ఈత డొక మహాపురుషుడని నమ్మి తమ యుద్ధారణ కవతరించిన కారణజన్ముడని సజ్జనులానందభరితులగుచుండిరి.

వాసుదేవునకు నాల్గవ సంవత్సరము వచ్చినది. ఒక శుభదినమున తండ్రీతనికి అక్షరాభ్యాసమును చేయించెను. మహాప్రతిభాశాలి యగు ఈ బాలునకు పాఠములు రెండవసారి చెప్పనవసరము లేకపోయెడిది. ఇదేవిధముగ ఈతను అచిరకాలముననే ఉద్గ్రంథముల నన్నిటిని సులభముగ నర్థజ్ఞానముతో చదువుటకు సమర్థుడాయెను. ఒకనాడు శివభట్టను పౌరాణికుడు పురాణము చెప్పుచుండ నచ్చటికి వాసుదేవుడు పోవుట సంభవించెను. పౌరాణికుడు తప్పుడర్థములు చెప్పుట గ్రహించి వెంటనే సభలో పదివత్సరముల బాలుడు వాసుదేవుడు లేచి తప్పులు దిద్ది సభ్యుల నాశ్చర్యచకితుల జేసెను. మరియొకనాడు తనతండ్రి మధ్యగేహభట్టు పురాణమును చెప్పుచుండ కొన్నిశబ్దముల కర్థములు చెప్పకపోయినప్పుడు బాలుడు లేచి అర్థములు చెప్పుట మొదలిడెను. అతిబాల్యమునందే వాసుదేవుడు తన దేహదార్ఢ్యమును బాహుబలిమిని, భగవద్భక్తిని, మేధాశక్తిని అనేకవిధముల ప్రకటించి ముందు తాజేయు మహాత్కార్యములను సూచించెను. ఉపనయనాది కర్మల యనంతర మొక గురువునొద్ద వేదాధ్యయన కర్మల నారంభించె నీ వాసుదేవుడు. వాసుదేవునకు సకలశాస్త్రములు సకలవిద్యలు కరతలామలకములుగా నున్నవి. ఇట్టివానికి గురువుదగ్గరి నిత్యపాఠములు రుచింపక విసువు కల్గించెను. తనపాఠములయం దశ్రద్ధ వహించుచుండ గురువునకు కోపము వచ్చినది. సకలవిద్యాప్రవీణునకు నిత్యపాఠము లేల? అధ్యాపకునకే శిష్యుడు ఐతరేయోపనిషత్తునందలి తత్త్వార్థముల విశదీకరించి శివభక్తుడైన గురువునకు విష్ణుభక్తినే గురుదక్షిణగా నొసగెను!

## సన్న్యాసము

ఈ విధముగ గురుకులవాసము ముగిసినపిదప తాను పూనుకొనిన మహాత్కార్యము నెరవేరుటకు సన్న్యాసస్వీకారముతప్ప వేరొండుమార్గము లేదని నిశ్చయించుకొని వాసుదేవుడు సద్గురువు నన్వేషింప మొదలుపెట్టెను. విషయసంగపరిత్యాగముచేతనే, వైరాగ్యమువలననే పరమాత్మునియందు ఆసక్తి కలిగి తన మహాకార్యము నెరవేరునని దృఢీకరించుకొనెను. తలిదండ్రులు తమకుమారుడు వివాహముచేసికొని గృహస్థాశ్రమమును స్వీకరించి తన పాండిత్య మహిమచే కీర్తిని ధనమును సంపాదించి తమ్ము వృద్ధాప్యమున కాపాడునని మనోరాజ్యమున కట్టిన మేడలు కూలినవి. కాని సద్గురు నన్వేషించుచు వాసుదేవుడు ఉడిపి గ్రామమున నున్న అచ్యుతప్రేక్షులను యతివర్యునొద్దకు వచ్చి చేరెను. వాసుదేవుడులేని గృహము కొడిగట్టిన దీపమువలె నున్నది.

తలిదండ్రులకు క్షణము యుగముగా పరిణమించి నది. ప్రేమపుత్రుని విరహతాపము హెచ్చెను, అన్నము రుచించుటలేదు, కంటికి కునుకులేదు. ఆ వాసుదేవుని ముఖచంద్రస్మరణతో శోకమున మునిగియుండిరి. ఈ వియోగదుఃఖమునకు తాలక పుత్రుని వెదకుచు మధ్యగేహభట్టు అచ్యుతప్రేక్షుల దగ్గరకు వచ్చి యనేకవిధముల పుత్రుని వేడుకొనెను. చివరకు మరియొక కుమారుడు కలుగునంతవరకును తాను సన్న్యాసము గైకొనవని వాగ్దానమిచ్చి ఇంటికి తరలి వచ్చెను. లోకహితార్థ మవతరించిన వాసుదేవుని మధ్యగేహభట్టు పుత్రవాత్సల్యముచే నింటియందే యుంచుకొనవలయుననెడి ప్రయత్నము విఫలమైనది. స్వల్పకాలముననే వారికి పుత్రోత్పత్తి సంభవించినది. వాసుదేవుడును తలిదండ్రుల యనుజ్ఞచే అచ్యుతప్రేక్షుల వలన సన్న్యాసమును స్వీకరించెను. ఇట్టి విశ్వ ప్రయత్నముచే సన్న్యాసాశ్రమమును స్వీకరించిన వీరవైరాగ్యశాలి వాసుదేవుడు సామాన్యుడుకాడు! ఆదిజగద్గురువైన శ్రీసురేశ్వరాచార్యుల యవతారమే. సన్న్యాసమును స్వీకరించిన వాసుదేవుడు పరమహంస పరివ్రాజకాచార్యులగుటచే పూర్ణప్రజ్ఞులని పిలువబడుచుండిరి. కొన్నిదినములకే ఉడిపిలో తర్కశాస్త్ర నిపుణుడగు నొక పండితునకును పూర్ణప్రజ్ఞులకును జరిగిన వాగ్వాదమున ఆచార్యులు విజయమును పొందిరి. మరియొకదినము అచ్యుతప్రేక్షాచార్యులు పూర్ణప్రజ్ఞునకు "ఇష్టసిద్ధి" యను అద్వైత గ్రంథమును పాఠము చెప్పుచుండ మంగళాచరణ శ్లోకమునందే బహు దోషములు గలవని వాదించెను. ఈయనను పరీక్షించుటకు కొందరు పండితులు భాగవత పంచమస్కంధ వచనమును చెప్పుమనిరి. పూర్ణప్రజ్ఞులును 'తు' 'చ' తప్పక యా వచనమును చెప్పి వారిని అత్యాశ్చర్యమగ్నుల జేసెను. "నీవు భాగవతమును పరిశీలించలేదే ఎట్లు చెప్పగల్గితివి?" అని అచ్యుతప్రేక్షు లడిగి నప్పుడు ఆచార్యులు—"నేను పూర్వజన్మమందే భాగవతమును పఠించితిని" అని చెప్పెను. అచ్యుతప్రేక్షులు సంతుష్టులై వేదాంతవిద్య యను రాజ్యమును పాలించుటకే పూర్ణప్రజ్ఞులే సమర్థులని వారి కభిషేకాది కార్యములచేసి ఆనందతీర్థ లను నామమిచ్చెను. ఇంకొకనాడు అచ్యుతప్రేక్షుల ముఖ్యశిష్యులైన న్యాయశాస్త్ర ప్రవీణులొకరు ఆచార్యులతో వాదించి పరాజయమును పొంది ఆయన న్యాయశాస్త్ర కౌశల్యమునకు మెచ్చుకొని ఆయనకు "అనుమానతీర్థ" యను బిరుదు నిచ్చిరి. ఈ విధముగ సర్వశాస్త్రవిశారదులు శ్రీమదానందతీర్థుల కీర్తి దిగంత విశాలము నందుచుండ దూర దూర దేశములనుండి పెద్దపెద్ద పండితులు వాదాభిలాషులై ఈయన దగ్గరకు వచ్చుచుండిరి. వేదద్వేషులై అత్యంత ప్రముఖ బౌద్ధ పండితులైన వాదిసింహ, బుద్ధిసాగర యను వారిని ప్రబలవాదములో జయించెను. ఆ పండితులును నిశ్శబ్దముగ నెవరికిని తెలియకుండ రాత్రికి రాత్రి పారిపోయిరి. ఈ ప్రకార మనేక పండితుల నోడించి తమ పాండిత్య ప్రకర్షను చూపుచుండిరి. ఇట్టి సమయమున బ్రాహ్మణ సమాజములం దెక్కడ చూచినను అద్వైత మతానుయాయులే. గురువులైన అచ్యుత ప్రేక్షులును, తండ్రియగు మధ్యగేహభట్టును, అధ్యాపకుడైన పూగు వనశాస్త్రియుకూడ అద్వైతులే.

ఈ సమయమున శ్రీమదాచార్యులు - శంకరాచార్యుల బ్రహ్మసూత్రభాష్యమును

ఖండించి సప్రమాణముగా ద్వైతమతపరముగ వేరొక భాష్యమును రచించిరి. ఇట్లు దిగ్విజయములతో దక్షిణదేశమునకు వచ్చి తీర్థయాత్రలుచేయుచు శృంగేరీ మఠాధిపతియగు శ్రీవిద్యాశంకరుల నోడించి అనంతశయన క్షేత్రమునందలి పద్మనాభతీర్థమునందు స్నానమాడి కన్యాకుమారీ క్షేత్రమునకువచ్చి అచ్చట కన్యాతీర్థములందు, ధనుష్కోటియందును స్నానములుచేసి రామేశ్వరలింగమునకు అభిషేకముచేసి చాతుర్మాస్యమును రామేశ్వరమందే గడపిరి. ఈ ప్రకార మనేక విద్వత్సభలలో తమ ప్రతిభాశక్తిని వెల్లడిచేయుచు శ్రీమదాచార్యులు "సర్వజ్ఞ" అను ప్రసిద్ధిని పొంది దక్షిణదేశ దిగ్విజయమును ముగించుకొని ఉడిపికి వచ్చి చేరిరి. తదనంతరము గీతాభాష్యమునురచించి గుర్వనుజ్ఞనుపొంది ఉత్తర దిగ్విజయమునుచేయ నుద్యుక్తులై శ్రీ మదాచార్యులు బదరికాశ్రమమునుచేరిరి. గంగాస్నానమునుచేసికొని అనంతమఠమున కొంత కాలము మౌనవ్రతమాచరించి గోదావరీ తీరమునకువచ్చి రాజమహేంద్రవరమున శోభన భట్టు, స్వామిశాస్త్రియను శాంకరులను జయించి వారికి దీక్షనొసగి, పద్మనాభతీర్థులు, నృసింహతీర్థులను నామములిచ్చెను. ఇట్లనేకులను పునీతులజేసి శ్రీమదాచార్యులు ద్వారకయందు స్వహస్తములతో శ్రీకృష్ణ ప్రతిమను ప్రతిష్ఠకావించి పూజావిధానమును ఏర్పరచి యర్చకుల నియమించెను. తిరిగి రెండవసారి బదరీయాత్రను పూర్తిచేసికొని ఉడిపిదగ్గరి కొడిపాడి గ్రామమునకు చేరెను. తరువాత కొంతకాలమునకు విష్ణుమంగళము అను పట్టణమునకు వచ్చి అచ్చట త్రివిక్రమ శాస్త్రి యను అద్వైతమతానుయాయికిని శ్రీమదాచార్యులకు 15 దినములు హోరాహోరి వాదముజరిగినది. ఈ వాదమున శ్రీ మదాచార్యులు త్రివిక్రమశాస్త్రి నోడించి త్రివిక్రముని తనశిష్యునిగ జేసికొనెను. త్రివిక్రమశాస్త్రియు బ్రహ్మసూత్ర భాష్యమును చక్కగా చదివి శ్రీమదాచార్యుల యనుమతిపై, "తత్త్వప్రదీపిక" యను టీకా గ్రంథమును రచించిరి.

శ్రీమధ్వాచార్యులు జయసింహరాజ సమ్మానమునుపొంది విష్ణుమంగళగ్రామముననే నివసించుచు అనేక గ్రంథములను రచించుచు పాచకగ్రామమున తన తలిదండ్రుల సేవయు చేయుచు పుత్రధర్మమును పరిపాలించుచుండెను. తలిదండ్రులు దివంగతులైన యనంతరము విరక్తశిఖామణియైన తమ్మునకు సన్న్యాసమిచ్చి విష్ణుతీర్థులను నామమిడియెను.

ఈ విధముగ శ్రీ మధ్వాచార్యులు సజ్జనోద్ధరణకు దేశాటనముచేయుచు ఉపన్యాసములిచ్చుచు సద్గ్రంథము లనేకములను రచించుచు శిష్యకోటికి విష్ణుదీక్షనొసగుచు ద్వైతమతమును ప్రకాశింపజేసెను. ఈ మహాత్ముని నిర్యాణమునుగూర్చిన విషయము లంతగా తెలియవు. కాని సుమారు 80 సంవత్సరములు జీవించెనని తెలియుచున్నది. ఈ యపాజక గ్రామమున తనశిష్యవర్యులకు ఐతరేయోపనిషత్తును పాఠము చెప్పుచుండ నొక పుష్పవర్షము గురిసినదట. ఆ సమయమున శ్రీమధ్వాచార్యులు భక్తుల భౌతికదృష్టి కదృశ్యులైరట. నేటికిని వారిసిద్ధాంతములు, వారు పునరుజ్జీవింపజేసిన విష్ణుభక్తియుకూడ ఆ పుష్పవర్షమువలెనే లోకోపకారమున కుపయోగపడుచున్నవి.



# శ్రీ వాసుదేవ మననము

## ప్రథమ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

ముముక్షువులు అధ్యారోపాప వాదముల నవశ్యము తెలిసికొనవలయును. కావున "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే। శిష్యాణాం బోధసిద్ధ్యర్థం తత్త్వజ్ఞైః కల్పితక్రమః॥" ఆత్మ జిజ్ఞాసువులై ముముక్షువులగు శిష్యులకు తత్త్వమును బోధించుటకొఱకును వారికి ఆత్మజ్ఞానము సిద్ధించుట కొఱకును తత్త్వజ్ఞులచేత గల్పింపబడిన విధివిధానమైన అధ్యారోపాపవాదములచేత నిష్ప్రపంచాద్వితీయాఖండైకరస నిర్గుణపరబ్రహ్మము జీవేశ్వరజగద్రూపమున ప్రకటితమగుచున్నది." 'నిష్ప్రపంచ'మనగా.—"ప్రకర్షేణ పంచధాభూజలాగ్ని వాయ్వాకాశరూపేణ విభజ్యతీతి ప్రపంచః। తన్నభవతీతి నిష్ప్రపంచః॥" పృథివ్యప్తేజో వాయురాకాశరూపమైన పంచ మహాభూతరూపముచేత నైదువిధములుగ విశేషముగా విభజింపబడునది ప్రపంచము. అటుల విభజింపబడనిది నిష్ప్రపంచము అనగా నిర్విశేషాద్వితీయాఖండైకరసపరబ్రహ్మము. "అధ్యారోపాపవాద తస్స్వరూపం నిశ్చయీ కర్తుం శక్యతే। తస్మాత్సదావిచారయే జ్జగజ్జీవ పరమాత్మనః। జీవభావజగద్భావబాధే ప్రత్యగభిన్నం బ్రహ్మైవాఽవశిష్యతే॥" (పైంగలి. ఉ. 2. అ.) అధ్యారోపాపవాదములచేత స్వస్వరూపనిరూపణము శక్యమగును. కనుక సద్గురూపసదన పూర్వకముగ వేదాంతశ్రవణాదికముద్వారా జగజ్జీవ పరమాత్మస్వరూపములను సర్వదా విచారణచేయవలయును. అయితే మోక్షావస్థయందు ఫలరూపముగా పరమాత్మ యుండుట వలన ఆ పరమాత్మస్వరూప విచారణము ఉపయోగించును. జగజ్జీవులయొక్క విచారణ మెచ్చట నుపయోగించును? అనెడి విషయము నకు తావులేదు. ఏలయన - వేదాంత విచారణమువలన గలిగిన సత్య బుద్ధ్యవధారణము చేత ఆ జగజ్జీవ రూపములు రెండును మాయా మూలమున బ్రహ్మమునం దారోపితమైన మాయాకార్యమని తెలియబడి బాధింపబడినవి యగుచుండగా స్వస్వరూపమైన ప్రత్యగభిన్న పరమాత్మ మాత్ర మవశేషించి ప్రకాశించు చుండును. అనగా ఆ జగజ్జీవరూపములు రెండును వాస్తవముగ లేవు, మిథ్యాభూతములు అనెడి నిశ్చయజ్ఞానము నుత్పాదించుట ద్వారా వాని విచారణము పరమాత్మను శేషింపజేయుటయందు ఉపయోగింపబడునని యభిప్రాయము.

అధ్యారోపమనగా.— "వస్తున్యవస్త్వారోపోయః సోఽధ్యారోపో ఇతీర్యతే। అసర్పభూతే రజ్జ్వాదౌ సర్వత్వారోపణం యథా॥" (సర్వ

వేదాంత సిద్ధాంతసార సంగ్రహము. 297.) సర్పాదులు కానటువంటి రజ్జ్వాదులయందు సర్పత్వారోపణముభంగి వస్తువునందు అవస్త్వారోపణము అధ్యారోపము అని చెప్పబడును. ప్రస్తుతమున రజ్జువునందు సర్పము శుక్తియందు రజతము, స్థాణువునందు పురుషుడు ఆరోపింప బడిన చందమున, నిష్ప్రపంచాత్మ వస్తువునందు ప్రపంచారోపము అధ్యారోపము. ఈ యధ్యారోపము వస్త్వజ్ఞానమువలన అనగా వస్తు స్వభావము తెలియబడకపోవుటవలన గలుగును. ఆ యజ్ఞానమే అవిద్య - తమస్సు- మోహము - మూల ప్రకృతి—ప్రధానము - గుణసామ్యము - అవ్యక్తము - మాయయని పేర్కొనబడుచున్నది. మూల ప్రకృతియనగా.- "అజామేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీం సరూపాం॥" (తై. ఉ. 4-12-5.) అనాదియు నేకమునగు నీమూల ప్రకృతి శుక్ల-రక్త-కృష్ణరూపములుగల సత్త్వ రజస్తమోగుణాత్మకమైనది. అనగా శుక్ల - రక్త - కృష్ణతంతు సముదాయరూప రజ్జు సదృశమైన సత్త్వరజస్తమోగుణ సముదాయ రూపము. ఇదియే స్వసమానమైన రూపము (స్వభావము)గల బహు ప్రజను విశేషముగ బుట్టించుచున్నది. "తదేవమూల ప్రకృతిర్గుణ సామ్యమవిద్యేత్యా ద్య నేకాకారా జగదాకారేణపరిణతా। తదేవం బ్రహ్మవిజ్ఞానాత్యను భవతిచ॥". (సర్వసార. ఉ. 12) ఆమూల ప్రకృతియే గుణసామ్యము అవిద్యయను ననేకాకారములయి జగదాకారముగ బరిణమించును. జగత్తు మూలప్రకృతియొక్క పరిణామమని యర్థము. ఆ విషయము వక్ష్యమాణ బ్రహ్మ విజ్ఞానమువలననను భూతమగును. దీని ప్రళయము మహాసుషుప్తియనియును చెప్పబడును. సృష్టికి బూర్వము సమస్త జీవకోటియు దమతమ పూర్వకర్మవాసనలతోసహ లక్కముద్దయందు దణగియుండు సువర్ణరేణువులవలె నీ మూలప్రకృతియందు లీనమైయుండును. ఈ యనుభవము సకలజనులకు సుషుప్త్యవస్థయందు గలదు. సకల ప్రపంచము సుషుప్త్యవస్థ యందు విలీనమై మఱల స్వప్నజాగ్రదవస్థల యందు ప్రకాశించునుగదా! ఆ మూలప్రకృతి సృష్ట్యవసరమునందు, పరిపక్వమై అనుభవోన్ముఖమైన జీవుల పూర్వకర్మవశమువలన (కారణముగ) మాయ - అవిద్య - తామసి యని మూడువిధములయ్యెను. అందు మాయ విశుద్ధ సత్త్వగుణ ప్రధానమైనది. అవిద్య మలినసత్త్వగుణప్రధానమైనది. ప్రకాశరూపముగలది సత్త్వగుణమగును. మఱియు మఱియొక గుణముతోగలియని సత్త్వగుణము విశుద్ధ సత్త్వమని చెప్పబడును. మఱియు రజస్తమోగుణములతోగలిసిన సత్త్వగుణము మలిన సత్త్వమని చెప్పబడును. ఇటులామూల ప్రకృతి విశుద్ధ సత్త్వమనియు మలినసత్త్వమనియు రెండు విధములుగానున్నది. విశుద్ధ సత్త్వగుణ ప్రధానముగలది మాయయనియు, మలినసత్త్వగుణ ప్రధానముగలది అవిద్యయనియు చెప్పబడును. ఇట్లు ఆమూలప్రకృతి విశుద్ధ సత్త్వగుణప్రధానముచేత మాయయనియు, మలినసత్త్వగుణప్రధానముచేత అవిద్యయనియు రెండు విధములుగా భేదమును గలిగియున్నది కనుక మాయ, అవిద్య - ఇవి రెండును మూలప్రకృతియొక్క అవస్థావిశేషములని తెలియవలయును. మఱియు సత్త్వగుణము జ్ఞానప్రకాశరూపముగలది యగును. రజస్తమోగుణములు రెండును అజ్ఞాన అప్రకాశరూపములను గలిగియుండును. మాయ 'మూలాజ్ఞాన

మని', అవిద్య 'తూలాజ్ఞానమ'ని పరిభాష.

“సదేవసోమ్యే దమగ్ర ఆసీ దేకమేవా ద్వితీయం॥” (ఛాం. ఉ, 6-2-1) ఈ జగదుత్పత్తికంటె పూర్వము, సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైన కేవలాద్వితీయాఖండైకరస సద్వస్తువు మాత్రమే యున్నది.” “ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీత్। నాన్యత్కించనమిషత్॥” (ఐ. ఉ. 1-1-1) పరమాత్మ ఒక్కటిమాత్రమే ఈప్రపంచ సృష్టికి బూర్వమున్నది. అట్టి పరమాత్మ వ్యతిరిక్తమైన వస్త్వంతరమేదియులేదు. “సోఽబ్రవీ దహమేకః ప్రథమమా సంవర్తామిచ భవిష్యామిచ। నాన్యః కశ్చిన్మత్తోవ్యతిరిక్త ఇతి॥” (అథర్వశిర. ఉ. 1-1.) “స్వయంప్రకాశ చిదానంద స్వరూపుడును, దేశకాలవస్తు పరిచ్ఛేద శూన్యుడునగు నేనొక్కడనే జగదుత్పత్తికంటె ముందుంటిని. ఇప్పుడును ఉన్నాడను. ఇక ముందుగూడ ఉండగలను. నాకంటె భిన్నుడగు నన్యుడు ఒక్కడును ఉండియుండలేదు. ఇప్పుడునులేడు ఇకమీదట నుండబోడు”అని అవ్యాకృత పరబ్రహ్మము పలికెను. అను నిత్యాద్యుపనిషత్సిద్ధాంతముగ సచ్చిదానంద పరబ్రహ్మము ఒక్కటి మాత్రమే ప్రపంచోత్పత్తికంటె ముందు ఉన్నదని తెలియబడుచున్నది. సృష్టికంటె పూర్వమునందున్న ఆ బ్రహ్మ చైతన్యము విశుద్ధసత్త్వగుణ ప్రధానమగు మాయయందు ప్రతిబింబించినదగుచు ఈశ్వరుడని చెప్పబడుచున్నది. ఈ యీశ్వరుడే మాయాశబల బ్రహ్మమనబడును. ఆ యీశ్వరునకు 'అవ్యాకృతుడు' 'అంతర్యామి' యని నామాంతరములు. అతడే జగత్స్రష్ట. అనగా జగజ్జన్మాది కారణత్వ విశిష్టుడు. సర్వజ్ఞుడు. 'అవ్యాకృతు'డన నామ రూపరహితమైన కేవలకారణము. 'అంతర్యామి' యన సర్వాత్మకత్వముతో సర్వాంతర్గతుడై యుండి సమస్త జగత్తును ప్రేరేపించుచుండువాడు. అతడే పరిపూర్ణబ్రహ్మ చైతన్యము, ఆ పరిపూర్ణబ్రహ్మ చైతన్యమే తామస్యావచ్ఛిన్నమగుచు అనగా తమోగుణ ప్రధానమైన మూలప్రకృతియందు ప్రతిబింబించినదగుచు జగత్తునకు ఉపాదాన కారణముకూడ నగుచున్నది. “యథా లూతానిమిత్తంచ స్వప్రధాన తయాభవేత్। స్వశరీర ప్రధానత్వే నోపాదానం తథేశ్వరః। స్వప్రాధాన్యేన జగతో నిమిత్త మపికారణం। ఉపాదానం తతోపాధి ప్రాధాన్యేన భవత్యయం॥” (స. వే. సి. సా. సం. 333-334.) సాలెపురుగు తంతుజాలమునకు స్వప్రధానత్వముచేత నిమిత్తకారణమును, స్వశరీర ప్రధానత్వముచేత ఉపాదానకారణమునుగూడ నెట్లగుచున్నదో అట్లే ఈశ్వరుడు జగత్తునకు స్వప్రధానత్వముచేత నిమిత్తకారణమును, తమోగుణరూపమైన స్వోపాధి ప్రధానత్వముచేత ఉపాదానకారణమును గూడ నగును. “దాత్మానం స్వయమకురుత। తస్మాత్తత్సుకృతముచ్యత ఇతి॥” (తై.ఉ.2-8.) తత్ = ఆయవ్యాకృతనామరూపములుగల బ్రహ్మము, ఆత్మానం=తనను – నామరూపాత్మకమగు ప్రపంచమును, స్వయం అకురుత=స్వయముగ తానే చేసెను. తస్మాత్ తత్ సుకృతం ఇతి ఉచ్యతే= అందువలన ఆ బ్రహ్మము స్వయంకర్తృకమని చెప్పబడుచున్నది. తా. పరమాత్మయే కారణముగాగల ఈ ప్రపంచము సృష్టికి పూర్వము నామరూప విశేషరహితమగు అవ్యాకృత స్వరూపముగనుండి సృష్ట్యనంతరము నామరూపవిశిష్టమగు సత్స్వరూపముగలది ఆయెను. “సర్వాధార మనాధారం.” (భస్మజాబాల,

ఉ. 2 అ.) సమస్త బ్రహ్మాండమునకు ఆధారమైనదియు, తనకు ఆధారము లేనిదియు అనగా తనకు తానే ఆధారమైనదియునగు ఆ పరబ్రహ్మము కారణాంతరమునుగాని సాధనాంతరమునుకాని అపేక్షింపక తననే జగద్రూపముగ తానే సృజించెను కనుక స్వకర్తృకమని-చెప్పబడుచున్నది. "రసో వైసః। రసగ్ం హ్యేవాయంలబ్ధ్వాఽఽనన్దీభవతి॥" (తై. ఉ. 2-8.) అదియే రసస్వరూపము. ఇట్టి రసముననుభవించియే జీవుడు సుఖవంతుడగు చున్నాడు. ఈ మంత్రమును విమర్శించిన నిమిత్తోపాదానములు రెండునుగూడ పరబ్రహ్మమేయని స్పష్టమగుచున్నది. ఎట్లనగా 'తానే సృజించెను' అనుటచేత నిమిత్తకారణమును, 'తననే సృజించెను' అనుటచేత ఉపాధానకారణమును అని విశదమగుచున్నది గదా. "కల్పయత్యాత్మనాఽఽత్మాన మాత్మా దేవస్స్వమాయయా। సఏవ బుధ్యతే భేదా నితి వేదాంత నిశ్చయః॥ (గౌడపాదకారిక. 2-12.) అలుప్తస్వయంప్రకాశమాన స్వరూపుడగు పరమాత్మస్వకీయ-స్వాధీన - మాయాసాహాయ్యముచేతనే రజ్జువునందు సర్పాదికమునువలె తనయందే వక్ష్యమాణములగు విశ్వతైజస ప్రాజ్ఞాదిభేదములను కల్పించుకొనుచున్నాడు, స్వయముగా తానే వానిని దెలిసికొనుచున్నాడు. ఇది ఉపనిషద్రహస్యము. "యస్సర్వజ్ఞ స్సర్వవిద్యస్య జ్ఞానమయంతపః। తస్మాదేతద్బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే॥" (ముం.ఉ. 1-1-10) ఎవడు సర్వజ్ఞః=సామాన్యముగ సర్వము నెఱింగినవాడో, సర్వవిత్ = విశేషముగా సర్వము నెఱింగినవాడో, యస్య జ్ఞానమయంతపః = ఎవనియొక్క తపస్సు జ్ఞానరూపమైనదో అనగా జ్ఞానవికారమగు సర్వజ్ఞతయే లక్షణముగా గలది కాని ఇతరుల తపస్సువలె ఆయాసలక్షణమైనదికాదో, తస్మాత్ = ఆ సర్వజ్ఞలక్షణ పరబ్రహ్మమువలన నుండి, ఏ తత్ బ్రహ్మ = కార్యరూపమగు హిరణ్యగర్భాఖ్య బ్రహ్మమును, నామ=దేవదత్త యజ్ఞదత్తాది నామములును, రూప = సిత పీతాది రూపములును, అన్నం = (అద్యతే భుజ్యత ఇతి అన్నం' = అనుభవింపబడునది అన్నము) వ్రీహియవాది లక్షణమగు అన్నమును పుట్టుచున్నవి.

యథోర్ణనాభి స్తన్తు నోచ్చరే ద్యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగావ్యుచ్చరన్త్యేవమేవాస్మాదాత్మనః సర్వేప్రాణాః సర్వేలోకాః సర్వేదేవాః సర్వాణి భూతాని వ్యుచ్చరన్తి॥ (బృ.ఉః 2-1-20) సాలెపురుగు తంతువులను తన శరీమునుండి ఏ ప్రకారము బయలువెడలించుచున్నదో, అగ్నివలననుండి అల్పమైన స్ఫులింగములు (అగ్నికణములు) ఏప్రకారముబయలు వెడలునో ఆప్రకారమే ఈ పరబ్రహ్మమువలన నుండి సర్వప్రాణులు సర్వలోకములు సర్వదేవతలు సర్వభూతములు బయలుపడుచున్నవి. "తదేతత్సత్యం। యథాసుదీప్తాత్పావకాద్విస్ఫులింగా స్సహస్రశః ప్రభవన్తే సరూపాః। తథాఽక్షరా ద్వివిధాస్సోమ్యభావాః ప్రజాయంతే తత్రచైవాపియన్తి॥"(ముం.ఉ.2-1-1) ఆ యీ విషయము సత్యము. బాగుగా మండుచున్న అగ్నివలన నుండి అగ్నిసమానమైన రూపములుగల వేలకొలది అగ్నికణములు ఎటుల బయలువెడలుచున్నవో ఆప్రకారమే అక్షరమువలన నుండి ("వర్ణేబ్రహ్మణ్యక్షరం స్యాదితి శేషః॥"అక్షరమన పరబ్రహ్మమునకును, కకారాది వర్ణములకును పేరు) నానావిధ నామరూపకృత దేహోపాధి ప్రభేదముగల తత్సమానరూప జీవులు పుట్టుచున్నారు. ఆయక్షరము

నందే లీనమగుచున్నారు. ''యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతేచ। తథాఽక్షరాత్సంభవతీహ విశ్వం॥'' (ముం. ఉ. 1-1-8) లోకమునందు సాలెపురుగు కించిత్కారణాంతరము నపేక్షింపకయే స్వశరీరముకంటె వ్యతిరిక్తముకాని తంతువులను వెలుపలికి ఎటుల ప్రసరింపజేయుచున్నదో మఱల ఎటుల వానిని తనలోనికి తీసికొనుచున్నదో అనగా వానిని మఱల స్వాత్మభావమును పొందించుచున్నదో ఆ విధముననే ఈ సంసారమండలమునందు విలక్షణము సలక్షణమును అగు ప్రపంచమంతయు నిమిత్తాంతరము నపేక్షింపకయే అక్షరతత్త్వమువలన నుండి యావిర్భవించుచున్నది. ఇట్లు తంతువులకు ఊర్ణనాభమువలె జగత్సృష్టికి అవ్యాకృత పరబ్రహ్మము స్వోపాధి ప్రాధాన్యముచేత ఉపాదానకారణమును, స్వప్రాధాన్యముచేత నిమిత్తకారణమును అగుచున్నదని యుపనిషత్తులన్నియు సిద్ధాంతముచేయుచున్నవి.

ఈయీశ్వరుడు జగత్తు నేప్రకారముగ సృజించెననిన వినుము. పూర్వోక్తావిద్య రజోగుణ ప్రధానమై అనేక ప్రకారములును అనంతమును (మేరలేనిదియు)అయ్యెను. ఆ యవిద్యయందు ప్రతిబింబిత చైతన్యరూపులగు జీవులును అనంతములే. ''అవిద్యాకృత దేహాది సంఘాతే ప్రతిబింబితా చిచ్ఛక్తిర్జీవలోకేఽస్మిన్ జీవ ఇత్యభిధీయతే॥'' (అధ్యాత్మరామాయణము. 1-7-34) అవిద్యాకార్యమైన దేహేంద్రియాది సంఘాతమునందు ప్రతిబింబించిన చిచ్ఛక్తియే అనగా బ్రహ్మచైతన్యమే ఈ జీవలోకమున జీవుడని పేర్కొనబడుచున్నది. జీవుడు అవిద్యావశుడు. ఈ జీవేశ్వరులకు వ్యష్టిరూపమైన అవిద్యయు, సమష్టిరూపమైన మూలప్రకృతి (మాయ)యు క్రమముగ కారణశరీరములు. ఆ రెండు కారణశరీరములయందును జీవేశ్వరులయొక్క అవస్థానము సుషుప్త్యవస్థ. ఆ జీవేశ్వరుల కుభయులకు తమతమ కారణశరీరమే ఆనందమయ కోశము. ఆనంద ప్రచురత్వమువలన ఆనందమయ కోశమనబడును. ''అనాద్యవిద్యా నిర్వాచ్యా కారణోపాధిరుచ్యతే॥'' (ఆత్మబోధ.) అనాదియు అనిర్వచనీయమునగు అవిద్యయే కారణోపాధియని చెప్పబడుచున్నది. ఇదియ కారణ ప్రపంచ సృష్టి.

(సశేషము)

# చిత్ర సమీక్ష

శ్రీ వరలక్ష్మి పిక్చర్ పబ్లిషింగ్ హౌస్‌వారు సమీక్షకొఱకై పంపిన త్రివర్ణ చిత్రపటములు మా కార్యాలయమును జేరినవి. అన్నియు చక్కని కళానైపుణ్యము గలిగి యున్నవి. పూజాగృహములకు పనికిరాగలవు; అందందు ప్రార్థన గీతికలు గూడ అచ్చొత్తింపబడియున్నవి

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ పట్టాభి రామస్వామి | వెల: రూ. | 0 | 6 | 0 |
| శ్రీ సౌభాగ్య వరలక్ష్మి | | 0 | 8 | 0 |
| శ్రీ కంచి కామాక్షి ... | ,, | 0 | 8 | 0 |

ప్రాప్తిస్థానము: శ్రీ వరలక్ష్మి పిక్చర్ పబ్లిషింగ్ హౌస్, 103, ఎమ్. కె. అమ్మన్ కోవిల్ వీధి, మైలాపూరు; మద్రాసు.



# సురజ్‌మల్స్




**313, ఎస్ప్లనేడ్, మద్రాసు.**

8—(S—4)

---

లాల్‌జి గోధు & కంపెనీవారి




మార్కు గమనించి
కొనుడు
మోసపోకుడు

**లాల్‌జి గోధు అండ్ కో**
సౌకార్‌పేట, మదరాస్

(L.G 8-4)

Vol. VIII—4 (October 1951) Sri Ramakrishna Prabha Regd. No. M—465

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసారప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| షికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | | | | ... | 0 | 8 | 0 |
| నాసంస్కరణ యుద్ధవిధానము | | | | ... | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | | | ... | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | 0 | 1 | 0 |
| నవీన భారతదేశము | | | | ... | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | | | | ... | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | | ... | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | | | | ... | 0 | 1 | 0 |
| నా మతము | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎమ్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-10-51.

# శ్రీ రామకృష్ణ ప్రభ

49

౧౯౫౧, నవంబరు—ఖర, కార్తీకము

సంపుటము ౮ సంచిక ౫






శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు

చెన్నపురి

# విషయసూచిక



# శ్రీరామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు దాంచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చి పంపఁబడును. విడిప్రతి రు. ౦—౬—౦ లు. హిగిన్‌బాథమ్స్ వారి స్టాలులలోఁ గాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్యను ఉదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పు కలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములే కాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రా పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునుచో తగు పోస్టేజి చేర్చి పంపవలెను



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౭ } ౧౯౫౧ - నవంబరు : : ఖర - కార్తీకము } సంచిక ౧౧

## ప్రార్థన

ఓం

శ్లో. శాంతాకారం సమాధౌ స్థిత మతులతను

జ్యోతిషా వ్యాప్త దేశం

సిద్ధే పీఠే నిషణ్ణం స్మిత లసిత ముఖం

హర్ష బాష్పాప్లు తాక్షమ్।

చార్వ్యజ్గం స్వర్ణవర్ణం వరద మభయదం

జీవనం సజ్జనానాం

దేవాధీశం భజేఽహం హ్యగణిత గుణినం

భక్తితో రామకృష్ణం ॥



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వర దేవాలయము

మంగళవారము,

16 అక్టోబరు, 1882.

బలరామ్‌బోసు జనకుడు, రాఖాల్, వేణీపాల్, 'మ.', మణిమల్లికు, ఈశానుడు, కిశోరుడు మున్నగువారు వచ్చియుండిరి.

శ్రీరామ:—ఉదారభావము గలవారు సకల దేవతలను నమ్ముదురు. కృష్ణుడు, కాళి, శివుడు, రాముడు! మున్నగువారి నెల్ల——.

బలరాముని తండ్రి:—ఔను, ఒకే భర్త వేరువేరు దుస్తులను ధరించియున్నను భార్య తన భర్తను గురుతుపట్టునట్లు.

శ్రీరామ:—కాని నిష్ఠభక్తి యొకటి గలదు. గోపికలు మధురానగరమును జేరి రాజవేషధారి యయిన శ్రీకృష్ణుని జూచి తలవంచుకొని, 'ఇతడెవరు? పీతాంబరధారి, మయూరఫించ భూషితుడు నగు మా శ్రీకృష్ణుడేడి?' యనిరట. హనుమంతునకుగూడ నిష్ఠభక్తి యుండెను. ద్వాపరయుగమున ద్వారకానగరమునకు ఆయన విజయముచేసినపుడు శ్రీకృష్ణుడు రుక్మిణితో, 'హనుమంతుడు రామరూపమును జూడనిచో సంతృప్తి నందజాలడు' అని పలికి శ్రీరామరూపమును ధరించెనట.

నాకిట్టి దశ కలుగునని ఎవరెఱుగుదురు నాయనా? నేను ఆ శుద్ధబ్రహ్మమునుండి ఆయన లీలాస్థితికి వత్తును. మఱల ఆ లీలారంగము నుండి నిత్యవస్తువునే చేరుదును. నిత్యవస్తువును జేరుటయే బ్రహ్మజ్ఞానము. అది యెంతయు దుర్లభము. సంపూర్ణముగ విషయాసక్తి తొలంగకపోయినచో ఆ వస్తువును చేరజాలము. హిమవంతునియింట భగవతి జనించినపుడు తన తండ్రికి వివిధ దర్శనముల ననుగ్రహించెను. అంతట హిమవంతుడు, 'అమ్మా! నేను బ్రహ్మదర్శనము బడయవలయునని వాంఛించుచున్నా'నని కోరెను. అందులకు భగవతి, 'మీ కట్టి కోరికయే యున్నచో సాధుసంగమము నొనర్పవలయును. సంసారమును త్యజించి ఏకాంతముగ నిర్జనస్థలములయందు సాధుసంగమము నొనరింపవలయు'నని పలికెను. *

ఆ ఏకవస్తువునుండియే వివిధములు కలుగుచున్నవి. ఆనిత్యవస్తువు లీలయే యిది. ఆ ఒక్కవస్తువు స్థితిని బడసినవుడే 'యనేకము'

* దేవీభాగవతము సప్తమస్కంధమునందలి 31, 35, 36-వ అధ్యాయములు.

లదృశ్యములగును. పిదప ఆ యొక్కటియు గూడ మాయమగును. ఏలయన ఒకటియున్నప్పుడే రెండవదియును కలుగ నోపును. ఆ పరబ్రహ్మము ఉపమానరహితమైనది. ఎవరును ఉపమానములచేత బ్రహ్మమును దెలుపజాలరు. అది చీకటికి వెలుతురునకు మధ్య నున్నది. కాని ఆ వెలుతురు మనము జూచుచున్న జడాత్మకమగు వెలుతురు గాదు.† మఱియు ఎపుడు ఆ పరబ్రహ్మము మన అవస్థను మార్చునో అపుడు మన మాయన లీలారంగమునకు దిగివత్తుము. అంతట అదియే (ఆ పరబ్రహ్మమే) భగవానుడు, మాయ, జీవజగత్తులుగ పరిణమించినట్లు గోచరించును. మఱియు ఆ బ్రహ్మమే ఈ సమస్త జీవజగత్తును సృష్టించినట్లు—యజమానుడును వాని తోటవలె—కనుపించును. అతడే కర్త. ఈ జీవజగత్తంతయు ఆయనదే యని తెలిసికొనుటయే జ్ఞానము. నేను కర్తను, తండ్రిని, గురువును అనుకొనుటంతయు నజ్ఞానము. సమస్త గృహము, పరివారము, ధనము ది యనుకొనుట యజ్ఞానము.

బలరాముని తండ్రి:—చిత్తము.

శ్రీరామ:—ఎంతకాలము 'నీవే కర్తవు' అన్న జ్ఞానము కలుగదో అంతకాలము ఈ సంసారమున పరిభ్రమించుచు నుండవలయును. 'నీవే కర్త' వన్న జ్ఞానోదయానంతరము పునర్జన్మ ముండదు. ఎంతవఱకు 'తూంహూ, తూంహూ' అని వచింపరో అంతవఱకు కష్టములే. అంతవఱకును పునర్జన్మము కలుగుచునే యుండును. ముక్తి యుండబోదు. 'నాది, నాది' యనినమాత్ర మేమి ప్రయోజనము. ఒకానొక ధనికుని నిర్వాహకుడు (Manager) 'ఇది నా తోట; ఇదియే నా పట్టెమంచము. ఇదియే నా గృహోపకరణ సందోహము' అని పలుకవచ్చును. కాని యజమాని అతనిని ఉద్యోగమునుండి తొలగించినచో అచటినుండి యొక జాజికాయ పెట్టెను దీసికొనిపోవుటకు గూడ నతని కధికారముండదు. 'నేను, నాది' యన్న భావము ప్రతివస్తువును ఆవరించుకొనియున్నది. అద్వైతజ్ఞానము లేనిచో చైతన్యదర్శనము లభింపదు. చైతన్యదర్శనము లభించిననే నిత్యానందము. పరమహంసావస్థయందే నిత్యానందము ననుభవింపగలము. వేదాంతమతానుసారము అవతారములు లేవు. ఆ మతానుసారము శ్రీకృష్ణచైతన్యులు అద్వైతమునందలి యొకానొక బిందువు. చైతన్యదర్శన మెట్టిదో తెలియునా? అంధకారబంధురమయిన గదియందు హఠాత్తుగా అగ్గిపుల్లను ముట్టించుటవంటిది. భక్తిమార్గానుయాయులే అవతారముల స్వీకరింతురు. ఒకప్పుడు కర్తాభజ సంప్రదాయమునకు జెందినయొక స్త్రీ నా యవస్థనుజూచి 'నీకు వస్తువు లభించినది. కావున ఇంకనీ యాటపాటలను వదలిపెట్టుము. బాగుగా బండిన ద్రాక్షపండ్లను మిక్కిలి జాగరూకతతో ప్రత్తిమీద నుంచవలయును. గర్భవతిగానున్న కోడలి పనులను అత్తగారు తగ్గించివైచును. కొంచెము కొంచెముగా కర్మత్యాగము కలుగుటయే భగవద్దర్శనము బడసినవారి లక్షణము. ఈ మనుష్యునియందు (శ్రీరామకృష్ణులయందు) మనుష్యరత్నమున్నది' అని వచించెను. 'నేను భుజించుచుండగా జూచి 'నాయనా, నీవే

† తత్ జ్యోతిషాం జ్యోతిః, తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః తద్యత్ ఆత్మ విదో విదుః.
—ముండకోపనిషత్తు, 2-2-9.

భుజించుచున్నావా? ఎవరికైన భోజనమిడుచున్నావా?' యని యడిగినది.

నేను అన్న జ్ఞానమే సత్యము నావరించి యున్నది. నరేంద్రుడు "ఈ 'నేను' ఎంత దూరముగా తొలగిపోవునో అంతంతకు భగవానుని నేను దగ్గరింతును" అని పలుకువాడు. 'కుండలో మట్టి ఎంత యెక్కువగా నుండునో నీరు అంత తక్కువగా నుండు'నని కేదారుడు వచించువాడు. శ్రీకృష్ణుడు అర్జునుని జూచి, 'నాయనా, అష్టసిద్ధులలో ఒకటి యున్నను నీవు నన్ను పొందజాలవు' అని పలికెను. ఈ సిద్ధులవలన కొంచెము శక్తి కలుగవచ్చును—వ్యాధి నివారణమువంటి విషయములందు ఇతరులకు సాయము చేయవచ్చును, నిజమేనా?

'అందులకే దేవియొద్ద శుద్ధభక్తిని ప్రార్థించితిని. సిద్ధిని గోరలేదు,' అని పలుకుచు శ్రీరామకృష్ణులు సమాధిగతులైరి. సాధారణస్థితికి వచ్చిన పిదప ఒక పాటను బాడ నారంభించిరి. పాట భావము :

సఖీ! ఎవని ప్రేమ నన్ను పిచ్చిదానినిగా జేసెనో అతనిని కనుగొనజాలకున్నాను.........

తరువాత రామలాలు నొక పాట బాడ గోరిరి. ఆయన గౌరాంగసన్న్యాసమును నెంచి పాడ నారంభించెను. పాట భావము :

ఆహా! కేశవభారతీ కుటీరమున ఎట్టి దివ్య దర్శనము ననుభవించితిని? అసాధ్యమయిన అనుపమజ్యోతి శ్రీ గౌరాంగమూర్తి. ఆయన చక్షుర్ద్వయమునుండి ప్రేమాశ్రువులు శతధారలుగా ప్రవహించెను. శ్రీ గౌరాంగుడు మత్తమాతంగము వలె ప్రేమావేశియై ఆడును, పాడును. క్రిందబడి పొరలాడుచు కన్నీటి కాలువలలో నీదుచు, సింహగర్జనములతో స్వర్గమర్త్యముల భేదింపగల 'హరి హరి' యను శబ్దములతో బిలుచుచు నేడ్చును. మఱియు మిక్కిలి దీనభావముతో బద్ధాంజలియై దాస్యభావముకొఱకై భక్తిని గోరును. ముండితమస్తకుడై, యోగివేషధారియై, భక్తిప్రేమావేశుడై యున్న అతనిజూచి ఎంతటి కఠినహృదయుడు గూడభావచకితుడగును. జీవకోటి దుఃఖముగాంచి దయార్ద్రహృదయుడై సర్వస్వమును త్యజించి భగవత్ప్రేమను వారికి పంచిపెట్టుట కేతెంచెను. అట్టి మహానుభావుడగు గౌరాంగుని చరణదాస్యమును ఆసించి వారి కీర్తనమును నింటింట పాడుచు దిరుగుటయే ప్రేమదాసు వాంఛ.

చైతన్యదేవుని ప్రేమోన్మాదవర్ణనానంతరము శ్రీరామకృష్ణుల యాజ్ఞానుసారము రామలాలు గోపికల ప్రేమోన్మాదావస్థను వివరించు మరియొక పాటను బాడెను.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
24-5-'15.

శ్రీమాన్ . . .

శరీరమున్నంతవఱకు సుఖదుఃఖములు అనుభవించుచునే యుండవలయును—"న వై సశరీరస్య సతః ప్రియాఽప్రియయో రపహతిరస్తి"* ఇది వేదవాక్యము. 'అశరీరం వావసంతం న ప్రియాఽప్రియే స్పృశతః.' అనగా ఈ శరీరమునందే అశరీరియగు నాత్మ కలదు. ఈ ప్రియాప్రియము లెవ్వియు దానిని స్పృశింపజాలవు. ఈ శరీరమే నేను అని తలంచుటవలనగదా సుఖదుఃఖములచే నాక్రమింపబడుచున్నావు! నేను శరీరమునుగాదు, అశరీరియగు నాత్మయే నేను అని తలంచుచు సుఖదుఃఖముల దరి ప ప్రయత్నించుటయే మేలు. ఇందువలన నెన్నియో కష్టములు లాఘవములగుననుటయందు సందియములేదు.

ఈ సంసారమున సమస్తమును చింతాఫలితమే. ఎవ డెట్లు తలంచునో వా డట్లే యగును. సదా శరీరభావమున నుండుటకంటె నపుడపుడయినను అశరీరచింతను అనుసరించిన నెంతయో మేలు చేకూరు నవకాశము కలదు. ఏసుక్రీస్తు "He that has, to him shall be given. He that has not, from him shall be taken even what he has—ఎవనియొద్ద నున్నదో వానికింకను నొసగబడును. ఎవనియొద్ద లేదో వానియొద్ద నున్నదియును తీసికొనబడును" అని పలికియున్నాడు. శ్రీరామకృష్ణులవారుగూడ "ఎల్లప్పుడును 'ఎవడు నాకేమియు లభింపలేదు. నేను పాపిని' అను నిట్టి తలంపులు గలిగియుండునో వాడు నిజముగా పాపియే యగును" అని వచించెడివారు.

కావున నిరాశాహతుడవు కాబోకుము. అందులకు 'నేను భగవన్నామము జపించుచున్నాను. నాకు భయమేల?'—అన్న భావమును కలిగింప బ్రయత్నింపవలయును. ఆయన కృపగలిగిన మన కష్టములన్నియు గట్టెక్కును. 'జయజయ జగదంబ' యని పలుకుచు తాళము వేయుచు ఆమె నామగుణగానము జేయ నారంభింపుము. అట్లు చేసినచో నీకు బలము చేకూరును. ఒకచోట బరుండియున్నచో అట్టే పరుండియుండ మనసు గోలుపును. ఎట్లో ఒకట్లు ఒకమారు కూర్చొకలిగినచో నిక పరుండ నిష్టము పుట్టదు. అపుడు పచార్లుచేయ తలపు గలుగును. అందులకే క్రీస్తు 'ఎవని కున్నదో వాని కింకను నొసగబడును, ఎవనికి లేదో వానియొద్ద నున్నది సయితము తీసికొన

* సశరీరవ్యక్తికి అనగా ఎవనికి శరీరమునం దాత్మబుద్ధి గలదో ఆ వ్యక్తికి ప్రియాప్రియములనుండి- అనగా మంచిచెడ్డలనుండి తప్పించుకొను మార్గము లేదు.

బడును' అని పలికెను. మిక్కిలి ఉత్సా అవసరము. నిరుత్సా ౹తను శ్రీ రామకృష్ణులు ఒప్పుకొనెడివారుకారు. పడికొట్టి తీసికొనెడి భావమును ప్రేమించెడివారు. కావుననే శ్రీ వివేకానందస్వాముల వారు ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత—మున్నగు ప్రచారమును గావించిరి. భయమేమియు లేదు. భగవానుని బిలువుము. ఆయన సమస్తమును చక్కబెట్టును. ఆయనయే మనకు గతి. ఆయనకు మించి యొక నెవరును లేరు. ఆయనయే మనకు మిక్కిలి కావలసినవాడు అను విషయమును దెలిసికొని ఆయనను ప్రార్థించినచో నన్నియు చక్కగా సరిపడును. శరీర మిపుడుండును. మరియొక సమయమున లేకుండును. భగవంతునినీవానినిగా వించుకొనుము. ఆయనయెల్లప్పుడునుండువాడు.

నిరుత్సాహివి కాకుము. నిరంతరము భగవానుని మనస్సున నిలుప బ్రయత్నింపుము. మనస్సునకు చక్కని బలమును చేకూర్చుకొనుము. ఎల్లప్పుడు భగవన్నామస్మరణము చేయుము. ఆయనయే సమస్తమునకును ఆశ్రయస్వరూపుడు. నిన్ను సంపూర్ణముగ ఆయన శ్రీచరణముల కర్పించుకొని నిశ్చింతమై నుండుము. భయాది భావనలు తమంతట తామే మాయమై హృదయమున నవీన బలసంచారము కలుగును. జయ శ్రీ గురుమహారాజునకు జై!

నా శుభేచ్ఛా ఆశీస్సులు,

ఇట్లు,

శ్రీ తురీయానంద



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

# శ్రీ బ్రహ్మానందస్వామి పారమార్థిక ప్రతిభాతిశయము

౨

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ బ్రహ్మానందస్వామి ప్రియశిష్యుడును ప్రస్తుతము అమెరికాదేశమున హాలీవుడ్ నందలి సుప్రసిద్ధ వేదాంత సంఘాధ్యక్షుడును నగు శ్రీ ప్రభవానందస్వామి వెలువరించిన (The Eternal Companion - Brahmananda—His Life and Teachings— బ్రహ్మానంద స్వామి జీవితోపదేశములు అను) గ్రంథమున దొలినుడిలో స్వామి మహత్త్వమునుగూర్చి తెల్పిన విషయములు దివ్యావేశజనకములై యలరారుచున్నవి. ఆతం డిట్లు వ్రాసి యున్నాడు:

"బ్రహ్మజ్ఞానియగు మహనీయుని సందర్శించు నెడ, అత్యద్భుతవిషయము సంఘటిల్లును, కేవల మాతని సాన్నిధ్యమే మాత్ర:

యందలి మహత్త్వమును గుర్తింపఁజేయు నింద్రియాతీతమగు నొకానొక జ్ఞానమును నీ కొసఁగును. మహారాజు (శ్రీ బ్రహ్మానందస్వామి) మాకుఁ దన సన్నిధి లభించినపుడెల్ల నిట్టి జ్ఞానము నొసఁగుచుండువాఁడు. మా మనస్సు సముద్ధరింపఁబడ, నాతని యాంతరిక దివ్యస్వభావము క్షణకాలము మాకు గోచరించెడిది. కాని యీ క్షణికసందర్శనములు అసంపూర్ణములు. స్వయముగా సాక్షాత్కార సంపన్నులగు స్వామిసోదరశిష్యులు స్వామి శిష్యులమగు మాకంటె శతగుణాధికముగా నాతని దివ్యతత్త్వము నరయఁగల్గెడివారనుటకు సందియము లేదు. చెన్నపురి శ్రీరామకృష్ణ మఠ సంస్థాపకుఁడును తదధ్యక్షుఁడునై యొప్పిన శ్రీ రామకృష్ణానందస్వామి బ్రహ్మానందస్వామిని శిష్యులకుఁ బరిచితు నొనర్చుచు నొకప్పుడిట్లు వచించియున్నాఁడు: 'మీలో నెవ్వరును శ్రీ రామకృష్ణునిఁ గాంచకున్నను, ఇపుడు మహారాజును గాంచుచున్నారుకదా? అదియు నిదియు నొక్కటియేయని గ్రహింతురుగాక!' మఱియొకప్పు డొకభక్తుఁడు ఆలయమున శ్రీ రామకృష్ణభగవానున కర్పింపఁగోరుచు నొకఫలమును గైకొని రాఁగా, శ్రీ రామకృష్ణానందుఁ డాతని నా ఫలమును మహారాజున కర్పింపుమని తెలుపుచు, 'దీనిని శ్రీ రామకృష్ణుని కర్పించు టెట్టిదో మహారాజున కర్పించుటయు నట్టిదేసుమీ!' యని వక్కాణించియున్నాఁడు.''

ఒకనాఁడు శ్రీ ప్రభవానందస్వామి మహారాజు తనతోఁ జెప్పిన విషయము నంగీకరింప సంకోచించుచుండెను. అపుడచట నుండిన శ్రీ శివానందస్వామి వెంటనే మహారాజుతో నేకీభవించు టాతని కామోదకరము కాలేదు. పిమ్మట నాతఁ డొంటరిగా శ్రీ శివానందస్వామితోఁ సంభాషించుచు, నాతఁడు మహారాజు చెప్పినదానికెల్లఁ దల యూఁపు వ్యక్తియని తన మనసులోఁ గల యభిప్రాయమును జనవుచే వెల్లడింప, శ్రీ శివానందస్వామి నవ్వుచు నిట్లు పలికెను: ''నాయనా! నీ కేమి తెలియును? నీవు మహారాజును మహారాజుగా మాత్రమే కనుచున్నావు. కాని బాహ్యమున మేము మహారాజురూపమును గాంచుచున్నను, ఆతఁడు అంతరంగమున భగవత్పరిపూర్ణుఁడై వెల్గొందుచుండుట గాంచుచున్నాము. మహారాజు నీ కేమి చెప్పినను, అయ్యది సాక్షాదీశ్వర వాణియని గ్రహింపుము.'' ఇది స్వయముగా బ్రహ్మసాక్షాత్కారము నందిన మహనీయుని— పూజ్యపాదుఁడగు శ్రీ వివేకానందస్వామిచే మహాపురుషుఁడని సంబోధింపఁబడిన ఋషివరేణ్యుని—మహోపదేశముగా గ్రహించి నచో, నెంతటి యమూల్యాభిప్రాయమో తెలియఁగలదు.

మహారా జొకనాఁడు చెన్నపురినుండి వెడలుటకై పంచాంగము చూచి శుభదినము కనుఁగొనుమని శ్రీ ప్రభవానందస్వామితోఁ జెప్ప నాతఁ డటు లొనర్చుచుఁ దనలోఁ దాను నవ్వుకొనుచుండుటయుఁ దన ముసిముసినవ్వుల నాఁపుకొనఁజాలకుండుటయు మహారాజు గమనించి, 'నీ వినోదకారణమే' మని యడుగ నాతఁ డిట్లు పలికెను: ''బాగుగనే యున్నది కానిండు, స్వామీ, మీ రెచటికైనను వెళ్లఁ దలఁచుకొనునపుడెల్ల, ఈ తంతు జరుపుచుందురు; కాని మఱియొకనాఁడు ప్రయాణమగుటకై యకస్మాత్తుగా నిర్ణయించుకొనుచుందురు.'' మహారా జందుల కిట్లు సమాధానించెను: ''కేవలము నా సంకల్పము ననుసరించి

నే నేమైనను జేయుచుందుననియా నీ యభిప్రాయము? నా ప్రయాణమున కేదియో యొకదినము నిర్ణయింప భక్తులు నిక్కచ్చిచేయుచుందురు; నిరంతరమైన యీ పీడ తొలఁగించుకొనుటకై యప్పటికప్పుడు ప్రయాణయోగ్యమైన యొకదినము నిర్ణయించుచుందును. కాని, భగవత్సంకల్పము తెలియనిదే కదలను; ఏ పనియుఁగూడఁ జేయను.''

ప్రభ. : ''అగుచో, సదా భగవత్సంకల్పముచేతనే ప్రేరితులై వర్తించుచుందురనియా మీరు చెప్పెడిమాట?''

మహారాజు : ''ఔను.''

ప్రభ. : ''సరియేకాని, స్వామీ! వాస్తవమరయఁబోయిన, కేవలము నా మనఃప్రవృత్తులను సంకల్పములను అనుసరించుచు వానినీశ్వరసంకల్పమున కారోపించుచు నేనును ఈశ్వరసంకల్పానుసారము వర్తించుచుంటి ననుకొనవచ్చును. ఇదియే కాదా మీరు చేయునది?''

మహారాజు : ''కాదు, నాయనా! అది కాదు.''

ప్రభ. : ''అగుచో, మీరు ప్రత్యక్షముగా భగవంతుని దర్శించి వానితో సంభాషించి వాని సంకల్పమును దెలిసికొనుచుందురన్న మాట.''

మహారాజు : ''ఔను, ప్రత్యక్షముగా వాని సంకల్పము దెలిసికొనుపర్యంతము వేచియుందును; నా కర్తవ్యమును భగవంతుఁడు నాకుఁ జెప్పును.''

ప్రభ. : ''మీరు చేయు ప్రతికార్యమునను గూడనా?''

మహారాజు : ''ఔను, నేఁ జేయు ప్రతి కార్యమునను ప్రత్యక్షముగా భగవత్ప్రేరణ పొందుచుందును.''

ప్రభ. : ''మఱి మీ రెవరిని శిష్యులుగా స్వీకరింప భగవంతుఁడు మీకుఁ దెల్పునో వారినిమాత్రమే స్వీకరించుచుందురా?''

మహారాజు : ''ఔను.''

మహారాజుతో ఈ సంభాషణానంతరము శ్రీ ప్రభవానందస్వామి కాతని విచిత్రవర్తన విధానమునకు అర్థము గోచరింపసాగెను. శిష్యులలో నెవ్వరైనను ఏదేని ముఖ్యవిషయమును గూర్చి మహారాజు నాదేశమునుగాని హితోపదేశమునుగాని యర్థించునెడ నాతఁడు, ''ఉండుము. నేఁడు నా ఆలోచనాశక్తి పాఱుట లేదు'' అనియో, ''నాకు అజీర్తిచేసినది, రేపు సమాధానింతును లెమ్ము'' అనియో చెప్పును. ఒకొక్కప్పుడు శిష్యుఁడు ఇదమిత్థమైన సమాధానము నొందుటకుముం దెన్నియో 'రేపులు' గడచెడివి. కాని స్వయముగా ఈశ్వరవాణి నాలకించి తుదకు మహారాజు సమాధానించునపు డా వాక్కు లమోఘములై యొప్పెడివనుట ఆశ్చర్యము కానేరదు.

# గోపాల్ మా

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

శ్లో. యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మాను వర్తన్తే
మనుష్యాః పార్థ సర్వశః॥ —భ. గీ.

ఈశ్వర సాక్షాత్కారము లేక మోక్షము సంపాదింపవలెనన్న దానికెన్నియో మార్గములు. ఇదమిద్ధమనరాదు. మనఃపూర్వకముగ నేమార్గము ననుగమించినను గమ్యస్థానమును జేరగలము. శ్రీకృష్ణపరమాత్మ గీతలో నర్జునున కుపదేశించినటుల నేప్రకారముగ నెవరు తన్ను ఆరాధించుచున్నారో, తాను వారల నాలాగుననే యనుగ్రహించును. ఈ కాలమున మోక్షప్రాప్తికి భక్తిమార్గము తగినది. సగుణోపాసన ముక్తిమార్గమునకు జక్కని రాజబాట.

శ్రీరామకృష్ణులిటుల జెప్పువారు: "మొదట భక్తిని సంపాదించినచో మిగిలినవన్నియు నీకు దేలికగ జేకూరును. భక్తి యనునది భక్తుని చేతి త్రాటివంటిది. ఈ పాశము ఈశ్వరుని (సచ్చిదానందమును) భక్తునియందు బంధించును. కాని, ప్రేమభక్తి మానవునకు దేవునకు మధ్య నెటుల వృద్ధియగుననిన, నిరువురకు నొక సంబంధము నేర్పాటుచేసికొనుటచేతనే. శాస్త్రములు, భక్తియోగమునందు భక్తునకు నీశ్వరునకు వివిధములగు సంబంధములు చెప్పుచున్నవి. వైష్ణవ ప్రపత్తియందు శాంత, దాస్య, సఖ్య వాత్సల్య, మధురభావముల, నేవిధమగు భక్తి మార్గముచేనైన, నీ సంబంధమును బెంపొందింపవచ్చునని చెప్పబడియున్నది. యోగమున, యోగులకు దేవతాదర్శనములు ప్రత్యక్షములే కాని కలలు గావు. శ్రీమద్భాగవతమున యశోదాదేవి, గోపీనందనుని దన బ్రహ్మ గోపాలునిగ వాత్సల్యభావమున నారాధించి, కైవల్యమును గాంచుట మనకు తెలిసిన విషయమే. రామలాలు లేక రఘునందనుని వాత్సల్యభావమున నారాధించి, శ్రీరామకృష్ణుల కృపచే జటధారి యనునతడు తరియించిన విషయము రామకృష్ణ లీలామృతమున గాంతుము. మనకు ప్రత్యక్ష ప్రమాణముగ, "గోపాలుని తల్లి" యను పౌరుష నామమును బొందిన అఘోరమణిదేవి, వాత్సల్యభావమున "బాలగోపాలు" నుపాసించి, శ్రీరామకృష్ణుల మూర్తియందు సారూప్య భావమును గాంచుచు, పరాప్రేమభక్తిపారవశ్యముచే లభించిన యోగసిద్ధియు, నామె జీవితఘట్టములందు యుగావతారుడగు పరమహంసదేవులు మన కండ్లముందర సత్యద్భుతముగ నటించిన బాలగోపాల లీలాదర్శనములును నతిరమణీయములు.

అఘోరమణీదేవి పూర్వాచారపరాయణమగు బ్రాహ్మణకుటుంబమున బుట్టినది. చిన్ననాటనే వివాహమైనది. వివాహిత కాగనే భర్తృవియోగము సంభవించెను. కావున, నామె సోదరుడగు నీలమాధవముఖోపాధ్యాయుని యింటియొద్ద నివసించుచుండెను. ఈతడు కలకత్తాయొద్ద పటోల్‌డంగా నివాసియగు గోవిందచంద్రదత్తునకు బురోహితుడు. దత్తునకు దక్షిణేశ్వరమునకు మూడుమైళ్లదూరమున నున్న కమర్‌హాటి గ్రామమున గంగయొడ్డున రాధాగోవిందుని దేవాలయము గలదు. దత్తుగూడ త్వరలోనే చనిపోయెను. దత్తు భార్య గొప్ప భక్తురాలు. ఆమెకు నఘోరమణికిని స్నేహము. అందువలన నిద్దరు నా దేవాలయముననే నివసింప నారంభించిరి. ఈ దేవాలయ స్థలముననే, అఘోరమణి యొకగదిలో తానొక్కతెయే కాలక్షేపము జేయుచు, ప్రశాంతి ననుభవించుచు, గంగను జూచి యానందించుచు, రేయింబవళులు తన యిష్టదేవతారాధనతో గాలము పుచ్చెడిది. ఆమె వైష్ణవ ప్రపత్తి గల బ్రాహ్మణ కుటుంబమునం బుట్టి, వైష్ణవ గురువువలన బాలకృష్ణోపదేశమును బొంది, యీ యిష్టదేవుని దన బిడ్డనిగా నారాధించుచుండెడిది. ఇట్లు ముప్పది సంవత్సరములు తన యిష్టదైవమగు బాలగోపాలము నుపాసించుచుండెను.

ఇంతలో దక్షిణేశ్వరమునందున్న శ్రీరామకృష్ణుల పేరు ప్రతిష్ఠలు చాలదూరము వ్యాపించి, అఘోరమణి చెవికి నీ విషయము వినబడగనే యామెయు, గోవిందబాబు భార్యయు శ్రీరామకృష్ణుల దర్శనమునకై దక్షిణేశ్వరమునకు వెళ్లిరి (1884). శ్రీరామకృష్ణులు వీరినిజూచి, చూడగనే, పరిచితులుగ వారిని గ్రహించి, వారిని తనగదిలోనికి దోడ్కొనివెళ్లి, భక్తి లేక ప్రేమయే యీ జీవితమునకు బరమావధి యని చెప్పి, భక్తిపురస్సరమగు కొన్ని కీర్తనలను బాడెను. అంత వారు శ్రీరామకృష్ణుల సెలవు గైకొన, పరమహంసదేవులు మామూలు ధోరణిగ, "మరచిపోక, మళ్లీ వస్తారుగదా" యనిరి. వీరును శ్రీరామకృష్ణులను తమ దేవాలయోద్యానమునకు రా వేడుకొనిరి. రామకృష్ణులా దినమున వారిద్వరగూర్చియు, వారి నిరాడంబర భక్తినిగూర్చియు, అఘోరమణిదేవికి బాలకృష్ణునందు గల ప్రేమనుగూర్చియు విస్తారముగ బ్రశంసించిరి.

ఈ ప్రథమ సందర్శనమున శ్రీరామకృష్ణులయందు గోపాలుడున్నాడనిగాని, వీరలకు బరస్పరమగు గాఢమైన ప్రేమానురాగ సంస్కారములుండియున్నవనిగాని గోపాల్ మా యనుకొనలేదు. ఆ కలిసిన దినమునుండియు అఘోరమణిదేవి మనస్సు శ్రీరామకృష్ణులచే దీవ్రముగ నాకర్షింపబడుచునే యున్నది. శ్రీరామకృష్ణులు చాలమంచివారు. నిజమగు భక్తులు, తిరిగి వారిని సందర్శింప బ్రయత్నింపవలెనని మాత్రమే యామె యనుకొనెను. అచిరకాలముననే, యొకనాడు ధ్యానముచేయుచుండ, దక్షిణేశ్వరము పోయి యా రామకృష్ణులను సందర్శింపవలెనని గాఢమగు వాంఛ యామెకు గలిగెను. ఈ దివ్యోన్మత్తుడగు పురుషునిఁ జూడక యెట్లుండగలదు! వెంటనే యచ్చట దొరకెడి నిలువమిఠాయినే కొని, యొక్కతెయే దక్షిణేశ్వరమునకు వెళ్లెను. ఆమె రాకను జూచుచుండగనే శ్రీరామకృష్ణులు, "ఓ! మీరు వచ్చినారా! నాకు దెచ్చినది నాకు బెట్టుడ"నియె. ఆమె కేమిచేయుటకు దోచ

లేదు. ఆ నిలువ మిఠాయి వారికెటుల యిచ్చుట ! ప్రతిదినము నెందరో రామకృష్ణులకు మంచి మంచి పదార్థము లిచ్చెదరే! రామకృష్ణు లెటువంటి సాధువయ్యా; ఆమె రాగనే తనకు దినుట కేమైన బెట్టుమనినాడు. అనుమానించుచు, సనుమానించుచు భయము తోడను, లజ్జతోను దాను దెచ్చినవానిని వారికి సమర్పణచేసెను. దానిని రామకృష్ణులు పిల్లవానివలె నతిసంతోషముగ, నాప్యాయముతో దినవారంభించెను.

''బజారులో, నీ వస్తువులు కొని డబ్బు నష్లెందులకు ఖర్చుచేసెదవు. నీవు లస్కోరా వుండలను జేసి యొకటో రెండో నాకు దీసికొని రమ్ము. లేదా, నీవు వండిన శాకపాకములను గొలదిగ నాకు దీసికొనిరమ్ము. నీవు పచనము జేయు పదార్థములను దినుటయందు నా కెక్కువ ప్రీతి'' యని రామకృష్ణు లామెతో పలికిరి. శ్రీరామకృష్ణు లటుల బసిబిడ్డని చందాన, నిదికావలె, నదికావలెనని, యఘోర మణిదేవిని జికాకుచేయ, గోపాల్ మా 'రామకృష్ణు లిదేమి సాధువయ్యా! దేవునిగూర్చి మాటలాడక తిండో, తిండో యను వాంఛతో నా వెనుకబడినారు. నేను దరిద్రురాలను. ఎటుల నెచ్చియియ్యగలను? సరియే ఇక నేను రానే రాను'అని యిలుసేర నెంచెను. కాని రామకృష్ణుల వైపునకు ప్రేమపాశము లామెను లాగుచునే యున్నవి. ఇంటికివెళ్ల బోవును గాని, యామె కాళ్లు వెనుకకు లాగుచునే యున్నవి. ఎటులనో యిలుసేరెను. తిరిగి త్వరలో నామె యొక కూరను వండి దొప్పలో పెట్టుకొని మూడు మైళ్లు నడిచి దక్షిణేశ్వరము చేరెను. ఎప్పటి వలెనే రామకృష్ణు లామె నా పదార్థమును దనకిమ్మని వేడుకొని, యమిత సంతోషము పొంది, దాని నారగించెను. ఇటుల నేదియో యొకటి వారి కామె తీసికొని వెళ్లుటయు, రామకృష్ణు లెప్పటి కప్పుడే యొక క్రొత్త పురమాయింపు నామెను తీసికొని రమ్మనుటయు మామూలైపోయినది. శ్రీరామకృష్ణుల పోకడ లామెకెంతయు చీకాకుగనుండి, యొకనాడు తన యిష్టదేవున కిట్లు విన్నవించెను: ''ఇదేమి గోపాలా! నేను నిన్ననుక్షణము స్మరించుకొనుచుండుటచేతనా, యేదో యొకటి తినుటకై ప్రాకులాడు సాధువుదగ్గరకు రమ్మని ప్రోద్బలము చేయుచుంటివి? అతనియొద్దకు నే నెన్నడును రాను.'' ఇటులనుకొననే గాని యామెకు రామకృష్ణులయెడ ననివార్యమగు, చెప్పరాని యనురాగము తనలో బనిజేయుచునే యుండెను. వారికి దూరముగాగనే, రామకృష్ణుల దర్శనమునకు వెళ్లవలెనను ధ్యాస యామెను బీడించుచునే యుండెడిది.

ఇంతలో రామకృష్ణు లఘోరమణిదేవి నివసించు కమరహాతి దేవళమును జూచుటకు వెళ్లెను. ఆ దేవతావిగ్రహముయొద్ద జరుగుచున్న నిత్యసేవలజూచి, వానిని ప్రశంసించుచు, దానుగూడ నచ్చట భజనకీర్తనలను బాడి, భోజనముచేసి, దక్షిణేశ్వరమునకు దిరిగివచ్చెను. ఆ కీర్తనలను వినినవారందరు ఆ శ్రావ్యతను గ్రోలుచు, శ్రీరామకృష్ణులు తరచు తన్మయులై యుండుటను గాంచుచు నానంద పరవశులైరి.

అఘోరమణి రాత్రి రెండుగంటలకు లేచి, యుదయ మెనిమిది తొమ్మిది గంటలవరకు జపమాలను ద్రిప్పును. జపమునుండి లేచి, దేవాలయపు బని పూర్తిచేసికొనిన పిమ్మట, వంట చేసి దానిని దేవునికి నివేదనచేసి, యా ప్రసాదమును దాను పుచ్చుకొని, కొంచెము నెమ్మ

దించెడిది. తిరిగి లేవగనే, సాయంకాలము వరకు జపముచేసికొని, సాయంకాలము దేవతా రాధనచేసి తిరిగి జాలరాత్రివరకు జపము జేసెడిది.

1885-వ సంవత్సరము వసంతఋతువున నొక రాత్రి మూడుగంటలవేళ, జపముచేసికొని యా జప ఫలితమును కృష్ణార్పణము జేయుచుండ, నామె యులికిపడ, నామె యెడమప్రక్కను శ్రీరామకృష్ణులు తన కుడి గుప్పిలిని ముడిచి కొని కూర్చొనియుండునట్లు దర్శనమైనది. ఆమె దక్షిణేశ్వరమునందు వారిని జూచినంత స్పష్ట ముగ, జీవకళతో ప్రత్యక్షముగ నామెకు ద్యోతకమయ్యెను. రామకృష్ణు లా వేళగాని వేళ నచటకు వచ్చుట కెటుల వీలుచిక్కినదియు నామెకు దెలియకుండెను. ఆమెను జూచుచు రామకృష్ణులు ముసి ముసి నవ్వుల నవ్వుచుండ నామె విస్మయపడుచుండెను. కొంతవరకు గుండె ధైర్యము తెచ్చుకొని, రామకృష్ణుల చేతి నామె బట్టుకొనబోయెను. కాని యా రూప మదృశ్యమై, పదినెలల పాపడు వారినుండి యావిర్భవించుటను గాంచెను. ఆ పాపడు నిజముగఁ దన గోపాలుడే! ఆతడు తన మోకాళ్లు, చేతులపై నెగబ్రాకుకొనుచు, నామెవంకకు వచ్చి, యొక చేతినెత్తి, యామెను తేరపారిచూచుచు, వచ్చియు రాని మాటలతో "నమ్మా! నాకు మీగడ పెట్టవా" యని యడుగ నారంభించెను. ఆ నిర్జన యేకాంతవాసమున నామె యెలుగెత్తి బిగ్గరగ కేకలువేయ నారంభించెను. ఆ సంభ్రమోల్లాసముచే మైమరచిన యామె స్థితి నూహించుటకంటె, నా వర్ణనాతీతమగు సన్నివేశము కొంతగ నామె చెప్పినది తెలిసికొనుటయే మంచిది. ఆమె యిట్లు ఏడ్వ నారంభించెను, "నా ముద్దుల చిన్నా! నేను బీద దానను. నీకు వెన్న, మీగడల నెచ్చటనుండి తెచ్చి పెట్టగలను." కాని యింతగ గోపాలు డామె మొరలకు సమాధానపడడుగదా! ఆత డామెను మరల మరల నేమైనఁ బెట్టుమని యడుగుచు నేయుండెను. ఏమి చేయగలదు. ఏడ్చుచు నామె దగ్గర గట్టిపడ్డిపోయియున్న కొబ్బరి నౌజుటుండలను దెచ్చి, యాతని కారగింపుజేయుచు, "నేనింత దరిద్రపు వస్తువును నీకిచ్చుచున్నాను. నాకట్టివానిని నీవియ్యతగదు సుమీ" యనియె. అంత గోపాలుడు తృప్తి పొందెను. ఆమె జపమునకు దిరిగి కూర్చొనబోయెను. కాని తన గోపాలు డది సాగనీయడే. ఆమె తొడలపై గూర్చొనును; తావళమును లాగికొనును; భుజములపై కెక్కును; ఆమెతో నాటలాడును; గదియంతయు ప్రాకుచుండును. తెల్లవారగనే అఘోరమణిదేవి పిచ్చిదానివలె దక్షిణేశ్వరమునకుఁ బోయెను. గోపాలు డామె భుజముపై తలపెట్టుకొని వెంటబడెను. ఆ గోపాలుని లేత కెంజాయరంగుగల చిన్ని పాదము లామె వక్షస్థలమున విస్పష్టముగ వ్రేలాడ, నామె యాతని తన రొమ్ముల గట్టిగ హత్తుకొనెను. భక్తులతో నీశ్వరు డీవిధముగనే విహరించును.

దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణుల సన్నిధి జేరియు, జేరకుండగనే, యఘోరమణిదేవి, "గోపాలా, గోపాలా" యని వెఱ్ఱికేకలు వేయుచుండెను. ఎవరి కేకలా యని, శ్రీరామకృష్ణుల గది నూడ్చుచున్న గోలప్మా, పరిచితమగు ఆ కంఠధ్వనిని వినగా నామె తన యఘోరమణియే. ఆమె జుట్టు విడిపోయి, తేలుచూపుల జూచుచు, చీరకొంగు జీరాడుచుండెను. తన శరీరమును, ప్రపంచమును మరచి కేవల నిర్జీవముగనుండి, తూర్పు గుమ్మ

మున శ్రీరామకృష్ణులుండు గదిలో ప్రవేశించెను. ఇదంతయుజూచి గోలప్ మా నిర్ఘాంత పోయెను. శ్రీరామకృష్ణులు తన చిన్నమంచముపై కూర్చొనియుండిరి. ఇంతలో శ్రీరామకృష్ణులు పరవశులైరి. అఘోరమణి వారిచెంత జేరి కూర్చొనెను. వెంటనే, రామకృష్ణులొక బిడ్డనివలె నామె తొడలపై గూర్చొనెను. ఆమె కంటినుండి యానందబాష్పము లపరిమితముగ గారజొచ్చెను. ఆమె తెచ్చిన వెన్న, మీగడ, భక్ష్యములను, నతడే గోపాలుడను భావముతో దినిపించుచుండెను. ఇదివరలో నెన్నడో, తన గురువగు భైరవీ బ్రాహ్మణి తాను యశోదాదేవియందలి భావదీప్తినుండ, గురుదేవు లామె తొడలపై గోపబాలునివలె గూర్చొనియుండుట వినికిడి. కొంతసేపటికి శ్రీ రామకృష్ణులు మామూలు స్థాయిలోకి వచ్చి తమ యాసనమును జేరుకొనిరి. కాని, యఘోరమణికి శరీర స్మృతి రాలేదు. ఆ యానందపారవశ్యమున వెఱ్ఱిదానివలె నాట్యముజేయ నారంభించెను. ఆమె తన గోపాలుడు రామకృష్ణులయందు లీనమగుట, తిరిగి వారి శరీరమునుండి బయటకు వచ్చుట, తన చేతులలోనే యున్నాడనుకొనుట, యామెతో నాటలాడుట తాను గాంచుచుండెను. ఆమె రామకృష్ణులతో వినియు వినబడని మాటలతో నిట్లనియె : "ఇడిగో నా తొడలపై గోపాలుడు, తిరిగి నీలోనుండి వచ్చుచున్నాడు. ఓ గోపాలా! దుఃఖితయగు నీ తల్లి యొద్దకు రమ్ము." ఇదంతయు మందహాసముతో రామకృష్ణులు జూచుచుండెను. "అఘోరమణి గోపాలుని చేష్టలను నటించుచు, నా యానందములో మునిగియున్నది గోపాలలోకమున నామె మనస్సు విహరించుచున్న"దని రామకృష్ణులు గోలప్‌మాతో ననియెను.

ఆమె ఆ దివ్యానందమున నుండ, శ్రీరామకృష్ణు లామె యుపశాంతికై, తనచేతితో నామె వక్షము నిమురుచు, నా గదిలోని భక్ష్యముల నామెకు బెట్టి, యామె యద్వితీయమగు ననుభూతిని అభినందించిరి. ఈ భక్ష్యములను దినుచుండిన, నామె యింకను నానందముతో బరవశయై యిట్లనుచుండెను : "నా ప్రియమైన గోపాలా! నీ తల్లి యీ లోకమునందు బహుకష్టజీవి. ఆమె నూలువడకి బ్రదుకవలసి వచ్చినది. అందులకేనా నీవింత ముద్దుగ నుంటివి." నాటినుండియు, నఘోరమణి దేవికి గోపాలుని తల్లి లేక గోపాల్‌మా యనునది వ్యావహారిక బిరుదైనది. ఆమెయు, నంతట నుండి శ్రీరామకృష్ణులను దన బాలకృష్ణునిగనే గ్రహించెను.

గోపాల్‌మా చే స్నానము చేయించి, భోజనమిడి, యా దినమంతయు దక్షిణేశ్వరముననే నుంచి, సాయంకాలమా మెను శ్రీరామకృష్ణులు కమర్హాటికి దిరిగి పంపివైచిరి. త్రోవ పొడుగున స్పష్టముగా నామెకు ద్యోతకుడైన బాలగోపాలుడు తనచేతులపైననే హత్తుకొనగ, తనతోడనే తిరిగి వచ్చెను. రాత్రి తన జపమును జేయుటకు గూర్చొనెను. కాని, గోపబాలుడు తావళమును త్రిప్పకుండ, నామెజపము సాగకుండ నవరోధములు గల్పించుచునే యుండెను. ఇంక నామె కుపాసన లెందుకు. ఆమె జీవితమంతయు నెవనికొరకు దపస్సుచేయుచుండెనో, యా స్వరూప మామె కట్టెదుట దాండవించుచుండెగదా! అంత లేచి, గోపాలుని దనపక్కలో పెట్టుకొని పరుండ[illegible]యెను. కాని తన ప్రక్క గట్టిగ నున్నదనియు, దలగడ లేదనియు గోపాలుడు మూలుగ నారంభించెను. ఆమె గోపాలుని దగ్గరకు దీసికొని యాతని

చిన్నతలను దనచేతిపై బెట్టుకొని, "నాబాలా! యీరాత్రి కీట్లు గడపుము. రేపు నీకు మెత్తని తలగడను కలకత్తానుండి తెచ్చెద" నని యాతని నూరుకొనబెట్టెను. మరునాడు గోపాలుని వంటకు ఆమె యెండుకట్టెలకై వెళ్లెను. గోపాలుడు నామెతో వెళ్లి యామెకు సాయపడెను. అంత నామె వంట ప్రారంభింపగా, నా పెంకివాడామెతో దమాషాలు చేయుచుండెను. ఆమె గోపాలుని నొకప్పుడు ముద్దులాడుచు, నొకప్పుడు తన స్తన్యమిడుచు, మరియొకప్పుడు గద్దించుచుండెను. శ్రీరామకృష్ణులు అప్పటికి అరువది సంవత్సరముల వయస్సు మీరిన గోపాల్‌మా యనుభవములు మనోవికారములు కావనియు, నవన్నియు యథార్థము లనియు శిష్యులతో జెప్పిరి.

ఈ యనుభూతి నొందుటచే గోపాల్‌మా తరచుగా దక్షిణేశ్వరము వెళ్లుచుండెను. ఆహార విషయముల, శుభ్రత విషయముల నామె కదివరకు గల విపరీతమగు ఛాందసము తగ్గినది. పూర్వాచార పద్ధతు లామె కసాధ్యములైనవి. ఆమెకు గోపాలుడే ప్రత్యక్ష గురువు. ఆ దివ్యబాలుడు చీటికి మాటికిఁ దిను నిచ్చు; అడపదడప ఆ హారములో గొంత నామెకు నోటిలో బెట్టెడివాడు. దాని నామె యెటుల వద్దనగలదు? వద్దన్న గోపాలు డేడ్చునే! ఇంతేకాక యిదంతయు రామకృష్ణుల పనియనియు, దన గోపాలుడు నిశ్చయముగ నాయనయే యనియు నమ్మిక కల్గి, శ్రీరామకృష్ణులు ముట్టిన యాహారము నామె పుచ్చుకొనుట కెట్టి శంకయు పడకుండెను. చాల సంవత్సరములుగ సునిశ్చలమగు సాధన చే, గోపాలుని తల్లికి తన పరమావధి సిద్ధించినది. గోపాలునియెడ నామెకు గల యభినివేశమువలన భగవంతు డీ రూపమును వాస్తవముగ ధరించి రా, నామె బాలకృష్ణునితో ప్రత్యక్షముగ జీవితమును గడపుచు, సంచరించుచు, నిరువదినాలుగు గంటలు నా తన్మయావస్థలో నుండెడిది. గోపాలు డొక్క క్షణమైన నామెను వదలియుండలేదు. అట్టి దివ్య దర్శన మదృష్టవంతులగు కొందరికి మాత్రమే లభింపగలదు.

(సశేషము)



కూజాను నిండుగా నింపి ఉట్టిమీద బెట్టియుంచుము. కొలది దినములలో నీరంతయు ఇగిరిపోవును. కాని దానినే నీటిలో నుంచితివేని, అటు లచట నున్నంతకాలము నిండుగనే యుండును. నీ భగవద్భక్తి విషయముకూడ నిట్టిదే. కొంతకాలము భక్తిసాధనచేసి, పిమ్మట ఆ విషయమే మఱచి, యితర వ్యవహారములలో దిగినపక్షమున నీ హృదయమందలి భక్తిరసమంతయు హరించిపోవును. కాని నీ యానందమయ హృదయమును పవిత్ర భక్తివిశ్వాసము లను నమృతసాగరమున సదా ముంచియుంచితివేని వానితో నెప్పుడును పరిపూర్ణమై యొప్పుచుండును.

—శ్రీ రామకృష్ణ పరమహంస

# శ్రీ వాసుదేవ మననము

## ప్రథమ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

అటుతరువాత సూక్ష్మప్రపంచసృష్టి చెప్పబడుచున్నది. ''సోఽకామయత, బహుస్యాంప్రజాయేయేతి॥'' (తై. ఉ. 2-6-3) సః=ఆ బ్రహ్మము, బహుస్యాం = దేవ తిర్యఙ్నరాది నానావిధ రూపములుగా నగుదును. ప్రజాయేయ = అందుకొఱకు పాంచభౌతిక రూపములుగానగుదును. ఇతి అకామయత = అని కోరెను. ''తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి॥'' (ఛాం. ఉ. 6-2-3) బహుస్యాం=ప్రకృతి మహదహంకార పంచతన్మాత్ర పంచమహాభూతైకాదశేంద్రియ రూపములగు ఇరువదినాలుగు అచిత్తత్త్వములును, ఇరువదియైదవ తత్త్వమగు చిత్తునుగల ఈ యుభయ మిళితమైన జగద్రూపమగు వ్యష్టి సృష్టిగా నయ్యెదను. ప్రజాయేయ=పై వ్యష్టి సృష్టికి సాధనములుగ ఆకాశాది పంచభూత రూపమగు సమష్టి రూపమైన సృష్టిగా నయ్యెదను. ఇతి తత్ ఐక్షత=తత్ సత్ ఐక్షత ఈక్షాం, దర్శనం, కృతవత్=అని యా పరబ్రహ్మము ఈక్షణము జేసెను. 'బహుస్యాం' అనుటవలన విచిత్రానంత చిదచిన్మిశ్రవ్యష్టి జగద్రూపముగ వ్యష్టి సృష్టియు, 'ప్రజాయేయ' అనుటవలన భూజలాది పంచభూతరూప సమష్టి సృష్టియు వివక్షితమని సూచితము. 'అకామయత' 'ఐక్షత' అనెడి కథనమువలన, రజ్జ్వాదికము భ్రాంతిచేత సర్పాద్యాకారమున గ్రహింపబడిన విధమున నాత్మయే స్వాజ్ఞాన మూలమున ననేకమైన ద్వైతభేదమున గ్రహింపబడుచున్నదని గ్రాహ్యము; అనునిత్యాది శ్రుతులు ప్రమాణముగ ఈశ్వరుని యొక్క ఈక్షణ వశమువలన తమోగుణరూపమైన ప్రకృతి, ఆవరణశక్తివిక్షేపశక్తియని రెండు విధములయ్యెను. ''విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్సృజేత్। అవృణోత్య పరాశక్తిస్సా సంసారస్య కారణం॥'' (సరస్వతీరహస్య.ఉ.) విక్షేపశక్తి లింగశరీరము మొదలుకొని బ్రహ్మాండాంతమైన సకల ప్రపంచమును సృజించెను. రెండవదియగు ఆవరణశక్తి అంధకారమువలె నావరించును. ఈ యావరణశక్తియే సంసారమునకు మూలకారణము' అనెడి శ్రుత్యుక్తముగ ఆ రెండు శక్తులలోను విక్షేపశక్తియే, శబ్దమే గుణముగాగల సూక్ష్మాకాశమయ్యెను. అనగా తమోగుణ ప్రధానమగు మూల ప్రకృతిచే నావరింపబడియున్న పరబ్రహ్మము నుండి యాకాశము అనగా ఆకాశ నామరూపములు గలిగెను. అభివ్యక్తములయ్యెను. ఆ యాకాశ నామరూపములచే నావరింపపడిన బ్రహ్మమునుండి స్పర్శయే గుణముగాగలవాయువును, వాయువుచే నావరింపబడిన చైతన్యమునుండి రూపమే గుణముగాగల యగ్నియు, అగ్నిచే నావరింపబడిన బ్రహ్మమునుండి రసమే గుణముగాగల జలమును, జలముచే నావరింపబడిన చైతన్యమునుండి గంధమే గుణముగాగల పృథివియు జనించెను. జనించుట యనగా నంతకు బూర్వము ప్రకాశములై యున్న నామ

రూపము లభివ్యక్తములగుటయే. ఈ యర్థము, "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః। ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ॥" (తై. ఉ. 2-1) అనెడి శ్రుతివచనమువలన విశదమగును. ఈ పంచ భూతములకు సూక్ష్మభూతములు, అపంచీకృతములు, తన్మాత్రలు నని నామాంతరములు. ఈ పంచభూతములకును సత్త్వరజస్తమోగుణములు కారణమగు అజ్ఞానమువలన నాగతములై యున్నవి. ఈ పంచసూక్ష్మ భూతముల యొక్క ప్రత్యేకసత్త్వ గుణాంశమువలన, దిగ్వాతార్కవరుణాశ్వినేయ రూపాధిష్ఠాన దేవతా సమన్వితములైన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లనియెడి జ్ఞానేంద్రియములైదును క్రమముగ జనించినవి. ఈ పంచ సూక్ష్మ భూతములయొక్క సత్త్వగుణ సమష్టి చేత అంతఃకరణము జనించెను. అది చంద్ర వాచస్పతి రుద్రక్షేత్రజ్ఞ రూపాధిష్ఠాన దేవతా యుక్తమైన మనోబుద్ధ్యహంకార చిత్తములని, సంశయ-నిశ్చయ-అభిమాన-ధారణ లనియెడి వృత్తిభేదముచేత చతుర్విధములు. వానిలో మనస్సునందు చిత్తమునకును, బుద్ధియందహంకారమునకును అంతర్భావము. ఇట్లే ఆకాశాది పంచసూక్ష్మ భూతములయొక్క ప్రత్యేక రజోగుణాంశమువలన వహ్నీంద్రోపేంద్ర మృత్యు ప్రజాపతి రూపాధిష్ఠాన దేవతా సమేతములైన వాక్పాణి పాదపాయూపస్థలనియెడి కర్మేంద్రియము లైదును క్రమముగ జనించినవి. ఈ పంచసూక్ష్మభూతములయొక్క రజోగుణసమష్టిచేత ప్రాణము జనించెను. అది విశిష్ట విశ్వస్రష్ట విశ్వయోని అజ జయరూపాధిష్ఠాన దేవతాఉపేతమైన ప్రాణాపానవ్యానోదాన సమానములని, ఉచ్ఛ్వాస-నిశ్వాస-బలదాన-ఉద్గమన-అన్న పచనములనియెడి వృత్తిభేదము చేత నైదువిధములు. "పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితం। అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనం॥" (ఆత్మబోధ.) అపంచీకృత పంచసూక్ష్మ భూతోత్పన్నములైన యీ జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, ప్రాణపంచకము, మనోబుద్ధులును, ఏకీభవించి సప్తదశ సూక్ష్మావయవాత్మకమైనది సూక్ష్మశరీరము. దీనికే లింగశరీరమని సంజ్ఞ. ఇదియె కర్మఫలోపలంభము (అనుభవము) నకు సాధనము. ఈ సూక్ష్మశరీరమునందు జీవేశ్వరులయొక్క అవస్థానము స్వప్నావస్థ. ఈ సూక్ష్మశరీరమునందు విజ్ఞానమయకోశము, మనోమయకోశము, ప్రాణమయకోశమును గలవు. ఇందు విజ్ఞానమయకోశము జ్ఞానశక్తివంతమై కర్తృరూపమైనది. మనోమయకోశము ఇచ్ఛాశక్తివంతమై కరణ (సాధన) రూపమైనది. ప్రాణమయకోశము క్రియాశక్తివంతమై కార్యరూపమైనది. యోగ్యత ననుసరించి వీనియొక్క విభాగము వివరింపబడినది. పూర్వోక్త కారణమునకును, ఈ సూక్ష్మసృష్టి కలుగుటకును ఆ జీవుల పూర్వకర్మములె సహాయములు. ఈ జీవత్వ మనాదికావున దేహాభిమానమువలన బూర్వకల్పమున జీవులచే నొనర్పబడి సంచితము లైయున్న కర్మములు ఫలముల నొసగు స్థితికి రాగానే యుత్తరకల్ప మారంభమై క్రమముగ సూక్ష్మ స్థూలసృష్టులు కలుగుచుండును. ఇదియ సూక్ష్మ ప్రపంచ సృష్టి ప్రకారము.

అటుతరువాత స్థూలప్రపంచ సృష్టి ప్రకారము చెప్పబడుచున్నది. "స్రష్టుకామో జగద్యోనిస్తమోగుణ మధిష్ఠాయ సూక్ష్మతన్మాత్రాణి భూతాని స్థూలీకర్తుంసోఽకామయతః

సృష్టేః పరిమితాని భూతాన్యేకమేకంద్విధా విధాయ పునశ్చతుర్థాకృత్వాస్వ స్వేతరద్వితీయాంశై పంచపంచధాసంయోజ్య పంచీకృత భూతైః అనంతకోటి బ్రహ్మాండాని, తత్తదండోచితచతుర్దశ భువనాని, తత్తద్భువనోచిత గోళక స్థూలశరీరాణి అసృజత్॥'' (పైంగల. ఉ. 1.) జగత్సృష్టినిజేయ సంకల్పించి యారంభించిన సర్వజగత్కారణుడైన ఈశ్వరుడు నిజాశ్రిత స్వాధీన మూలప్రకృతియందలి తమోగుణము నంగీకరించి సూక్ష్మతన్మాత్రములైన పంచభూతములను స్థూలములుగజేయ సంకల్పించెను. సృష్టిమూలమున పరిచ్ఛిన్నమైయున్న (పరిమితములైయున్న) పంచసూక్ష్మభూతములను ఒక్కొక్క భూతమును రెండుభాగములుగ విభజించి, మఱల నందొక్కొక్క భూతార్థభాగమును నాలుగు సమభాగములుగ విభజించి యొక్కొక్క నాలుగు పరకభాగములను స్వార్థభాగమునువిడిచి యితర భూతార్థ భాగములతోగూర్చిన, ప్రతిభూతము నందును సగభాగము అసలు భూతమును మిగత సగభాగము ఇతర నాలుగు భూతములయొక్క నాలుగు అష్టమాంశములును ఏకీభవించి, మొదటి సూక్ష్మభూతము లైదును పంచీకృతములై స్థూలభూతములగుచు స్థూలాకృతులను బొందుటవలన నింద్రియ గోచరములగును. ఇటుల పంచీకృతములైన పంచమహాస్థూల భూతములచేత అనంతకోటి బ్రహ్మాండములను ఆ బ్రహ్మాండముల కనుగుణమైన (తగిన) చతుర్దశ భువనములను, ఆయాభువనముల కుచితములైన చతుర్విధ స్థూల శరీర సమూహములను, వానికి యోగ్యమైన భోగ్యవస్తుజాతమును సృజించెను. సృజించుట యనగా నామరూపములను ప్రకాశింపజేయుట యనియే యర్థము కాని ఈశ్వరునికంటె వేఱుగ నొక్కదానిని గల్పించుటయని యర్థముకాదు. మఱియు పూర్వోక్త సూక్ష్మభూతములయొక్క పంచీకృతత్వమే స్థూలభూతత్వముకాని తద్వ్యతిరిక్తముగ స్థూలభూతోత్పత్తి యిచట వివక్షితము కాదని గ్రహించవలయును'' అనెడి శ్రుత్యుక్తప్రకారము "ద్విధావిధాయచైకైకం చతుర్ధాప్రథమంపునః। స్వస్వేతరద్వితీయాంశైర్యోజనాత్పంచపంచతే॥'' (పంచదశి. 1-7) "అథతమోగుణప్రధానా న్యపంచీకృతాన్యాకాశాదీనిపంచాపిభూతాని ప్రత్యేకంద్వేధా విభజ్యతత్రైకైకమర్థం చతుర్ధావిభజ్య స్వార్థభాగం విహాయేతర భూతార్థభాగేషు సంయోజనం పంచీకరణం॥'' అటుతరువాత తమోగుణ ప్రధానములైన అపంచీకృత ఆకాశాది సూక్ష్మభూతము లైదింటిని ప్రత్యేకముగ నొక్కొక్కదానిని రెండు సమరాసులుగ విభజించి అందలి ప్రతి భూతార్థభాగమునువిడిచి ప్రతి భూతముయొక్క రెండవ అర్థభాగమును మఱల నాలుగు సమభాగములుగ విభజించి, దానంగలిగిన ఒక్కొక్కటి పరకచొప్పున నాలుగు పరకభాగములను స్వార్థభాగమును విడిచి ఇతర నాలుగు భూతార్థ భాగములయందు సంయోజనమొనర్చుటయే పంచీకరణము. దీనికిని జీవులయొక్క పూర్వజన్మములయందు వారిచేతం జేయబడి ప్రస్తుత జన్మమున అనుభవసిద్ధములుగ పరిపక్వములైయున్న సంచితకర్మములు ఫలోన్ముఖములగుటయే కారణము. ఈప్రకారము జీవులయొక్క ప్రాక్తన జన్మమున అనుభవమునకు అరబ్ధములైన పూర్వకర్మముల సహాయమునగూర్చిన పంచీకరణ క్రమమువలన శబ్దగుణముగల ఆకాశము, శబ్దస్పర్శగుణములుగల వాయువు, శబ్దస్పర్శరూప గుణములుగల అగ్ని, శబ్దస్పర్శ

రూపరస గుణములుగల జలము, శబ్దస్పర్శరూపరసగంధ గుణములుగల పృథివియును పంచీకృతములై మహాస్థూలాకృతులైనవగుచు ప్రకటములై ఇంద్రియగోచరములయ్యెను. ఈ పంచీకృత పంచమహాభూతముల వలన బ్రహ్మాండము అందులో భూలోకము-భువర్లోకము-సువర్లోకము- మహర్లోకము - జనలోకము-తపోలోకము-సత్యలోకము నను సప్త ఊర్ధ్వలోకములును; అతలము - వితలము-సుతలము-రసాతలము-తలాతలము - మహాతలము-పాతాళము నను సప్త అధోలోకములును కలిసి చతుర్దశ భువనములును; ఆయా భువనములయందు తత్తదుచితములైన జరాయుజాండజస్వేదజోద్భిజ్జరూపములైన చతుర్విధ స్థూలశరీర సమూహములును, జరాయుజములనగా మావివలన బుట్టునట్టి మనుష్య పశ్వాదులును-అండజములనగా గ్రుడ్డువలనబుట్టునట్టి పక్షిపన్నగాదులును-స్వేదజములనగా ఉక్కవలన బుట్టునట్టి మశకమత్కుణాదులును - ఉద్భిజ్జములనగా భూమిని వ్రక్కలించి భూమినుండి పుట్టునట్టి కక్షవృక్షాదులును; వాని కనుగుణమైన ధాన్యములు ఓషధులు మున్నగు భోగ్యపదార్థజాతమును పుట్టినవి. ఈ స్థూలశరీరమునందు జీవేశ్వరులయొక్క అవస్థానము జాగ్రదవస్థ. ఈ స్థూలశరీరము త్వఙ్మాంసరుధిరమేదోమజ్జాస్థులనెడి షట్కోశాత్మకమైన అన్నమయకోశము, అన్నమువలన నుత్పన్నమై, అన్నముచేతనే వర్ధిల్లుచు అన్నవికారమైన కారణమువలన స్థూలశరీరము అన్నమయకోశ మనబడును. ''పంచీకృత మహాభూత సంభవం కర్మసంచితం । శరీరం సుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే॥'' (ఆత్మబోధ.) బహుజన్మార్జిత సంచితకర్మమునుండి పరిపక్వమై అనుభవారబ్ధమగు కర్మసహితమైన పంచీకృత పంచమహాభూత సముద్భూతమైన ఈ స్థూలశరీరమే—అన్నమయకోశమే-కర్మఫల భూతములైన సుఖదుఃఖముల యనుభవమునకు ముఖ్యనిలయము. ఇది స్థూలసృష్టిప్రకారము.

ఈ కారణ శరీరము-సూక్ష్మశరీరము-స్థూలశరీరమును ప్రత్యేకము వ్యష్టిసమష్టి భేదముచేత రెండువిధములు. 'ఒక వృక్షము'-'ఒక గృహము' వ్యష్టి, అనేక వృక్షసముదాయముగల 'వనము'-అనేక గృహసముదాయముగల 'గ్రామము' సమష్టి. ఇట్లే 'ఒక శరీరము' వ్యష్టి-సకలశరీర సముదాయముగల ప్రపంచము సమష్టి. అందు సమష్ట్యుపాధికుడైన పరబ్రహ్మము ఈశ్వరుడు. వ్యష్ట్యుపాధికుడైన పరబ్రహ్మము జీవుడు. అందునను, కారణ సమష్టిచేత ఈశ్వరుడు-కారణ వ్యష్టిచేత ప్రాజ్ఞుడు అనియు; సూక్ష్మసమష్టిచేత హిరణ్యగర్భుడు-సూక్ష్మవ్యష్టిచేత తైజసుడుఅనియు; స్థూలసమష్టిచేతవైశ్వానరుడు-స్థూలవ్యష్టిచేతవిశ్వుడు అనియు నిట్లుజీవేశ్వరులయందు అవాంతర భేదము.

''ఉత్పన్నస్య జగద్యోని రగుణోపి రజోగుణం । భుంజన్నివర్తతే సర్గే బ్రహ్మత్వం సముపాశ్రితః । బ్రహ్మత్వేన ప్రజాసృష్ట్వా తతస్సత్త్వాతిరేకవాన్ । విష్ణుత్వమేత్యధర్మేణ కురుతే పరిపాలనం । తతస్తమో గుణోద్రిక్తో రుద్రత్వేచాఖిలంజగత్ । ఉపసంహృత్యవై శేతే త్రైలోక్య త్రిగుణోఽగుణః॥'' (మా. పు. 46. అ.) విశేషముగ నుత్పన్నమైన అశేష ప్రపంచమునకు గారణభూతుడైన పరబ్రహ్మము నిర్గుణియైయైనను స్వాశ్రిత స్వాధీన మాయా సంబంధము వలన, రజోగుణము నవలంబించి సృష్టికార్యమునందు బ్రహ్మత్వమునుపొంది లోకాదులను సృజించుచు అంతట సత్త్వగుణ ప్రధా

నుడై స్థితికార్యమునందు విష్ణుత్వమునుపొంది
ధర్మముగ జగత్పరిపాలనమును జేయుచున్నాడు.
అంతట తమోగుణాతిశయుడై లయకార్యము
నందు రుద్రత్వమునుపొంది యఖిల ప్రపంచము
నుపసంహరించి ముల్లోకములను స్వప్నతుల్య
ప్రపంచములుగ జేయుచున్నాడు. ఇట్లు పర
బ్రహ్మము సగుణుడయ్యును నిర్గుణుడే యని
మార్కండేయ పురాణోక్తప్రకారము ఈ
యీశ్వరుడే రజోగుణమనెడి యుపాధిచేత
బ్రహ్మాభిధానుడై జగత్సృష్టిని, సత్త్వగుణ
మనెడి యుపాధిచేత విష్ణునామధేయుడై జగ
త్పరిపాలనమును తమోగుణమనెడి యుపాధి
చేత రుద్రాభిఖ్యుడై జగత్ప్రలయమును చేయు
చున్నాడు. బ్రహ్మకు విరాట్పురుషునియందంత
ర్భావము. విష్ణువునకు హిరణ్యగర్భునియం
దంతర్భావము. రుద్రునకు ఈశ్వరునియందంత
ర్భావము. ఇదియే ప్రపంచోత్పత్తి, ఇదియే
అధ్యారోపము, ఇది విక్షేపశక్తి కార్యము.

అటుతరువాత ఆవరణశక్తి కార్యము చెప్ప
బడుచున్నది.—"మాయాంతు ప్రకృతిం విద్యా
న్మాయినంతు మహేశ్వరం । తస్యావయవ
భూతైస్తు వ్యాప్తం సర్వమిదంజగత్॥" (శ్వే.
ఉ. 4-10). మాయనే ప్రకృతినిగా దెలియ
వలయును. ప్రకృతియనగా "ప్రకర్షేణక్రియతే
బ్రహ్మణ సకాశాత్ జగదారంభోనయేతి
ప్రకృతిః॥" బ్రహ్మప్రతిబింబము (చిచ్ఛక్తి)తో
గూడి గుణసామ్యావస్థగలదియై విశేషముగ
జగత్సృష్టినిజేయు మాయయే ప్రకృతి. "ఆ
మాయకు అధిష్ఠాత మహేశ్వరుడు. అనగా
మాయ మహేశ్వరునకు స్వాధీనమైయుండును.
చిచ్ఛాయా సమేతమగు మాయయొక్క అంగ
భూతమైన కారణకార్య సముదాయముచేత నీ
ప్రపంచమంతయు సంపూర్ణముగ వ్యాప్తమై
యున్నది. "అస్మాన్మాయీసృజతే విశ్వమే
తత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః॥"
(శ్వే ఉ. 4-9). ఈ సకల కారణ కార్యరూప
మాయకు అధిష్ఠానమును అధిపతియునైన
పరమేశ్వరుడే ఆత్మాంశభూతమగు నీ సకల
ప్రపంచమును పూర్వోక్త పంచభూతాది తత్త్వ
సముదాయమువలన కల్పించుచున్నాడు. ఇట్లు
కల్పితమైన ఆ జగత్తునందు, బ్రహ్మవిదుని
కంటె భిన్నమైన సమస్త జీవ సముదాయము
మాయా మూలమున బంధింపబడుచున్నది.
అనగా జీవుడు మాయకు వశుడై యుండును"
అను నిత్యాదిశ్రుతులు మానముగ ఈశ్వరు
నకు మాయవలన నుపద్రవమేమియు లేదు. ఆ
యీశ్వరునకును లోకములో ఆత్మవిజ్ఞానికిని
భేదము లేదు. అందువలన ఈశ్వరుని, ఆత్మ
విజ్ఞానిని, ఆవరణశక్తి, యావరింపజాలకుండుట
చేత వారిని మాత్రము విడిచి యితర జీవుల
కందఱకును, పంచకోశములకును ఆత్మకు గల
భేదమును అంధకారమువలె నావరించుచున్నది.
దానభ్రాంతి (విరుద్ధజ్ఞానము) కలుగుచున్నది.
అనగారజ్జువునందుసర్పభ్రాంతివలెఅవ్యయైకనిత్య
శుద్ధముక్తాత్మయందుసంసారపరిచ్ఛిన్నజీవభ్రాంతి
కలుగుచున్నది. ఈ యావరణము, 1 అసత్త్వా
వరణము. 2 అభానావరణము నని రెండు విధ
ములు, 'వస్తునాస్తి'=బ్రహ్మము లేదు' అనెడి
వ్యవహార కారణము అసత్త్వావరణము. 'వస్తు
నభాతి=బ్రహ్మము ప్రకాశించుటలేదు' అనెడి
వ్యవహార కారణము అభానావరణము. ఆవరణ
శక్తి కార్యమే సంసార వృక్షమునకు మూలము
కాని విక్షేపశక్తి కార్యము సంసార వృక్షము
నకు మూలముకాదు. ఈ వివేకమే మోక్ష
సిద్ధికి హేతువు. ఈ రెండువిధములైన ఆవ
రణములుకూడతత్త్వజ్ఞానముచేతబాధ్యములు.



# ప్రశ్నోత్తరి

(శ్రీ ఆది శంకరులవారి సంస్కృత గ్రంథమున కాంధ్రీకరణము)

శ్రీ గుమ్మలూరి లక్ష్మీనృసింహ శర్మ

పారమే లేనియట్టి సం♦సారజలధి, జిక్కువడియున్న నాకేది ♦ దిక్కు, దయను
హే కృపాలో!, గురూ! సెల♦వీయు డింక, జగదధీశ్వరు గొప్పదౌ ♦ చరణనౌక॥ ౧

బంధనంబెద్ది? విషయాను♦వర్తనంబు, మోక్షమన నెద్ది? విషయవై♦ముఖ్యపటిమ,
స్వర్గమన నెద్ది? విగతతృ♦ష్ణా ప్రశస్తి, హేయతర నరకమెయ్యది? ♦ స్వీయతనువె॥ ౨

నరకమున కెద్ది ద్వారంబు? ♦ సరసిజాక్షి, హాయిమై నిద్రపోగల్గు ♦ నాతడెవడు?
అతుల నిష్ఠాగరిష్ఠ స♦మాధిగతుడు, ఎవరు నిజమైన శత్రువు? ♦ లింద్రియములు॥ ౩

ఎవరు నిజమైనమిత్రు? లా♦యింద్రియములె, వాని బూర్తిగను జయించి♦వైచినపుడు;
ఎవడు నిజమైన మెలకువ ♦ నెప్పుడొప్పు? భవ్యసదసద్వివేక సం♦పద్ఘనుండు॥ ౪

ఎద్ది సంసారబాధల ♦ నెల్ల గూల్చు? వేదజనితాత్మ విజ్ఞాన ♦ విభవ మహిమ,
మోక్షహేతు వెయ్యది? యాత్మ ♦ బోధనంబు, స్వర్గమనజాలు నెది? యహిం♦సావ్రతంబు॥

ఎవ్వడు దరిద్రు? డత్యాశ ♦ నెసగువాడు, ధనికు డెవ్వాడు? సంతుష్టి ♦ దనరువాడు,
ఉండి మృతతుల్యు డెవడు? ని♦రుద్యముండు, అమృతమెది? సుఖమిచ్చు ని♦రాశయొకడ॥ ౬

యముడు ప్రాణాల హరియింప ♦ నరుగుదేర, యత్నమున జేయదగు నెద్ది♦ప్రాజ్ఞవరుడు?
సౌఖ్యదము, మృత్యుహరమునౌ ♦ శౌరిసేవ, మనసుచే, వాక్కుచేతను ♦ తనువుచేత॥ ౭

మాతవలె సౌఖ్యదంబెద్ది? ♦ మంచివిద్య, సభను శోభిలు నెవ్వండు? ♦ సద్బుధుండు,
అసురుడెవ్వాడు? దుర్వాస♦నాయుతుండు, ఇచ్చినకొలంది పెంపారు ♦ నెద్ది? విద్య॥ ౮

వేనికి భయంబుజెందగా ♦ నౌను జనులు? భవ వనానికి, లోకాప♦వాదమునకు;
ప్రియతరంబగు బంధువున్ ♦ బితయు నెవరు? వెతల గాపాడి-పాలించు ♦ విమలమతులు॥ ౯

రేయి బవలును గడుజింత ♦ నీయమెద్ది? సచ్చిదానంద పరతత్త్వ ♦ సత్యతయును
భవమృషత్వంబు; కర్మనా ♦ బఱగు నెద్ది? దైవమునకెద్ది ప్రీతియై ♦ తనరు నదియ॥ ౧౦

ఎవరు నిజమైన శత్రువుల్? ♦ హితులవోలె, బయటికగుపడు పుత్రాది ♦ వర్గమెల్ల;
పశువు కన్నను పశువయి ♦ పరగు నెవడు? స్వాత్మధర్మము నెఱుపని ♦ శాస్త్రవిదుడు॥ ౧౧

ప్రాణములు కంఠగతములై ♦ యరుగనున్న, చేయగారానిదెది? యెద్ది♦చేయదగును?
పాపకార్యంబు నెపుడొన♦ర్పంగరాదు, శివకరంబగు పుణ్యమే ♦ చేయవలయు॥ ౧౨

దుర్లభములెవ్వి జగతి?—స♦ద్గురువరుడును, త్యాగమున్, దైవచింత, సం♦త్సంగతియును;
ఎవ్వనిజయింప దుష్కర ♦ మెట్టిరికిని? కనులకగుపడనట్టి యా♦కాయభవుని॥ ౧౩

దేశికుండెవ్వఁడు? హితోప♦దేశకుండు, ఛాత్రుడెవ్వఁడు? గురుభక్తి ♦ సంయుతుండు;
దీర్ఘరోగి యెవ్వఁడు? భవో♦ద్భూతిపరుఁడు, దాని కౌషధమెయ్యది? శ్రీ దైవచింత॥ ౧౪

వాస్తవమ్ముగ నేయది ♦ పాశమగును? మహితదారుణమమతాభి♦మాన యుగళి;
ఈశ్వరప్రాప్తి కెయ్యవి ♦ హేతుకములు? దైవచింత, ఆనందమున్, ♦ త్యాగబుద్ధి॥ ౧౫

భూషణంబులకెల్లను ♦ భూషణమెది? చక్కనైనట్టి సౌశీల్య ♦ సద్విభవము;
నిజమయిన తీర్థమెయ్యది? ♦ నిర్మలాత్మ, శ్రావ్యమెయ్యది? గురువేద ♦ సంతవాణి॥ ౧౬

త్యాజ్యము లవెవ్వి? స్వర్ణంబు ♦ నంబుజాక్షి, అంధుడగు నాతడెవడు? కా♦మాతురుండు,
అగునదేయది మృతి? స్వకీ♦యాపయశము; ఇట్టి సమ్మోహనమొనర్చు ♦ నెద్ది? చెల్వ॥ ౧౭

సంతజనులెవ్వ? రఖిల సం♦సార సుఖవిరాగులై, మోహరహితులై ♦ బ్రహ్మతత్త్వ
మరయనిష్ఠాగరిష్ఠులై ♦ యలరువారు; ప్రియమయిన కార్యమెయ్యది? ♦ విష్ణుభక్తి ౧౮

ఎవడు మూర్ఖుండు? సువివేక ♦ హీనజనుడు, జ్వరమనగనెద్ది? విషయ సం♦సక్తి నుంట,
నిజమయిన జీవనంబెద్ది? ♦ నిష్కలుషత, జ్ఞానమన నెద్ది? యేది మో♦క్షప్రద, మదె॥ ౧౯

వాస్తవిక లాభమెద్ది? యీ♦శ్వరునిసేవ, జగతిని జయింపగల్గిన ♦ శక్తుడెవడు?
తనదగు మనస్సును జయించి ♦ తనరు నతడె; అగున దెయ్యది విద్య? అ♦ధ్యాత్మవిద్య ౨౦

వీరులందఱిలోపల ♦ వీరుడెవడు? అతను బాణంబులకు జిక్క♦నట్టివాడు;
వీరుడును, సమదర్శియున్ ♦ విబుధుడెవడు? గరితల కటాక్షమున మోహి♦కానియతడు॥ ౨౧

మూలమెయ్యది? సంసార♦మునకు? చింత, ఏయవస్థలోనున్నప్పు ♦ డేనిగ్గాని
జ్ఞానులగువార లెవ్వాని ♦ సలుపరాదు? బంధకంబగు స్నేహమున్ ♦ పాపకర్మ॥ ౨౨

ఏరు ధన్యాత్ములు? పరోప♦కారమతులు, విషములనుమించు విషమెద్ది? ♦ విషయచయము,
దుఃఖి యెవ్వండు? విషయేచ్ఛ ♦ దొరలువాడు, పూజ్యుడెవ్వ డీశ్వరుకృపన్ ♦బొదలునతడె॥

యత్నమొనరించి యెవిచేయ ♦ నగును బుధులు? ఉత్తమగ్రంథపఠనంబు ♦ నురుతరంపు
ధర్మపాలనమునుజేయ ♦ దగును బుధులు; త్యాజ్యమెయ్యది? విషయభో♦గానురక్తి॥ ౨౪

విమలమౌ వ్రతమెయ్యది? ♦ వినయగుణము, పూరుషునకెద్ది సంకెల? ♦ పూవుబోడి,
విజ్ఞులందఱిలోపల ♦ విజ్ఞుడెవడు? వంచితుడుకాని యాతడు ♦ వనిత కెపుడు॥ ౨౫

అందఱికిని దుస్త్యాజ్యమే♦యది? దురాశ, పశువెవడు? విద్యనేమి నే♦ర్వనియతండు,
ఎఱుగగ నశక్యమేయది ♦ యెవ్వరికిని?, స్త్రీలచిత్తవృత్తియును త♦దీయ చరిత॥ ౨౬

శీఘ్రముగ ముక్తిరతుడెద్ది ♦ చేయవలయు? మంచిపో, త్రీశుసేవ, ని♦ర్మమతనుంట :
వాసమును, సంగ మెవరితో ♦ బనికిరావు? ఖలులతో, నీచులతో, మూర్ఖ♦గణముతోడ॥ ౨౭

అగు నాకేత్తత్త్వ మెది? పర♦మాత్మతత్త్వ, మగునెది ప్రశస్తమగుదాన? ♦ మభయదాన,
మెపు డవిశ్వసనీయమ♦దెద్ది? నారి, యే సుఖంబగుత్యాజ్యంబు? ♦ స్త్రీసుఖంబు॥ ౨౮

బధిరుడగు నాతడెవ్వాడు? ♦ పల్కునట్టి, హితము నెవ్వాడు చెవిజొఱ ♦ నీయడతడె ;
తలప మూగివాడెవ్వండు? ♦ తరుణమందు, సత్యమును నొక్కి తెల్ప న♦శక్తుండు॥ ౨౯

నీచతకు మూలమెయ్యది? యాచనంబు, ఘనత కెదిమూలమగును? త్యా♦గంబు చూవె
సార్థకంబయి యెవ్వాని ♦ జన్మమొప్పు? మఱల జన్మము లేనట్టి ♦ మానవునిది॥ ౩౦

ఎవని మృత్యువు సార్థకం♦బవుచు దనరు? తిరుగ మృత్యువు లేనట్టి ♦ దివ్యమతిది ;
అవని నత్యుత్తమంబగు ♦ నయ్యదెద్ది? విమలమగు నాచరణగల్గి♦ వెలయునడత॥ ౩౧

శత్రువుల లోపలను మహా♦శత్రు లెవరు? అమృతమును, లోభమును, క్రోధ, ♦ మధికతృష్ణ
తోడ నొప్పారు కామాది ♦ దుర్గుణములు ; అగు ముఖంబున కెది భూష? ♦ సాక్షరతయ॥ ౩౨

నిజమయిన కర్మమెయ్యది? ♦ నిఖిలమైన, జీవకోటికి హితమును ♦ జేయుచుంటె ;
పనుల నెవిచేసి శోకింప ♦ ననవసరము? హరిహరుల పూజనంబను♦నట్టి పనులు॥ ౩౩

హెచ్చుగా గ్రుచ్చుకొనునెద్ది ♦ యెముకవోలె, కర్కశంబగు? తనదు మూ♦ర్ఖతయెనుమ్ము ;
తెలిసికొన నింకబనిలేదు ♦ దేని దెలిసి? అధికసుఖబోధరూపక ♦ మయిన శివుని॥ ౩౪

ఎవ రుపాస్యులు? గురుదేవ ♦ వృద్ధవితతి, ఏది నశియింప ముక్తి ల♦భించు? మనము,
విషయసౌఖ్యా లవెంతగా ♦ వెలయుచున్న, కనదు తృప్తి నదెయ్యది? ♦ కామగుణము॥ ౩౫

ఎందు విశ్వాస మునుపరా♦దింతయైన? ఘోరదారుణ సంసార ♦ వారిధియెడ ;
అమృతమట్టుల వెలుపలి ♦ కగుపడుచును, నిజముగా నెద్ది గరళమై♦ నెగడు? — నారి॥ ౩౬

సమయునే యవి మెఱుపట్లు ♦ క్షణికములయి? యౌవనంబును, భాగ్యంబు♦నాయువయును;
ఉత్తమంబైన దానమై ♦ యొప్పునెద్ది? పాత్రులైనట్టి వారి కీ ♦ బడిన యదియ॥ ౩౭

ఘనుడు సర్వేశు భగవంతు ♦ కథలనువలె, ననయ మీ మణిరత్న మా♦లాభిధాన
మైన ప్రశ్నోత్తరి బఠింప ♦ నాలకింప, శాశ్వతానంద సంపత్తి ♦ జనులు గంద్రు॥ ౩౮

ఇది రమామానినీమణీ ♦ హృదయనాథ, వరకృపాప్రాప్త కవితా ప్ర♦భావ గుమ్మ
లూరి లక్ష్మీనృసింహాఖ్య ♦ సూరి రచిత, మయిన ప్రశ్నోత్తరి కృతి స♦మాప్తమయ్యె

ప్రశ్నోత్తరి సమాప్తము.



# శ్రీ వివేకానంద సంభాషణలు

## (ఒక భక్తుని దినచర్యనుండి)

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[పరబ్రహ్మ, అనేకత్వము—జీవబ్రహ్మైక్య వివేకము—సచ్చిదానందమే యందరి యాదర్శము—అహం బ్రహ్మోఽస్మి యని నిరంతరము జపింపుము—ఆత్మానాత్మ వివేకము, త్యాగము బ్రహ్మనిష్ఠకు మార్గము—నిర్భయముగా నుండుము.]

శిష్యుడు:—స్వామిజీ! పరబ్రహ్మ యొక్కటే సత్యమైనచో, ప్రపంచమునందీ యనేకత్వమేలగలదు? దయచేసి సెలవిచ్చెదరా?

స్వామిజి:—నీ వీ ప్రశ్నను, పదార్థ విజ్ఞాన శాస్త్రరీత్యా ఆలోచించుచుండుట లేదా? పదార్థవిజ్ఞానము ననుసరించి, కార్య, కారణ, విచక్షణాజ్ఞానముచే, క్రమక్రమముగా, సమస్త పదార్థములయొక్క సమష్టి తత్వమునకు జేరుకొందుము, కాని నీవు మొదటనే, ఈ సమష్టి తత్వదృష్ట్యా, ఈ సమస్తమును పరిశీలించుచో, ఈ వ్యష్టిత్వము గానబడునేమో చెప్పగలవా?

శిష్యుడు:—సత్యము, నేసి సమష్టితత్వమునందున్నచో, నేను ''ఎందుచేత'' అని ఎట్లు ప్రశ్నింపగలను? నేను ఈవిధముగా ప్రశ్నించుటచేత, అనేకత్వమును దర్శించుచుంటినని వేరే జెప్పనవసరములేదు.

స్వామిజి:—బాగుగానున్నది. వివిధ పదార్థములను పరిశీలించి, వస్తువులయొక్క మూలకారణమును గ్రహించుట, శాస్త్రముల వ్యతిరేకముగా తర్కించుట యనియు లేక వక్రమార్గమున వాదించుటయనియు, ననగా, మొదటలేనిదానిని ఉన్నట్టుగా భావించి, పిమ్మట తర్కజ్ఞానముచే, అది పదార్థముగానేరదని నిరూపించుట యనియు, పిలువబడుచున్నవి. సత్యముగాని వస్తువును, సత్యమని నమ్మి, వస్తువుయొక్క మూలతత్వమును గ్రహించు పద్ధతినిగూర్చి, నీవు మాట్లాడుచుంటివిగాదా? నిజమేనా?

శిష్యుడు:—నా మనస్సునకు ఈ కనబడునదంతయు యథార్థమనియు, దీనికి వ్యతిరేకముగా నున్నదంతయు అసత్యమనియు, దోచుచున్నది.

స్వామిజి:—కాని, వేదములు ''ఏకమేవా

ద్వితీయంబ్రహ్మ'' ఉన్న దొక్కటేయని వచించుచున్నవి. ఆ యున్నదొక్కటియు, పరబ్రహ్మస్వరూపమేయగుచో, నీ యనేకత్వ సిద్ధాంతము అసత్యమనవలెను. బహుశా, నీవు వేదములను నమ్మెదవని తలచెదను.

శిష్యుడు:—నామట్టునకు నాకు వేదప్రమాణమునకు మించిన గొప్ప ప్రమాణము లేదని నమ్మెదను. కాని, తర్కించునపుడు వేదప్రమాణము నంగీకరింపనివాని కితరసాధనములను జూపి, ఖండింపవలయును.

స్వామిజి:—అదిగూడ జేయవచ్చును. ఇటు చూడుము. ఒకానొక సమయమున, ఈ కనబడు సమస్తము మాయమై, ఏమియును గోచరముగాని స్థితి రాగలదు. అట్టి స్థితిని నేను జీవితములో ననుభవించితిని.

శిష్యుడు:—ఎప్పుడు తమరు ఆరీతిగా ననుభవించితిరి?

స్వామిజి:—ఒకానొకరోజున, దక్షిణేశ్వర మందలి ఆలయారామమందు శ్రీ రామకృష్ణులు నా హృదయమును స్పృశించిరి. మొట్టమొదట సమస్తమైన భవనములు, గదులు, తలుపులు, కిటికీలు, వసారాలు, చెట్లు, సూర్యుడు, చంద్రుడు అన్నియు ఎగిరి పోవుచున్నట్లును, ముక్కలుముక్కలుగా బ్రద్దలై పోవుచున్నట్లును, అణువులుగను, పరమాణువులుగను విడిపోయి చివరకు ఆకాశమం దణగిపోయినట్లుగా గాంచితిని. క్రమముగా ఆ యాకాశముగూడ యదృశ్యమై, పిమ్మట నా యహంకారము, బాహ్యస్మృతినిగూడగోల్పోయితిని. పిమ్మట నేమి సంభవించినదో నేను జ్ఞాపకము జేసికొనజాలను. మొదట నాకు భయముగలిగినది. ఆ స్థితినుండి బాహ్యస్మృతికి వచ్చిన తోడనే, యీ గృహములు, తలుపులు, కిటికీలు, వసారాలు, సమస్తమును గాన్పించినవి. ఇంకొక సమయమున, అమెరికా ఖండమున ఒకానొక సరోవరముచెంత నిట్టిదే మఱియొకసారి కాంచితిని.

శిష్యుడు:—మనస్సునకు వెఱ్ఱి ఎత్తినపు డిట్టి స్థితి సంభవింపగూడదా? ఒకవేళ ఇట్టి స్థితి గలిగినను, అనుభవించు మహా సౌఖ్య మేదియో నాకు అర్థమగుటలేదు.

స్వామిజి:—మనస్సునకు పిచ్చియెత్తుటా! ఏరోగమైనను సంధించుటవలనగాని, ఏమద్యమునైనను సేవించుటవలనగాని, అస్వాభావికమగు శ్వాసనియమ సాధనలచే గలుగు భ్రమవలనగాని, ఏర్పడక, పరిపూర్ణారోగ్యవంతునకు గలిగిన యీ స్థితి పిచ్చితనమని ఎట్లు చెప్పగలవు? వేదములలో చెప్పబడిన స్థితితో, ఈ స్థితి తులతూగుచున్నది. పూర్వకాలపు మతాచార్యుల, ఋషుల వాక్యములతో ఈ స్థితి సమన్వయమగుచున్నది. (చిఱునవ్వుతో) చివరకు నన్ను పిచ్చివానిగా భావించుచుంటివా?

శిష్యుడు:—కాదు, కాదు. ఆవిధముగా నేను తలచుటలేదు. శాస్త్రములయందు పూర్ణస్థితిని ప్రాపించిన యుదాహరణములు వందలకొలది నుదహరింపబడియుండగను, కరతలామలకమువలె, ప్రతి మానవుడును, ఈ స్థితిని ప్రత్యక్షముగా ననుభవింపవచ్చునని తమరు సెలవిచ్చుచుండుటచేతను, వేదశాస్త్రములయందు నుడివియున్నరీతిగా, తమ జీవితమునం దీ విషయమున ననుభవ

మును పొందుటచేతను, నేను ఇది యసత్యమని చెప్పుట కెట్లు సాహసింతును? శ్రీ శంకరాచార్యులవారుగూడ ఇట్టిస్థితిని అనుభవించి, ''ఈ ప్రపంచమేది'' మొదలగు అనుభవ వాక్యములను నుడివిరి.

స్వామిజి:—ఈ వ్యష్టియందలి సమష్టిని గ్రహించుటయే పరబ్రహ్మమును గుర్తించుట యనియు, దీనిని గ్రహించిన పిరికితనము జననమరణములు పూర్తిగా నశించిపోవు ననియు, సమస్త శాస్త్రములును నుడువుచున్నవి. జీవితమునం దొక్కసారియైనను ఆ బ్రహ్మానందరసమును గ్రోలినచో, ప్రపంచమందలి సుఖదుఃఖములచే క్రుంగిపోనేరదు. మానవులు నిష్ప్రయోజనములగు కామినీ కాంచనములచే బంధింపబడి, ఈ బ్రహ్మానందమును అనుభవింపనేరరు.

శిష్యుడు:—ఇది నిజమైనచో, మనము యథార్థముగా ఆ పరిపూర్ణుని యంశములమే యైనచో, స్వాభావికముగా మనమేల ఆ బ్రహ్మానందమును బడయుటకు యత్నింపకున్నాము? కామినీ కాంచనములను నిరర్థక జాలకమునందుజిక్కి, మోసగింపబడి మృత్యుగహ్వరమును మరల మరలజొచ్చుటకు కారణమేమి?

స్వామిజి:—మానవులీ సచ్చిదానందమును వాంఛించుటలేదను భావముతో నీవు మాట్లాడుచున్నావు. జాగ్రత్తగా ఆలోచింపుము. మనముజేయు ప్రతి కార్యమును, ఆ బ్రహ్మానందమును గ్రోలుటకొరకే. కాని, ఎవ్వరును దానిని గుర్తించుచుండుట లేదు. అందుచేత దానిని గ్రహించుటయునులేదు. బ్రహ్మము మొదలు తృణపర్యంతమునుగల సమస్తమునందును, ఈ సచ్చిదానంద మంతర్గతమైయున్నది. నీవుగూడ ఆ పరిపూర్ణ బ్రహ్మస్వరూపమవే. నీవా పరిపూర్ణ స్వరూపమ వని నిశ్చయముగా దలచిన, ఈ క్షణమునందే, యా పూర్ణస్థితి సిద్ధింపగలదు. ప్రత్యక్ష సాక్షాత్కారము విధిగా గావలయును. నీవు నీ భార్యకై యింత సేవచేయుటగూడ ఆ సచ్చిదానంద రసాస్వాదనమునకే. అనేక సార్లు భ్రాంతియందు దగుల్కొని, శోక, మోహములచే గొట్టుపడి, మానవుడు స్వభావ సిద్ధముగా తన సహజాంతరంగిక స్వరూపముపై దృష్టిని సారించును. ఈ సచ్చిదానందరసము నాస్వాదించు ఈప్సితము హృదయమునం దుండుటయే బహువిధములగు కష్టపరంపరల ననుభవించి, మానవుడు తన యంతరంగ స్వరూపముపై దృష్టిని కేంద్రీకరించుటకు గారణము. ప్రతి మానవుడును, ఎట్టి మినహాయింపునులేక, ఈరీతిగా జేయగలడు. కొందరకీ జన్మతోడనే సిద్ధించును. మరికొందరకు పెక్కు జన్మల యనంతరము ప్రాప్తించును.

శిష్యుడు:—ఇదంతయును భగవంతుని కృపావిశేషము మీదను, గురువుయొక్క యాశీర్వచనాబలము మీదను ఆధారపడియుండును.

స్వామిజి:—భగవంతుని కృపయనెడి మారుత మనాదినుండియు వీచుచునేయున్నది. నీవు నీ తెరచాపను తెరచితివా? నీ వేపనిని ఒనర్చుచున్నను, నిశ్చల మానసముతో, హృదయపూర్వకముగా నొనర్పుము. అహోరాత్రములు ''నేనా సచ్చిదానంద

స్వరూపమను. నాకు భయము, ఆదుర్దా ఎందుకు? ఈ శరీరము, మనస్సు, బుద్ధియు అశాశ్వతములు. ఈ మూడింటికి నతీతమగు వస్తువేదిగలదో యదియే నేను'' అని నిరంతరము స్మరింపుము.

శిష్యుడు:—అప్పుడప్పుడు బహు స్వల్పకాలము మాత్రమే యిట్టి భావములు గలుగుచుండును. కాని వెనువెంటనే యవి యదృశ్యమై, నిరర్థకములు నిష్ప్రయోజనములునగు సమస్త భావములు పునరుద్ధానమగుచుండును.

స్వామిజి:—ఆరంభదశయందే యీరీతిగా నుండును. కాని క్రమక్రమముగా వీనిని నిగ్రహింపవచ్చును. కాని మొదటి నుంచియు, మనస్సునందు తీవ్రమగు సంకల్పమవసరమైయున్నది. ఎల్లప్పుడును ''నేను నిర్మలుడను, జ్ఞానస్వరూపుడను, నిష్క్రియుడను, ముక్తపురుషుడను. దుశ్చేష్టితముల నెట్లు జేయగలను? నిరర్థకములగు కామినీ, కాంచనములను మాయలోబడు సామాన్య మానవునివలె, వెఱ్ఱివానినిగా నగుదునను కొంటివా?'' ఇట్టి భావములతో మనస్సునకు బలము జేకూర్చుకొనుము. ఇది తప్పక యథార్థమగు మంచిని కలుగజేయగలదు.

శిష్యుడు:—ఒకానొక సమయమున మనస్సునకు బలము చేకూరగలదు. అంతట నేను, డెప్యూటీ మేజస్ట్రేటు పరీక్షకు హాజరయ్యెదనని తలచినంతనే నా హృదయములో, ధనము, పేరు, ప్రతిష్ట సంపాదించవలయుననెడి కుతూహలము, సౌఖ్యముగను, బాగుగను జీవించవలయుననెడి కుతూహలము రేకెత్తగలవు.

స్వామిజి:—ఇట్టి భావములు, మనమునం దుద్భవించినతోడనే, నీలోనీవు, ఆత్మానాత్మవివేకమును, విచక్షణ జేయుము. వేదాంతమును నీవు పఠించలేదా? నీ సుషుప్త్యవస్థయందుగూడ, నీ శిరోభాగమున, ఆత్మానాత్మవివేకమను కరవాలము నుంచుకొనిన, స్వప్నమందుగూడ ఆశాపిశాచము దరిజేరజాలదు. ఈవిధముగా ఆత్మబలము నభ్యసించుచో, క్రమక్రమముగా, త్యాగధర్మము సిద్ధించి, నీకొరకై స్వర్గద్వారములు తెరచియుండుట నీవు గమనింపగలవు.

శిష్యుడు:—అట్లైనచో, స్వామిజీ, భక్తి గ్రంథములయందు, తీవ్రవైరాగ్యము, హృదయమునందలి మార్దవమును నశింపజేయునని ఏల జెప్పుచున్నవి?

స్వామిజి:—ఆవిధముగా నుడువు గ్రంథములను బహిష్కరించవలసినదిగా నేను జెప్పుచున్నాను. వైరాగ్యము లేనిచో, విషయేంద్రియములయందు తీవ్రమగు తృష్ణారాహిత్యము లేనిచో, కామినీ కాంచనములను అసహ్యాకరములగు ముఱికి పదార్థములవలె భావింపనిచో, ''ననిధ్యతి బ్రహ్మసతాన్తరేపి'' వందలకొలది బ్రహ్మకల్పములకైనను ఎవ్వరును మోక్షమును బొందజాలరు. భగవంతుని నామజపము, ధ్యానము, ఆరాధన, అగ్నిహోత్రమును జేయుట, వైరాగ్యోదయము కొరకే. ఎవనియందు వైరాగ్యము శూన్యమో, వాని యత్నమంతయును లంగరువేసిన నావను తెడ్డువేయువానివలె నుండును, ''నప్రజయా, నధనేన, త్యాగేనైకే అమృత్వమానసు'' ''సంతానమును బడయుటవలన

గాని, ధనమువలనగాని, కాక కేవలము వైరాగ్యము వలననే కొందరు అమృతత్వమును బొందిరి.''

శిష్యుడు:—కామినీ కాంచనములను త్యజించినంతమాత్రమున సర్వము సిద్ధించునా?

స్వామిజి:—ఈ రెంటిని త్యజించిన పిమ్మట, పేరు, ప్రతిష్ఠలు మొదలగు ఆటంకములను గూడ త్యజించవలసియుండును. అసాధారణ బలము లేనిచో, బహుకొద్దిమంది మాత్రమే వీనియందు సమత్వబుద్ధి నుంచగలరు. ప్రజలు వారిపై గౌరవములను కురిపింతురు. రకరకములగు భోగములు, క్రమక్రమముగా వారి దాపుజేరును. వీటివలననే త్యాగులలో ముప్పాతికమంది భ్రష్టులగుచున్నారు. ఈ మఠమును స్థాపించుటకును, ఇంకను మఱికొన్ని పనుల నొనర్చుటకును, తిరిగి నేను జన్మించవలసి యుండునేమో యది ఎవరు చెప్పగలరు?

శిష్యుడు:—మీరే యీవిధముగా జెప్పుచో నిక మేము ఏమి చేయగలము!

స్వామిజి:—ఎందుకు భయము? ''అభీరభీరభీః'' ''నిర్భయముగా నుండుము, నిర్భయముగా నుండుము, నిర్భయముగా నుండుము.'' నీవు నాగమహాశయుని జూచితివిగదా. గృహస్థుడైనను, ఆతడు సన్న్యాసులకంటె ఎంత ఘనుడో చూచితివా!'' ఇది యసాధారణము. ఆతనివలె నింకొకని నే జూచియుండలేదు. ఎవ్వరైనను గృహస్థులుగా నుండదలచినచో, నాగమహాశయునివలె నుండుటకు యత్నింపుడు. ఆతడు తూర్పు బెంగాలులోని ఆధ్యాత్మికాకాశమున నొక గొప్ప తేజోరూపముగా ప్రకాశించుచున్నాడు. ఆ ప్రాంతమందలి ప్రజలను, తరచు ఆతనిని దర్శించుటకు బోవునట్లు ప్రోత్సహింపుము. దానివలన లాభము గలదు.

శిష్యుడు:—భూలోకమున శ్రీ రామకృష్ణ భగవానుని యవతారమను నాటకమున, నాగమహాశయులు, మూర్తీభవించిన వినయమువలె గన్పట్టుచున్నారు.

స్వామిజి:—యథార్థము. సందేహమించుకంతయును లేదు. నేనొకసారిబోయి యాతనిని దర్శింపవలెనని తలంచుచున్నాను. నీవు నాతో వచ్చెదవా? వర్షాకాలములో నీటియందు మునిగిన పొలములను జూచుట నాకిష్టము. నీవు వానికి వ్రాయుదువా?

శిష్యుడు: తప్పకుండ వ్రాయుదును. తమ విషయమును వినినపుడెల్ల ఆనందముతో నొడలు మరచును. తమ పాదధూళిచే, తూర్పు బెంగాలంతయును యాత్రాస్థలమగునని యాతడు నుడువును.

స్వామిజి:- శ్రీ రామకృష్ణుడు నాగమహాశయునిగూర్చి ''యాతడు మండుచున్న నిప్పువంటి'' వాడని చెప్పుచుండుట నీకు దెలియునా?

శిష్యుడు:—అవును, ఆవిధముగా వినియుంటిని.

స్వామిజీకోరికపై నా శిష్యుడు కొంత ప్రసాదమును స్వీకరించి, యా ఈశ్వరప్రేరితుడగు గురువుచే బోధింపబడి, ''నేను స్వతంత్రుడను, నేను స్వతంత్రుడను'' అను ధైర్యసందేశమును గూర్చి తీవ్రముగా నాలోచించుచు చీకటి పడుచుండగా, కలకత్తా చేరుకొనెను.

# గ్రంథ సమీక్ష

## శ్రీ బుద్ధచర్య

అనువాదకులు : బ్రహ్మశ్రీ రామకృష్ణ బ్రహ్మచారి గారు, శ్రీ భూమానందాశ్రమము, గండిక్షేత్రము. ప్రకాశకులు : శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు, పుటలు 547. వెల : రూ. 3-0-0.

కపిలవస్తుపురాధీశుడైన శుద్ధోదనుని పుత్రరత్నము సిద్ధార్థుడు, తల్లి మాయాదేవి. సకలరాజభోగములను అనుభవించుచు సౌందర్యరాశి భార్యయగు యశోధరతో మహాభోగముల నోలలాడుచుండెను. ఇట్లయ్యు సర్వసంగ పరిత్యాగియై పరువంపు ప్రాయమున నే పరివ్రాజకుడై జ్ఞానముకొరకు అడవులకుపోయి తపస్సుచేయ నారంభించెను. తుదకు గయలో నొక రావిచెట్టుక్రింద జ్ఞానోదయమును పొంది సిద్ధార్థుడు బుద్ధభగవాను డను పేరుబడసెను. దశావతారములలో నొకటిగా పరిగణింతురు బుద్ధావతారమును. ప్రజలు వేదమార్గములను విడిచి నీతిదూరులై జీవహింస కలవాటుపడిరి. ఇది చూచి సహింపలేక అహింసను బోధించుటకై బుద్ధుడవతారపురుషుడుగ జన్మించెను. ఈ మహాపురుషుడే బౌద్ధమతకర్త. ఈ విషయ మందరకు విదితమే.

భారతభూమియందేకాక బర్మా, చైనా, జపాను, సయామ్ మొదలగు దేశములందు బౌద్ధము బహుళ ప్రచారమున గలదు. మొదట బుద్ధుడు బోధించిన మతము ఒక్కటియే యైనను పలువురు విద్వాంసులు అభిప్రాయభేదములతో మాధ్యమిక, యోగాచార, సౌంత్రాంతిక, వైభాషికము లను నాలుగు విధములుగా విభజించిరి. టిబెట్టు మొదలగు పాశ్చాత్య బౌద్ధులకు దేవుడు కలడు. మిగిలిన బౌద్ధులు పాశ్చాత్యులవలె గాక శాక్యమునినే పూజించుచున్నారు. వీరి విధానమున పంచభూత తత్త్వములు, పంచకర్మేంద్రియ తత్త్వములు మొదలగునవి ఇరువదిమూడు తత్త్వములు చెప్పబడినవి. ఈ తత్త్వములయందు ప్రధానమైనది బుద్ధి తత్త్వము. బుద్ధికన్న వేరైన ఆత్మ లేదని వీరు చెప్పుదురు. బుద్ధి జ్ఞానము ఒకటి. శరీరము భౌతికము - జగత్తంతయు క్షణికము. సృష్టిలో ప్రతివస్తువు ప్రతిక్షణము వృద్ధి పొందుటో, క్షీణించుటో, పటుత్వము చెడుటో, ఎండుటో మొదలగు మార్పులను పొంది చివరకు నశించి వేరుగతిగా ఉత్పన్నమగుచున్నది. ఈ విధానమే భావనాచతుష్టయము—క్షణిక భావన, దుఃఖభావన, స్వలక్షణభావన, శూన్యభావన. ఈ నాలుగును క్షణిక ధర్మములు. జగత్తంతయు క్షణికము. జీవించుట దుఃఖభాజకము. సంపూర్ణ సమానలక్షణములు గల రెండు వస్తువులు అసంభవములు. జగత్తు సర్వము శూన్యము. జన్మమెత్తి మనుష్యులు పుట్టుట, గిట్టుట—మొదలగునవి చెట్లు చేమలవలె ప్రకృతికార్యములు. జన్మము ముఖ్యముగా అజ్ఞానజనకము—దుఃఖమునకు మూలము జన్మవాంఛ. జ్ఞానోదయమునకు సూచన జన్మవాంఛా విరాగతయే. జన్మ బంధవిమోచనసాధన సన్న్యాస స్వీకరణ. బౌద్ధులయందు సన్న్యాసమునకు ప్రతివారును అర్హులే. వీరిమతగ్రంథములలో ముఖ్యమైనది త్రిపిటకము. ఇది మూడు భాగములు గలది. సుత్తపిటకము, వినయపిటకము, అభిదమ్మ పిటకము. బుద్ధుని బోధలు, ఉక్తులు కలది సుత్తపిటకము బౌద్ధ భిక్షువుల ధర్మము నిరూపింపబడినది వినయపిటకము. జీవితరహస్యము లెన్నియో వివరింపబడినవి అభిదమ్మపిటకమున. ఇది కాక (త్రిపిటకసారము) దమ్మపదమనియు, జాతకకథలు, అట్టకథలు మొదలగునవెన్నియో బౌద్ధవాఙ్మయమున గలవు. ఈ బౌద్ధవాఙ్మయమున మహాపండితుడగు రాహులసాంకృత్యాయనుడు పై ముఖ్య పాళీగ్రంథములనుండి ఏర్చి కూర్చి హిందీభాషను రచింపబడిన దీ బుద్ధచర్య. ఇట్టి హిందీ గ్రంథమును మాతృకగాగొని శ్రీ భూమానందాశ్రమవాసులగు శ్రీ రామకృష్ణ బ్రహ్మచారిగారు తేట తెలుగులో అతిసులభశైలిని "బుద్ధం శరణం గచ్ఛామి", "సంఘం శరణం గచ్ఛామి", "ధర్మం శరణం గచ్ఛామి" అను శరణత్రయ వివరణముతో పరిభాషా పదబాహుళ్యమును చక్కగా విశదీకరించిరి. బుద్ధలీలా ప్రసంగములని చెప్పదగిన శ్రీ బుద్ధచర్యను ఆంధ్రలోకమున కర్పించినారు. అనువాదక బ్రహ్మచారి కడు ధన్యులు! అమూల్యమగు అనువాదకుల పీఠిక బౌద్ధ ధర్మమును పండిత పామరులందరకును పరిచయము చేయగలదు. గ్రంథము ఐదు ఖండములు గలది. బుద్ధుని జీవితము ఉపదేశములు విద్యావంతులందరు తెలిసికొనదగినవి.

ఇట్టి మహాగ్రంథమునకు కాగితపు కరవుచే గాబోలు పీచు కాగితము లుపయోగించినారు.



Vol. VIII—5 (November 1951) Sri Ramakrishna Prabha Regd. No. M—4635

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసారప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

350 పుటలు (మద్రాసు ఆంధ్ర విశ్వవిద్యాలయములందు పాఠ్యగ్రంథము) రూ. 2-8-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు (ఆంధ్ర విశ్వవిద్యాలయమున పాఠ్యగ్రంథము) వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

136 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | | | | ... | | 0 | 8 | 0 |
| నాసంస్కరణ యుద్ధవిధానము | | | | ... | | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | | | ... | | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | | | | ... | | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | | | | ... | | 0 | 3 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | | 0 | 3 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | | ... | | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | | | | ... | | 0 | 1 | 0 |
| నా మతము | 0 | 0 | 6 | | డజను | 0 | 5 | 0 |
| సింహ గర్జన | 0 | 0 | 6 | | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాసపత్రికలును మాయొద్ద దొరకును

**శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి**

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు :

**మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.**

సంపాదకులు : శ్రీ ఋతజానందస్వామి ; శ్రీ [illegible] వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే శ్రీ జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానంద స్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-11-51.

# ప్రకటన

మీ చందా యీ నెలాఖరుతో ముగియును. రాబోవు సంవత్సరమునకు మనియార్డరు ద్వారా, మా కార్యాలయమునకు రాబోవు నెల 10-వ తేదిలోగా అందునట్లు, మీచందా (రూ. 3) పంపగోరెదము. అట్లు మనియార్డరు పంపనియెడల, రాబోవు సంచికను వి. పి. పి. ద్వారా పంపెదము. పత్రికయెడ మీ యాదరాభిమానములను యథాప్రకారముగా జూపుదురని నమ్ముచున్నాము. మనియార్డరుద్వారా మీచందా పంపినయెడల, తపాలా రిజిస్ట్రేషను చార్జీలు నాలుగణాలు మీకు మిగులునని గుర్తింతురుగాక. అనివార్యమైన యేకారణములచేతనైనను, మీరిక చందాదారుగా నుండగోరనియెడల, రాబోవునెల 10-వ [illegible] తెలుపగోరెదము.

ఉత్తరప్రత్యుత్తరము లన్నిటిలోను మీచందాదారు సంఖ్యను ఉదాహరించుచు, మీ పూర్తి పేరును, విలాసమును స్పష్టముగా వ్రాయగోరెదము.

మేనేజరు: శ్రీ రామకృష్ణ ప్రభ.

# శ్రీ రామకృష్ణ ప్రభ

50

౧౯౫౧, డిసంబరు—ఖర, మార్గశిరము

సంపుటము ౮ సంచిక ౯






శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు

చెన్నపురి

# విషయసూచిక



# శ్రీరామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు గాచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరినెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్‌వారి స్టాలులోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పుకలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములే కాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను పంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల ఒకటవ తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౮ } ౧౯౫౧ - డిసంబరు : : ఖర - మార్గశిరము { సంచిక ౭

## మనః ప్రబోధము

ధనాసరి రాగము - ఆదితాళము

స్థిరతా నహి నహిరే - మానస స్థిరతా నహి నహిరే।
తాపత్రయ సాగర మగ్నానాం దర్పాహంకార విలగ్నానాం॥ (స్థిరతా)
విషయ పాశ వేష్టిత చిత్తానాం విపరీతజ్ఞాన విమత్తానాం॥ (స్థిరతా)
పరమహంస యోగవిరుద్ధానాం బహుచంచలతర సుఖ సిద్ధానాం॥ (స్థిరతా)

—సదాశివ బ్రహ్మము.

స్థిరత్వ మనునది లేనే లేదు గదా. ఓ మనసా! స్థిరత్వము లేనే లేదు గదా।

త్రివిధ తాపములనెడి సాగరమున మునిగియున్నవారికిని గర్వాహంకారములతో గూడినవారికిని (స్థిరత్వము...)

విషయ సుఖములను రజ్జువులచే కట్టువడిన మనస్సు గలవారికిని విపరీతమైన విమత్తులకును * (స్థిరత్వము...)

పరమహంసలకు చెందిన యోగమార్గమునకు అన్యథా నడుచుకొనువారికిని, మిక్కిలి చంచలములగు సుఖముల ననుభవించుటయం దారితేరినవారికిని (స్థిరత్వము...)

* సచ్చిదానందస్వరూపుడైన ఆత్మను దేహాదులతో నేకముగా తలచుటయే విపరీతజ్ఞానము.



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

# శ్రీ రామకృష్ణ వచనామృతము —'మ.'

## దక్షిణేశ్వరాలయమున భక్తులతో శ్రీరామకృష్ణుడు

(గతసంచిక తరువాయి)

16 అక్టోబరు, 1883.

శ్రీరామ:—హరిభక్తి మాత్రము మనుష్యులకు కలిగినచో వర్ణవిచారము నశించును. (మణిమల్లికుని జూచి) ఏమోయ్ ! తులసీదాస గ్రంథములలో నీ విషయమై యేమి ప్రవచింపబడియున్నదో తెలుపుము.

మణిమల్లికుడు:—చాతకపక్షి యెంతటి తృష్ణాతురమైనను గంగా యమునాది మహానదులు, తటాకములు ఎన్నియున్నను వాని యందలి జలమును గ్రోలక స్వాతీనక్షత్రమునందు బడెడు వర్షపు చినుకులకై కాపెట్టుకొనియుండును.

శ్రీరామ:—దీని యర్థమిది; భగవత్పాదపద్మములయందలి భక్తియే ముఖ్యము గాని యితరమంతయు అముఖ్యము.

మణిమల్లికుడు:—తులసీదాసు వాక్యాంతరము–స్పర్శవేది స్పర్శమాత్రమున అష్టధాతువులును బంగారముగా మారిపోవును. అట్లే జాతులన్నియు చర్మకారకుడు చండాలుడుగూడ హరినామస్మరణమువలన పరిశుద్ధుడగును. ఆ హరినామస్మరణము లేనిచో వర్ణచతుష్టయమును చర్మకారకతుల్యమే.

శ్రీరామ:—చర్మమును మన మంటరాదు, కాని అది శుద్ధము చేయబడిన పిదప దేవళమునకుగూడ దీసికొనిపోవచ్చును. భగవన్నామోచ్చారణమువలన మానవుడు పవిత్రుడు కాగలడు. అందువలననే భగవన్నామసంకీర్తనము నభ్యసింపవలయును. నేను యదుమల్లికుని తల్లితో నిట్లంటిని. మృత్యువాసన్నమయినపుడు సంసారము విషయమే జ్ఞప్తికి వచ్చును. సంసారమునందలి సాధకబాధకములు, పుత్రీపుత్రుల యెడలి యనురాగము, ఆయవ్యయాదుల ఆలోచన, మరణశాసనము వ్రాయుట ('విల్లు వ్రాయుట')—ఇవిమాత్రమే తలంపునకు వచ్చును. కాని భగవన్నామము జ్ఞప్తికి రాదు. అందువలననే భగవన్నామజపము, సంకీర్తనము—వీని నభ్యసింపవలయును. ఆ యభ్యాసమే యున్నచో మరణకాలమున భగవన్నామమే జిహ్వాగ్రమున నుండును. రామచిలుకకు 'రామా, కృష్ణా' యన్న పలుకులు నేర్పినను పిల్లి పట్టుకొనబోవునపు డది 'క్యావు క్యావు' మని యఱచునే కాని 'రామా! కృష్ణా!' యని పలుకదు. మరణమునకు సంసిద్ధుడుగా నుండుట శ్రేయస్కరము. వార్థక్యమున నిర్జనస్థలమున కేగి భగవద్ధ్యానము, భగవన్నామజపము—వీనినే నిత్యకృత్యములు గావించుకొనవలయును. ఏనుగును స్నానముచేయించి చావడిలో కట్టి

పెట్టినచో నది తనమీద దుమ్ము పోసికొన జాలదు,

బలరాముని తండ్రి, మణిమల్లికుడు, వేణీపాలుడు—వీరందరును వృద్ధులు. అందులకే నా శ్రీరామకృష్ణులవారు వీరి కుపదేశ మిచ్చుచున్నారు!

శ్రీరామ:—నిర్జనస్థలమున కూర్చొని భగవద్ధ్యానముచేయ గోల్పుచుంటిని, ఏల తెలియునా? రేయింబవళ్లు సంసారమున నుండిన మనకు లభించునది కేవలము అశాంతియే. నూరుగజముల స్థలము కొఱకు సోదరులు కొట్టుకొని చచ్చుటను మనము చూచుచున్నాము కదా! భూమి, స్త్రీ, ధనము—ఇవియే సమస్త కలహములకు కారణములని సిక్కులు వచింతురు.

మీరు సంసారమున నున్నారు. అయిన నేమి? శ్రీరామచంద్రుడు సంసారము త్యజింపగోర దశరథుడు వసిష్ఠుని శరణుజొచ్చెను. వసిష్ఠుడు రాముని బిలిచి 'రామా! నీవు సంసారము నేల త్యజింపగోరెదవు? నాతోడ వాదింపుము. భగవంతుడులేని సంసారము గలదా? దేనిని త్యజింతువు? దేనిని గ్రహింతువు? భగవదన్యమగునదేదియు లేదు. ఆయనయే భగవానుడు, జీవము, జగత్తు—ఈ రూపముగ విరాజిల్లుచున్నాడు.

బలరాముని తండ్రి:—చాల కష్టము.

శ్రీరామ:—సాధనసమయమున నీ సంసారము మాయాపంజరముగ కనిపించును. కాని జ్ఞానోదయానంతరము ఆనందనికేతనమువలె గోచరించును. వైష్ణవగ్రంథములందు 'భగవంతుని విశ్వాసమువలననే పడయవచ్చును. శ్రీకృష్ణునకును తర్కమునకును చాల దూర' మని వచింపబడియున్నది. నమ్మకమే ప్రధానమైనది.

కృష్ణకిశోరున కెంతటి విశ్వాసము గలదు! బృందావనమందు నిమ్నజాతీయు డొకడు బావిలోని నీరు చేదిపెట్టగా, ఆతనిని నీవు శివనామోచ్చారణము గావింపుము అని, యాతడు 'శివ' యని పలికినంతట ఆ జలమును గ్రహించెను. భగవన్నామోచ్చారణము గావించిన వారికి డబ్బు ఖర్చుపెట్టి ప్రాయశ్చిత్తము చేసికోవలసిన యగత్యమేమి? రోగోపశమనార్థము భగవంతుని తులసీదళములతో బూజించుటగాంచి ఆతడాశ్చర్యపడెను. ఒకపరి సాధుసందర్శనమును గూర్చి సంభాషించుచుండ హలధారి "పంచభూతమయములగు గంతలను జూచి యేమి ప్రయోజన"మని పలుకగా ఆ పలుకులు విని కృష్ణకిశోరుడు చాల కోపముతో "అతడేల ఇట్లు పలికెను? సాధువుల శరీరములు చిన్మయదేహములని యెరుగడు గాబోలు!" ననియెను. నేను స్నానముచేయునపుడు నన్ను జూచి 'రామ, రామ' యని మీరు పలుకుచున్నారు. ఆ నామ ముచ్చరించుచు నా శరీరము త్యజించునట్లు నన్నాశీర్వదింపుడు అని కోరెను. ఆతని జూడ వారింటికేగిన నన్నుజూడగనే యాతడు భక్త్యావేశమున నృత్యము చేయును. శ్రీరామచంద్రుడు లక్ష్మణుని జూచి 'తమ్ముడా ఊర్జితమగు భక్తి నెందు జూతువో అచ్చట నే నున్నట్లు గ్రహింపుము' అని పలికెను. అట్టి శ్రేష్ఠమయిన భక్తి చైతన్యదేవున కుండెడిది. ఆయన ఆ భగవత్ ప్రేమతో నొకప్పుడు నవ్వును, ఒకప్పు డేడ్చును, మరియొకప్పుడు నృత్యము చేయును. శ్రీ చైతన్యప్రభువు అవతారపురుషుడు.

తరువాత శ్రీరామకృష్ణులు గౌరాంగుని

భగవద్భక్తిని సూచించు నొక కీర్తనను బాడెను. సంధ్యాకాలము సమీపించినది. బలరాముని తండ్రి, మణిమల్లికుడు మున్నగువారు సెలవుపుచ్చుకొని తమ తమ యిండ్లకు బోవ నారంభించిరి. పిదప కాసరితోలానుండి కొందఱు భక్తులు వచ్చిరి. వారితోబాటు శ్రీరామకృష్ణ గురుదేవుడు సంకీర్తనము గావించి భావావేశమున నృత్యముసేయ మొదలిడెను. తదనంతరము 'నేనుకూడ వారితో కొంత దూరము పోయెదను' అని పలికెను. కిశోరి భావావస్థలోనున్న శ్రీవారి పాదసేవ చేయ గోరెను. కాని భావావస్థయందున్నప్పుడు శ్రీవారు ఎవరినీ తమ్ము ముట్టుకొననిచ్చెడివారు కారు. చీకటిపడినంతట ఈశానుడు వచ్చి చేరెను. ఈశానునకు గాయత్రీ పురశ్చరణ చేయు తలంపు గలిగెను.

శ్రీరామ:—(ఈశానునితో) నీ మనస్సునం దేది కలదో దానినే చేయుము. వేరు సంశయములు లేవుగదా?

ఈశానుడు:—నే నొకవిధముగా ప్రాయశ్చిత్త మతమును సంకల్పించుకొంటిని.

శ్రీరామ:—ఈ ఆగమమార్గమున నష్ట దేమియు లేదు. ఏది బ్రహ్మమో అదియే శక్తి, కాళి. "కాళి బ్రహ్మమని తెలిసికొని ధర్మాధర్మములను నేను త్యజించితిని" అన్న కీర్తన మఱచితివా?

ఈశానుడు:—చండీస్తవమునందు 'బ్రహ్మమే ఆద్యాశక్తి; బ్రహ్మమునకు శక్తికిని భేదము లేదు' అని ప్రవచింపబడియున్నది.

శ్రీరామ:—దీనిని నోటితో వివరింపజాలము. ఎప్పుడు దీనియందు ధారణ కలుగునో అపుడే దాని భావము స్ఫురించును. సాధనానంతరము చిత్తశుద్ధి కలిగి భగవంతుడే సమస్తమునకును కర్త యను విషయము బోధపడును. అతడే మనఃప్రాణబుద్ధిస్వరూపుడు. మనము కేవలము యంత్రస్వరూపులము.—"పంకమున కరిని బంధించెదవు. పంగునిచే గిరులను లంఘింప జేయుదువు!"

చిత్తశుద్ధి కలిగినచో భగవంతుడే పురశ్చరణాది కార్యముల చేయించుచున్నాడని తెలిసికొనగలవు? 'ఎవరి పని వారే చేయించుకొనుచున్నారు. మానవులు 'మేమే చేయుచున్నా'మని వచింతురు. భగవద్దర్శనానంతరము సర్వసంశయములును పటాపంచలగును. అపుడు అనుకూల వాతావరణము గలుగును. అట్టి సందర్భమున నావికుడు తెరచాపను విప్పి చుక్కాని పట్టుకొని చుట్ట కాల్చుకొనుచు హాయిగా కూర్చొనును. అట్లే భక్తుడు సంశయ రహితుడై యుండును.

ఈశానుడుగూడ సెలవు పుచ్చుకొని వెళ్ళిన పిదప 'మ.' తో నొంటరిగ శ్రీ గురుదేవుడు మాటాడ నారంభించెను. నరేంద్రుడు, రాఖాలు, అధరసేనుడు, హాజరా—వీరిని గూర్చి ఆయన ('మ.' యొక్క) యభిప్రాయమును దెలియగోరి, 'వీరందఱును సరళస్వభావము గలవారా' యని యడిగెను. పిమ్మట 'నన్నుగూర్చి నీవేమి తలంతువు' అని ప్రశ్నించెను.

'మ.':—మీరు సరళస్వభావము గలవారే. దానితోబాటు చాల గభీరులు. మిమ్ము తెలిసికొనుట చాల కష్టము.

ఆ మాట విని శ్రీరామకృష్ణులు నవ్విరి.

—•—

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
11-8-'16.

ప్రియ వి. బాబు,

మీరు 5-వ తారీఖున వ్రాసిన యుత్తరమును ఈ యుదయముననే అందుకొంటిని. మీరు చక్కని ఆరోగ్యము గలిగి శాంతమనస్కులై భగవదారాధనము గావింతురని కోరుచున్నాను. శరీరమున్నంతవఱకు భగవానుని గుణకీర్తనము గావించుటయే కర్తవ్యము. ‘కీర్తనం పరమ సాధనమ్’ ఇక సాధనము లేమి కలవు? అంతయు ప్రేమయే. అంతకు మించిన సాధన యేది? శ్రీ వివేకానందస్వామివారు ‘ఈ యొంటి నావతో రెండు గట్లును జేరవచ్చు’ నని వచించెడివారు. ‘అనిర్వచనీయమ్ ప్రేమస్వరూపమ్ మూకాస్వాదనవత్’ * అని పలుకుచు నారదులు వెనువెంటనే ‘ప్రకాశ్యతే క్వాపి పాత్రే’ † అని వచించియున్నారు. ఈ ప్రేమను బడయు మార్గము నిట్లు సూచించియున్నారు. ‘సంకీర్త్యమానః శీఘ్రమేవావిర్భవత్యనుభావయతి భక్తాన్—సంకీర్తనము చేసినచో వారు శీఘ్రముగా ప్రకాశింతురు. భక్తులకు సయితము అనుభవమునుగల్గింతురు.’ అందువలననే ‘హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్, కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా’ అని ప్రవచింపబడియున్నది. శ్రీరామకృష్ణులవారు ‘నీ నామమే ముఖ్యమయినది, నాకు పూజాద్రవ్యములతోడి పనియేమి?’ యన్న భావముగల పాటను బాడెడివారు.

నా శుభాశీర్వచనములు
శ్రీ తురీయానంద

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
27-7-'16.

ప్రియ వి. బాబు,

కొన్నాళ్లనుండియు మీ విషయము నాకు స్ఫురించుచుండెడిది. మీకు జాబు వ్రాయ దలంచునంతలో మీ యుత్తరమే వచ్చినది. చాల సంతోషము. మరి యిక నుత్తరము వ్రాయు నవసరమేల? భావము లసంబద్ధములైన నేమి, ముఖ్యాంశములు సరిపడినచో చాలును. ఎన్ని చక్కటి విషయములను మీరు గుర్తించి యున్నారు! సత్సంగమే భగవల్లాభమునకు సర్వశ్రేష్ఠమయిన యుపాయము. ఇంతకంటెను వచనీయము నహి. భగవంతుడే సత్-చిత్-ఆనందము. సత్సంగము నాచరించినచో ఆయన సంగము చేయుటయే. యద్భుతానంద

* మూగవాడు రుచినిగూర్చి వివరింపజాలని యట్లే ప్రేమస్వరూపము వర్ణింపరానిది.

† వ్యక్తి విశేషము ననుసరించి ప్రేమ ప్రకాశించును.

స్వాములగూర్చియు, బ్రహ్మానందస్వాముల గూర్చియు నేసిద్ధాంతమునకు వచ్చియుంటిరో అది బాగున్నది. దృఢవిశ్వాసము నలవరుచు కొన్నచో మనకు మంచి శ్రేయస్సు లభించునని వచించియున్నారు. మఱియు భగవంతుని ప్రమాణము భగవానుడే యనియు వచించి యున్నారు. ఎంతటి సత్యమయిన పలుకు! 'స్వయమేవాత్మ నాత్మానమ్ వేత్థత్వం పురుషోత్తమ' * 'నమే విదుః సురగణాః ప్రభవమ్ న మహర్షయః' † కారణమేమన, 'అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః' ‡ ఆయన నెవరెఱుంగగలరు? ఆయనకు కృప కలిగి దర్శన మొసంగిననే యెఱుగవచ్చును. ఒకనాడు శ్రీరామకృష్ణులవారు ''ఓరీ కుశలవులారా! ఆయన తనంతట తానే పట్టువడనిచో మీరేమి చేయగలరు'' అను భావము గల పాటను బాడి నన్ను శోకసముద్రములో ముంచిరి. ఆనాడే నాకు సాధనములు పురుష ప్రయత్నము—వీనివలన మాత్రమే భగవంతుని బడయజాలమని స్థిరవిశ్వాసము కల్గించిరి. ఆయనయే పట్టువడవలయును. భగవానుడు ''మనసోజవీయో, నైన ద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్'' § ''యమే వైషవృణుతే తేన లభ్యః'' $ భగవంతునియెడల నిబ్బరము మీయు తరములందు పదే పదే చూచి నేను చాల సంతసించుచున్నాను. తప్పక ప్రభువు మీ ప్రార్థన లాలకించి చేయిపట్టుకొని తీసికొనిపోవునని నాకు గట్టినమ్మకము గలదు.

నా ప్రేమాశీర్వచనములు,

ఇట్లు,

శ్రీ తురీయానంద

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,

25-6-'15.

మూర్ దే...

ఎల్లప్పుడు భగవత్స్మరణము చేయుచుండుము. ఒకప్పుడు నీవు దీని నభ్యసింపగలిగినచో తరువాత నది మిక్కిలి సులభమగును. ఇదియే నీ సర్వశ్రేయస్సునకును ముఖ్యకారణమని తెలిసికొనుము.

నా శుభాశీర్వచనములు,

ఇట్లు,

శ్రీ తురీయానంద

* ఓ పురుషోత్తమా! నిన్ను నీవే యెఱుంగగలవు. అన్య లెఱుంగజాలరు. —గీత-10-15.

† ఇంద్రాది దేవతలును భృగ్వాది మహర్షులునుగూడ నా యుత్పత్తిని ఎఱుగరు. —గీత-10-2.

‡ దేవతలకును మహర్షులకును గూడ సర్వవిధముల నేనే మూలకారణమను.

§ ఆత్మ మనస్సుకంటె వేగము గలది. ఇంద్రియములు దానిని బట్టజాలవు. ఏలయన, నది వాని నతిక్రమించి గమించినది కావున. —ఈశావాసోపనిషత్ 4.

ఈ యాత్మ ఎవరిని వరించునో వారే పొందగలరు.

ముండకోపనిషత్ 3-2-3, —కఠోపనిషత్ 1-2-23.

# గోపాల్ మా

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ

(గతసంచిక తరువాయి)

ఈ విధముగ భగవదనుసంధాన మవిచ్ఛిన్నముగ రెండునెలలు గోపాల్‌మా గడపెను, అంత నట్టి దర్శనములు లేకుండెను. కాని, యాతని ధ్యానించునపుడెల్ల నాతని గాంచుచుండెడిది. ఒకపర్యాయ మామె తన కిదివరకువలె గోపాలు డెల్లపుడు గనబడుట లేదనియు, అందువలన ఆధ్యాత్మిక సంబంధముగ వెనుకబడిపోవుచుంటినా యనియు రామకృష్ణులను బ్రశ్నించుచు, గొప్ప దుఃఖముతో నిట్లనియె: ''గోపాలా, నన్నిట్లెందుకు శిక్షించితివి? నే నేతప్పుచేసితినని నీవు నీ బాలగోపాల స్వరూపమున నాకగపడుచుండుటలే''దన, గురుదేవు లామె నోదార్చుచు నిట్లనిరి నీ వసాధ్యమైన దానిని సాధించితివి. ఈ కాలమున నీకుగల యనుభూతి వంటిది సకృతు. ఆవిధముగా, సదా భగవద్దర్శనమును గాంచుచున్నచో, శరీరము నిలువదు. ఇరువదియొక్క దినములలో నెండుటాకువలె రాలిపోవును. మనసు చైతన్యశక్తికిగల మహోన్నత స్థానమున (చిత్పదార్థమునందు) లయమైనచోఁ గలియుగమునందు స్థూలశరీరము చిరకాలము జీవించియుండుట యసాధ్యము.'' ఈ యనుభూతిని బొందిన రెండు మాసముల వరకు, నామె పూర్తిగ నింకొకలోకములో నుండి, కొంచె మించుమించుగ నొడలెరుంగక, కేవల మలవాటునుబట్టి, తన దైనికచర్య నిర్జీవ యంత్రమువలె జేసికొని పోయెడిది. భగవంతునితో నింతదగ్గరి సంబంధము నేర్పరచుకొనుట సాధ్యమనుట కొక దివ్యమైన దృష్టాంతముగ నుండగలందులకుగా, గోపాలునితల్లి ప్రపంచమున కొంతకాలముపాటు జీవించియుండుట, బహుశః భగవదిచ్ఛ గాబోలు.

ఇంతటినుండి శ్రీరామకృష్ణుల భక్తులలో గొందరియెడల దనకుగల కులమునుగూర్చినవియు నితరములగునవియు నగు విచారణలపట్ల నావృద్ధురాలి పట్టింపులు క్రమేణ సడలినవి. శ్రీరామకృష్ణులు దన గోపాలుడేయను నభేదజ్ఞాన నిశ్చయ మేర్పడినప్పటినుండి, ఆమె ధ్యానసమయమున గోపాలునికంటె రామకృష్ణుల నెక్కువ తఱచుగా జూచుచుండెను. రామకృష్ణులద్వారా తనగోపాలు డామె కుపదేశించువాడు.

కొన్నాళ్లయినపిమ్మట, గోపాలునితల్లి దక్షిణేశ్వరమునకుబోయి, గురుదేవుల దర్శించి, భజనమందిరమున మాతృదేవియొద్దకు వెళ్లెను. ఆమె మామూలుగ జపముచేసికొని, యిష్టదైవమునకు నమస్కరించుచుండునప్పుడు గురు

దేవులు వచ్చిరి. "ఇప్పుడుగూడ నీ వింతగ జప మేల చేయుచున్నావు? నీ కిదివరకే కావలసినంత సిద్ధి గలిగినదిగదా?" యని గురుదేవు లడిగిరి. అంత, "నే నీ జపమును నిలిపివేయుదునా; నాకంతయు బూర్తియైనదా" యని యామె యడిగెను. "ఔను. అంతయు సమాప్తి యయినది. నీకు గావలసిన యాధ్యాత్మిక సాధనలన్నియు బూర్తియైనవి. కాని నీ కిచ్ఛయున్న (మదర్థమై) యీ శరీరక్షేమమునకై నీవు ప్రార్థింపవచ్చు"నని గురుదేవులు చెప్పిరి. ఆ మాటలను గోపాల్‌మా వినగనే తన తావళమును, దానిసంచిని గంగలో విసర్జించెను. కాని గోపాలుని (శ్రీరామకృష్ణుల) కొరకై యామె వ్రేళ్లపై జపముచేసెడిది. చాల కాలమున కామె తిరిగి తావళమును సంపాదించెను. ఎట్లో రోజులు గడుపవలెను గాన, తన సత్కాలక్షేపమున కిది యుత్తమ మార్గమని యాతావళముతో సదా జపమును చేసికొనుచుండెడిది.

బలరామ్‌బోసు ప్రతి సంవత్సరము బాగ్ బజారునందలి తన గృహమున రథోత్సవము చేయు నాచారము. ఆ కార్యమునకు గొందరి భక్తులతో గురుదేవు లాహ్వానింపబడిరి(1885). గురుదేవు లుదయముననే, భక్తగణముతో నేతెంచిరి. రామకృష్ణుల సూచనప్రకారము, బలరామ్ కమర్హాతియందలి గోపాల్‌మాను తీసికొనివచ్చుటకు మనుష్యుని పంపెను, గురుదేవు లా మధ్యాహ్నము భక్తులతో మాట్లాడుచు, గచేరిగదిలో గూర్చొనిరి. చీకటిపడుచుండెను. శ్రీగురుదేవులు హఠాత్తుగా పటమునందలి బాలకృష్ణుల యభినయమును బూని, పరవశులైరి. వారి రెండు మోకాళ్లు నొక చేయి నేలపై నానుకొని, రెండవచేతినెత్తి యెవరికొరకో నిరీక్షించుచుండునట్లు ముఖమును బైకిబెట్టి యుండిరి. ఈ యాకస్మికమైన మార్పునకు గారణమెవ్వరికి నవగాహన కాలేదు. కొద్దిక్షణములలో, గోపాలునితల్లి వచ్చినబండి, యా యింటిముందరనాగ, నా యదృష్టవంతురాలు తన ఇష్టదేవతా స్వరూపమున శ్రీరామకృష్ణులను గాంచెను. ఆ చేరినవారు గురుదేవులట్లు ప్రేరేపింపబడుట కామె భక్తియే కారణమని తెలిసికొనిరి. గోపాలుని తల్లి, "నా కీ కొయ్యబారినరూపము నచ్చదు. నా గోపాలుడు నవ్వుచు, నాడుచు, నడచుచు, బరుగెత్తుచుండవలెను. కాని యిదేమిటి! ఆతడు కట్టెవలె బిగిసిపోయెను. గోపాలు నీ భావమున జూడ నా కిష్టములే" దనెను.

ఆనంద బాష్పముల గార్చుచున్నాననుచు, లలాటము నేలపైపెట్టి గురుదేవులకు నమస్కరించెను. "ఇదేమిటి, నన్ను గోపాలా యనెదవు! నాకు నమస్కరించెదవు! లోపలకు వెళ్లి, నాకు కూరను దయారుచేయుము. ఇక్కడకు నాకు వాసనగొట్టునట్లు మసాలాతో దాలింపుపెట్టు"మని గురుదేవు లనిరి. అంత ప్రసంగించుచు భక్తులతో శ్రీవా రిట్లనిరి: "భక్తితో నేలపై దొరలినను నాడుదానిదగ్గఱకు పురుషుడు పోరాదు. భక్తులు, భక్తురాండ్రు నేగణమున కాగణము, దూరదూరముగనుండి వారి వారి యభివృద్ధిని బొందవలసినదే. భక్తురాండ్రు 'గోపాల' రీతిని పురుషులను ముద్దాడరాదు. ఎందులకన, నీ యతిమాత్ర మాతృప్రేమ మంచిదికాదు. అది కొంతకాలమునకు హానికరమైన బాంధవ్యములో దిగిపోవు"నని హెచ్చరించిరి.

బలరామునింట రెండు దినములుండి, మూడవనాటి యుదయమున రామకృష్ణులు, గోపాల్

మా, గోపాల్ మా లతో కలసి దక్షిణేశ్వరము నకు బయలుదేరిరి. బలరాముని యింటి యాడు వారు గోపాలుని తల్లికి గొన్ని బట్టలను, పాత్ర లను బహుమానముగా నిచ్చి, వానిని వారి పడవలో బెట్టిరి. పడవ కొంతదూరము నడచు సరికి, గురుదేవుల దృష్టి యామూటపై బడెను. ఇదేమిటని, విషయమును రామకృష్ణులు తెలిసి కొని, గంభీరముగ నిట్లు గోలప్ మాతో ననిరి: ''భగవంతునికొర కెవరు సర్వస్వమును త్యాగ ము చేయుదురో వారికే దేవుడు ప్రత్యక్షమగును. ఇతరుని యాతిథ్యముతో మాత్రము తృప్తి నొంది, పై బహుమతులను వేటినీ చేతితో నందుకొనక తిరిగివచ్చు భక్తుడు భగవంతునికి బహు సన్నిహితముగ నుండును.'' గోపాలుని తల్లితో నొక్కమాటైన పలుకక యామె మూట వైపునకే రామకృష్ణులు చూచుచుండిరి. ఆమె పశ్చాత్తాపముతో బాధజెంది, మూటను పార వేయవలె ననుకొనెను. శ్రీ రామకృష్ణులు మా మూలుగా పరమదయాళువు. అవసరమైన నాయన బహు గడ్డు. శిక్షాక్రమము సాధారణ ముగ బహుసూక్ష్మము—కొంచె ముపేక్షా భావము లేదా బాగుగ నెక్కువపక్షము మృదు వుగ నాక్షేపించుటయో. మిగిలినదంతయు వారి మానవాతీతమగు ప్రేమయే యొనర్చెడిది.

గోపాలుని తల్లి దక్షిణేశ్వరము చేరి, మాతృదేవికడ కేగి చింతాక్రాంతురాలై, ''గోపాలు డీ వస్తువుల మూటనుగురించి నాపై కోపముగ నున్నాడు. నే నేమిచేయుదును? నేను దీనిని ఇంటికి దీసికొని వెళ్లకుండ నిచ్చట బంచి పెట్టెద'' ననిమె. శ్రీ మాత యా వృద్ధురాలి నోదార్చి, ''తల్లీ! వ్యాకులపడకుము. ఆతని యిష్టమేదో చెప్పనిమ్ము. ప్రపంచమున నీకు సాయపడువారెవ్వరును లేరు. ఇవి నీకు కావలసి యుండి యంగీకరించితి'' వనిమె. ఐనను, వానిలో కొన్నిటిని బంచిపెట్టెను. పిమ్మట గురుదేవులకు గొన్ని కూరలను వండి, యాతని కవి తినిపించు టకు గొంత బెదురుతో వెళ్లెను. శ్రీ రామ కృష్ణు లామె పశ్చాత్తాపమునుజూచి, యా విషయ మెన్నడు స్మరింపలేదు. ఆమె బాగుగ, కులాసాగా, నానందముతో సాయంకాలము కమర్హాతి చేరెను.

ఈ సాధ్వియెడల గురుదేవుల గౌరవాదర ములు వర్ణనాతీతములు. ఆ కాలమున ననేకులు మారువాళీలు శ్రీవారిని దర్శించి, కలకండ, పళ్లు వారికి సమర్పించెడివారు. వీనిని భక్తులకు బెట్టుటగాని, తాను తినుటగాని సకృతు. ఆ సమర్పణములు నీచమైన స్వార్థములగు తలం పులతో మేళవించియుండుననియు, నవి పుచ్చు కొనిన వారల మనస్సులు తప్పక నపవిత్రులం జేయుననియు గురుదేవులు చెప్పుచుండెడివారు. కాని యిర్వుర విషయములం దిది వర్తింపదు. ఎట్టి యపవిత్రమునకైనను లొంగని జ్ఞానదీప్తి గల నరేంద్రు లందొకరు (స్వామిజీ), అన్ని యైహిక కిల్బిషముల కతీతముగ నుండిన గోపాలుని తల్లి యొకతె.

ఒకనాడు గురుదేవులను జూచుటకు గోపాల్ మా భక్తురాంద్రతో వచ్చెను. ఆమెను జూడ గనే, బిడ్డనివలె గురుదేవు లామెను ముద్దు లాడిరి. అచ్చటనున్న వారల కామెను జూపుచు, ''ఆహా! ఈ శరీరములో నీశ్వరుడు తప్ప నింకేమియును లేదు. ఆమె ఈశ్వరమయమై యున్నది'' యనిరి. గోపాలుని తల్లి ముగ్ధయై నిల్చియుండెను. ఆమె తన పాదములనుగూడ గురుదేవులను ముట్టుకొన నిచ్చెను. అచ్చట నాయన యామెకు తినిపించెను. అంత నామె, ''నాకు తినిపించుటలో నీ కింత ముద్దే'' లని

యడిగెను. గురుదేవులు తమ కామె జన్మజన్మములనుండి యనేక వస్తువులను దినిపించినదని బదులు జెప్పిరి. సాయంకాల మామె కమర్హాతికి తిరిగి వెళ్లిపోవుచుండ, మారువాళీలు తనకు కానుకగ నిచ్చిన కలకండను విస్తారముగ నామె నంగీకరింపుమనిరి. అంత కలకండ తనకెందు కిచ్చుచున్నారని యామె యడిగెను. గురుదేవులపార దయతో నామె చెక్కిలి బట్టుకొని, "మంచిది, నీ విదివరలో బెల్లపు పాకమవు; అంతట నీవు శర్కరవైతివి. ఇప్పుడు నీవు కలకండవు. కనుక, కలకండను దిని, యానందముగ నుండు"మనిరి.

ఒకనాడు గోపాలుని తల్లియు, నరేంద్రులు (వివేకానందస్వామివారు) ను దక్షిణేశ్వరము వచ్చిరి. ఈ యిద్దర యాశ్చర్యమగు తారతమ్య మింతగ నెచ్చటను గానరాదు. శ్రీరామకృష్ణులు తన యసమాన హాస్యబుద్ధితో, నీ యిద్దరి భక్తి, యనుభవముల తహవేలు వేసికొనుటకై పురికొల్పిరి. గోపాలుని చదువుకొనని, కపటమెరుగని స్త్రీ. ఆమె భగవద్దర్శనముల ననుభవములో గలది. నరేంద్రుడు విద్యావంతుడు; ఇప్పటికాలపు యువకుడును, బ్రహ్మసమాజ పరాయణుడునగుటచే నిరాకార బ్రహ్మమునందు నమ్మిక గల్గియుండెను. వీరిద్దరు రామకృష్ణులయొద్ద గలసికొనిరి. కొంచెము వినోదమును గోరి శ్రీరామకృష్ణు లీ యవకాశమును పోనీయ లేదు. నరేంద్రునికి దన దర్శనానుభవములను జెప్పుమని గోపాలుని తల్లితో రామకృష్ణు లనిరి. ఈ యనుభవములను దనకైనను వెల్లడిచేయ వలదని గురుదేవులు మున్ను హెచ్చరించి యుండుటచే, వానిని జెప్పుటలో బాధ లేదు గదా యని యామె గురుదేవుల నడిగెను. గురుదేవులు హానిలేదని ప్రోత్సహించుటచే, నామె యద్భుతములై కనపడు—గుండెలు ఝల్లుమనిపించు—ఆ బాలకృష్ణునితో గల తన జీవితానుభవములను గన్నీరొలుకజెప్పెను. పైకి నరేంద్రుడు యుక్తివాదియై గానిపించినను, నంతరంగమున దైవభక్తియందలి తీవ్రత, యపరిమితమైన శ్రద్ధయు గల్గియుండుటచే, నామె చెప్పునది వినుచు దానుగూడ కన్నీటి నాపుకొనలేకపోయెను. మధ్య మధ్య నామె చెప్పుచు, చెప్పుచు, నమాయకముగ, నిష్కపటముగ, "నాయనా! నీవు విద్యావంతుడవు. తెలివిగలవాడవు. బుద్ధిమంతుడవు. నేను విద్యలేని బీదవితంతువను. వృద్ధురాలను. నాకేమియు తెలియదు. ఈ గోపాలుని దర్శనములు యథార్థములేనా చెప్పు"మను చుండెడిది. ఆమె యడిగినప్పుడెల్ల నవి 'అక్షరాలా' అన్నియు యథార్థములే యనుచు, భక్తిచే గన్నీరుగార్చుచు నరేంద్రుడు వచించెడువాడు.

రామకృష్ణుల నిర్యాణానంతర మామె మనసు దుఃఖాక్రాంతమై, కడుదీనముగ నుండెడిది. ఆమె యెన్నాళ్లకోగాని తనగదినుండి బయటకు రాలేదు. అప్పుడప్పుడు, శ్రీ రామకృష్ణుల దర్శనమగుట ప్రారంభమయ్యెను. ఆమె సమాధానపడినది. ఆమె కేమాత్ర మశాంతిగ నుండినను మఠమునకు వెళ్లి, శ్రీవారి శిష్యుల జూచి, వారితో నచట నుండెడిది.

గోపాలుని తల్లి యొకనాడు గంగానది యావలిగట్టుననున్న మహేష్ అను స్థలమున రథోత్సవమును జూచుటకు వెళ్లినది. అచ్చట నామె కొక వింత యనుభవము గల్గెను. రథము లాగబడుచుండ నామె ముందర నెల్లెడల

గోపాలుని దర్శనమే—ఆ జనవిస్తారమేమి! రథమేమి! రథముపైనున్న దేవుడేమి! అందు దేవుని సర్వవ్యాపకత్వమునుగాంచి యానంద పరవశయై యామె మైమరచినది.

స్వామీజీ పశ్చిమఖండమునుండి, తిరిగి వచ్చినప్పుడు, వారితో సారాబుల్ సతి, మిస్ మక్లాడ్, సోదరి నివేదిత మొదలగు శిష్యురాండ్రు హిందూదేశమునకు వచ్చిరి. వీరందఱొకపర్యాయము గోపాలుని తల్లి దర్శనార్థము కమర్హాటి వెళ్లిరి. ఆమె వారలందఱు, గడు నాదరముసేయుచు, వారియందు దన గోపాలునే గాంచెను. తన చాపపై వారల నాసీనులుగ జేసి, దేశీయములగు మంచి రుచ్యపదార్థములను వారికి బెట్టెను. మన తల్లుల యలవాటుగనే, ఆమె వారల చెక్కిలి గొట్టుచు ముద్దులాడెను. వారి కోర్కెపై దన దివ్యానుభవముల నెన్నియో వారికి జెప్పెను.

ఈ సందర్భమునుగూర్చి సోదరి నివేదిత యిట్లు వర్ణించెను. ''మేము కొద్దిమంది ఆమె దర్శనమునకై యామె తావునకు వెళ్లియుంటిమి. అది పున్నమ రేయి. మా నావ చల్లగ నడచుచుండ గంగానది యెంతో రమణీయముగ నుండెను. నీటిలోనుండి గట్టబడిన యా సుందరమగు స్నానాలరేవున గల మెట్ల నెక్కి మెల్లగా, నదివరలో నెవరో నొకరునకై కట్టించిన గది యనుకొందును, ఎన్నియో సంవత్సరముల నుండి జపమును జేయుచు, జపమాలలను ద్రిప్పుచు, గోపాల్ మా యుండియుండిన గదిలో బ్రవేశించితిమి. ఆమె శయ్య శిల, నేలంతయు శిలయే. ఆమె యలమారనుండి తీసి, విప్పి, మాకు కూర్చొనుడని యిచ్చిన యాసన మొక చాప. త్రాళ్లతో నటుకకు వ్రేలాడగట్టిన, యుట్టిమీద పిడతలో నుండిన పట్టెడడుకులును, గలకండయు నామె 'ఖీర్ గిరి'. ఇదియే మా కామె యిచ్చిన యాతిథ్యము. జపమాలను ద్రిప్పి, యామె పరమ పావని యాయెను. గంట తర్వాత గంట. రోజు గడచి రోజు ఎన్ని సంవత్సరములిటుల రేయింబవళులు కూర్చొని, తావళముతో నామె మైమరచియుండెనో! తనకు శ్రీవారియందు వాత్సల్యభావ మేర్పడిననాటి నుండి, శ్రీ రామకృష్ణుల కామె నమస్కరింప లేదు. వారు ఆమెను మాతృభావన జేసిచూచెడి వారు.'' స్వామీజీ యీ సందర్భమున వారితో నిటుల చెప్పియుండిరి. ''ఆ! ఇదియే పురాతనమగు హిందూదేశము. మీరు జూచునది, ఆ ప్రార్థనలతో, నశ్రుధారలతో, నుపవాసములతో, జాగరములతో నిండిన హిందూదేశము! ఈ దశ మారిపోవుచున్నది, మరల రాదు!'' నిజముగా బురాతన హిందూదేశ మామెయందున్నది, ఎందువలననగ, హిందూదేశమున జిన్న బిడ్డనికైన, నీ జీవితముననే, ఈశ్వరానుభూతి ముఖాముఖిగా గలుగునని తెలియగలదు. గోపాల్ మా చిన్ననాటనే వైధవ్యము గలిగి ప్రపంచపు బోకడలు బొత్తిగా దెలియక, భౌతిక సుఖముల నన్నింటిని త్యాగముజేసి, ఈశ్వర సాక్షాత్కారమునకు, సేవకు జీవితమంతయు వినియోగించెను. ఆమెకు గలిగిన యీశ్వర దర్శనములు, ననుభవములు నెంత వింతైనవి! ఆశ్చర్యమైనవి! ఈశ్వరుని నమ్మని కాలమున మనకందఱకు నామె నిశ్చయముగ నొక జ్యోతి.

పందొమ్మిదవశతాబ్ది మొదట నామె బ్రాహ్మణకుటుంబమున బుట్టి, చిన్ననాటనే వైధవ్యముగల్గిన యామె నడకయంతయు విపరీతమగు నాచారకాండకు లోనైయుండెను. మొదట శ్రీ రామకృష్ణులు ముట్టిన యాహార

మును భుజింప నొల్లలేదు. దక్షిణేశ్వరము రాను రాను, కొంచె మా ఛాందసము సడలి నది. ఆ తర్వాత నామె యెంతగ మారినదన సోదరి నివేదితవంటి యన్యదేశీయను, శారదా మాత గృహమున నివసించుట కాటంకపరచ లేదు.

1904–వ సంవత్సరమున నామెకు జాల సుస్తీ చేసినప్పు డామెను బలరామ మందిరమునకు తీసికొని వెళ్లిరి. సోదరి నివేదిత యామెను జూచి, యెంతయో వలపుజెంది యామెకు బరిచర్య చేయ గుతూహలపడెను. ప్రతి హృదయమునను గోపాలుడే గాన సోదరి నివేదిత దన కుపచారము జేయుట కామె కెట్టి యభ్యంతరము గల్గింపలేదు. అప్పటినుండియు సోదరి నివేదిత యింట నామె నివసింప నారంభించెను. అవసాన కాలమున నామెను గంగానదియొద్దనకు జేర్చిరి. ఆమెను సోదరి నివేదిత పూలతోడను, దండల తోడను అలంకరించెను, ఆమె (1–7–1906) తొంబదియవ సంవత్సరమున పరమపదించెను.

ప్రహ్లాదుడు భక్తితత్పరతగనిన, "ఇందుగల డందులేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకిచూచిన నందందే కల" డను భాగవత సత్యము మన కీ గోపాల్ మాయందు ప్రత్యక్షదర్శనము. నీమెచరిత్రము భక్తులెల్లరకు విష్ణుసాయుజ్యము సాధ్యమను నుత్సాహమును జనింపజేయును.



ప్రారంభదశలో కర్మసంబంధమైన గందరగోళము ఎక్కువగా నుండును. కాని నీవు భగవానుని సమీపించినకొలదియు కర్మము క్షీణించుచుండును. తుదకు సంపూర్ణమైన కర్మపరిత్యాగమును సమాధిస్థితియు లభించును. సాధారణముగా సమాధిస్థితిని బొందినవెనుక శరీరము విశేషకాలము నిలువదు. కాని కొందఱివిషయము వేఱు. లోకమునకు బోధించు నిమిత్తము వారి శరీరము నిలుచును. నారదునివంటి మహర్షులును శ్రీచైతన్యునివంటి అవతారపురుషులును ఇట్టివారు. నూయి త్రవ్విన వెనుక తట్టలు, పాఱలు మొదలగు పరికరముల నన్నిటిని కొందఱు పాఱవేయుదురు. కాని మఱికొందఱు ఇరుగుపొరుగువారి కవి పనికివచ్చు నని వానిని భద్రముగా దాచియుంతురు. అట్టి మహనీయులు లోకులను జూచి జాలిపడుదురు, పరితపింతురు. తమ జ్ఞానప్రాప్తిని మాత్రమే చూచుకొను నంతటి స్వార్థపరులు కారు వారు.

శ్రీ రామకృష్ణ పరమహంస

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# మహనీయుల దివ్యప్రసంగములు

## ౧

## శ్రీ చిరంతనానంద స్వామి

పరమానందదాయకమగు భగవదనుభూతి నందియుండువారే మహనీయులు. వారి ఘనతయే ఘనత, అదియే నిజమైన మహత్త్వము. నాఁడు చతురంగబలసమేతులగు సార్వభౌములును నేఁడు 'ఆటంబాంబు' బలసమన్వితులగు సామ్రాజ్యాధిపతులును ఆత్మ సామ్రాజ్యాధిపతులముందు నిజముగా క్రిమికీటకతుల్యులు. అట్లని పశుబలము—అస్త్రశస్త్రబలము—సమాజమునకు అనావశ్యక మందుమా? కాదు. అస్త్రశస్త్రబలమును ఆత్మబలమును రెండును గూడ సమాజసంస్థితికి ఆవశ్యకములే. శ్లో. ''యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః, తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.—ఎచట సర్వయోగ ప్రవర్తకుఁడగు శ్రీ కృష్ణుఁడును ధనుర్ధరుఁడగు నర్జునుఁడును ఉందురో, అచ్చట సంపద, జయము, ఐశ్వర్యము, స్థిరమగు నీతియు నుండు నని నా మతము (సంజయుని మతము)'' అని కదా భగవద్గీతయందలి అంతిమశ్లోకము? యోగేశ్వరుఁడగు శ్రీ కృష్ణుఁడు ఆత్మబల ప్రతినిధి, ధనుర్ధరుఁడగు నర్జునుఁడు అస్త్రశస్త్రబలప్రతినిధి. ఈ యుభయుల సమ్మేళనమే చతుర్విధపురుషార్థసాధనభూతమై యొప్పియున్నది. మహాబలాన్వితమగు మత్తేభమును నిపుణుఁడగు మావటివాఁడు లొంగఁదీసి నడపునపుడే అయ్యది మహాప్రయోజనములను నెఱవేర్చు రీతిని, లేనిచో, అది మహావిపత్కరము, విధ్వంసకము నగుచందమునను పశుబలము—అస్త్రశస్త్రబలము—అనెడి మత్తేభమును యోగబలము—ఆధ్యాత్మికబలము—అనెడి మావటి యధిరోహించి సన్మార్గమున నడపునపుడే అయ్యది దివ్యప్రయోజనదాయకమై శోభించును, లేనిచో సర్వవినాశకముగాఁ బరిణమించును.

ఇట్టి యాత్మవిజయోపేతులగు మహనీయుల ప్రసంగములే దివ్యప్రసంగములు. స్వయముగా దివ్యావేశసంజనితములైన యా ప్రసంగములు శ్రోతలకు దివ్యావేశసంజనకములై భాసించుచుండును. మల్లెలు, గులాబులు, తామరలు మొదలగు పూవులు తమ సుగంధసౌందర్యములను వెదచల్లుచు నెల్లరకును మనోహరమై యొప్పుచుండురీతిని మహనీయుల దివ్యవాక్కులు తమ మహోన్నతభావము లనెడి పరిమళములచే, సరళమృదులపదజాల మనెడి సోయగముచే, అంతరార్థము లనెడి తేనియలచే నెల్లరి యుల్లములను బల్లవింపఁ జేయుచుండును. స్వాను

భవపూర్వకములై యుండుటయే వారల ప్రసంగములును సల్లాపములును ఇట్లు శోభించుచుండుటకు మూలకారణము. అనుభవరహితమగు వాక్కులు అసువులు వాసిన కళేబరముల వంటివి. ఆచరణహీనులగు వా రెంతటి చక్కని వాక్కులు పలికినను, ఎంతటి గంభీరోపన్యాసము లొనర్చినను నేతిబీరకాయలలో నెంత నేయి యుండునో, విభూతిపండ్లలో నెంత రస ముండునో, ఆ వాక్కులలో, ఆ యుపన్యాసము లలో నంత సారస్య ముండును.

నక్షత్రములును నభోమండలమును నొండొంటిచేఁ బ్రకాశించు రీతిని అనుష్ఠానపరాయణులగు మహనీయుల నోటినుండి వెలువడియుండుటచే సదుపదేశములును, సదుపదేశములను వెలువరించియుండుటచే వారల మహాత్త్వమును శోభించుచుండును. "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" యని యే శ్రీరామకృష్ణపరమహంసయో, ఏ రమణమహర్షియో, అధమపక్షము ఏ యుత్తమసాధకుఁడో చెప్పినన్నచో జనులు విందురుగాని, లౌకికుఁడగు నే పుల్లయ్యయో చెప్పినన్నచో, "చాల్లేవయ్యా, నీ వేదాంతము!" అని చీకొట్టుదురుగదా? అనుభవాభిజ్ఞత లనునవి పారమార్థికవిషయములందే కాదు, వ్యావహారికవిషయములందును నిట్టివే. ఐహికవిషయములలో సైతము ఏ అలాడి కృష్ణస్వామియో చెప్పిన వ్యాజ్యెపు సలహాయందు జనులకుఁ గలుగు విశ్వాసము, అదే సలహా యగుఁగాక, ఏ కళ్ళప్పో చెప్పినన్నచో, కలుగఁజాలదు కదా? శంఖమునఁ బోసిననేకాని తీర్థము కాదను సామెత యిందువలననే పుట్టియున్నది.

దివ్యాభరణస్థగితమై యొప్పు రత్నమును పేడకుప్పలోఁ బొదిగిన, సొగ సేముండును? దివ్యప్రసంగవిషయముననేకాక సర్వవిషయములందును దేశకాలపాత్రము లనునవి వర్తించును. పందికిఁ బన్నీటిస్నానమా! కసాయివానికి గోదానమా! కల్లుపాకలో సంధ్యావందనమా! సుస్నాతుఁడై, శుచిమంతుఁడై, భక్తిప్రపత్తులతో పూజామందిరమునకుఁ బోవువానివలె వేదశాస్త్రములందలి మహోపదేశముల నుచ్చరించువాఁడును వానిని జనులకు బోధింపఁబూనువాఁడును ముందుగాఁ దమ తలఁపులను, చెయిదములను శరీరమునుగూడ పరిశుద్ధమొనర్చుకొనఁ బూనవలయును. "సత్యపూతం యదే ద్వాచం మనఃపూతం సమాచరేత్" అని మనుమహర్షి యుపదేశించుచున్న చందమున, సత్యముచేఁ బరిశుద్ధమగు వాక్కులనే పలుకఁదగును, వినిర్మలమనఃపూర్వకములైనట్టి కార్యములనే ఆచరింపఁదగును. ఇట్టి సదాచారసంశోభితులగువారి ప్రసంగములే దివ్యప్రసంగములు. తద్విరహితులగువారి మాటలో, ప్రలాపములు.

వేదాంతము ఆచరణశూన్యులగువారి నోటియందుఁ బడి వాచావేదాంతమై—కలువాయి వేదాంతమై—మిట్టవేదాంతమై పిట్టతలలు వేయుచుండును.

# వై రా గ్య గీ తా లు

శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ.

—: ఆటవెలఁదులు :—

నిన్న యొన్న నేఁడు నిముసంబు నిముసంబు, చచ్చి పుచ్చి పోవు జనులఁ దలఁచి
చావ కుండు, లేక చచ్చి పుట్టక యుండు, త్రోవఁ దెలిసికొనుము నీవు మనస! ౧

క్షణము క్షణము మృత్యు సాన్నిధ్యమున కేఁగు, చుంటి వీవు; భ్రమయు చుంటి సుఖము
లందుచుంటి ననుచు నయ్యొ నీసుఖములు, మండ, నాత్మసుఖము మఱఁగు మనస! ౨

పుట్టు నరుఁడు పిదప గిట్టును పుట్టును, గిట్టు మరలఁ బుట్టు గిట్టు నిట్టు
పుట్టిపుట్టి చచ్చి పోయెడు వారితోఁ, బోక మనుము దొడ్డబుద్ధి మనస! ౩

కలుకలాఁడిఁ జూచి వలపూనఁ బూనెదు, వల దటన్న వినక పరుగు లిడెదు
పళ్లు రాలఁ గొట్టి పడవైతు జాగ్రత్త, ఇది యెఱింగి మసలు మింక మనస! ౪

మంచికొఱకు నిన్ను మరియాదగా నింత, కాల మూరకున్న గంగఁ గలుపఁ
[illegible] తు నన్ను నిన్నుఁ జూచుచు నున్నాను, మంచివంక. కింక మఱలు మనస! ౫

నిన్ను నే జయింప నిఖిలంబును జయించి, నట్టులౌను గాన నణఁగిమణఁగి
యుండవేని నిన్ను నూరక కాల్క్రిందఁ, బెట్టి రాచివైతుఁ బట్టి మనస! ౬

ఇహ మశాశ్వత మని యెఱిఁగియుండియు నీవు, మోసపుత్తు నన్ను మూర్ఖముగను
ఆలు బిడ్డఁ జూపి యర్థంబుఁ జూపియు, నిన్నుఁ జీల్చివైతు నిజము మనస! ౭

పంచభూతమయము పరమహేయం బగు, కాంత యొడలు భోగకారణ మని
మూర్ఖజనులు గంగ మునుఁగుచుందురు వారి, కర్మ; యాత్మసుఖముఁ గనుము మనస! ౮

కాంతపైని ఆశ కలిగెనేని మనంబ! ముక్తికాంతఁ గూడ మోహపడుము.
కాంచనంబుపైని కలిగెనేని భ్రమంబు, కనకవర్ణు హరిని గనుము మనస! ౯

రాగ మందఁ గను విరాగమందు మనంబ! రక్తి గాంచు మాత్మరతిని సతము
పొందఁ జూడు విష్ణు పూర్ణ సాయుజ్యంబు, లన్య మేల నీకు నరయ మనస! ౧౦

# శ్రీ వాసుదేవ మననము

## ప్రథమ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

జ్ఞానము (1) పరోక్షజ్ఞానము (2) అపరోక్షజ్ఞానము నని రెండు విధములు. "అస్తి బ్రహ్మేతిచేద్వేద పరోక్షజ్ఞానమేవతత్। అహం బ్రహ్మేతిచేద్వేద సాక్షాత్కారస్స ఉచ్యతే॥" (వరాహ.ఉ. 2-41.) పరబ్రహ్మము ఉన్నదిఅని సద్గురుబోధిత వేదాంతశ్రవణమువలన గలిగిన నిశ్చయజ్ఞానము పరోక్షజ్ఞానము. అనగా పరబ్రహ్మమును ఆత్మకంటె నన్యముగ భావించి యటులనే ఉపాసించుట పరోక్షజ్ఞానము. ఇదియే శ్రవణము. ఈ శ్రవణముచేత 'వస్తునాస్తి = పరబ్రహ్మములేదు' అనెడి వ్యవహారకారణమైన అసత్త్వావరణము నశించును. అంతట 'వస్త్వస్తి = పరబ్రహ్మము ఉన్నది' అని పరోక్షముగ దెలియును. "ప్రథమం శ్రవణం కృత్వా ద్వితీయే మననంతదా। నిదిధ్యాసనకంపశ్చాత్ సాక్షాత్కారస్తదాభవేత్॥" (కపిలః) సద్గురుముఖమున **మొదట** వేదాంత శ్రవణమును, తరువాత మననమును, తదనంతరము నిదిధ్యాసనమును అభ్యసించినయంతట ఆత్మ సాక్షాత్కారము సిద్ధించును. శ్రవణముచేత సంశయభావన, మననముచేత అసంభావన, నిదిధ్యాసనముచేత విపరీతభావనయు నను ప్రతిబంధకత్రయమును (పంచమవర్ణకమున చూడుము) నివర్తించి నిశ్చయ దేహాత్మజ్ఞానమువలె నిశ్చల బ్రహ్మాత్మజ్ఞాన మపరోక్షముగ నవగతమగును. ఇట్టి బ్రహ్మాత్మైకత్వానుభవసిద్ధియే ఆత్మసాక్షాత్కారమనబడును. ఇదియే అపరోక్షజ్ఞానము. "జ్ఞానపదస్యానుభవపరత్వాదితిశ్రుతి." జ్ఞానమన అనుభవమని శ్రుతి. కనుక అపరోక్షజ్ఞానమన స్వాత్మోపలబ్ధి-కైవల్యానుభవము. దీనిచేత 'వస్తునభాతి'='బ్రహ్మముప్రకాశించుటలేదు' అనెడి వ్యవహారహేతువైన అభానావరణము నశించును. ఇట్లు పరోక్షజ్ఞానము చేతను అపరోక్షజ్ఞానముచేతను 'బ్రహ్మనాస్తి'-'బ్రహ్మనభాతి' 'బ్రహ్మములేదు-బ్రహ్మము ప్రకాశించుటలేదు' అనెడి వ్యవహార కారణమైన ఆవరణద్వయము కూడ నశించుచున్నది. "అవిద్యావృతితాదాత్మ్యే విద్యయైవవినశ్యతః విక్షేపస్య స్వరూపంతు ప్రారబ్ధక్షయమీక్షతేః" (పంచదశి. 6-53) అవిద్యయే ముఖ్యకారణముగాగల ఆవృతియు (ఆవరణమును) తాదాత్మ్యమును (అన్యోన్యాధ్యాసమును)("పరత్ర పరావభాసః అధ్యాసః"='ఒకవస్తువునందు మఱియొకవస్తువు తోచుట అధ్యాసము') అపరోక్షజ్ఞానము (స్వాత్మాపరోక్షసాక్షాత్కారము) చేతనే నశించుచున్నవి. ప్రారబ్ధకర్మసహితావిద్యాజన్యవిక్షేపస్వరూపమన్ననో ప్రారబ్ధకర్మావసాన

మును జూచుచున్నది. అనగా ప్రారబ్ధకర్మ క్షయాంతమగునంతపర్యంతము నశింపక ప్రవర్తించుచుండును. ప్రారబ్ధకర్మ క్షయమే విక్షేప స్వరూప వినాశము. స్థూల సూక్ష్మశరీర విశిష్టమైన చిదాభాసుడు – ్డు – విక్షేపమనియు, స్థూల సూక్ష్మ దేహములు రెండును విక్షేప స్వరూపమనియుం దెలియవలయును. ఇట్లు ఆవరణద్వయము నశించినతోడనే అనర్థ (సంసార) నివృత్తియు ఆనందావాప్తియు సిద్ధించును. ఇవ్విధమున సప్తావస్థలు సిద్ధించుచున్నవి. సప్తావస్థలనగా,—"అజ్ఞాన మావృతిస్తద్వ ద్విక్షేపశ్చ పరోక్షధీః। అపరోక్షమతిః శోకహాతి స్తృప్తిర్నిరంకుశా॥" (పంచదశి. 7-33.) 1 అజ్ఞానము, 2 ఆవరణద్వయము, 3 విక్షేపము, 4 పరోక్షజ్ఞానము. 5 అపరోక్షజ్ఞానము, 6 శోకహాతి, 7 నిరంకుశతృప్తి.

అజ్ఞానమనగా,—"రజ్జౌ సర్పభ్రాంతిరివా ద్వితీయే సర్వానుస్యూతే సర్వమయే బ్రహ్మణి దేవతిర్యఙ్నరస్థావర స్త్రీపురుష వర్ణాశ్రమ బంధమోక్షోపాధి నానాత్మభేద కల్పితం జ్ఞానమజ్ఞానం॥" (నిరాలంబ. ఉ.) రజ్జువునందు సర్పభ్రాంతివలె, అద్వితీయము సర్వానుస్యూతము, సర్వమయమునైన అఖండైకరస పరబ్రహ్మమునందు దేవ తిర్యఙ్నరాది జంగమములు, పర్వతపాదపాది స్థావరములు, స్త్రీపురుష వర్ణాశ్రమ బంధ మోక్షములు అనియెడి ఉపాధిరూపములుగ నానాత్మభేదము ఏజ్ఞానముచేత గల్పితమైనదో ఆజ్ఞానమే అజ్ఞానమునాబడు. ఈ యజ్ఞానముచేతనే చిదాభాసుడు అద్వితీయాఖండైకరస సచ్చిదానందాత్మకమగు స్వస్వరూపమును విస్మరించి నన్ను నేనెఱుగనను చున్నాడు. ఇదియే అజ్ఞానావస్థ. 2 ఆవృతియనగా.—బ్రహ్మము లేదు– ప్రకాశించుట లేదు అనెడి విపరీత వ్యవహారము ఆవరణకార్యము. ఇట్టి వ్యవహారదశ ఆవృత్త్యవస్థ. 3 విక్షేపమనగా.—'అఖండవస్త్వనవలంబనేన చిత్తవృత్తేరన్యావలంబనం విక్షేపః॥" చిత్తవృత్తి అఖండ పరబ్రహ్మము నవలంబించక తద్విలక్షణమైన ప్రపంచము నవలంబించుట విక్షేపము. సకలవికారముల యందు అహంకార మమకార భావనాదశ విక్షేపావస్థ. 4 పరోక్షజ్ఞానమనగా.—"అహం బ్రహ్మేత్యనుల్లిఖ్య బ్రహ్మాస్తీత్యేవముల్లిఖేత్। పరోక్షజ్ఞానమేతత్ న భ్రాంతం బాధానిరూపణాత్॥" (పంచదశి. 7-51) నేను బ్రహ్మమని బ్రహ్మమును సాక్షాత్కరించుకొనక బ్రహ్మముగలదని సామాన్యాకారముగా దెలిసికొనుటయే పరోక్షజ్ఞానమగును. అనగా ఆ బ్రహ్మము, ప్రత్యగాత్మయగు నేనే యని అవ్యవహితముగ నెఱుగమిచేత, ఇది పరోక్షజ్ఞానమే యగునని యభిప్రాయము. బ్రహ్మముగలదని సామాన్యాకారముగా నెఱిగిన ఈ పరోక్షజ్ఞానము, బాధింపబడమిచేత, ఇది మిథ్యాజ్ఞానము కానేరదు. ఇట్లు సద్గురూపసదన పూర్వకముగ వేదాంత శ్రవణాదికమువలన పరబ్రహ్మము యొక్క అస్తిత్వమునందు అచంచలబుద్ధి నిశ్చయావస్థ పరోక్షజ్ఞానావస్థ. 5 జ్ఞానమనగా.—దేహేంద్రియ నిగ్రహ సద్గురూపాసన శ్రవణ మనన నిదిధ్యాసనైర్యద్యద్దృగ్దృశ్యస్వరూపం సర్వాంతరస్థం సర్వసమం ఘటపటాది పదార్థమివాఽవికారం, వికారేషు చైతన్యం వినా కించిన్నాస్తీతి సాక్షాత్కారానుభవో జ్ఞానం। ఇతి నిరాలంబోపనిషత్॥" ఏచిన్మాత్ర వస్తువు దృగ్దృశ్య (సాక్షి-ప్రపంచ) రూపములను పొంది, సర్వాంతర్యామియై, సర్వత్రసమాన సత్త గలిగి, సకల ప్రపంచమునకుంగల షడ్భా

వేత్యాది సర్వవికార రహితముగ నిర్వికార స్వరూపమై, జడరూప ప్రపంచమునందంతటను చైతన్యరూపమై, సర్వ పరిపూర్ణముగ సర్వదా ప్రకాశించుచున్నదో ఆ చిద్వస్తువు వినా అన్య మెద్దియు నీషణ్మాత్రమైనను లేదు. ఆచిదాత్మయే నేను – అని దేహేంద్రియ నిగ్రహ సద్గురూపాసన వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసనమున నిరంతరాభ్యాసమూలమున స్వయముగ స్ఫురించెడి స్వస్వరూప సాక్షాత్కారానుభవము జ్ఞానమని శ్రుతివచనము. ఇట్టి జ్ఞానము ననవరతము అప్రతిబద్ధముగ బొందియుండు స్థితియే అపరోక్ష జ్ఞానావస్థ. 6 శోకహాతి యనగా.. ఆయపరోక్షజ్ఞాన సాక్షాత్కారమువలన సంసారము–దుఃఖము–సమూలముగ నిర్మూలమగుటయే దుఃఖనివృత్త్యవస్థ. 7 నిరంకుశతృప్తి యనగా – పూర్వోక్త ప్రకారము సర్వసంసారము నివృత్తినిబొందుచుండగా నిత్యము జీవన్ముక్తత్వముయొక్క స్ఫురణము వలనను, సంసారరూప దుఃఖముయొక్క పునరుత్పత్త్యసంభవమువలనను, నిత్య నిరతిశయ నిరుపాధికమైన సంవిదభిన్న సుఖరూపమున అవస్థానము. ఇదియే నిరంకుశ తృప్త్యవస్థ. ఈ సప్తావస్థలును చిదాభాసునకే గలిగియున్నవి గాని, కూటస్థున కొక్కటియైన లేదు. కూటస్థుడనగా.—''బ్రహ్మాది పిపీలికాంత సర్వప్రాణి బుద్ధిష్వ విశిష్టతయోపలభ్యమాన స్సర్వప్రాణి బుద్ధి సాక్ష్యధిష్ఠానాత్మా స్తిభాసతేచ స కూటస్థః॥'' (సర్వసార.ఉ.) 'కూటేన నిశ్చలత్వేన తిష్ఠతీతి కూటస్థః' = నిర్వికారముగ నిశ్చలుడై యుండువాడు కూటస్థుడు–అనెడి వ్యుత్పత్త్యర్థము చేత – బ్రహ్మ మొదలు పిపీలికాంతము వఱకు యావత్ప్రాణి బుద్ధులయందు నభేదముగ దెలియబడుచు సర్వప్రాణి బుద్ధులకు సాక్ష్యధిష్ఠానస్వభావముతోనుండి ప్రకాశించుచున్న చిత్తే కూటస్థు డనబడును.'' ఈప్రకారముగ, ఆకాశమువలె నిర్మలమైన నిత్యశుద్ధ చిద్ఘన పరబ్రహ్మమునందు మిథ్యాభూత ప్రపంచ కల్పనము అధ్యారోపము.

అటుతరువాత అపవాదము చెప్పబడుచున్నది.—''కారణ వ్యతిరేకేణ కార్యం నాస్తి'' కారణముకంటె భిన్నముగ కార్యము పుట్టనేరదు. కార్యమునం దంతటను కారణమంటియే యుండును' అనెడి సుబోధచేత ''ఇదం సర్వం బ్రహ్మమాత్రం బ్రహ్మణ్యాత్వాతత్వా చ్ఛుక్తి రజతవత్''=శుక్తియందు గల్పితమగు రజతము మిథ్యాభూతమగుటంజేసి సత్యముగాక ఆరజతమునకు అధిష్ఠానమైన శుక్తియే సత్యమైనట్లు పరబ్రహ్మమునందు మాయాకల్పితమైన జగత్తు మిథ్యాభూతమగుటంజేసి సత్యముగాక సకల ప్రపంచమునకు అధిష్ఠానమైన పరబ్రహ్మమే సత్యమగుటవలన నీపరిదృశ్యమాన ప్రపంచమంతయు పరబ్రహ్మమాత్రమే. ''ఘటనామ్నా యథాపృథ్వీ పటనామ్నాహి తంతవః। జగన్నామ్నా చిదాభాతి సర్వం బ్రహ్మైవ కేవలం। యథావంధ్యా సుతో నాస్తి యథానాస్తి మరౌజలం। యథానాస్తి నభోవృక్ష స్తథానాస్తిజగత్స్థితిః॥'' (యోగశిఖ. ఉ. 1 అ.) ఘటమను నామరూపములతో పృథివియు, పటమను నామరూపములతో తంతువులును ఏవిధమున ప్రకాశించుచున్నవో ఆవిధమున జగత్తను నామరూపములతో పరబ్రహ్మ చైతన్యమే ప్రకాశించుచున్నది. సర్వము కేవల పరబ్రహ్మమే. వంధ్యాపుత్రుని చందమున, మరు మరీచికాజలముల భంగి, నభోవృక్షములరీతిని, జగత్తునకు సత్త యెన్నడును లేదు. ''యథారజ్జుంపరిత్యజ్య సర్పం

గృహ్ణాతి వై భ్రమాత్। తద్వత్సత్య మవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః। రజ్జుఖండే పరిజ్ఞాతే సర్పరూపం న తిష్ఠతి। అధిష్ఠానే తథాజ్ఞాతే ప్రపంచే శూన్యతాంగతే॥'' (నాదబిందు. ఉ. 28.) రజ్జువును పరిత్యజించి భ్రాంతివశమున సర్పమును గ్రహించుచందమున, **మూఢ**చిత్తుడు సత్యవస్తువును గ్రహింపజాలక జగత్తునుచూచుచున్నాడు. అధిష్ఠానమగు రజ్జుఖండము తెలియబడినదగుచుండగా ఆరోపిత సర్ప మంతరించును. అట్లే సర్వాధిష్ఠాన స్వాత్మతత్త్వ మవగతమగుచుండగా ఆరోపిత ప్రపంచము శూన్యత్వమును పొందును. ''స్వయమావిర్భవేదాత్మామేఘాపాయే ఽంశుమానివ॥'' (నాదబిందు.ఉ.30). అంతట మబ్బువిడిచిన మార్తాండుని మాడ్కి స్వాత్మస్వయముగ నావిర్భవించును. అనగా దేని అజ్ఞానము అనగా తెలియబడమివలన నేది పుట్టుచున్నదో, దాని జ్ఞానము అనగా తెలియబడుటవలన నాపుట్టినదాని బాధయగును. రజ్జువుయొక్క అజ్ఞానమువలన రజ్జువునందు వివర్తముగా గలిగిన రూపాంతరమగు సర్పమునకు, రజ్జుస్వరూప జ్ఞానమువలన బాధకలిగి రజ్జుమాత్రమేమై తెలియబడునట్లు అనాద్యవిద్యావాసనవలన అద్వితీయాఖండైక రస పరబ్రహ్మముయొక్క అజ్ఞానమువలన నాబ్రహ్మమునందు వివర్తముగాగలిగిన రూపాంతరమగు అఖిల ప్రపంచము శ్రుతి సిద్ధమగు విచారణవలన మిథ్యయగుచు స్వస్వరూప జ్ఞానముచే నశించి అద్వితీయాఖండైకరస పరబ్రహ్మమాత్రమే మైయుండును. అని యీప్రకారము శుక్తియందు రజతమువలెను. రజ్జువునందు సర్పమువలెను 'బ్రహ్మణి ప్రపంచోనాస్తి'= బ్రహ్మమునందు ప్రపంచములేదు–అనెడి నిషేధము అపవాదము.

అపవాదక్రమ మెట్లనగా.—'చతుర్విధం స్థూలశరీరజాతం తద్భోజ్య మన్నాది తదాశ్రయాది। బ్రహ్మాండ మేతత్సకలం స్థవిష్ఠ మీక్షేత పంచీకృత భూతమాత్రం॥'' (స.వే.సిం.సా.సం. 682.) అజ్ఞానోపహిత చైతన్యమైన చిదాభాసునకు (జీవునకు) నివాసస్థానములగు చతుర్విధ స్థూలశరీర సమూహమును, వానికి భోజ్యములగు అన్నపానాదులును, ఈయన్నాదులకును స్థూలములైన చతుర్విధ శరీరజాతమునకును కూడ నివాసస్థానములగు భూర్భువరాది చతుర్దశ భువనములును, ఈ భువనములకు ఆశ్రయమగు బ్రహ్మాండమును స్థూలతమములగు నివియన్నియు క్రమముగ విచారణవలన మిథ్యయని నిశ్చయింపబడుట మూలముగా నశించి వీనికి గారణరూపమైన పంచీకృత పంచమహాభూతములు మాత్రమే యగును. ''తచ్చాపి పంచీకృత భూతజాతం శబ్దాదిభిః స్వస్వగుణైశ్చ సార్థమ్। వపూంషిసూక్ష్మాణిచ సర్వమేతద్భవ త్యపంచీకృత భూతమాత్రం॥'' (687) శబ్దస్పర్శ రూపరస గంధములనెడి తమ తమ గుణములతో సహ ఆపంచీకృత పంచ మహాభూత సమూహమును సూక్ష్మశరీర సంఘాతము నివి యన్నియు క్రమముగ విచారణవలన మిథ్యయని నిశ్చయింపబడుట మూలముగా నశించి వీనికి గారణరూపమైన అపంచీకృత పంచమహా భూతములు మాత్రమే యగును. ''తదప్య పంచీకృత భూతజాతం రజస్తమస్సత్త్వగుణైశ్చసార్థమ్। అవ్యక్తమాత్రం భవతి స్వరూపతః సాభాసమవ్యక్తమిదంస్వయంచ॥'' (688) సత్త్వరజస్తమోగుణ సమేతముగ ఈయపంచీకృత పంచమహాభూతజాతము ఉత్పత్తి క్రమమునకు విపరీతమగు క్రమమున, విచారణవలన మిథ్యయని నిశ్చయింపబడుట

మూలముగా నశించి వీనికి గారణభూతమైన అజ్ఞానోపహిత చైతన్య స్వరూపమైన అవ్యక్తము మాత్రమేయగును. ''ఆధారభూతం యదఖండమాద్యం శుద్ధం పరం బ్రహ్మసదైక రూపం। సన్మాత్రమేవా స్త్యథనో వికల్పః సతః పరం కేవలమేవవస్తు॥'' (689) చిచ్ఛాయాసమేతమైన ఈ యజ్ఞానము, అజ్ఞానోపహిత చైతన్యమగు ఈశ్వరాదికమును విచారణ వలన మిథ్యయని నిశ్చయింపబడుట మూలముగా నశించి తమ కాధారభూతమైన అఖండము ఆద్యము శుద్ధము పరము బ్రహ్మము సదైకరూపమునైన అనుపహితమగు సన్మాత్రమే మైయుండును. అటుపిమ్మట నట్టి సద్వస్తువునకు ఎట్టి వికల్పములేదు. అదియే పరమైన కేవల బ్రహ్మము. ఈ యర్థమునందు ప్రమాణము.—''బ్రహ్మాండం తద్గతలోకాని కార్యరూపాంశ్చ కారణత్వం ప్రాపయిత్వా, తతః సూక్ష్మాంగం కర్మేంద్రియాణి ప్రాణాంశ్చ జ్ఞానేంద్రియాణి అంతఃకరణ చతుష్టయం చైకీకృత్య సర్వాణి భౌతికాని కారణే భూతపంచకే సంయోజ్య, భూమింజలే. జలంవహ్నౌ, వహ్నింవాయౌ, వాయుమాకాశేచా, కాశమహంకారేచా, హంకారం మహతి, మహదవ్యక్తేఽవ్యక్తం పురుషేక్రమేణ విలీయతే॥'' (పైంగల. ఉ, 3 అ.) కార్యరూపములైన బ్రహ్మాండమును, బ్రహ్మాండాంతర్గతమైన చతుర్దశ భువనములను, ఆభువనాంతర్గత చతుర్విధ స్థూలశరీరములను అన్నాది భోజ్యపదార్థములను, స్థూలములైన వీని నన్నింటిని విచారణ వలన మిథ్యయని నిశ్చయించుట మూలముగా వీనికి గారణ స్వరూపమైన పంచీకృత పంచ మహాభూత స్వరూపత్వమును పొందింపజేసి, తరువాత వాని గుణములైన శబ్ద స్పర్శ రూప రస గంధములతో సహా అపంచీకృత పంచ మహాభూతములను, కర్మేంద్రియ పంచకము - జ్ఞానేంద్రియ పంచకము - ప్రాణపంచకము - అంతఃకరణ చతుష్టయమునను నీ పందొమ్మిది సూక్ష్మావయవముల స్వరూపమైనదియు అపంచీకృత పంచభూతోత్థితమునగు సూక్ష్మశరీరమును ఒక్కటిగాజేసి యీసమస్త భౌతికములను విచారణవలన మిథ్యయని నిశ్చయించుట మూలముగా వీనికి గారణ స్వరూపమైన అపంచీకృత పంచ సూక్ష్మ మహాభూతములయందును సంయోజనముచేసి యంతట సత్త్వ రజ స్తమోగుణములతో సహా ఈయపంచీకృత పంచ సూక్ష్మ మహాభూతములను మొదట సృజించిన క్రమమునకు విరుద్ధక్రమమున, భూమిని జలమునందును, జలమును అగ్నియందును, అగ్నిని వాయువునందును, వాయువును ఆకాశమునందును, ఆయాకాశమును అహంకారము (తైజసాఖ్యతత్త్వము)నందును, అహంకారమును మహత్తు (హిరణ్యగర్భాఖ్యతత్త్వము) నందును, మహత్తును అవ్యక్తము నందును, అవ్యక్తమును (ఈశ్వరతత్త్వమును) పురుషుని (పూర్ణత్వాత్పురుషః = పరిపూర్ణత్వమువలన పురుషుడనబడు పరమాత్మ) యందును, విచారణవలన మిథ్యయని నిశ్చయించుట మూలముగా విలీనముజేసి తానైక్యమగుచున్నాడు. అనగా తానే 'పరమాత్మయగుచున్నాడు' అని శ్రుతి సిద్ధాంతము. ఇదియ అపవాదక్రమము; ''యథైవవటబీజస్థః ప్రాకృతశ్చ మహాన్ ద్రుమః। తథైవరామబీజస్థ. జగదేతచ్చరాచరం॥'' (రామపూర్వతాపినిం ఉ.) ప్రాకృతమగు వటమహీరుహ ముద్భవమునకు బూర్వము వటబీజమునందే అంతర్భూతమై వటబీజరూపమే మైయున్న విధమున

ప్రాకృతమైన యీ చరాచర ప్రపంచమంతయు సృష్టికి బూర్వము రామబీజమునం దంతర్భూతమై రామబ్రహ్మమే యైయున్నది. 'రామబీజ' మన "బీజం మాయావినిర్ముక్తం పరబ్రహ్మేతి కీర్త్యతే॥" (రామరహస్య. ఉ. ౬-11) మాయావినిర్ముక్తమైన పరబ్రహ్మమే రామాభిధేయ బీజమని శ్రుతి మానము. "ఇదంబ్రహ్మ వివర్తత్వాత్ బ్రహ్మో భిన్నం జగత్సదా॥ మృద్వివర్తః స్వయంకుంభో మృదభిన్నో యథాతథా॥" (మహావాక్య దర్పణము 108.) మృత్తుయొక్క వివర్తరూపమైన ఘటము మృత్తుకంటె వ్యతిరిక్తముకాదు. స్వయముగ మృత్తే. అటులనే బ్రహ్మముయొక్క వివర్తరూపమైన యీ సమస్త ప్రపంచము బ్రహ్మమునందు వివర్తముగాగలిగిన రూపాంతరమగుట వలన, భ్రాంతికి బూర్వకాలమున పశ్చాత్కాలమున, భ్రాంతికాలముననుగూడ సర్వదా స్వాధిష్ఠాన పరబ్రహ్మముకంటె వ్యతిరిక్తము కాదు. కేవల పరబ్రహ్మము మాత్రమే. "సర్వంహ్యే తద్బ్రహ్మాయ మాత్మాబ్రహ్మ॥" (మాం. ఉ. 2.) సర్వజగత్తు బ్రహ్మముయొక్క వివర్తముగాన వాస్తవముగ బ్రహ్మమే నిశ్చయము. జగత్సృష్టి విషయమై ఆరంభవాదమనియు - పరిణామవాదమనియు వివర్తవాదమనియు మూడు వాదములు గలవు. 1 అత్యల్ప వస్తువులు ఒండొంటితో జేరి సజాతీయమైన ఒక పెద్ద వస్తువగును. ఉ॥ నూలుపోగులు వస్త్రమగును అనెడి కథనము ఆరంభవాదము. 2. అసలు వస్తువుచెడి అన్యవస్తువుగ మాఱును. ఉ॥ క్షీరము దధియగును అనెడి కథనము పరిణామవాదము. 3 అసలు వస్తువు చెడక అన్య వస్తువుగ మాఱుదలను బొందకయే అజ్ఞానము చేత అసత్యమైన అన్యవస్తువుగ దోచును. ఉ॥ రజ్జువు అజ్ఞానముచేత సర్పముగాదోచు నట్లు మాయచేత బ్రహ్మమే ప్రపంచముగా దోచును అనెడి కథనము వివర్తవాదము, ఇందు మొదటివాదము చెల్లదు ఏమన అసంగుడు నద్వితీయుడు నగు నీశ్వరునకు జగదారంభమును జగద్భావమును (జగత్తుండుటయు) గూడదు. రెండవవాదమును చెల్లదు ఏమన నిష్కలుడు (నిరవయవుడు)ను అవికారియునగు నీశ్వరునకు పరిణామముకూడదు. ఆహేతువు చేత వివర్తవాదము ననుసరించి, రజ్జువు అజ్ఞానమువలన సర్పముగా వివర్తమగు విధమున బ్రహ్మము మాయచేత ప్రపంచ వివర్తమయ్యెను. కావున రూపముగా భ్రాంతిరచితమైన సర్పము, యథార్థ రజ్జుజ్ఞానమున నశించి సంపూర్ణముగ రజ్జువే స్ఫురించుచున్న వడువున యథార్థమగు బ్రహ్మజ్ఞానమున, మాయాకల్పితమైన జగన్నిరసన పూర్వకముగ కేవల బ్రహ్మమే అవశేషించును గాన సర్వము బ్రహ్మమే. అట్లగుట ఈ ప్రత్యగాత్మ ఆ బ్రహ్మమే యని శ్రుతి. ఇట్లు "సిద్ధాంతోధ్యాత్మశాస్త్రాణాం సర్వాపహ్నవ ఏవహి॥" (అన్నపూర్ణ. ఉ. 5-112.) సమస్త వేదాంతశాస్త్రములయొక్క సిద్ధాంతము అధిష్ఠానమైన అద్వయమైక పరబ్రహ్మముదక్క తదితరముగ ప్రతీతమగుచున్న ఆరోపితమంతయు అపహ్నవము (మిథ్య) యని నిషేధించుటయే యగును. జగజ్జీవేశ్వరాదికము మిథ్యయగుటయే సర్వవేదాంతరాద్ధాంతము.

(సశేషము)

ఓమ్ తత్సత్.

# దేవీసవము

శ్రీ ఆత్మానందస్వామి

(అక్టోబరు సంచిక తరువాయి)

క్షుత్పిపాసానివారణ సుఖముఁగోరి; యెందుకీపాటు నాకు, నీయిల్లు నీది
భువి ననుగ్రహ నిగ్రహం బులును నీవె; తెరను తొలఁగించి కావవే గిరిజ తల్లి. 53

నీదు నైసర్గిక శ్రీకి వాదులాడి, ధిక్కరించువార లధముదిక్కుఁబట్టి
తరలుచున్నారు మూఢులై తల్లియడుగు; జాడలఁ జనుచుంటిని దయఁజూడు మమ్మ 54

ధాత్రి జన్మింత్రు రాక్షసాధములు, గౌరి; యఘమణంచి ధర్మస్థాపనంబుఁ జేయఁ
గాంచును. మత ప్రవర్తనా కాలమందు; వేదములు కూడ, నీయంతు వెదుకలేవు. 55

ఎందఱో మహాత్ములు మున్ను పొందినారు; నీయనుగ్రహ రథమెక్కి మాయదాటి
నిర్గుణానంద పథమును నేఁడె నాకు; లోకనాథుని జూపించు లోకమాత! 56

ప్రణవ పుష్పము లక్షయభావమలర; రాసిఁజేతునాధార వికాసమందు
మోసగింపకు పాదాల మ్రొక్కువాడ; తెరను తొలఁగించు నీవాడ దేవదేవి. 57

జ్ఞాన, యోగ, సమ్మతి, ధృతి శాంతి, భక్తి; చయము భిన్నమొంద, కెవని సంక్రమించు
నతఁడె నీకుఁ బ్రియంబైన సుతుఁడుగాన; నాకు చూపుము శంభుని లోకమాత. 38

శివుడు గలడంట మేరువు శిఖరమందు; పర్వతారోహణంబెంతొ భారమంట
చండి దయలేమి, దరిజేరఁ జాల మంట; సోముఁ దిలకింపనగుట నానోము పంట. 59

పయనమైవేగఁ బోవుదు బ్రహ్మమార్గ; మధ్య చక్రాధిదేవతా మధుర విధులఁ
జొక్క నీయనుగ్రహమున్న మ్రొక్కువాడఁ; బరమభక్తితోడ గిరిజ తెరువుమమ్మ. 60

విశ్వమున్ ఖగోళమును వివేకగతుల; సృష్టిచేసెను బ్రహ్మ నీచేతనమున
మూలమెఱుఁగలే వీవును మూతవెట్టఁ; దగునె, తెరదీయవే దేవి తగినవాఁడ. 61

ఎప్పు, డేలాగు, నెందుండి ఽ యీ విసర్గ ; వికసన ముదయమాయెనొ ఽ విశదపరుప
నెవ్వరున్నారు? నీకైనఁ దెలుపపడదు ; మాత, తొలఁగించు నీ తెరఁ ఽ జూతు నతని. 62

ఏ దనాదిగ, గాలిలేఽకే స్వశక్తి ; వల్ల, నుఛ్వాస నిశ్వాస ఽ లల్లుచుండు
దాని కావల నితరము ఽ గానరాదు ; దాని బొందెదఁ దెరజిమ్ము ఽ తల్లి నేఁడు. 63

స్థూల సూక్ష్మకారణములు ఽ తోఁచుచుండు ; నీ విజృంభణంబుకతన ఽ నీ కసాధ్య
మొకటిలేదు ; మాయవు, వరఽమొక్కటిమ్ము ; తెరను తెరువుము నాతండ్రి ఽ దరికిఁజనఁగ. 64

కర్మమూలము సంసార ఽ మర్మమునకు ; చిత్తమే మూలమగు కర్మ ఽ సృష్టికొఱకు
చిత్తశోధనఁ గర్మలఁ ఽ జెండివైచె ; తెరనుతొలఁగించు గిరిసుత ఽ కరుణతోడ. 65

అంబ, రేచక పూరక ఽ కుంభకముల ; నభ్యసింపగనొల్లనే ఽ ననుభవింతు
నాత్మలో పరమాత్మ భాఽవంబుగలిగి ; తెరను తొలఁగించి నాతండ్రి ఽ దరికిఁ జేర్పు. 66

పుణ్యకర్మలఁ జేయించుఁ ఽ బుణ్యలోక ; మంప నొకనిచేఁ బాపకృఽత్యముల నాచ
రింపఁజేయు మఱొకని ఘోఽషింపఁదలఁచి ; కర్మలేటికిఁ దెరజిమ్ము ఽ కాళికాంబ. 67

అలసియున్నాఁడ మఱిమఱి ఽ యఱచియఱచి ; యంబరంబెక్కి చాటెద ఽ నంబ, నీవు
లేవు, లేవు ముమ్మాటికి ఽ లేవటంచు ; తెరను దీసి తండ్రిని గానఽబరుపకున్న. 68

శాస్త్రలోక శరీరవాఽసనల, నాశ ; నం బొనరిచి, చిత్త నిరోధ ఽ నంబుఁజేసి
యోగినైతి, సంసార పఽయోధి దాటఁ ; దెరను తొలఁగించు శైలజా! ఽ కరుణతోడ. 69

సర్వధర్మపరిత్యాగ ఽ నిర్వహణము ; సహనశక్తియు నాత్మ విఽశ్వాస మొదవె
నర్చిరాది మార్గారోహ ఽ ణాభిలాషఁ ; గలిగియున్నాఁడఁ దెరయెత్తు ఽ కాళికాంబ. 70

కుంటివాఁ డెగబ్రాఁకు నఽకుంఠితముగ ; పర్వతాగ్రమునకు, మూగ ఽ పలుకు తైల
ధారనే జనార్దను దయ ఽ దాపురింప ; నతని దర్శింపఁ దెరదీయు ఽ మమ్మ కాళి. 71

చెంపఁగొట్టఁగ మఱియొక ఽ చెంపనిచ్చు ; దొంగవానిని తనయిల్లు ఽ దోపనిచ్చు
ఉగ్రకోపిని దూర కఽనుగ్రహించు ; నట్టి సహనంబుఁ జేకూర్పు ఽ మంబ నాకు. 72

వదలినాఁడ సంసార దఽవానలంబు ; త్రెంచినాఁడ రాగద్వేష ఽ శృంఖలంబు
పట్టినాఁడ సద్గురుపాద ఽ పంకజంబు ; రచ్చఁబెట్టక తెరదీయ ఽ రావె దుర్గ. 73

(సశేషము)

# శ్రీ వివేకానంద సంభాషణలు

## (శ్రీ సురేంద్రనాథసేను స్వంత దినచర్యనుండి)

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[జ్ఞానయోగ భక్తియోగ సమన్వయము—భగవంతుడు మంచి యందును గలడు, చెడ్డయందును గలడు—ఉపయోగించు విధానమును బట్టి మంచి, చెడ్డ లుండును—కర్మ—సృష్టి—దైవము—మాయ.]

ఆదివారము, 23-1-1898.

బాగ్‌బజారునందున్న బాబు బలరాంగారి యింటియందు శ్రీ రామకృష్ణ సేవాసంఘము వారు, ప్రతి వారము జరుపు ఒకానొక సమావేశమునకు నేను ఒకనాటి సాయంసమయమున బోయితిని. శ్రీ రామకృష్ణ మఠమునుండి తురీయానందస్వామివారు, యోగానందస్వామి వారు, ప్రేమానందస్వామివారు ఇంకను మఱి కొందరు భక్తులు నరుదెంచిరి. స్వామిజీ, వసారాలో తూర్పు ముఖముగా గూర్చుండిరి. ఈ వసారాయంతయు ప్రేక్షకులతో క్రిక్కిరిసి యుండెను. ఉత్తర, దక్షిణ వసారాలుగూడ నదేరీతిగా నుండెను. స్వామిజీ కలకత్తాలో నున్నంతకాలము నిత్యము నీరీతిగనే ప్రేక్షకులసంఖ్యాకులులై వచ్చెడివారు.

ఈ సమావేశమైన ప్రేక్షకులలో బహుసంఖ్యాకులు, స్వామిజి శ్రావ్యముగా గానము చేయగలరని వినియుండుటచే, వారందరును స్వామిజీ యొకసారి పాడిన బాగుండునని యువ్విళ్లూరుచుండిరి. 'మ.' మహాశయు డీ విషయమును గ్రహించి, సమీపమున గల పెద్దలతో స్వామిజిని పాడవలసినదిగా ప్రార్థింపుడని మెల్లగా ప్రోత్సహించెను. ఈ సంగతి స్వామిజీ గ్రహించి ఉత్సాహముతో, "మాష్టరు మహాశయా! మీలో మీరు చెప్పుకొను ఆ గుసగుసలు ఏమిటి?" యని ప్రశ్నించెను. "నిజము చెప్పు"మనెను. మాష్టరు మహాశయుని ప్రార్థనపై స్వామిజీ "ప్రియమగు శ్యామామాతను, నిండుప్రేమతో నీ హృదయమున ప్రతిష్ఠింపుము" అనెడి కీర్తనను పాడెను. అది వీణాగానమా యని సభ్యులకు భ్రమ గొల్పెను. గానము పూర్తియైన పిమ్మట స్వామిజీ మాష్టరు మహాశయునితో "మీకు తృప్తి గలిగినదా? ఇక సంగీతము వలదు. లేనిచో ఆ గానమాధు

ర్యముచే నేను బాహ్యస్మృతిని గోల్పోవగలను. అదియునుగాక పాశ్చాత్యదేశములయందు నేనొసంగిన యుపన్యాస పరంపరలచే నా గొంతుకకూడ చెడినది. వణకు వచ్చుచున్న'' దనెను.

పిమ్మట స్వామిజీ తన బ్రహ్మచారి శిష్యులలో నొకరిని మోక్షస్థితినిగూర్చి యుపన్యసింప బురికొల్పెను. అంత ఆ బ్రహ్మచారి నిలువబడి కొంతవఱకుపన్యసించెను. ఆతని పిమ్మట మఱికొంద రుపన్యసించిరి. పిమ్మట స్వామిజీ యీ సమస్యపై వాదోపవాదములను జేయ తన గృహస్థ శిష్యులలో నొకనిని ఉపక్రమింపుమన, నాతఁడు తన సిద్ధాంతమును అద్వైతపరముగను, జ్ఞానపరముగను సమర్థించుచు, ద్వైతమునకును, భక్తిసిద్ధాంతమునకును ద్వితీయస్థాన మిచ్చుచుండుటచే ప్రేక్షకులలో నొకరు అధిక్షేపింపసాగెను. ఉభయులును తీవ్రముగా వాదోపవాదములను జేసి, తమ తమ సిద్ధాంతములను సమర్థించుకొనుటకై యత్నించుచుండుట స్వామిజీ క్షణమాత్రము పరిశీలించి, శ్రుతిమించి రాగమున బడుటను జూచి, యీ బోధనచే వారిని శాంతపరచెను.

స్వామిజి:—ఆలాగున ఉద్రేకముతో వాదించి, సమస్తమును ఎందుకు పాడుచేయుదురు! వినుడు, అసలైన జ్ఞానము, అసలైన భక్తి యీ రెండును ఒక్కటియే యని శ్రీ రామకృష్ణులు చెప్పుచుండెడివారు. భక్తి సిద్ధాంతానుసారము, ప్రేమస్వరూపమే, ప్రేమతత్త్వమే, భగవంతుని రూపము; ప్రేమయే యాతఁడైనపుడు, "నేను వానిని ప్రేమింతు" నని నుడువరాదు. ఆతఁడు వినా ప్రేమ యనునది వేరొకటి లేదు. నీ హృదయమందున్న ఏ ప్రేమచే ఆతని ప్రేమించుచుంటివో యా ప్రేమయే యా భగవానుని స్వరూపము. మన యాశాపాశములన్నియు నాతని స్వరూపమే. తస్కరుల చోరత్వము, జారస్త్రీల శరీరత్యాగము, తల్లికి తనబిడ్డపై గల వాత్సల్యము ఇవన్నియును ఆ ప్రేమస్వరూపియగు భగవానుని యనంతరూపమే. ఒక లోకము, ఇంకొక లోకమును గురుత్వాకర్షణశక్తిచే నాకర్షించుకొనుటయు నాతని రూపమే. ఆత డంతటను గలడు. జ్ఞానసిద్ధాంతానుసారముగూడ ఆతని సర్వగతస్వరూపమును తెలిసికొనవచ్చును. ఇచ్చటనే జ్ఞానయోగ, భక్తియోగ సమన్వయము కలుగగలదు. భక్తిరసామృతమును పూర్తిగా త్రావి, మైమరచిన సమాధిస్థితియందే, పూజించువాడు, పూజింపబడునది యనను ద్వైతభావన పూర్తిగా నశించును. భక్తిగ్రంథములలో నైదువిధములగు భక్తిమార్గములు వచింపబడియున్నవి. దీనికి భగవంతునితో తాదాత్మ్యస్థితిని గలుగజేయు ధ్యానమార్గమును జతపరచవలయును. ఈ రీతిగా అద్వైత మార్గావలంబులగు జ్ఞానమార్గీయులనుగూడ భక్తులు, తమవర్గములోనికి జేర్చుకొనవగును. ఎంత కాలము మానవుడు మాయకు బద్ధుడై యుండునో, యంతవరకు ఆతడు ద్వైతమవలంబింపక తప్పదు. దేశ, కాల, నిమిత్తములనుగాని, నామ, రూపములనుగాని మాయ యందురు. ఈ మాయను, నధిగమించినపుడే, ద్వైత, విశిష్టాద్వైతముల నధిగమించి, సర్వము నాతడే యను ఏకస్వరూపస్థితికి రాగలరు. ఆరంభస్థితియందే భక్తులకును, జ్ఞానులకును వ్యత్యాసము. ఒకరు భగవంతుని బాహ్యమున, ఇంకొ

కరు అంతర్యామున గాంచుచున్నారు. అద్వైతసిద్ధినిబొంది, మోక్షమును బొందిన పిమ్మట, పరాభక్తితో మెలగెడు నత్యున్నతస్థితి యింకొకటి గలదని శ్రీ రామకృష్ణులు నుడువుచుండెడివారు. ఇది స్వవచన వ్యాఘాతముగా గనబడవచ్చును. మోక్షమును బొందిన పిమ్మట, భక్తిమార్గ మవలంబించుట ఎందులకని సందేహము గలుగ వచ్చును. దీనికి సమాధానమేమన, ముక్త పురుషుడు ధర్మాధర్మముల కతీతుడు. ఆతనికే ధర్మములును వర్తింపవు. ఆత డే ధర్మమునకును బద్ధుడుగాడు. అందుచే నాతని గూర్చి ప్రశ్నింప వీలులేదు. కొందరు మోక్షమును బొందిన పిమ్మటగూడ, వారి యిష్టానుసారము, భక్తి రసామృతమును గ్రోలుటకై పరాభక్తిని గలిగి యుందురు.

ప్రశ్న:—తల్లి, తనబిడ్డపై జూపు ప్రేమయందు భగవంతు డుండవచ్చును. కాని యిది కొంచము గూఢార్థమును గలిగియున్నది. చోరులకు తమ చోరత్వమందలి కుతూహలము, కులటలకు తమ జారత్వము నందలి యపేక్ష, భగవానుని రూపములా యనెడి సందేహ మొదవుచున్నది, ఇదే నిజమైన, ప్రపంచమందలి పుణ్యా పాపములకు పరమేశ్వరుడే బాధ్యుడని చెప్పక తప్పదు గదా?

స్వామిజి:—ఏది యాకర్షణీయమో, యేది ప్రేమకు మూలమో, యదియంతయును పరమేశ్వరుని రూపమే యని గ్రహింపగల్గు స్థితి సంపూర్ణమగు ఆత్మసాక్షాత్కారసిద్ధి గల్గిననాడు ప్రాప్తించగలదు. ఈ సత్యమును జీవితములో గ్రహించుటకు ప్రతి మానవుడును ఈ యత్యున్నతస్థితిని పొందవలయును.

ప్రశ్న:—అయినను, పరమేశ్వరుడు పాపమునందుగూడ గలడని మనము ఒప్పుకొనవలయునుగదా?

స్వామిజి:—మంచి యనియు, చెడ్డ యనియు, ప్రత్యేకముగా నెచ్చటను, ఏదియును లేదు. అవి మన కల్పనలు. మన ముపయోగించు రీతినిబట్టి యొకానొకప్పుడు చెడుగా భావింపబడు దానినే మంచిగా దలపవలసివచ్చును. ఉదాహరణమునకు ఈ లాంతరు దీపమును దీసికొనుడు. ఇది వెలుగుచుండుటచే, దీని సహాయమున, మనము అన్నింటిని గాంచి లాభదాయకముగా సమస్తమును నొనర్చుకొనుచున్నాము. దీప మీ విధముగా నుపయోగపడుచున్నది. నీ వ్రేళ్లను ఆ దీప శిఖ యందుంచిన నవి కాలును. అది యింకొక విధముగా నుపయోగించుకొను మార్గము. అందుచే నొకవస్తువుయొక్క మంచి, చెడ్డలు, దానిని మన ముపయోగించు విధానమునుబట్టి యుండగలవు. పుణ్యా పాపములు గూడ నిట్టివే. స్థూలముగా చెప్పవలెననిన, శారీరకమానసికశక్తులను సక్రమమార్గమున నుపయోగించుట పుణ్యమనియు, వక్రముగగాని, నష్టదాయకముగగాని వినియోగించుట పాపమనియు నిర్వచింపవచ్చును.

ఈ విధముగా ననేకులు ప్రశ్నించిరి. స్వామివారు వానికి తగు సమాధానము లిచ్చిరి. అందాక భక్తుడు, భగవంతుడు, గోశములన్నియును పరస్పర మాకర్షించుకొని నిలబడియున్న తావున గలడను సత్యమును నిజమనవచ్చును.

లేదా అసత్యమనవచ్చును, గాని యీ చక్కని ఊహాగానము నభ్యసించు భావమునుమాత్రము సరియగునది గాదని యెవ్వరును పలుకజాలరు అని వ్యక్తపరచెను.

స్వామిజి:—అయ్యా! అది ఊహాగానముగాదు. జ్ఞానసిద్ధిని బొందిన పిమ్మట ఎల్లరును ఈ పరమసత్యము యథార్థమని గ్రహింపగలరు.

ఈ విషయమై శ్రీ స్వామిజీ యనంతర ముపన్యసించిన విషయమును నే నీ క్రింది విధముగా గ్రహించితిని. పదార్థము, శక్తి, యీ రెండును స్థూలదృష్టికి రెండు వేరు వేరు రూపములుగా గాన్పించుచున్నను, అవి యొకేపదార్థముయొక్క రెండు భిన్నరూపములని గ్రహింపవలయును. అదేవిధముగనే మనము చూచుచున్న సమస్త శక్తులు, స్థూలముగాని, సూక్ష్మముగాని ఆ యనంతశక్తియొక్క వివిధ పరిణామములే. శక్తి అల్పముగా స్ఫుటమగుచో పదార్థమనియు, ఎక్కువగా బహిర్గతమగుచో చైతన్యమనియు పేర్కొనుచున్నాము, గాని ఏ కాలమునందును పదార్థమనునది పృథక్కుగా నెచ్చటను లేదు. ఏ శక్తి బాహ్యప్రపంచమున నాకర్షణ శక్తిగా గనబడుచున్నదో, స్వరూప సాక్షాత్కారస్థితియందు ఆ శక్తియే, నిర్మల ప్రేమముగా సూక్ష్మతత్త్వమున ననుభవవేద్యమగుచున్నది.

ప్రశ్న:—మానవు లీ శక్తిని, విభిన్నమార్గముల నేల ఉపయోగించుచుండిరి? తన శక్తులను మానవుడు వక్రమార్గమున నుపయోగింపవలెనని యేల కుతూహలమును జూపవలయును?

స్వామిజి:—ఈ కుతూహలము, వారివారి పూర్వకర్మానుసారముండును. స్వీయకర్మానుసారమే ఫలిత మనుభవింపగలరు. అందుచే చిత్తవృత్తులను నిగ్రహించి, సరియగు మార్గమున నడువవలసిన బాధ్యత ప్రతి మానవునియందును గలదు.

ప్రశ్న:—సమస్తమును మన పూర్వకర్మానుఫలితమగుచో, ఈ ప్రస్తుత కర్మకు ఒక యారంభముండవలెనుగదా, అట్లైనచో యారంభమందే మన చిత్తవృత్తులు ఏల మంచివిగను, చెడ్డవిగను ఉండవలయును?

స్వామిజి:—ఆరంభము గలదని ఎట్లు చెప్పగలవు? వేదములు ఈ సృష్టి యనాది యని చెప్పుచున్నవి. భగవంతు డెంతకాలముండునో, యాతని సృష్టిగూడ అంతకాలముండును.

ప్రశ్న:- మంచిది. అయ్యా! యీ మాయ యిచ్చట నేల యుండవలయును? ఇది ఎచ్చటనుండి వచ్చినది?

స్వామిజి:—భగవంతునిగూర్చి కర్తవ్యమును ప్రశ్నించుట దోషము సకామునిగూర్చి గాని, అసంపూర్ణునిగూర్చిగాని యిట్లు ప్రశ్నింపవచ్చును. ఏ కోరికయు లేక, అంతయును ఆతడే యైనపుడు, ఆతని కర్తవ్యమునుగూర్చి ప్రశ్నించు టెటుల సంభవమగును? మాయయొక్క జన్మస్థాన మెద్ది యని ప్రశ్నింప తగదు. దేశ, కాల, నిమిత్తముల స్వరూపమే మాయ. నీవు, నేను, ఈ సమస్తమును మాయయందున్నాము. ఉండి,

యీ మాయయొక్క పుట్టుకను గూర్చి ప్రశ్నించుచున్నాము. మాయయందు జీవించుచు, ఈ ప్రశ్న ఎట్లు ప్రశ్నింపగలము? ఇది యసంభవ విషయము.

యనేక ప్రశ్నలు వేయబడెను. మిల్లు, హామిల్టన్, హెర్బర్టు, స్పెన్సరు మొదలగు పాశ్చాత్య తత్వవేత్తల వేదాంతముల ప్రసంగము జరిగెను స్వామిజి ఆ విషయమున తృప్తికరముగా నుపన్యసించెను. అందరును స్వామిజీయొక్క పాశ్చాత్య వేదాంత పాండిత్య గరిమకును, జబాబుల నిచ్చుటయందలి సునిశిత విషయగ్రహణశక్తికిని ఆశ్చర్యమును పొందిరి.

పిమ్మట కొద్దికాలమునకు ఆ నాటి సభ సమాప్తమయ్యెను.

శ్రీ శారదాదేవి జన్మదినోత్సవము గురువారము 20-12-1951
మఠమున బహిరంగోత్సవము ఆదివారము 23-12-1951

శ్రీ వివేకానంద స్వాములవారి జన్మదినోత్సవము శనివారము 19-1-1952
మఠమున బహిరంగోత్సవము ఆదివారము 20-1-1952

గమనిక: గతసంచిక ౧౪౦-వ పుటయందు శ్రీ బుద్ధచర్య వెల రూ. 3-0-0 అని పొరపాటున ముద్రింపబడినది. ఆ గ్రంథము మూల్యము రూ. 5-0-0 అని పాఠకులు గమనింతురుగాక.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్స్ లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ ఆదిదేవానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-12-51.